# తెలుగు సందేశకావ్య సమాలోచనం

నాగార్జున విశ్వవిద్యాలయం నుండి
పిహెచ్. డి. పట్టంపొందిన సిద్ధాంత వ్యాసం

"అట నాగార్జునుపేర నొప్పెసగునయ్యా। విశ్వవిద్యాలయి
స్ఫుట విజ్ఞాన మరీచి ప్రాగ్విభవ విస్ఫూర్తిన్ విడంబించి యు
ద్భట విద్యారస ధారలం దనిసి విద్యార్థి వ్రజంబందు ప్రో
త్కట విఖ్యాతి ఘటించి మించు సకలాంధ్ర క్షోణికిన్ నిత్యమున్

—వృషభరాజ సందేశం


భాషాప్రవీణ

డాక్టర్ బాపట్ల రాజగోపాలశర్మ

ఎం ఏ, పిహెచ్ డి.

ఆంధ్రోపన్యాసకుడు

శారదాకళాశాల — విజయవాడ

# తెలుగు సందేశకావ్య సమాలోచనం

డాక్టర్ బాపట్ల రాజగోపాలశర్మ

| ఈ సిద్ధాంత వ్యాసం |
| --- |
| తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో ముద్రితము |

ప్రథమ ముద్రణ   శుక్ల కార్తీక పూర్ణిమ

ప్రతులు :   1000



**మూల్యము : రు. 65—00**

ప్రాప్తిస్థానాలు .

**శ్రీమతి బి. వి. సూర్యకుమారి**
గాయత్రి ప్రచురణలు
23—23—31 శివరావువీధి
సత్యనారాయణపురం
విజయవాడ—11

**సాహిత్య నికేతన్**
ఏలూరురోడ్, విజయవాడ—520 002

**సాహిత్య నికేతన్**
బరకత్‌పుర, హైదరాబాద్—500 027

ముఖ చిత్రం . వి. ఎస్. ప్రకాష్

ముద్రణ . శ్రీ లక్ష్మి ప్రెస్
14/2 అరండల్‌పేట, గుంటూరు-2

మనసు మంచితనాన తనవారిఁబెరవారి
లో గొనం దగినట్టి శ్రీగుణములు
నోపినయంతకు నొరుల కుపకరించు
శాంత గకళీరార్ద్రి స్వాంతములును
కుశలతా వ్యవహార నిశిత నిరాడంబ
రాత్మ ప్రభావాత్త ప్రాభవములు
తేనె యిక్షురసాల తీయందనాలకు
సరసమౌ ననురాగ సరళగతులు

చోద్యములుగాక తొలినుండి జూడ నమరి
నట్టి ధన్యాత్ము లుత్తము లత్తమామ
లైన ధనలక్ష్మి సీతరామయ్యలకును
నంకితముసేతు నైసర్గి కాదరమున.



పుణ్యదంపతులు

అత్తమామలు

కీర్తిశేషులు

ధనలక్ష్మి సీతారామయ్యగారలకు

అంకితం

విరిసిన పద్మసూనమన విశ్రుతమై తనచేయు సత్కృతుల్
పరిమళముల్ బలెన్ హృది యెవానికిఁ గల్గు మహోత్తముండు న
న్నరసి మదీయ మీకృతికి నా కృతి నిచ్చినవాఁడు వాని ని
ద్ధర చెవుటూరి వంశ విధు తాండవ కృష్ణ ప్రశంస చేసెదన్

వారి యర్ధాంగి కుసుమ కుమారి సాధ్వి
రమ్య గుణ ఖని, ఈశ్వరార్చన కళా ప్ర
వీణ, వాత్సల్యమున గౌరవించు నన్ను
హృది నమస్కృతు లర్పింతు నెల్లవేళ



వదాన్య శేఖరులు

శ్రీ చెవుటూరి తాండవకృష్ణగారు

ధర్మపత్ని శ్రీమతి కుసుమకుమారిగారు



## బాపట్ల రాజగోపాలశర్మ

| | | |
|---|---|---|
| జననం | . | 15 జులై 1953 |
| జన్మస్థలం | | రాంభొట్లవారిపాలెం, గుంటూరు జిల్లా |
| పాఠశాల విద్య | . | చందోలు, గుంటూరు జిల్లా |
| కళాశాల విద్య | : | కె. వి. కె. సంస్కృత కళాశాల, గుంటూరు |
| పరమ పట్టభద్రత | . | ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్తర కేంద్రం గుంటూరు (1974–76) |
| పిహెచ్ డి, పరిశోధన | : | నాగార్జున విశ్వవిద్యాలయం-నాగార్జుననగరం |
| ఉద్యోగం | . | ఆంధ్రోపన్యాసకులు, శారదా కళాశాల, విజయవాడ |
| అభిరుచి | : | సాహిత్య అధ్యయనము అధ్యాపనము |

Prof. BODDUPALLI PURUSHOTTAM
National Lecturer
Head of the Department of Telugu &
Oriental Languages (Retired)
Nagarjuna University

# పురోణి

ప్రాచ్యవిద్యా స్నాతకుడై, చిరంజీవి బాపట్ల రాజగోపాలశర్మ మావద్ద స్నాతకోత్తరుడైనాడు ఇతనంటే నాకెంతో అభిమానం. ఎందుకంటె అతని యింటిపేరు మా వూరుపేరు ఒక్కటే దీన్నే బాదరాయణ సంబంధమంటారు

దీన్ని గుర్తించి, ఇతణ్ణి చేబట్టి పరిశోధన చేయించమని ఇతని మామగారు శ్రీ శే సీతారామయ్యగారు (ఈమధ్యనే హఠాత్తుగా పరమపదించారు) నన్నెంతగానో బ్రతిమాలారు వారి నిర్బంధ ప్రణయానికి తట్టుకోలేక పరిశోధన విద్యార్థిగా శర్మను స్వీకరించాను అది శర్మ అదృష్టం.

ఇంకో విధంగాకూడ శర్మ అదృష్టవంతుడే. ఎందుకంటే పరిశోధనకు నేనెన్నికచేసి యిచ్చిన అంశాన్నే కాదనకుండా స్వీకరించాడు. అటువంటి బుద్ధిమంతుడు. ఉద్యోగానికి కూడా పెక్కుచోట్లకు తిరగలేదు. ఒకేచోట స్థిరపడ్డాడు. ఇది మరో అదృష్టం

నేను బాపట్ల వాణ్ణనే అమోఘాభిమానంతో నేను ఆచార్య పీఠ మధిష్ఠించే దాకా అతను తన సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించలేదు. అది ఆతని అచంచల గురుభక్తికి నిదర్శనం. నా ఆచార్యత్వంలోనే డాక్టరేట్ బిరుదాంకితుడైనాడు.

డాక్టర్ శర్మ, మంచి విషయంమీద పరిశోధన చేసాడనే తృప్తి నాకున్నది. ఆత్మవంచన లేకుండా కృషి చేశాడు. దాన్నిప్పుడు ముద్రించి మామగారి కంకితం చేయటం ఆయనకు, లోకానికి ఆనందదాయకం.

ఈ సందేశ కావ్యాలపై ఇంకో విశ్వవిద్యాలయంలో జరిగిన కృషిని నేను పరిశీలించాను. ఆతని కృషి కన్న ఈతని కృషి ఎన్నోరెట్లు మిన్న అని మాత్రం నిరభ్యంతరంగా చెప్పగలను. అంతకంటే ఎక్కువగా చెప్తే ఆత్మస్తుతి అవుతుంది. ఎవ్వరూ స్తుతించనప్పుడది యెట్లాగో తప్పదు. అప్పటిదాకా నిరీక్షిస్తాను

గుంటూరు
4–9–1989

బొడ్డుపల్లి పురుషోత్తం



# అభినందనము

భాషాప్రవీణ శ్రీ బాపట్ల రాజగోపాలశర్మగారు రచించిన 'తెలుగు సందేశ కావ్యసమాలోచనం' అను సిద్ధాంత వ్యాస గ్రంథమును సమగ్రముగా పరికించి పరమానంద పడితిని. కాళిదాసు మేఘదూతముతో ఆరంభమై బహుధా విస్తరించిన యీ సందేశకావ్య ప్రపంచమునుగూర్చి సమగ్రమైన చర్చ తలస్పర్శిగా నిందు గావింప బడినది.

ఇంతవఱకు ఈ విషయమును గూర్చి యిట్టి గ్రంథము వెలువ రింపఁ బడలేదు. శ్రీ రాజగోపాలశర్మగారి సునిశితమైన పరిశీలనమున కిది నిదర్శనముగా విరాజిల్లు చున్నది.

ఆఱు అధ్యాయములుగా వెలసిన యీ గ్రంథములో సంస్కృతాంధ్ర సందేశకావ్య చర్చ వినూత్నాంశములతో చేయబడినది.

ఇంతటి పరిశోధనమును గావించి, కృతార్థులైన శ్రీ రాజగోపాల శర్మగారికి హార్దమైన అభినందనము.

లలితానగర్
రాజమహేంద్రి
20–10–'89

"కళాప్రపూర్ణ"
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు
రిటైర్డ్ సంస్కృతోపన్యాసకులు
విశాఖపట్నం

## ఆశీః

శ్రీ బాపట్ల రాజగోపాల శర్మగారు పిహెచ్. డి. పట్టానికై సమర్పించిన తెలుగు సందేశ కావ్యసమాలోచనాన్ని ఒకసారి చూచే అవకాశాన్ని నాకు ప్రసాదించినారు. సందేశ కావ్యాలు సంస్కృతంలో తెలుగులో చాలా ఉన్నాయి. మొదటిది మేఘసందేశం. దీనికి మూలం శ్రీ రామాయణంలోని హనుమత్ సందేశం. కాని హనుమత్ సందేశానికి మేఘసందేశానికి భేదం ఉంది. శ్రీ రామాయణంలో కథా ప్రధానంగా ఆ సందేశం సాగింది భావ ప్రధానంగా దర్శనీయ మనోహర సన్నివేశాలతో సందర్శింపచేస్తూ, సౌందర్యాన్ని పవిత్రతతో మేళవించి సాగింది మేఘసందేశం. ఇది సందేశ కావ్యాలలో ఉత్తమ కావ్యం. శ్రీ శర్మగారు వేదాలలోంచి బయల్వెడలిన ఈ సందేశకావ్య స్రవంతిని ఆధునికుల సందేశకావ్యాల వరకు అవగాహించినారు. ఆనందించి తాము పొందిన ఆనందాన్ని వాగ్రూపంలో లోకానికి అందించినారు. వారికి భాషమీద ఉన్న అధికారం, భావ విశ్లేషణంలో ఉండే సమర్థత ఈ సమాలోచనాన్ని ఒక పరిశీలన గ్రంథంగాగాక, కావ్యంలాగా పరిణమింప చేసింది. ఇందులో వారు ఎన్నో విషయాలను భాష, భావన, వర్ణన, శబ్ద, అర్థ చమత్కారాలను విశ్లేషించి వాటి రామణీయకతను పాఠకులకు అందింప చేసినారు.

సాధారణంగా సందేశ కావ్యాలు ప్రేయసీ ప్రియుల మధ్యసాగే సందేశాలుగానే సాగినవి. కాని మన ప్రాచీన వాఙ్మయములో భార

తీయ సనాతన ధర్మాన్ని, ఆధ్యాత్మికతను అంతరంగ ధ్వనిమార్గంలో అందిస్తూ బాహ్యానికి వానిని ప్రణయ సందేశాలుగా అందింపచేసినారు. ప్రేయసీ ప్రియులను జీవ పర తత్త్వాలుగా, శివ శక్తులుగా భావించే వారు ఆనాటి కవులు. వారి సమాగమాన్ని అమృతంగా భావించి దానికి సాధనంగా ఈ సందేశ కావ్యాలను లోకానికి అందించినారు. కాని ఆ తర్వాత ఆ ఉదాత్తత తగ్గి బాహ్య చమత్కారాలే ప్రధానంగా సాగే స్థితి వచ్చినది. అయినా భారతీయత కోల్పోకుండానే కవు లందరు మన వాఙ్మయాన్ని ప్రవహింప చేసినారు.

శ్రీ శర్మగారు ఈ సందేశ కావ్యాలగూర్చి చేసిన పరిశ్రమ ప్రశంసనీయం. వారికి సీతారామచంద్రులు దీర్ఘాయు రారోగ్యములు ప్రసాదిస్తు, ఈ సందేశ కావ్యాలలోని ధార్మిక మార్మికతను తాత్త్విక ప్రబోధాన్ని కూడ వారు వివరించి లోకానికి అందించేలా అనుగ్రహిం చాలని ప్రార్థిస్తున్నాను. నాకు ఈ సదవకాశాన్ని ప్రసాదించిన శ్రీ రాజగోపాల శర్మగారికి నా పరిపూర్ణమైన హార్దిక మంగళా శాసనములు.

విశాఖపట్నం
6—10—'89

ఇట్లు
శ్రీభాష్యం అప్పలాచార్యులు



Prof. G. V. SUBRAHMANYAM
M A, Ph.D
Department of Telugu
University of Hyderabad
Hyderabad - 500 001

# తేనెవాగు

కొన్ని పరిశోధన గ్రంధాలు పరిశను బలవంతాన చదివిస్తాయి, కొన్ని ఆపి, ఆపి చదివిస్తాయి, మరికొన్ని మొదలు పెట్టింది మొదలు ముగిసేంత వరకూ ఆసక్తికరంగా చదివిస్తాయి మిత్రులు డాక్టర్ బాపట్ల రాజగోపాల శర్మగారు రచించిన సిద్ధాంత వ్యాసం 'తెలుగు సందేశకావ్య సమాలోచనం' నన్ను ఆమూలాగ్రం ఆసక్తికరంగా చదివేటట్లు చేసింది. దీనికి వస్తు వెంత కారణమో రచనకూడా అంత కారణం !

కావ్య ప్రక్రియలలో సందేశ కావ్యం ఒక 'లిరిక్కు' లాంటిది. ఋగ్వేదంలో దాని బీజం కానవచ్చినా, రామాయణంలో దాని మూలం గోచరించినా, దాని అవతారానికి అభినవ బ్రహ్మ మహాకవి కాళిదాసే. ఒక ప్రక్రియకు కావలసిన లక్షణాలన్నీ సలక్షణంగా 'మేఘసందేశం'లో మూర్తీభవించటంచేత దానికి సందేశ కావ్యమనీ, దూత కావ్యమనీ ప్రత్యేకంగా నామకరణం చెయబడింది ఆ పేరు క్రమంగా రూఢి కెక్కింది అందువలన సందేశకావ్య ప్రక్రియకు ఆదిమరూపమే కాకుండా, ఆదర్శరూపం గూడా మేఘసందేశమే !

సందేశ కావ్యాల ఆవిర్భావ వికాసాలను గురించి సమాలోచించటం మేఘసందేశానికి ముందు వెనుకలను గురించి పరిశీలించటంతో మొదలు కావాలి. ఈ పరిశోధనకూడా అలాగే మొదలైంది సంస్కృత సాహిత్యంలో వెలసిన సందేశ కావ్యాల నన్నింటినీ కాలాన్నీ, గుణాన్నీ అనుసరించి సమీక్షించటం జరిగింది. దీనివలన సంస్కృత సందేశ కావ్యాల ఉత్పత్తి వికాస విచారం ఈ పరిశోధనలో పూర్వఖండంగా అమరింది. పరిశోధన జరుగుతున్నది

తెలుగులో కాబట్టి, తెలుగులో వెలసిన సందేశ కావ్యాల ఉత్పత్తికి దోహదం చేసింది సంస్కృత సందేశకావ్యం కాబట్టి, గీర్వాణ ప్రయోగాల కంటె తెలుగు కవుల సందేశకావ్య ప్రయోగాలు స్వతంత్ర ప్రతిభతో కూడినవై నవ్యతతోనూ, ప్రత్యేక వ్యక్తిత్వాలతోనూ వెలువడ్డాయి కాబట్టి, వాటిని ప్రత్యేకంగా పరిశీలించే అవకాశమున్న విస్తృత సంఖ్యలో తెలుగులో సందేశకావ్య ప్రయోగాలు వెలసి యున్నాయి కాబట్టి—సంస్కృత సందేశ కావ్యానుశీలనం ఈ పరిశోధనలో పూర్వభాగంగానే కాక పూర్వరంగంగా కూడా అమరింది. నిజం చెప్పవలసి వస్తే, సంస్కృతాంధ్ర సందేశకావ్యాల ఉత్పత్తి వికాసాల పరిశీలనం రెండు డాక్టరేట్లకు తగిన కృషి.

ఈ సిద్ధాంత వ్యాస ప్రథమాధ్యాయంలో సంస్కృత సందేశకావ్యాలతో పాటు మేఘసందేశ' కావ్య పరిశీలనం విశేషంగా సాగింది కావ్యంలోని బహి రంగాలను, అంతరంగాలను పరస్పర పోషకంగా ఉండేటట్లు సంవదించటం కవి ప్రౌఢి. కాళిదాసుని మేఘసందేశ కావ్య నిర్మాణ విధానం, తరువాతి సందేశ కావ్యాలమీద ప్రభావం వేయటం సహజం. దూతను వర్ణించటం, మార్గాన్ని సూచించటం, మార్గమధ్యంలోని విశేషాలను వర్ణించటం, నాయికను, ఆమె విర హావస్థను వర్ణించటం, సందేశాన్ని వినిపించటం మొదలైనవి మేఘసందేశకావ్య బహిరంగ నిర్మాణ విధానం. సంస్కృతంలోగానీ, తెలుగులో కానీ సందేశ కావ్యాల నిర్మాణాన్ని పరిశీలిస్తే మేఘసందేశ నిర్మాణ ప్రభావం ఎంతవరకు ఉన్నది ? అని వివేచించటం ఒక ముఖ్యాంశమౌతుంది.

బాహిరమైన అంగాలు ఆంతరమైన అంగాలకు అనుగుణంగా సంయో జింపబడటం కావ్యశిల్పం. అంతరంగ శిల్పం కావ్యవస్తు స్వభావాన్ని బట్టి యేర్పడుతుంది. అది అన్ని సందేశ కావ్యాల్లోనూ ఒకేరకంగా పోషింపబడే అవకాశం ఉండదు. ఉంటే అది అరుదు. ఉదాహరణకు మేఘసందేశంలోని భావగతమైన ఒక ఆంతర శిల్పవిశేషాన్ని గురించి ముచ్చటించుకొందాం.

యక్షుడు శాపగ్రస్తుడు. సతి విరహంతో అత్యంత కృపణుడై మేఘుని ద్వారా ప్రియురాలికి సందేశం పంపాడు ఆ సందేశంసంగతి విన్న కుబేరుడు యక్షుని శాపాన్ని ఉపసంహరించాడు ఇది స్థూలంగా కనపడే కథ శాపోప

సంహార కారకమైన ఆ విరహ సందేశంలో అంతటి సానుభూతిని కలిగించే భావాంశ ఏమిటని సహృదయుడు భావించటం ప్రారంభిస్తాడు. మహాకవి కాళిదాసు ప్రతిభ అప్పుడు అతనికి అవగతం కావటం ప్రారంభమౌతుంది.

శాంతిపర్వంలో భీష్ముడు ధర్మజునికి పరమోత్తమ ధర్మమని చెప్పిన మాటలివి—

'ఒరు లేయవి యొనరించిన
నరవర ! యప్రియము దనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పదములయందున్".

యక్షునకు కలిగిన అప్రియం ప్రియురాలితో వియోగం, దానివలన కలిగిన విరహ దుఃఖం, అతడు సందేశాన్ని పంపుతున్నది. తన ప్రియురాలికి కలిగే విరహదుఃఖం కొంత ఉపశమించటానికి, సందేశ శ్రవణం వలన ఆమెకు పతితో భావగతమైన యోగం కలగాలని. ప్రణయభావ యోగం మేఘసందేశ ఫలం. ఇది యక్షదంపతులకు మాత్రమే కలిగితే ఆ ఫలం వైయక్తికమౌతుంది. అప్పుడది ఉదాత్తంకాదు. అందువలన కాళిదాసు యక్షుని నోట పలికించిన సందేశంలో ప్రకృతిలోని చరాచర ప్రవృత్తులలో స్త్రీ పుంస భావయోగం నిత్యంగా ఉండాలనీ, స్త్రీ పురుష శక్తులకు వియోగం కలగకూడదనీ సంభావించి నట్లు చిత్రించటం అంతస్సూత్రంగా గోచరిస్తుంది.

ఉజ్జయినీ నగరంలో తమోభిసారికలు చిమ్మచీకట్లో సంకేత స్థలాలకు పోతుంటారు. ఆ సన్నివేశాన్ని చూచిన మేఘుడు మెరవాలనే కాని, గర్జించ రాదని యక్షుడు భావిస్తాడు. మెరుపులకాంతి ఆ విరహిణులు సంకేత స్థలానికి పోవటానికి త్రోవచూపిస్తుంది. అభిసారికలు ప్రియులతో పొందే యోగాన్ని భగ్నం చేయరాదనే హృదయ ధర్మం సందేశంలోని అంతస్సూత్రం. (చూడండి : "గచ్ఛంతీనాం .... ... ... విక్లబాస్తాః" పూ. మే. 41) ఇలాగే ఆమ్రకూటంలోని సిద్ధ దంపతుల విషయంలో కూడా యక్షుడు సంభావిస్తాడు. అక్కడ మేఘుణ్ణి ఉరుమ మంటాడు. దానివలన సిద్ధపతులకు అయాచిత

ప్రియా పరిరంభ సౌఖ్యం కలుగుతుందని యక్షుని కామన (చూడు "ఆంభో బిందుగ్రహణచతురాం.. .." పూ మే 22), మహాకవి కాళిదాసు మహాకాళ క్షేత్రంలోని పార్వతీ పరమేశ్వరులను మేఘుణ్ణి దర్శించుమని నిర్దేశించి చెప్పిన మాటలు మరింత విశేషంగా ఉన్నాయి. (చూడు : పశ్చాదుచ్చైర్భుజ తరు వనం....... పూ. మే 40) ఆదిదంపతుల అవిచ్ఛిన్నానురాగానికి ఆవంత కూడా అవరోధం కలుగకుండా ఉండాలని యక్షుని అభిమతం. నటరాజస్వామి ఒకవైపు తాండవం చేస్తుంటే మరొకవైపు పార్వతీదేవి లాస్యంచేస్తూ ఉంటుంది స్వామి ధరించిన రక్తార్ద్ర గజచర్మ వస్త్రాన్ని చూచి ఆ దేవి యేవగించుకొని ఆయనకు దూరంగా జరుగుతుందేమోనని యక్షుని భయం. ఆ యెడబాటుకూడా వారిద్దరికీ కలగకుండా మేఘుణ్ణి స్వామి గజాజిన స్థానంలో నిలిచి ఉమాదేవికి ఉత్సాహాన్ని కలిగించుమని ప్రార్థిస్తాడు అలాచేస్తే కైలాసగిరిపై విహరించే పార్వతీ పరమేశ్వరులపట్ల కూడా యక్షుడు వారి అనురాగసిద్ధినే అభిలషిస్తాడు.

> "హిత్వా తస్మిన్ భుజగవలయం శంభునా దత్త హస్తా
> క్రీడాశైలే యది చ విహరే త్పాద చారేణ గౌరీ
> భంగీ భక్త్యా విరచిత వపుః స్తంభితాంతర్జలౌఘః
> సోపానత్వం కురు మణితటా రోహణాయాగ్రయాయీ" – పూ మే. 64

ఆదిదంపతుల అవిచ్ఛిన్న ప్రణయసిద్ధిని కోరే యక్షుడు సర్వజీవ ప్రవృత్తులలో చివరకు అచేతన ప్రకృతులయందు కూడ ఇటువంటి భావయోగాన్ని కాంక్షించి సర్వభూత హితార్థి యైనాడు నదీ మేఘాలమధ్య నాయికా నాయక సంబంధాన్ని భావించి తత్పునస్సంయోగ సిద్ధిని పెక్కుచోట్ల ఆశించాడు కాళిదాసు నదీమేఘాలనేగాక ప్రకృతిగతాలైన అచేతన ద్రవ్యాలను వర్ణిస్తూ కూడా ప్రణయసిద్ధిభావానికి ప్రాముఖ్యం కల్పించాడు. సూర్యోదయ కాలంలో ఖండిత నాయికయైన పద్మినికీ సూర్యునికీ మధ్య మేఘాన్ని అడ్డు రావద్దంటాడు యక్షుడు శిప్రావాయువు ప్రార్థనాచాటుకారుడైన ప్రియునిలాగా సురత పరిక్రాంతలైన సుదతుల చిత్తాలలోని గ్లానిని పోగొట్టి పునస్సంభోగాభిలాషను రేకెత్తిస్తాడట ! ఇలా యక్షుడు సర్వప్రకృతిలోనూ దంపతీయోగాన్ని భావించి తన సందేశంలో అంతస్సూత్రంలా నిబంధించాడు. ఆ భావాన్ని భావించిన సహృదయునిలాగా కుబేరుడు కూడా యక్షశాపాన్ని నివారిస్తాడు. (ఇంకా

వివరాలకు చూడండి నా వ్యాసం : 'సారస్వత సౌరభం' లోని 'మేఘ సందేశము ప్రకృతి వర్ణనలు — 1970).

మిత్రులు డాక్టర్ బాపట్ల రాజగోపాలశర్మగారు కావ్యంలోని బహిరంగాలను పరామర్శించి ఊరుకోకుండా అంతరంగాన్ని కూడా అనుశాసించే గాఢ స్వభావులు. అందుచేత పరిశోధనలో అంతస్సారం గోచరిస్తుంది ద్వితీయాధ్యాయంలో అనువాద సందేశకావ్య సమీక్ష ఔచిత్యవంతంగా సాగింది. తెలుగులోకి వచ్చిన అయిదు సందేశ కావ్యాల మూలార్థాలను, అనువాదకుల రమణీయార్థాలను తులనాత్మకంగా వివేచించటం ఈ అధ్యాయంలో ప్రశంసాపాత్రం. వివరాలను, విశేషాలను తెలపటంతో పాటు వివేచనను జోడించి విశ్లేషించటం ఈ అధ్యాయంలో విశేషంగా వ్యక్తమౌతుంది.

తెలుగులో వెలువడిన స్వతంత్ర సందేశ కావ్యాలను ప్రణయ సందేశ కావ్యాలనీ, సామాజిక సందేశ కావ్యాలనీ వర్గీకరించి తృతీయ చతుర్థాధ్యాయాలలో వరుసగా వాటిని వివేచించారు వీరి పరిశీలనలో పఠిత హృదయానికి నచ్చే విషయాలెన్నో ఉన్నాయి. కొన్నింటిని పేర్కొంటాను.

1. రచయితకు విషయాన్ని గురించిన స్పష్టమైన అవగాహనం ఉండటం వలన, విశ్లేషణ వివేకం దానికి పోషకంగా అమరటంచేత ప్రతిపాద్యాంశాలు పండొలిచి చేతిలో పెట్టినట్లుగా ఉంటాయి. అందువలన పఠిత పుస్తకం చదువుతున్నప్పుడు సుఖపడతాడు.

2. ప్రతిపాద్యాంశాలకు సంబంధించిన వివరాలను వెంటనే ఫుట్ నోట్సులో ఇవ్వటం వలన అవగాహన అందిపుచ్చుకొన్నట్లు అనుభవంలోకి వస్తుంది.

3 తులనాత్మక పరిశీలనం చేసేటప్పుడు మూలపాఠాన్ని పూర్తిగా ఇవ్వటం వలన పఠితకు వెదుక్కునే బాధ తొలగింది.

4. శైలి సరళం కావటం చేత గ్రంథ పఠనాసక్తిని పఠితలో ఇనుమడింపచేస్తుంది.

5. కావ్యానుశీలనంలో పరిశోధకుడు ఒకే రకమైన విశ్లేషణ విధానాన్నీ, వివరణ పద్ధతినీ సర్వత్రా అనుసరించక, ఆయా కావ్యాల స్వరూప స్వభావాల ననుసరించి అనువైన విమర్శ వివేకాన్ని రూపొందించు కొనటం ఈ పరిశోధనలో ప్రత్యేకంగా పరిగణింపదగిన సాహిత్యాంశం.

6. సందేశ కావ్యాలన్నీ తెలుగువారికి నేడు అందుబాటులో లేవు. అందు వలన వాటిలోని విశిష్టాంశాలను వివరించేటప్పుడు పరిశోధకుడు వాటిని సోదాహరణంగా పేర్కొనటం సంతోషింప దగిన అంశం.

7. పరిశోధన గ్రంథ రచనలో అస్పష్టతలేని సూటిదనంతో కూడిన వ్యక్తీ కరణ వైఖరి, బంగారానికి తావి అబ్బినట్లుగా అమరింది.

8. 'సందేశకావ్య సందేశసారం'గా సాగిన పంచమాధ్యాయం పరిశోధనాంశ సారంగా రూపొందింది. ఇది శాస్త్రీయ ఫలితాంశ పత్రం

డాక్టర్ బాపట్ల రాజగోపాలశర్మగారి పరిశోధనాంశం ప్రధానంగా విశ్లేషణాత్మకం, వివరణాత్మకం అని మొదట గమనించాలి. రచనలో నిగ్రహం, వ్యక్తీకరణలో క్లుప్తత లేకపోతే ఈ జాతికి చెందిన పరిశోధనలు నీరెక్కువైన పాలలాగా సారరహితంగా తయారయ్యే అవకాశంఉన్నది తన పనిలోని మెళకువలను తెలిసికొన్న పనిమంతులు డాక్టర్ శర్మగారు అందు వల్లనే ఈ పరిశోధనలో ఎక్కడా పల్చబడిన లక్షణం గోచరించదు. పదను తప్పిన అదను కనపడదు నీరుగారిన ఘట్టం ఎక్కడా లేదు. ఆద్యంతం ఒక తేనెవాగు అవిచ్ఛిన్నంగా అవలీలగా పారుతున్న అనుభూతి పఠితకు కలుగుతుంది పరిశోధనకు ఇంతకంటె పరమార్థం మరెందుకు !

చదివిన తృప్తిని మిగిల్చే రచన నందించిన డాక్టర్ రాజగోపాలశర్మ గారికి హృదయపూర్వకాభినందనలు.

హైదరాబాద్
18–11–'89

జి. వి. సుబ్రహ్మణ్యం

# కృతజ్ఞతాంజలి

జన్మనిచ్చి, బాల్యం నుండి సాహిత్యాభిరుచిని కల్గించి నన్ను నిత్య సాహిత్య విద్యార్థిని చేసిన జననీ జనకులకు సభక్తికమైన నమస్సుమాంజలులు

సాహిత్యాధ్యయనాధ్యాపనాలలో ఈ జీవితాన్ని సార్థకం చేసుకోడానికి దోహదం చేసిన గురువర్యులు ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం మహోదయులు ఆప్తులు పూజ్యులు శ్రీ పి. గోపిరెడ్డి మహోదయులకు వినయపూర్వక నమస్సుమాంజలులు.

నా సిద్ధాంతవ్యాస విషయసేకరణలో సహకరించిన ఆంధ్ర, వేంకటేశ్వర, మద్రాస్, నాగార్జున విశ్వవిద్యాలయాల గ్రంథాలయాధికారులకు, రాజమహేంద్ర వరంలోని గౌతమి గ్రంథాలయం, కాకినాడ ప్రభుత్వ గ్రంథాలయం, వేటపాలెం సారస్వత నికేతన్, హైద్రాబాద్ స్టేట్ సెంట్రల్ లైబ్రరీ, మద్రాస్ కన్నెమెరా లైబ్రరీ అధికారులను నా కృతజ్ఞతలు.

విజయవాడలో అత్యంత పురాతన గ్రంథాలయం దుర్గామల్లేశ్వర గ్రంథాలయం, రామమోహన లైబ్రరీ, టాగోరు పరిశోధన గ్రంథాలయం అధికారుల సహకారం మరువలేనిది. వారికి నా కృతజ్ఞతలు.

ఒక పండితునితో సంభాషణ వందల గ్రంథాలను చదివిన ప్రయోజనాన్ని కల్గిస్తుంది నాయందలి వాత్సల్యంతో నేను అడిగినదాని కంటె ఎక్కువ సమాచారాన్ని నాకందించిన ప్రముఖ పండిత కవివరేణ్యులు సరస్వతీపుత్ర శ్రీమాన్ పుటపర్తి నారాయణాచార్యుల వారికి, కీ॥ శే॥ మహామహోపధ్యాయ బ్రహ్మశ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారికి, కీ॥ శే॥ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారికి, కీ॥ శే॥ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారికి కీ॥ శే॥ ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి, ఇలా ఎందరో పెద్దలున్నారు. వారందరికి వినయపూర్వక నమస్సుమాంజలులు.

నా యీ సిద్ధాంత వ్యాసం డాక్టరేట్ పట్టానికి అర్హమైనదిగా నిర్ణయించిన పరీక్షాధికారులు పూజనీయులు ఆచార్య గంధం అప్పారావుగారు, ఆచార్య

తుమ్మపూడి కోటేశ్వరరావుగారు. ఆచార్య శ్రీమతి పి. యశోదారెడ్డిగారలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

అల్పాక్షరాల్లో అమూల్యాభిప్రాయ ప్రకటనతో హార్దికంగా అభినందించిన ఆంధ్ర పురాణకర్త కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారికి ఆశీః పూర్వకమైన పరిపూర్ణ హార్దిక మంగళాశాసనాలతో నన్ను ధన్యుని చేసిన శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య మహోదయులకు, నా పరిశ్రమను విశ్లేషణాత్మకమైన పరిశోధనగా భావించి సముచితమైన ప్రశంసాపూర్వక అభిప్రాయాలను తెలియజేసిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం మహోదయులకు నా కృతజ్ఞతాంజలులు.

డాక్టరేట్ పొందిన కారణంగా నే పనిచేస్తున్న కళాశాలలో పెద్దల సరసన పండితుల సమక్షంలో సన్మానం పొందడం నా సుకృతం అది నా జీవితంలో మధురస్మృతి. ఆ సన్మాన కార్యక్రమానికి రూపశిల్పి శారదా డిగ్రీ కళాశాల ప్రాచార్యులు శ్రీ వై పూర్ణచంద్రరావుగారికి, సూత్రధారులు శ్రీ ఎ వై. ఎన్ ఆచార్యులుగారికి నా కృతజ్ఞతాభివందనాలు

తమ కళాశాలలోని అధ్యాపకులు పొందిన అభివృద్ధికి మిక్కిలి ఆనందాన్ని పొందే కళాశాల పాలకవర్గ అధ్యక్షుల అధ్యక్షతన నాకు సన్మానం జరగడం పాలకవర్గ కార్యదర్శి శ్రీ శిష్టు భరతశాస్త్రిగారు సత్కరించడం నా అదృష్టంగా భావిస్తున్నాను. మా నిరంతర పురోభివృద్ధిని కాంక్షించే వారిరువురికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు

సహాధ్యాపకుల అభినందన అందుకోవడం కూడ మహాద్భాగ్యమే శారదా డిగ్రీ, జూనియర్ కళాశాలల అధ్యాపకులందరూ కలసి శారదా జూనియర్ కళాశాల ప్రాచార్యులు శ్రీ కె వి హనుమంతరావుగారి అధ్యక్షతన నన్ను సమ్మానించడం దానికి ఆప్తమిత్రులు శ్రీ పి లక్ష్మణరావుగారు సూత్రధారులు కావడం ఆనందకరమైన విషయం వారందరికి నా హార్దిక కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలులు,

తమలో ఒకడినైన నేను డాక్టరేట్ పట్టం పొందినందుకు సంతసించి ఉచితరీతిని అభినందన సమ్మానాలను చేసిన రసభారతి సాహిత్యసంస్థవారికి, అందునా ప్రత్యేకించి సహృదయులు శ్రీ ఎ మల్లికార్జునశర్మగారికి, రసతరంగిణి కార్యవర్గానికి, లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ సిటీవారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు.

నేను చేసే ఏ మంచి పనికైనా సహకరిస్తూ నిరంతరం ప్రోత్సాహాన్నిచ్చే సహాధ్యాపకులు శ్రీమతి ఎం మీనాకుమారి, శ్రీ జె. హనుమంతరావుగార్లకు కృతజ్ఞతలు.

సిద్ధాంత వ్యాసరచనలో నిమగ్నమై విధి నిర్వహణలో కొంత అలసతను కనపరచినా పెద్ద మనసుతో క్షమించి ప్రోత్సహించిన సహృదయులు, మంచికి, మానవత్వానికి విలువనిచ్చే ఆదర్శ ప్రాచార్యులు శ్రీ కె వి. హనుమంతరావు గారికి నా కృతజ్ఞతాంజలులు.

నా యీ సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించడానికి ఆర్థిక సహాయాన్ని అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, విశ్వవిద్యాలయ కులపతి ఆచార్య తూమాటి దొణప్ప మహోదయులకు నా వినమ్రాంజలి.

తమకున్న సాహిత్యాభిమానానికి నా యందలి వాత్సల్యం తోడుకాగా గ్రంథ ప్రచురణకు ఆర్థికంగా సహకరించిన మాన్యమహోదయులు బ్రహ్మయ్య అండ్ కో, పార్టనర్ శ్రీ చెవుటూరి తాండవకృష్ణ, వారి ధర్మపత్ని శ్రీమతి కుసుమకుమారి గారలకు వినయపూర్వక కృతజ్ఞతాంజలి.

ఈ గ్రంథానికి చక్కని ఈ ఆకృతినీయడంలో సహకరించిన శ్రీ లక్ష్మీ ప్రెస్ అధినేతలు శ్రీ కాట్రగడ్డ బ్రహ్మయ్యగారికి వారి తనయులు శ్రీ కాట్రగడ్డ శ్యాంబాబుగారలకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు

బాపట్ల రాజగోపాలశర్మ

# ప్రవేశిక

సందేశ కావ్యమనగానే వెంటనే రస హృదయుల మదిలో మెదిలే మహనీయ కావ్యం కాళిదాస మహాకవి మేఘసందేశం దీనికి మేఘదూత మనికూడ ప్రసిద్ధి వ్యవహారం.

మేఘసందేశం గుర్తుకువస్తే చాలు సహృదయ హృదయం స్పందిస్తుంది. కవికుల గురుని మధురబాధాపూరిత కమనీయ విరహ కావ్యంలోని మందాక్రాంతం అయస్కాంతంలా ఆకర్షిస్తుంది. అది పాఠకుని మేఘంతో పాటు యక్షుడున్న రామగిరినుండి అలకా పట్టణంలోని యక్షకాంత గవాక్షం వఱకు పయనింప జేస్తుంది అప్పటికి పాఠకుడు భారమైన వేడి నిట్టూర్పు విడిచి బాహ్య లోకంలోకి వస్తాడు

ఈ విధంగా మేఘసందేశ కావ్యం సార్వకాలికము సార్వజనీనమైన విరహబాధ కథావస్తు కలితం కావడంచేత యావత్ప్రపంచాన్ని ఆకర్షిస్తుంది పులకింప జేస్తుంది.

మేఘకావ్యంలోని స్వచ్ఛ కవిత్వానికి తెలుగు కవిపండిత లోకంకూడ ఆకర్షితమైంది తెలుగు భాషలో దీనికి అర్థశతానికి పైగా అనువాదాలు వచ్చాయి అంతేగాక మరుద్సందేశం, హంస సందేశం, విప్ర సందేశంలాంటి మరికొన్ని సంస్కృత సందేశకావ్యాలు కూడ తెనుగులోకి అనూదితాలైనాయి.

ఈ సందేశ కావ్యాలలోని ఇతివృత్త మేమంటే 'ఏ కారణం చేతనైనా ప్రియా ప్రియులకు వియోగం సంభవిస్తే ఆ వియోగజనిత బాధను సహింపలేక విరహోన్మత్తులై వారిలో ఒకరు తమకు కన్పించే శుక, పిక, శారికాదుల లోగాని ఘనపవనాదులలో గాని ఒక దూతనెన్నుకొని, ప్రార్థించి తన విరహబాధను వ్యక్తంచేస్తూ ప్రియునికి గాని, ప్రియురాలికి గాని సందేశం పంపించడం, దూత కృత్యాన్ని అంగీకరించిన దూతకు గమ్యస్థానాన్ని మార్గాన్ని వివరించడం" ఆ వివరించే సందర్భంలో అద్భుతమైన వర్ణనలు గావించడం పరిపాటి ఇవి "ప్రణయసందేశ కావ్యాలు."

కాలక్రమంలో శుకపికాల స్థానాన్ని గబ్బిలం, కప్ప, చీమ, దోమ మొదలైనవి ఆక్రమించవచ్చు. విరహవేదన స్థానంలో పతితుల, ఆర్తుల ఆవేదన ఆక్రందనలు చోటు చేసికొన్నాయి. వారు తమ ఆవేదనను దూత ద్వారా భగవంతునికే నివేదనంగా సందేశాలు పంపించారు ఇలా కొన్ని సందేశకావ్యాలు ఉద్భవించాయి. వీటిని "సామాజిక సందేశ కావ్యాలు" అనవచ్చు.

కేవలం అనువాద కావ్యాలేగాక తెలుగులో స్వతంత్ర సందేశకావ్య రచనకూడ సాగింది.

రావాడ వేంకటరామశాస్త్రిగారు ఆంధ్ర మేఘప్రతి సందేశం, మోటూరి వేంకటరావుగారు చకోర సందేశం, విశ్వనాథ సత్యనారాయణగారు శశిదూతం, గంటి కృష్ణవేణమ్మగారు పవన సందేశం వ్రాశారు. వీరిలా మరికొందరు కవులు స్వతంత్ర ప్రణయసందేశకావ్య రచన గావించారు.

మరికొందరు కవులు కాళిదాసుని వలె ప్రణయ సందేశ కావ్యాలుగాక తననాటి సమాజంలోని మంచి చెడులకు దర్పణాలుగా సామాజిక స్పృహతో సామాజిక సందేశ కావ్యాలు వ్రాశారు.

అతడి గాలిసోకిందంటే కసరి బుసకొట్టే నాల్గు పడగల హైందవ నాగ రాజు దౌష్ట్యాన్ని తట్టుకోలేని అరుంధతీ సుతుడు తన వేదనామయ కన్నీటి గాథను పరమేశ్వరునకు గబ్బిలంద్వారా నివేదించాడు. ఈ కథను కరుణరస పరిప్లావితమైన కావ్యంగా నవయుగ కవిచక్రవర్తి గుఱ్ఱం జాషువ చిత్రించారు.

సామ్యవాద సిద్ధాంతాకర్షితుడైన ఒక యువజనుడు ధనమదాంధుడైన కామందుని అక్రమాన్ని కనిపెట్టి ధైర్యంగా వేలెత్తిచూపి అతని క్రౌర్యానికి బలియై చెరసాల పాలైన విధాదాన్ని మేఘదూత కావ్యంగా సరస్వతీపుత్ర పుటపర్తి నారాయణాచార్యులుగారు కల్పించారు

ఆర్షధర్మం అడుగంటిపోతూ సమాజం నిర్వీర్యమై పతనావస్థను పొందు తున్నవేళ ఆ స్థితిని తప్పించమని వేడుకొంటూ శుకాన్ని దూతగా బ్రహ్మ దగ్గ

రకు పంపారు కందుకూరి వీరబసవరాజుగారు. ఇటువంటి సామాజిక సమస్య లకు దర్పణాలుగా మరికొన్ని సందేశకావ్యాలు వచ్చాయి.

ఈవిధంగా తెలుగులో ఏర్పడ్డ సందేశకావ్యాల్ని సమాలోచించి సిద్ధాంత వ్యాసరచన కుపక్రమించాను.

ప్రధమాధ్యాయంలో సందేశ కావ్యావిర్భావ వికాసాలను గూర్చి సమా లోచనం చేశాను. అందులో సందేశకావ్య నిర్వచనం సందేశకావ్యోత్పత్తిని గూర్చి పరిశీలించి తొలి సందేశ కావ్యమైన మేఘసందేశ రచనకు ప్రేరకమైన మూలకథ కావ్యంగా రూపొందడానికి స్ఫూర్తిదాయకమైన రామాయణ కావ్యేతి హాసంలోని విశేషాలనుగూర్చి వివరిస్తూ హనుమద్దౌత్య మేఘదూత్యాల సారూప్యా లను సమీక్షించాను. తొలిసందేశ కావ్యమైన మేఘకావ్య వైశిష్ట్యాన్ని పరిశీ లించి మేఘసందేశం ఆదర్శంగా సంస్కృత వాఙ్మయంలోని సందేశకావ్య వికాసాన్ని విశదీకరించాను.

ద్వితీయాధ్యాయంలో తెలుగులో వచ్చిన సంస్కృత సందేశ కావ్యాను వాదాల్ని సమీక్షించాను. మేఘసందేశానికి వివిధ ఛందస్సులలో, వివిధ రచనా పద్ధతులలో విరచితాలైన అనువాదాల్ని స్థూలంగా వివక్షిచాను. అదే రీతిగా మరికొన్ని సందేశకావ్యాలకు తెలుగులో వచ్చిన అనువాదాలలోని వైశిష్ట్యాన్ని యథాశక్తి విశదీకరించాను.

తెలుగులో వచ్చిన స్వతంత్ర సందేశ కావ్యాలలో ప్రణయ సంనేశ కావ్యాల్ని ప్రత్యేకంగా అనుశీలనం కావించాను. ఆ కావ్యాలలోని వస్తు వైవిధ్యాన్ని, వర్ణనా నైపుణ్యాన్ని కథన పద్ధతుల్ని వివరించి అవి ఆయా కవుల ప్రతిభకు ఎలా దర్పణాలైనాయో తెలియజేశాను తృతీయాధ్యాయంలో.

చతుర్థాధ్యాయంలో స్వతంత్ర సందేశ కావ్యాలలోని సామాజిక సందేశ కావ్యాలను ఒక్కొక్కటిగా సమీక్షకు చేపట్టాను. సామాజిక స్పృహను నిర్వ చించి ఈ సందేశకావ్యాల్లోని వస్తు స్వీకారంలోను, వర్ణన విధానంలోను, పాత్ర చిత్రణలోను, సామాజిక స్పృహలోను ఆ యా కవులు చూపిన వైలక్షణ్యాన్ని వివక్షించాను.

పంచమాధ్యాయంలో సందేశకావ్యాలిచ్చే సందేశాన్ని గూర్చి చర్చించాను. కవులు తమ కావ్యాలలో వస్తువైవిధ్యం కనపరచారు సమ్రాట్టులే గాక సామాన్యులు గూడ కావ్య నాయకులు కాదగినవారని నిరూపించారు మార్గాన్ని దూతకు వివరించే సందర్భంలో భారతీయ ప్రాచీనవైభవం, భారతీయ కవి, పండిత ప్రకాండుల ప్రాభవం మహిమాన్వితులైన దేవతల వర్ణన, క్షేత్ర మాహాత్మ్యాల వివరణం. వర్తమాన కాలంలోని రాజకీయ సాంఘిక స్థితిగతులు, నేటి నాగరక జీవన విధానం పల్లీయ జీవనం, సభ్య సమాజం .. విజ్ఞానిగా మనిషి వ్యవహరించ వలసిన తీరు మొదలైన విషయాల్ని ఈ సందేశకావ్యాలు ఎంతవఱకు నిరూపించాయో ఈ అధ్యాయంలో శక్తికొలది సమాలోచనం కావించాను.

కతిపయ భారతీయ సాహిత్యాల్లోని సందేశకావ్యాల తీరును విహంగ వీక్షణం గావించాను చివరి అధ్యాయంలో ఈ సందర్భంలో శ్రీమాన్ పుటపర్తి నారాయణాచార్యులవారితో ముఖాముఖి గావించి మలయాళ సాహిత్యంలో ఈ ప్రక్రియకుగల ప్రాచుర్యాన్ని గూర్చి సేకరించిన విషయాలను ఇందులో పొందుపరచాను.

ఈ విధంగా ఆరు అధ్యాయాలకు పరిమితమైన ఈ సిద్ధాంతవ్యాసం వ్రాయ సంకల్పించి పరిశోధన కుపక్రమించే నాటికి ఏ విశ్వవిద్యాలయంలోను ఈ విషయం పరిశోధనాంశంగా స్వీకరింపబడలేదు. క్వాచిత్కంగా భారతి వంటి సాహిత్య పత్రికల్లో ఒకటి రెండు వ్యాసాలు మాత్రమే వచ్చాయి. వాటిని చూచి ఈ అంశంపై పరిశోధనచేస్తే బాగుంటుందని గురువర్యులు ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారు సూచించారు చర్విత చర్వణంగా కాక నూత్న విషయాన్నిగూర్చి సిద్ధాంత వ్యాసంవ్రాస్తే బాగుంటుందనే ఉత్సాహంతో ఈ అంశాన్ని స్వీకరించి పరిశోధన కుపక్రమించాను. శ్రేయోభిలాషులైన మిత్రులు గూడ ప్రోత్సహించారు, ఈ అంశం ఒక కవికి సంబంధించిన సమగ్ర పరిశోధనకుగాకి. ఒక గ్రంథానికి పరిమితమైన సమగ్ర సమాలోచనకుగాని చెందిందిగాక ఒక సాహిత్య ప్రక్రియకు సంబంధించింది కావడంచేత విషయ సేకరణ కష్టసాధ్యమైంది. పరిధి విస్తృతిని బట్టి ఎక్కువకాలం కూడ పట్టింది.

అయినా సమగ్రంగా దీన్ని తీర్చిదిద్దానని చెప్పలేనుగాని సందేశకావ్య సాహిత్య ప్రక్రియపై సమగ్రమైన అవగాహనను కల్గించడానికి శక్తివంచనలేక కృషి చేశాననే ఆత్మప్రత్యయం నాకు ఉంది ఆ ప్రత్యయానికే నాకు నాగార్జున విశ్వవిద్యాలయం పి. ఎచ్.డి. పట్ట ప్రదానం చేసిందని భావిస్తాను.

ఈ గ్రంధాన్ని అవలోకించిన గుణగ్రహణ పారీణులైన బుధులు

గుణదోషౌ బుధో గృహ్ణన్నిందు క్ష్వేళా వివేశ్వరః ।
శిరసా శ్లాఘ తేపూర్వం పరం కంఠే నియచ్ఛతి ॥

అన్న ఆర్యోక్తి తెలిసినవారు గాన ఈ గ్రంధంలోని గుణం లేశమాత్ర మున్నా గ్రహించి మరింత మంచి గ్రంధంగా తీర్చి దిద్దడంలో అదనపు సమాచారాన్ని అందించినా, చక్కని సూచనలు చేసినా శిరసావహించి స్వీకరిస్తాను. సూచనలు ఇవ్వవలసినదిగా అర్థిస్తున్నాను.

బాపట్ల రాజగోపాలశర్మ



# వి ష య సూ చి క

# సందేశ కావ్యావిర్భావ వికాసాలు

## ప్రథమాధ్యాయము



ఇందులో; తొలి సందేశహర్త – దేవశుని 'సురమ'

సందేశ కావ్య నిర్వచనం

సందేశ కావ్యోత్పత్తి

తొలి సందేశ కావ్యం

మేఘ సందేశం – కావ్య వైశిష్ట్యం

సంస్కృత సందేశ కావ్య వికాసం

మేఘ దూతానికి పూరకాలు



తొలి సందేశ హర్త
ఇంద్ర దూతి సరమ

ఇంద్రస్య దూతీ రిషితాచరామి
మహ ఇచ్ఛంతీ పణయోనిధీన్వః
అతిష్కదో భియసా తన్న ఆవత్త
థారసయా అంతరంపయాంసి

- ఋగ్వేదం

# తొలి సందేశ హర్త దేవశుని 'సరమ'

దేవతలకు గురువైన బృహస్పతి ధేనువులను వలుడనే రాక్షసుడు తన భటులైన పణుల సహాయంతో అపహరించి పర్వత గుహలో దాచాడు. తన గోవులు అపహరింపబడిన విషయాన్ని బృహస్పతి ఇంద్రునకు తెలియజేశాడు. ఇంద్రుడు దేవశుని సరమను పిలిపించి చోరవృత్తాంతాన్ని తెలియజేసి ధేనువులెక్కడ ఉన్నాయో తెలిసికొని శత్రువుల స్థితిగతుల్ని కూడ పరిశీలించి రమ్మని పంపాడు. ఆ సరమ వలాసురుని పట్టణానికి చుట్టునున్న మహానదిని దాటి పట్టణంలోకి ప్రవేశించి గోవుల్ని దాచిపెట్టిన ప్రదేశాన్ని చూస్తుండగ వలుని భటులైన పణులు సరమ సాహసానికి ఆశ్చర్యం పొంది, గోవుల్ని గూర్చి ఇంద్రునకు తెలియకుండాలని ఆలోచించి దానితో సంభాషిస్తు "మనం స్నేహం చేద్దాము. ఈ గొవులలో భాగం తీసికో, మా బలం అధికం. కాబట్టి ఇంద్రుడు మమ్మేమి చేయలేడ"ని పల్కితే అపుడు సరమ ప్రలోభానికిలోను గాకుండా తానెవరి దూతగా రాబడ్డదో ఆ ఇంద్రుని బలశౌర్యాల్ని వివరించి విశ్వాసపాత్రమైన దూతవలె వర్తించి మరల తిరిగివచ్చి గోవుల వృత్తాంతాన్ని శత్రుబలాన్ని ఇంద్రునకు వివరిస్తుంది.

* ఋగ్వేదం 8వ అష్టకం మొదటి మండలం

సరమాదేవ శునీ ఋషికా పణయోదేవతా త్రిష్టుప్ ఛందః

1) కి మిచ్ఛంతీ సరమా ప్రేదమాన డ్దూరేహ్యధ్వాజ గురిః పరాచైః కాస్మేహితిః కాపరితక్మ్యాసీ క్కథంరసయా అతరః పయాంసి

2) ఇంద్రస్య దూతీ రిషితాచరామి మహ ఇచ్ఛంతీ పణయో నిధీన్వః అతిష్కదోభియసాతన్న ఆవత్త ధారసయా అంతరం పయాంసి

---

*. ఋగ్వేద సంహితా సంపాదకః పద్మభూషణ బ్రహ్మర్షి శ్రీపాదదామోదర సాత్వ లేకర్ ప్రకాశకః స్వాధ్యాయ మండలం పారగే[illegible] [illegible]ాడ్ ప్రదేశ్ గుజరాత్

3) ఇన్ద్రస్య దూతీరిషితా చరామి మహ ఇచ్ఛన్తీ పణయో నిధీన్వః అతిష్కదో భియసా తన్న ఆవత్తథా రసాయా అతరం పయాంసి (?) — printed: కీదృఙ్ఙిన్ద్రః సరమే కాదృశీకా యస్యేదం దూతీ రసరః పరాకాత్ ఆ చగచ్ఛాన్మిత్ర మేనాదధామా ఽ. థాగవాం గోపతిర్నో భవాతి

4) నాహంతం వేదదభ్యందభత్సయస్యేదం దూతీర సరం పరాకాత్ నతం గూహంతి స్రవతో గభీరా హతా ఇంద్రేణ పణయః శయధ్వే

5) ఇమాగావః సరమేయా ఐచ్ఛః పరిదివో అన్తాన్సుభగేపతంతీ కస్త ఏనా అవస్సృజాదయుధ్వ్యతాస్మాక. మాయు ధాన్సంతి తిగ్మా

6) అసేన్యావః పణయోవచాంస్య నిషవ్యాస్తన్వః సన్తుపాపీః అదృష్టోవ ఏతవా అస్తుపన్థా బృహస్పతిర్వ ఉభయా నమృళాత్

(7) అయం నిధిం సరమే అద్రిబుధ్నో గోభిర స్వేభిర్వసుభిర్న్యృష్టః రక్షంతి తం పణయో యేసుగోపారేకు పదమలక మాజ గన్థ

8) ఏ హాగమన్నృషయః సోమ శితా అయాస్యో అంగిరసోనవగ్వాః త ఏత మూర్వం విభజంత గోనామథైతద్వచః పణయో వమన్నిత్

9) ఏ వాచత్వం సరమ ఆ జగన్థ ప్రబాధితా సహసాదైవ్యేన స్వసారంత్వాం కృణవైమా పునర్గా అపతేగవాం సుభగే భజామ

10) నాహం వేద భ్రాతృత్వం నోస్వసృత్వ మిన్ద్రో విదురంగిరం సశ్చ ఘోరాః గోకామామే అచ్ఛదయన్యదాయమ పాత ఇతపణయో వరీయః

11) దూరమిత పణయో వరీయ ఉద్గావోయన్తుమినతీ ఋతేన బృహస్పతిర్యా అవి నన్ని గూళ్హాః సోమో గ్రావాణ ఋషయశ్చ విప్రాః

1. సరమ ఎందు నిమిత్తం మన నివాస స్థానానికి వచ్చింది?

ఈ మార్గం మహాయత్నం చేతగాని రావటానికి శక్యం గానిది. దూర మైంది. సామాన్యముగ తిరుగుచు యాదృచ్ఛికంగా రావటానికి ఎంత మాత్రం అవకాశం లేదు. కాబట్టి సరమనే అడుగుదాం అని అను

---

వేదసారరత్నావళి ద్వి.భా. రచయిత సాంగవేద వాచస్పతి
బ్ర శ్రీ. ఉప్పులూరి గణపతిశాస్త్రి ప్రచురణ 1974
ప్రాప్తిస్థానం; సత్యనారాయణస్వామి దేవస్థానం-అన్నవరం; తూ.గో.జిల్లా

కొన్ని వలాసురుని భటులు సరమతో ఓ దేవశునీ! మావద్ద నీకేం ప్రయోజనం? ఎందుకీ ప్రదేశానికి వచ్చావు? రాత్రి అంతా ఎట్లా పయనించితివి? సూతాయుతల వెడల్పు గల్గి మహాధ్వనితో కూడిన ఈ అంతరిక్ష నదీ జలాన్ని ఎట్లు దాటితివి?

2. ఓ పణులారా! నేను ఇంద్రుని దూతని, ఇంద్రుడే నన్ను వంపుటచే తిరుగుతు బృహస్పతి గోసమూహం మీపర్వతములందున్న గోశాలలలో వెదకటానికై వచ్చాను. ఆ మహానదీ జలముల తరణం వల్ల భయం లేకుండా సురక్షితంగా దాటి వచ్చాను.

3. ఓ సరమా! ఏ ఇంద్రుని దూతవై ఎంతో దూరంనుండి ఇటకు వచ్చావో ఆ నీస్వామియైన ఇంద్రుడు ఎంత పరాక్రమము గలవాడు? సైన్యమెంత ఉన్నది? అని ప్రశ్నిస్తు సరమను మంచితనంతో లోబరుచుకోవాలని యాలోచిస్తు తమలో తాము కూడ బలుక్కున్నారు.

4. ఓ పణులారా! ఏ ఇంద్రునకు దూతినై బహు దూరంనుండి మీ స్థానానికి వచ్చితినో ఆఇంద్రుడు పణులను హింసించేవాడు, హింసింసబడేవాడుకాడు. ఏ ఇంద్రుని మహిమచే ఈ పట్టణానికి కందకంగా నున్న గంభీరములగు ఈ మహానదీ జలములు ఇంద్రుని దూతనైన నేను దాటి వచ్చితినో అట్టి ప్రభువగు ఇంద్రుని ఈ నదీజలములు ప్రతిబాధించ నేరవు. అంతేగాక అవి అనుకూలించనుగలవు. అట్టి ఇంద్రుని శక్తి సామర్ధ్యములచే మీరు హతులై శయనించగలరు.

5 పణులు క్రోధయుక్తులై ఇట్లా పల్కారు :-

సౌభాగ్యవతియగు ఓ సరమా! ఏ గోవుల్ని వెదకాలనే తలంపుతో స్వర్గ ప్రాంతంనుండి సర్వప్రదేశాల్ని అన్వేషణం చేస్తువస్తున్నావో ఆగోవులు నీకనుల యెదుట కనిపిస్తున్నాయి కదా! మాకు తీక్ష్ణములైన ఆయుధములు ఉన్నాయి. అందుచేత మాతో యుద్ధం చేయక ఎవ్వడూ ఈ గోవుల్ని ఈ పర్వతములనుండి తీసికొని పోలేడు

6. ఓ పణులారా? మీ మాటలు సేనార్థములుగావు. మీ శరీరాలు బాణార్థములు గావు. మీరు పాపయుక్తులగుటచే పరాజితులు కాగలరు. మీ దుర్గాలచేత ఈ మార్గం ఇతరులకు ప్రవేశించటానికి అశక్యమైనా ఇంద్రుడు, బృహస్పతి, అగ్ని మున్నగు వారు వచ్చి మీ సేనల్ని మీ దేహాల్ని బాధిస్తారు.

7. ఓ సరమా! మాగవాదుల స్థానం ప్రతిబంధకములైన పర్వతాలచేత చుట్టు ఆవృతమై యున్నది. ఆ ప్రదేశ రక్షణలో నేర్పరులైన పణులు అనే అసురులు పాలిస్తున్నారు. నీవు వ్యర్థంగా ఇక్కడకు వచ్చావు.

8. ఓ పణులారా! సోమపానంచే మత్తులైన నగ్వులు. దశగ్వులు, అయిన అంగిరస్సులలో మొదటి వాడగు అయాస్యుడు మొదలగు వారు వచ్చి ఈ గొవుల్ని వశం చేసికొని విభజించుకొని కొనిపోగలరు. అపుడు మీరు పల్కిన వాక్యము మీరే ఉపసంహరించుకో గలరు.

9. ఓ సరమా! నీవు వలపురానికి పోయి అటనున్న గోవులను చూచి వచ్చి మాకు తెల్పమన్న ఇంద్రాదులచే అత్యంతము పీడితురాలవై ఇచటకు వచ్చావు. మరల వారివద్దకు పోవలదు. నిన్ను మా సహోదరిగా భావిస్తాము. ఈ గోవుల్ని విభాగం చేసికొందాం.

10. ఓ పణులారా! మీ భ్రాతృత్వం, స్వస్పృతం నాకేమి తెలియదు. శత్రువులకు భయంకరులగు అంగిరస్సులును, ఇంద్రుడును, మీ స్వభావం బాగా తెలిసినవారు. నేను వెళ్ళి ఈ వృత్తాంతం వారికి తెల్పగలను. వారు వెంటనే మీ స్థానాలు ముట్టడించగలరు. అంతకుముందే మీరీ ప్రదేశాన్ని, గొవుల్ని వదిలి దూరదేశం పొండి.

11. మీచే గుప్తంగా నుంచబడిన గోవులను బృహస్పతి పొందిన పిదప సోమలతను దంపుటకు సాధనములగు గ్రావలు, మేధావులగు అంగిరసులు పొందగలరు అని సరమ పలికింది.

ఈ సంవాదాన్నిబట్టి ఇంద్ర సందేశహర్త దేవశుని "సరమ" సామర్థ్యం, నిజాయితీ విదితమౌతాయి. సందేశ హారులతీరు అత్యంత ప్రాచీన వాఙ్మయం ఋగ్వేదంలోనే పొందుపరుపబడింది. సందేశ కావ్య లక్షణాలు కొన్ని ఈ సంవాదంలో బీజవాపం కావింపబడ్డాయి.

# సందేశ కావ్య నిర్వచనం

## సందేశ కావ్య నిర్వచనం :-

సంపూర్వక 'దిశ' (అతిసర్జనే) ధాతువునకు భావార్థంలో ఘఞ్ ప్రత్యయం* చేరగా సందేశమనే శబ్దమేర్పడుతుంది.

దీనికి వార్తను పంపడం, సందేశమందివ్వడం, ఏమైనా మాటలు చెప్పి పంపడమని అర్థం. అంతేగాక పసుపు, ఆజ్ఞ అనే అర్థాలు కూడ ఉన్నాయి.** "సందేశస్తు ప్రోషితస్య స్వవార్తా ప్రేషణం భవేత్" అని రసార్ణవ సుధాకరం (1-204) దేశాంతర గమ్యమైన స్వజనానికి వార్తను పంపడమని అర్థం.**ఎ.

ఆంగ్లంలో Message, command అనేవి దీనికి సమానార్థకాలు.*** ఈ సందేశం ఇతివృత్తంగాగల కావ్యాలకు సందేశ కావ్యాలని వ్యవహారం. వివిధ వాఙ్మయ ప్రక్రియల్లో ఈ సందేశకావ్య ప్రక్రియ ఒకటి.

"సందేశం" తీసుకుపోయేవాణ్ణి సందేశహరుడంటారు. అతనికి "దూత" "దూతడు" అనికూడ వ్యవహారం. "సందేశహరోదూతయే దూత్యం తద్భావ కర్మణోః****అని అమరం. అందుచేత సందేశ కావ్యాలకు దూతకావ్యాలని కూడ ప్రసిద్ధ వ్యవహారం. సంస్కృత వాఙ్మయ సహకార వృక్షానికి ఈ సందేశ [దూత] కావ్యాలు ప్రత్యేక శాఖ.

---

*. భావే. [పాణినీయ. కృదంత పరిచ్ఛేదం 3-3-18]
సిద్ధావస్థాపన్నేధాత్వర్థేవాచ్యే ధాతోఘ ఞ్ ప్రత్యయః స్యాత్.

**. శబ్దరత్నాకరం - సీతారామాచార్యులు బహుజనపల్లి

**ఎ సంక్రందనుని దివ్యసందేశ వాక్యంబు ధరియించు మౌళి పూదండ పోలె (శృం నై.iii-130)

***. Sanskrit-Hindi-English Dictionary Mukharji

**** అమరం

ప్రియుడు ప్రియురాలు ఏ కారణం చేతనైనా వియోగానికిలోనైనపుడు తద్వియోగ బాధాపనయార్థం ఎవరిద్వారానైనా తమమనోవేదనాన్ని నివేదించడం ఇతివృత్తంగాగల కృతులు ఈ సందేశ కావ్యాలు. ఇవి వియోగ శృంగారానికి సంబంధించినవి

స్థూలంగా ఈ కావ్యలక్షణమేమిటంటే తన్నెడబాసినప్రియుని గూర్చి ప్రియురాలు గాని, ప్రియురాలిని గూర్చి ప్రియుడుగాని ఉన్మాదావస్థలో ఏవేవో పలుకుతూ తగిన దూత లభించినపుడు సందేశం పంపడం. ఆ సందేశాన్ని తీసుకుపోయేదూత తన గమ్యంచేరడానికి ఏవి దేశాలు అతిక్రమించాలో, తన ప్రస్థానంలో ఏయే వింతలు చూడాలో తెలపడం. ఆ వివరాలన్నీ ఈ కావ్యాల్లో వర్ణితమౌతాయి.

కాలక్రమంలో ప్రియాప్రియులే గాక ఏ వ్యక్తి అయినా తన బహువిధ మానసిక వేదనాన్ని ఇంకొక వ్యక్తికిగాని లేదా దేవుడికిగాని నివేదించడమనే లక్షణంతోను ఈ సందేశ కావ్యాలు విస్తరిల్లాయి. మొదటివి ప్రేమ సందేశ కావ్యాలు కాగా రెండవ వర్గానికి చెందినవి సామాజిక సందేశక కావ్యాలు. వేదాంత సందేశకావ్యాలు కూడా క్వాచిత్కంగా కనపడుతున్నాయి.

ఒకానొకవ్యక్తిని ఆలంబనంచేసుకొన్నా ఈకావ్యాల్లో ప్రధానంగా వ్యక్తమయ్యేది కవి మనోగతోద్విగ్నభావన. ఇట్టి తీవ్ర భావోద్విగ్నమనోవేదనా హృదయం లేని కవి సందేశ కావ్యరచనకంతగా అర్హుడుకాడు. మొత్తంమీద ఈ వాఙ్మయం ఆత్మాశ్రయ కవితాధర్మం (Subjectivity) అధికంగా కలదిగా మనకు కన్పిస్తుంది.

ఈ సందేశాన్ని ప్రియురాలికో, ప్రియునికో, ఆత్మీయునికో లేక భగవంతునికో అందిస్తున్నట్లు కన్పించినా కవి పరోక్షంగా సహృదయలోకానికి అందిస్తున్నదే. అందుచేత సందేశకావ్యకర్తకులోకానుభవం, నిశిత పరిశీలం అత్యధికంగా ఉండాలి. సందేశమివ్వడానికి కవికి అనేక విధాల సామర్థ్యన కావాలి. సందేశం సహృదయలోకాని కత్యంత అభీష్టదాయకంగా ఉండాలి. అన్ని కావ్యాలవలె కాక సందేశ కావ్యరచన చేయడానికి కవికి ప్రత్యేకాభినివేశం, అర్హతకావాలి.

# సందేశ కావ్యోత్పత్తి

సందేశ కావ్యరచన ప్రత్యేక వాఙ్మయ ప్రక్రియగా ప్రవర్ధమానం కావటానికి పూర్వం అక్కడక్కడ కొన్ని సందేశాలు వేదాల్లో, కావ్యేతిహాసాల్లో అక్కడక్కడ కన్పిస్తున్నాయి. ప్రపంచ వాఙ్మయంలోనే అత్యంత ప్రాచీనతమమైన ఋగ్వేదంలో ద్రవణుని "సరమ" శత్రువుల స్థితిగతులను తెలిసికొని తిరిగి వచ్చి దేవతలకు తెల్పడంతో ఈ వాఙ్మయ ప్రక్రియ బీజావాపనకు దోహదం జరిగింది.1 ఆది కావ్యమైన రామాయణేతిహాసంలోని హనుమత్సందేశంలా ఈ సందేశకావ్య రచనా ప్రక్రియకు బీజవాపనం జరిగింది. మహాభారతారణ్య పర్వాంతర్గతనలోపాఖ్యానం లోని హంస దౌత్యంతో ఈ రచనా ప్రక్రియ మొలకెత్తింది. బుద్ధజాతక కథలలోని కామ విలాపజాతక కథలో భర్త వాయసంద్వారా విపన్నయైన తన వెలదికి వార్తను పంపడంతో ఈ ప్రక్రియ మారాకు తొడిగింది.2

---

1. సంస్కృత వాఙ్మయచరిత్ర; రెండవ భాగం - పుట 323
రచయిత - సూర్యనారాయణశాస్త్రి, మల్లాది.

2. తంపణపురి సంజీబ సూలే ఉత్తానేసుం
సోతత్తణి సినోహ్న గచ్ఛన్తం కాకం దిఖా
తావఖరం పితం వేదణం ఆ గణేత్వా
పియభరియాయ సాసణం పేసేతుం
కాకం ఆమన్తోన్తో ఇమా గాథా ఆహ
అప్పేస కుణజే మాణవత్తయాణ విహంగమ
బజ్జనిఖో త్త్వం వాముదుం చిరంఖోసా కిరస్పతి
ఇదం భోసాణజాణాతి అసింసత్తి జిద ఓడిదతం
పాచణ్ణి కాహతి కోధం కమ్యేత పతినో యిధ
ఏస ఉప్పల సన్నాహ హాణిక్ఖం ఉస్సీన కేకతం

దక్షిణభారత వైష్ణవుల దివ్యప్రబంధాల్లో, ప్రియుడైన వేంకటేశ్వరునకు గోదాదేవి మేఘం ద్వారా సందేశం పంపిన ఘట్టం కూడ యిలాంటిదే.1 సంస్కృత వాఙ్మయంలోను దానిననుసరించిన ప్రాకృత తమిళ వాఙ్మయాలలోనే గాక ప్రాచీన నాగరక విశిష్టమైన చైనా వాఙ్మయంలోను ఇటువంటి ఉదంతం కనబడుతోంది.2 ఈ పైవానిలో ఏదైనా తొలి సందేశకావ్యా విర్భావానికి ప్రేరణ కల్గించి యుండవచ్చుననడంలో సందేహం లేదు.

---

కాశియ ఇచముదుం వద్దం తప్పదు ధణకామియా
కామ విలాప జాతకకథ - సంఖ్య 297
మేఘ సందేశంలో మధురిమ - ఫిబ్రవరి 1953 - భారతి —
రామదాస అయ్యంగార్ నేలటూరి

మిన్నాగత్తెళ గిన్న వేగజ్గాళ్ వేజ్గిడత్తు
త్తన్నాగత్తిరుమంగై తజ్గియ శీర్ మార్వఱ్కు
ఎన్నాగత్తిళజ్కొజ్గై విరుమ్బిత్తామ్నాళ్ తోఱుమ్
పొన్నాగమ్పుల్ గుదఱ్కు ఎన్ పురిపుడైమై శెప్పుమినే

విద్యుల్లతలతో గూడియుండు ఓ మేఘములారా! నూతనముగ అభివృద్ధి యగుచుండు నాకుచములయందాసపడి నన్ను గాఢాలింగనము చేసికొను గాక యని ఎల్లప్పుడును ఆశపడుచున్నాను. ఈ విషయమును వేంకటాచలమున వేంచేసియున్న స్వామియగు శ్రియఃపతికి విన్నవింపుడని గోదాదేవి మేఘములను ప్రార్థించెను

ఆళ్వారుల మంగళాశాసనపాశురములు, పుట -143
శ్రీమాన్ టి.కె.వి.యన్. సుదర్శనాచార్య, 1957

2. క్రీ॥పూ॥ 274లో చ్యూయాన్ [Chuyuan] అనేకవి తన కావ్యంలో ఒక సుందరిచేత ప్రియునకు మేఘంద్వారా సందేశం పంపించాడు.

"O, Floothing Clouds that swin in the Heaven above
Bear on your wings, these words to him I Love"
A History of Chinese Literature - Page 119.

-Giles, H.A



"కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః"

"తొలి సందేశకావ్యం మేఘకావ్యారంభం"—

ఇతి హాసములతోడ
హితము గూర్చిన ఋషులే
కావ్యామృతము పంచ
కాళిదాసైనారు
అసమానుడౌ కాళి
దాస కవి సత్కృతులు
రస సముజ్జ్వలితమై
ప్రసరించు తేజమ్ము

- ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

# తొలి సందేశకావ్యం

సంస్కృత వాఙ్మయంలో వివిధ ప్రక్రియల్లో ఆదిరచన ఏదో నిర్ణయించటం సాధ్యంకాదు. అయినా తొలి సందేశ కావ్యం మాత్రం కాళిదాసుని మేఘసందేశం.1 అని నిస్సందేహంగా ఉద్ఘాటించవచ్చు. ఆ కావ్యకల్పనకు కాళిదాస మహాకవికి ఆధారమైన మూలకథ పురాణాంతర్గతమైనదే. కాని ఆ కథ కావ్యంగా రూపొందడానికి మార్గదర్శకమైనది రామాయణ కావ్యేతిహాసం. 2యక్షుని విరహవేదనకు శ్రీరాముని సీతా వియోగవేదన నమూనా అనవచ్చు. వర్షర్తు వర్ణనలోని కొన్ని అంశాలకు సమానాంశాలు కొన్ని మేఘ సందేశంలో గోచరిస్తాయి.

---

1 In the case of the many types of Sanskrit Literature it is not possible to fix the first specimen This is the case with Mahakavyas and Natakas But in one type of Literature' there is no such doubt regarding the first specimen. The Meghasandesa of Kalidas is the first Sandesa Kavya in Sanskrit langu-age In imitation of this poem' many sandesa kavyas have been composed by later poets.

Introduction of Mayura Sandesa

Published by - R. N. Sardesai

2 "Suggestions for the subject matter may have been taken from the Ramayana, where Rama's deep longing for his lost Sita offers an abvious prototype for the Yaksha's sorrow for the wife from whom he is served and the description of the rainy season in iv 28 has some points of similarity"

THE MEGHADUTA-I

A History of Sanskrit Literature

by

A B. Keith, D.C.L , D. Litt.,

Oxford University Press,

LONDON.

# మేఘ సందేశానికి మూలకథ

తొలి సందేశ కావ్యమైన మేఘ సందేశ రచనకు దోహదం చేసిన మూల కథను గూర్చి కతాకావ్య వ్యాఖ్యాతలు పలువురు పలురకాలుగా చెప్పారు.

"సారోద్ధారిణీవ్యాఖ్యాత, వల్లభసుమతి విజయులు మరికొందరు జైన వ్యాఖ్యాతలు మరొక విధంగాను భావించారు.1

## సారోద్ధారిణీవ్యాఖ్యాతాదుల భావన :

యక్షుడు రోజూ ఉదయాన్నే లేచి మానస సరోవరంలో ఉన్న నవ్య దివ్య పుష్పాలు తెచ్చి కుబేరుని శివపూజకై అందజేయాలి. కాని ఆ యక్షుడు తన ప్రియతమ భార్య కౌగిలిని ప్రాతఃకాలాన్నే వీడలేక ఒకనాడు రేపు తేవలసిన పూలు మాపటే సంగ్రహించి మరునాడు కుబేరునకు అశ్రమంగా అందజేశాడు. కుబేరుడు వాటితో శివపూజ చేస్తుండగా మకరందపాన మత్తమైన ఒక తుమ్మెద సాయం సమయంలో ముడుచుకొని యున్న పూవులో చిక్కుకొని ఉండడం వల్ల కుబేరుడు పూవు పట్టుకోగానే బయటికి వచ్చి అతని వేలిమీద గట్టిగా కుట్టింది. వెంటనే ధనపతి కోపించి భృత్యునిస్వాధికార ప్రమత్తతకు శపించాడు.

## భరతాదుల భావన :

ధనపతిచే ఉద్యానవన ద్వార పాలకునిగా యక్షుడు నియమింపబడ్డాడు. అతడొకనాడు తన విధులలో అశ్రద్ధగా ఉండడం చేత ఇంద్రగజం ఐరావతం ఆ ఉద్యానవనంలో ప్రవేశించింది. అక్కడి పూలమొక్కలన్నిటిని ధ్వంసం చేసింది. దానికి కోపించిన ధనపతి తన సేవకుడైన యక్షుణ్ణి శపించాడు.

---

1. మేఘ సందేశానికి మూలకథ - ప్రమాదీప. చైత్రము - భారతి - పుట 392 - హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి

కాని వీటన్నిటి కంటె బలీయమైన ఉపపత్తులు గల్గిన సహేతుకమైన కథ బ్రహ్మ వైవర్త పురాణంలో లభిస్తుంది. అది ఏకాదశి ప్రభావాన్ని తెలిపే కథగా లోకంలో ప్రచారంలో ఉన్నది.

## బ్రహ్మవైవర్తపురాణాంతర్గత కథ:

నిత్య శివపూజాధురంధరుడైన ధనపతి వద్ద హేమమాలి అనే పేరుగల యక్షుడు పుష్పవటుకోద్యోగం చేస్తున్నాడు. అతని భార్యపేరు విశాలాక్షి ఆమె అతిలోక సుందరి. ఆమె విరహాన్ని ఒక్క క్షణమైనా హేమమాలి భరింపలేడు. ఒకనాడు ధనపతి శివపూజకు పూలు తేవడానికి వెళ్లి విరహాన్ని సహింపలేక తిరిగి ఇంటికి వచ్చి భార్యతో కాలక్షేపం చేస్తున్నాడు. పూజా సమయ మాసన్నమైనా పూలు రాకపోయేసరికి కారణం తెలుసుకోడానికి భటుని హేమమాలి ఇంటికి పంపాడు. తిరిగి వచ్చిన భటుడు హేమమాలి తన భార్యతో కాలక్షేపం చేస్తున్నాడని విన్నవించాడు. అపుడు భటునిచే కబు రందుకొని హేమమాలి స్వామి కార్యం లోపరాకుగా నున్నందుకు భయపడి వెంటనే శివపూజా మందిరానికి వచ్చాడు. అతణ్ణి చూచిన ధనపతి కోపంచే ఎఱ్ఱబడ్డ కన్నులతో "నీవు కాంతాలోలతచేత శివపూజను హేళన చేశావు. కాబట్టి ఈ స్థానాన్నుంచి పతనమై అధోలోకాలు పొంది కుష్టపీడిత విగ్రహుడవై కాల క్షేపం చేయమని శపించాడు!

---

1. బ్రహ్మవైవర్త పురాణాంతర్గత ఏకాదశీ మాహాత్మ్యం

శ్లో॥ అలకాధిపతిర్నామ్నా కుబేరః శివపూజకః
తస్యాసీత్ పుష్ప వటుకో హేమాలీతి నామతః!
తస్యపత్నీ సురూపాచ విశాలాక్షీతి నామతః
స తస్యాంస్నేహ సంయుక్తః కామ రూపావశంగతః!
మానసాత్ పుష్పనిచయం ఆనీయస గృహ స్థితః!
పత్నీ ప్రేమ సమాయుక్తేన కుబేరాలయం గత
కుబేరోదేవ సదనే కరోతి శివపూజనం
మధ్యాహ్నసమయే రాజన్ పుష్పాణి ప్రసమీక్షతే!!

ఈ కథను గ్రహించిన కాళిదాస మహాకవి మేఘ దూత్యకల్పనతో అజరామరమైన సందేశ కావ్యాన్ని సృజించాడు.

శ్లో॥ యత్స్యాదనుచితం వస్తు నాయకస్యరసస్యవా!
విరుద్ధం తత్పరిత్యాజ్యః అన్యథా వాప్రకల్పయేత్!

అన్న ధనంజయుని ఆలంకారికోక్తికి లక్ష్యభూతంగా తనకాధారమైన పురాణాంతర్గతమైన కథలోని రసభంజకమైన కథానాయకుని కున్న కుష్టువ్యాధిని తన కల్పనతో మార్చి అనన్య ప్రతిభతో
కవికుల గురువైన కాళిదాస మహాకవి

---

హేమమాలీ స్వభవనే రమతే కాంతయాసహ
యక్షరాట్ ప్రత్యువాచాథ కాలాతిక్రమ కోపితః!!
కస్మాన్నయాతి హే యక్ష! హేమమాలీ దురాత్మవాన్
నిర్ణయః క్రియ తామస్య ప్రత్యువాచ పునః పునః.

యక్షఊచుః -

వనితా కాముకో గేహే రమతే స్వేచ్ఛయా నృప
తేషాం వాక్య సమాకర్ణ్య కుబేరః క్రోధ పూరితః
అహ్వయామాస తంతూర్ణం మకుటం హేమమాలినం.
జ్ఞాంత్వాకాలోత్యయంసోఽపి భయాకులలోచనః,
ప్రత్యువాచ రుషావిష్టః కోపాద్విప్ఫురితాధరః!!
రే! పాప!! దుష్టసర్వల్పత్త కృతవాన్ దేవహేళన!
అతోభవ శ్విత్రయుక్తః వియుక్తః కాంతయాసహ!!
అస్మాత్ స్థానాదపధ్వస్తో గచ్ఛస్థాన మధాధమమ్!!
ఇత్యుక్తేవచనేతేన తస్మాత్ స్థానాత్ పపాతసః!!
మహాదుఃఖాభిభూతస్య కుష్టపీడిత విగ్రహః!!
అలకా హిందీనాటిక ముందుమాట - పుట.2.

సీతారామచతుర్వేది

ప్రచురణ - అఖిలభారతీయ విక్రమపరిషత్, వారణాసి

మూర్తీభవించిన సౌందర్యానికి ప్రతీకగా నాయకుని తీర్చిదిద్ది వియోగ శృంగారాత్మకమైన కావ్యంగా సృష్టించి ఆ కథకు చిరజీవితాన్ని కల్పించాడు. మహాశిల్పి చేతిలోపడ్డ ఎట్టి శిలయైనా సుందర శిల్పంగా రూపుదిద్దుకొన్న విధంగా మహాకవి హృదయానికెక్కిన ఎటువంటి కథయైన రసవత్కావ్యంగా మార గలదని నిరూపించాడు.

మేఘ సందేశ కథకు ఆధారం పురాణాంతర్గతమైనదికాగా కావ్యసృష్టికి మార్గదర్శకమైనది రామాయణ కావ్యేతిహాసం.

వాల్మీకి రామాయణంలోని హనుమద్దౌత్యం మేఘ సందేశ రచనకు ప్రేరకమైనదని ఎందరో పండితులు సహేతుకంగా వివరించారు.

వ్యాఖ్యానశిరోమణియైన మల్లినాథ సూరి మేఘసందేశానికి వ్యాఖ్యానం వ్రాస్తూ "జనక తనయా స్నాన పుణ్యోదకేషు" అనే వాక్యాన్ని వివరిస్తూ "రాముని దూతగా సీత కొఱకు హనుమంతుడు గొనిపోయిన సందేశాన్ని మనసు నందుంచుకొని కాళిదాసమహాకవి మేఘసందేశ రచన చేశాడని తెలిపాడు 1

కాళిదాసు వాల్మీకి ననుసరించడానికి కారణం అతనిపైనున్న గాఢమైన గురు భావనయే. "నేను ఆదికవి వాల్మీకి మార్గంలో నడుస్తున్నానేగాని అంతటి ప్రతిభాశాలిని కాదని"2 ఒకచోట కాళిదాసే చెప్పుకొన్నాడు.

మల్లినాథ సూరి చెప్పిన విధంగా రామాయణంలోని హనుమత్సందేశం మాత్రమే గాక ప్రతి విషయంలోను వాల్మీకి మహర్షిని కాళిదాసు అనుసరించాడ రచనలో

---

1. సీతాం ప్రతి రామస్య హనుమత్సందేశం మనసినిధాయ
కవిః మేఘ సందేశం కృతవాన్.
— మేఘ సందేశ వ్యాఖ్య - మల్లినాథ సూరి

2. మందః కవి యశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతాం!
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహురివవామనః!!
- రఘువంశం - మొదటి సర్గ - 3వ శ్లోకం.

## రామాయణానికి మేఘదూతానికిగల సారూప్యాలు :

| రామాయణం | మేఘదూతమ్ |
|---|---|
| రాముడు | యక్షుడు |
| సీత | యక్షిణి |
| హనుమద్దౌత్యము | మేఘునిదౌత్యం |
| కైకకోపంచేత అరణ్యవాసం | కుబేరుని కోపంచేత వనప్రవాసం |
| రామునకు ప్రశవవ పర్వత నివాసం | యక్షునకు రామ గిరివాసం |
| రామునకు వర్షాకాలం నాల్గు నెలలు గడవాలి | యక్షునకును నాల్గునెలలుగడవాలి |
| రాముని విరహవేదన | యక్షుని విరహవేదన |
| హనుమ ఆకాశ ప్రయాణం | మేఘునకు ఆకాశయానం |
| హనుమ లంకచేరాలి | మేఘుడు అలక చేరాలి |

ఇంతేగాక రామాయణ మేఘదూతాలను లోనారసి తులనాత్మకంగా పరిశీలిస్తే ఎన్నో పోలికలు కనిపిస్తాయి.

ఈ మేఘ దూతానికి బీజం ఎక్కడున్నదో తెలిస్తే మనకాశ్చర్యం కలుగుతుంది. వాల్మీకంలోనె విరాధుడనే రాక్షసుడు రామ బాణహతుడై నిజ స్వరూపంతో ఆకాశంలో నిలిచి "నేను వాస్తవంగా గంధర్వుణ్ణి1 రంభాసక్తుణ్ణై కొలువులో అశ్రద్ధచేసి ప్రభువైన కుబేరునిచే శపింపబడి తత్ఫలితంగా ఈ విరాధ జన్మ మెత్తానని"1 యంటాడు. ఈ విరాధునివంటి వాడే మేఘదూతంలోని

1. ఇతివై శ్రవణో రాజా రంభాసక్తో పురానఘ!
అనుపస్థీయమానోమా సృద్ధో వ్యాజ హారహ!!
ఆరణ్య-18-2

యక్షుడు. యక్షుడుగూడ స్వాధికార ప్రమత్తుడై ధనపతి శాపంచేత ప్రియా విరహం చేత రామగిర్యాశ్రమంలో బాధననుభవించాడు.[1]

కాళిదాసు తన కావ్యానికి మేఘదూతమని పేరు పెట్టడానికి ప్రభావితం చేసింది కూడా రామాయణమే. హనుమ సీతాన్వేషణకై సముద్రోల్లంఘనం చేసిన సందర్భంలో ఆకాశంలో పయనిస్తున్న హనుమను వాల్మీకి పునఃపునః మేఘంతో పోల్చాడు[2]. అంతేకాదు పలుమార్లు 'రామదూత '[3] అని పేర్కొంటాడు వాల్మీకి. అదే మేఘదూతమైంది కాళిదాస మహాకవి కల్పనలో. ఇంతేకాక ప్రతి వర్ణనలోను సన్నివేశంలోను కాళిదాసు వాల్మీకి మహర్షిననుసరించాడు.

సీతాన్వేషణకై వెళ్ళిన పావని పిల్లిలా కుంచించుకొని లంకలో ప్రవేశించాడు[4]. ఈ విధంగానే యక్షుడునూ తన దూత మేఘని పిల్లఏనుగంతగా శరీరాన్ని సంకోచించుకొని ప్రవేశించమంటాడు.[5]

అశోకవనంలో హనుమ ప్రవేశానికి పూర్వం సీతకు శుభశకునాలు స్ఫురిస్తాయి. మేఘుని ఆగమనానికి పూర్వం యక్షభామకు కూడా అటువంటి శుభశకునాలే స్ఫురించాయి. రెండుచోట్ల అవే శకునాలు అవే ఉపమానాలు.

---

[1] కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
—మేఘసందేశం 1 – 1

[2] పుష్పౌఘేణాను విద్ధేన నానా వర్ణేన వానరః
బభౌమేఘైవాకాశే విద్యుద్గణ విభూషితః!! —సుందరకాండ 1-54

[3] తస్యాః స్సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్
—సుందరాకాండ 1-155

అహం రామస్య సందేశాత్ దేవి దూతస్తవాగతః
—సుందరాకాండ – 2-34.

[4] పృషదం సకమాత్రస్సన్ బభూవాద్భుత దర్శనః
—సుందరాకాండ – 2-49.

[5] గత్వాసద్యః కలభతనుతాం —మేఘసందేశం – 2-20.

సీతకు అదిరిన ఎడమకన్ను చేప వలన కదిలిన తామరపువ్వులా ఉన్నది. యక్షప్రియకు స్పందించిన కన్ను చేప వలన కదిలిన కలువపువ్వులా ఉన్నది. ఒకచోట తామర మరొకచోట కలువ పువ్వు అంతే తేడా[1].

సీతాదేవి హనుమను ఎంత ఆదరంగా చూసిందో నా ప్రేయసి కూడా నిన్ను అలానే చూస్తుందని యక్షుడు[2] అంటాడు

రామాయణంలోను మేఘదూతంలోను వియోగకాలం ఒక సంవత్సరమే.[3] యక్షుని వియోగకాలం పూర్తికావడాన్ని కాళిదాస మహాకవి జ్యోతిశ్శాస్త్ర పరిభాషతో తెలిపాడు. "విష్ణువు శేషశయనం నుండి నిదురలేచినపుడు యక్షుని శాపాంతమౌతుంది.. "[4] అంటే కార్తికం తరువాత పదిరోజులకు. ఈ విధంగా చెప్పడం రామాయణంలో కూడా ఉన్నది. వాల్మీకి కిష్కింధకాండలోని వర్ష ఋతువును వర్ణిస్తూ విష్ణువునకు నిదురవచ్చేకాలం[5] అంటాడు.

ఇక సందేశాన్ని చూస్తే రామాయణంలో దూత ప్రియుని నుండి ప్రియురాలికి సందేశాన్ని కూడా తీసుకుపోయాడు.

శ్రీరాముడు తన ప్రియురాలికి తనకేగాని ఇతరులకెవ్వరికీ తెలియని కాకాసుర వృత్తాంతం, అంగుళీయం అనే రెండు అభిజ్ఞలు ఇచ్చాడు.

---

1 ప్రాస్పందతైకం నయనం సుకేశ్యాః
మీనాహతం పద్మ మివాభి తామ్రం — సుందరకాండ - 2.29

2 ఇత్యాఖ్యాతే పవనతనయే మైథిలీవోన్ముఖీసా
తాముత్కంఠోచ్ఛ్వసిత హృదయా వీక్ష్య సంభావ్య చైవం
— మేఘసందేశం - 2.42.

3 వర్షభోగ్యేణభర్తుః — మేఘసందేశం - 1.1

4 శాపాన్తోమే భుజగశయనాదుద్ధి తే శార్ఙ్గపాణౌ
శేషాన్మాసాన్గమయ చతురాన్ లోచనే మీలయిత్వా!!

5 నిద్రాశనైః కేశమభ్యుపైతి — కిష్కింధ - 25.28

శ్లాఘించే రీతిలో యక్షుడు వెలసిన అన్నట్లుగా సందేహమెవరికైన కలుగవచ్చు. ఇందులో ఒక కోతువుంది. వస్తురూపంలో నున్న అభిజ్ఞ మార్గమధ్యంలో ఎక్కడైన జారిపోవచ్చు. కాని రహస్య వృత్తాంత రూపమైన అభిజ్ఞానమైతే భద్రంగా గమ్యస్థానం చేరడాని కవకాశముంటుంది.

ఈ సూక్ష్మం గ్రహించిన కాళిదాసు సందేశహారియైన మేఘునితో వృత్తాంతరూపమైన అభిజ్ఞానాన్నే పంపించాడు. హనుమలా మేఘుడు వస్తువును తీసుకుపోలేడుగాబట్టి ఇది ఎంతో సమంజసంగా ఉంది.

కిష్కింధ కాండలోని సుగ్రీవుడు వర్ణించిన వర్ణనలు మేఘునకు మార్గోపదేశం చేస్తూ యక్షుడుచేసిన వర్ణనలకు మార్గదర్శకాలైనాయి.[1]

రామదూత హనుమ కామరూపి. ఆ విధంగా యక్షదూతకూడా కామరూపం కలిగినవాడే.[2] వియోగంలో సీతారాముల వర్ణన, యక్షయక్షకాంతల వర్ణన సమానంగానే ఉన్నాయి. సీతను వాల్మీకి శ్యామ అన్నాడు. మేఘదూతంలోని యక్షప్రియను కూడా కాళిదాస మహాకవి 'శ్యామ' అనే[3] అన్నాడు. శ్యామ అంటే

---

1 కిష్కింధకాండ — 44-43 సర్గలు.

2 సనికామం విమానేషు విషణ్ణః కామరూపధృత్ —సుందరాకాండ 1-6.
మయేయము సహాయేన చరతా కామరూపిణా —సుందరాకాండ 36-76.
జాతం వంశే భువన విదితే పుష్కలా వర్తకానాం
జానామి త్వాం ప్రకృతి పురుషం కామరూపం మఘోనః
—మేఘసందేశం 1-6.

3 శ్యామా సమవిభక్తాంగీ —అరణ్యకాండ 31-29.
శ్యామాం కమలపత్రాక్షీం ఉపవాసకృశాననాం
—సుందరాకాండ 56-58.
శ్యామా శిఖరిదశనా —మేఘసందేశం 2-21

యౌవన మధ్యస్థ అని అర్థం. సీత, యక్షకాంత ఇద్దరూ చక్రవాకంతోను శుక్ల పక్ష చంద్రరేఖతోను పోల్చబడ్డారు.[1] అంతేకాక వారిద్దరి వర్ణనలోను ఏక వేణిత్వం సమానమే.[2]

విరహులైన రాముడు యక్షుడు మద్యమాంసాలు సేవించడం మానేశారు.[3] కాని ఇప్పటివారు తదపనయార్థం మద్యం సేవించడం లోకసామాన్యమై పోయింది.

రామదూత, యక్షిదూత ఇద్దరూ చాలా ఉదాత్తంగా పొగడబడ్డారు. సీత వద్ద హనుమ కేవలం కోతిలా ప్రవర్తించాడు. నీవు గనుక వెంటనే వచ్చేటట్లైతే నా భుజాలపై ఎక్కించుకు పోతానన్నాడు. అందుకే నిన్ను పట్టి కోతిలా భావిస్తున్నానన్నది సీత[4]. అపుడు ఉగ్రుడైన హనుమ తన దీర్ఘ శరీరాన్ని ప్రదర్శించాడు. వెంటనే ఊరకే అలా అన్నానుగాని నీవు మిక్కిలి ప్రతిభ గలవాడవని నేనెరుగనా అని అన్నది.[5]

హనుమ సామాన్యమైన కపియైనట్లే మేఘుడు కూడ కేవలం ధూమజ్యోతి సలిల మరుత్తుల యొక్క సన్నిపాతంగానే మనకు కన్పించినా[6] హనుమంతుని

---

[1] సహచరరహితే చక్రవాకీ —సుందరాకాండ - 30-16.
దూరీభూతేమయి సహచరే చక్రవాకీ —మేఘసందేశం 2-22.
ఉపవాసకృశాదీనాం నిత్య సంతీం పునఃపునః
దదర్శ శుక్లపక్షాదౌ చంద్రరేఖామివామలాం. —సుందరాకాండ 19-25.
కళామాత్ర శేషాహిమాంశోః —మేఘసందేశం 2-28

[2] ఏకవేణీ ధరాధీనా రామదర్శన లాలసా —సుందరాకాండ 38-57
స్పర్శక్లిష్టాం కఠినవిషమాం ఏకవేణీం కరేణ —మేఘసందేశం 2-31

[3] న మాంసం రాఘవో భుఙ్క్తే నచాపి మధుసేవతే సుందరకాండ 41-36
ప్రత్యాదేశాదపిచమధునో మేఘసందేశం 2-34.

[4] తదేవఖలుతే మన్యే కపిత్వం హరియూధప సుందరాకాండ 31-37

[5] తపసత్వం బలం చైవ విజానామి మహాకపే సుందరాకాండ 31-42

[6] ధూమజ్యోతి స్సలిల మరుతాంసన్నిపాతః క్వమేఘః
మేఘసందేశం

అంతర్గతమైన ఉగ్రరూపంలా కామరూపం కల్గి భువన విదితమైన పుష్కలావర్తక వంశంలో జన్మించినవాడుగా కీర్తింపబడ్డాడు.[1]

ఈవిధంగా నాయికా, నాయక దూత దౌత్య వర్ణనలలో పోలికలున్నట్లుగానే ప్రకృతి వర్ణనలలోను పోలికలు విస్తారంగా కనిపిస్తాయి. కిష్కింధకాండలోని ఉత్తరకురు భూముల వర్ణనలు చాలావఱకు అలకాపట్టణ వర్ణనల్తో కలుస్తాయి[2].

ఈ విధంగా పెక్కు విషయాల్లో రామాయణానికి మేఘసందేశానికి పోలికలుండడం చేతనే వ్యాఖ్యాన శిరోమణి మల్లినాథ సూరి మాటలు అక్షర సత్యాలనక తప్పదు.[3]

---

[1] జాతం వంశే భువన విదితే పుష్కలావర్తకానాం
జానామిత్వాం ప్రకృతి పురుషం కామరూపం మఘోనః
—మేఘసందేశం 1-6.

[2] కిష్కింధకాండ 43వ సర్గ 21 నుండి 64 శ్లోకం వఱకు

[3] ఈ రచనకు ఆధారాలు

అక్షరార్చన - పాటిబండ మాధవశర్మ షష్ట్యబ్దిపూర్త్యుత్సవ సంచిక.
వ్యాసం - రామాయణానికి మేఘదూతకు గల సంబంధం.
- గుంటూరు శేషేంద్ర శర్మ,
- ఇందిరాదేవి ధనరాజ్ గిర్.

# మేఘ సందేశం

## కావ్య వైశిష్ట్యం

భారతీయ వాఙ్మయాలలో తొలి సందేశ కావ్యం మేఘదూతమన్నది నిర్వివాదం. మహోన్నతమైన దూత కావ్యశాఖకు నాంది పల్కిన ఈ మేఘ సందేశ కావ్యానికి గల వైశిష్ట్యాన్ని కొంతైనా పరిశీలించాలి.

### తొలిఖండకావ్యం :

మేఘదూతం సంస్కృతంలో తొలి ఖండకావ్యం విశ్వనాధుడు సాహిత్య దర్పణమనే తన అలంకార గ్రంధంలో ఖండకావ్యాలను గూర్చి వివరిస్తూ "మహాకావ్యాలలోని ఏకదేశాలైన రసవద్ఘట్టాలనుగాని నగర, అర్ణవ, శైల, ఋతు, చంద్ర, అర్క ఉదయాలలో ఏదేని ఒక దానిని గ్రహించి తనప్రతిభతో రసబంధుర రమణీయ కావ్యాలు సృష్టించవచ్చు. అటువంటి వాటినే ఖండకావ్యాలంటారు[1]"ని అన్నాడు. దానికి ఉదాహరణంగా "యథా మేఘదూతాది కావ్యాని" అని వివరించాడు.

పాశ్చాత్య సాహిత్యంలో Lyric poetry అనే శాఖ ఉన్నది. Lire అనే వీణలాంటి వాద్య విశేషం. ఇటువంటి వాద్యంతో గానాని కనుకూలమైన భావోద్విగ్నతతో చెప్పిన కవిత్వాన్ని Lyric poetry అంటారు.[2] దీనికి సరియైన ఉదాహరణం మేఘదూతం అనే ఈ క్రింది ఉద్ఘాటన పరిశీలింపదగింది.

---

[1] ఖండ కావ్యం భవేత్కావ్యస్యైకదేశానుసారిచ.

—సాహిత్య దర్పణం.

కావ్యాలంకార సంగ్రహం —సన్నిధానం వారి వ్యాఖ్య - పుట 268.
ప్రచురణ 1945.

[2] విజ్ఞాన దీపిక : —సాహిత్య అకాడమీ ప్రచురణ 1972.



యక్షుడు మేఘునితో

శరణం బీవ ప్రతప్త చిత్తులకు జీమూతా! ధనస్వామి కో
పమునన్ బిట్టెడబాటు పాలయితి, నా సందేశమందింపవో!
శివ చూడా శశి చంద్రికల్ తడుపు బాహ్యోద్యాన హర్మ్యంబులన్
లలితంబౌ అలకన్ వసించుసఖి; నీవా త్రోవ పోవందగున్

- రాయప్రోలు - దూత మత్తేభము

It is an inspired and passionate out-burst of one's own heart-felt experiences Its function is to interpret in an artistic way "The secrets of Innerlife, its hopes, its fantastic joys Its sorrows, its delinum" The highest Literary out is required to pour forth these strains of personal image and music"

The Meghadute is a towering example of this Class"[1]

సంస్కృత భాషోపకరణలతో కాళిదాస మహాకవి ప్రపంచ వాఙ్మయానికే ఒక అమూల్యమైన కానుకగా మేఘసందేశ ఖండకావ్యాన్ని ప్రసాదించాడు.

అడుగడుగునా మేఘదూతంలో సవ్యత ప్రస్ఫుటమౌతుంది. ఉత్తమ ధ్వని కావ్యమైన దీనిని మధించిన ఆనందవర్ధనుడు మహానందంతో "అతి విచిత్రమైన కవి పరంపరతో కూడిన కవి సంసారంలో మహాకవియని చెప్పదగినవారు కాళిదాసవంటి వారు ఇద్దరు, ముగ్గురు లేక ఐదుగురు మాత్రమే ఉన్నారు"ని అన్నాడు[2].

ఆనందవర్ధనాచార్యుని వంటి అత్యుత్తమాలంకారికుణ్ణి ఆనందమగ్నుని గావించిన ఆమేఘసందేశంలోని గుణరత్నాల్ని దిఙ్మాత్రంగానైనా పరిశీలించాలి

ఆంగ్లంలోని 'లిరిక పొయిట్రీ'కి ప్రధాన లక్షణంగానానుకూలత, కాళిదాస మహాకవి తన వియోగకావ్య సృజన కెన్నుకున్న ఛందస్సు మందాక్రాంతవృత్తం అది గానాని కత్యంతానుకూలమైనది. కేవలం గాన యోగ్యతేగాదు. ఇందులో ఇంకో రహస్యంకూడ ఉన్నది.

---

1 Sanskrit Lyrics -U. వెంకట కృష్ణమూర్తి త్రివేణి-1953.

2 యేన కవిసంసారే కాళిదాసాదయః ద్విత్రాః పంచషావా మహాకవయః గణ్యన్తే! ధ్వనిసారః - పుట-3. గ్రంథనము-జమ్ములమడక మాధవరామశర్మ.

మందాక్రాంతాన్ని శంకరాభరణరాగంలో పాడినట్లైతే మేఘధ్వని వినిపిస్తుందట.[1] మేఘంతో సందేశం పంపటానికి మందాక్రాంత వృత్తానికి ఇంత సంబంధ మున్నది.

ఒకే విషయాన్ని వివిధ భంగిమల్లో, వినేవాళ్ళకు విసుగు పుట్టకుండా చెప్పగల్గిన ప్రతిభామూర్తుల లెక్కించడానికి ప్రారంభిస్తే కనిష్ఠికను అధిష్ఠించే వాడు కాళిదాస మహాకవి (అనగా ప్రథమ స్థానం ఆక్రమిస్తాడు). అట్టికవి కాళిదాసుతో తుల్యుడైన కవి, మరియొకడు లభించక పోవడంచేత కనిష్ఠికనను సరించి ఉన్న వ్రేలు అనామికగా సార్థకమైందని[2] ఎవరో అజ్ఞాతకవి చమత్క రించాడు. అంతటి కాళిదాస మహాకవి అల్పమైన కథావస్తువు గ్రహించి అనల్ప మైన రసవత్కావ్య నిర్మాణం చేశాడు.

ఈ కావ్యంలోని ఇతివృత్తం ప్రణయం. అందులోను వియోగం. అది మధుర వేదన. ప్రేమ, బాధ అందరికీ సమానమైనదే. భాగ్యవంతునికైనా, బీదవానికైనా, రాజుకైనా, బంటుకైనా ఈ కావ్యానుభూతుల్ని పంచుకొనే సదవ కాశాన్ని ప్రకృతే ప్రసాదించింది. ఈ విధంగా ఈ మేఘకావ్యం సార్వకాలిక మైన, సార్వజనీనమైన విలువలను సంతరించుకొన్నది. మరొక ముఖ్యవిషయం. ఏ మహారాజునో మఠాధిపతినో గాక ఒక సామాన్యోద్యోగిని కావ్యనాయకునిగా ఎన్నుకొన్న మొదటి గౌరవం కాళిదాసుకే దక్కింది.

భారతదేశ భౌగోళిక స్వరూపాన్ని సమగ్రంగా చిత్రించిన మొదటికావ్యం మేఘదూతమే. మన ప్రాచీన ప్రజా జీవితాన్ని చిత్రించే కావ్యాలలో అగ్ర స్థానం దీనికే లభిస్తుంది. ఇంత జగత్ప్రసిద్ధమైన ఈ కావ్యంలో నాయికా నాయకుల పేర్లేమిటో మనకు తెలియవు.[3] కవికి తెలిసినా నవ్యతకోసం చెప్ప

---

1 ఘనవృత్తం. (మేఘసందేశానువాదం) ముందుమాట. పుట—3
ఆచార్య యస్వీ జోగారావు

2 పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః
అద్యాపి తత్తుల్య కవే రభావాత్ అనామికా సార్థవతీ బభూవ.

3 కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః - మేఘసందేశం 1-1.

ధ్రుళిక్షుకోలేదేమోననిపిస్తుంది. పోనీ కావ్యాన్ని వినేవాళ్ళకుగాని చదివేవాళ్ళకు గాని ఇంతటి అతిలోక సుందరులైన నాయికా నాయకుల ముద్దు పేళ్ళు తెలుసు కోవాలనే కుతూహలం ఏమాత్రం కలుగదు. దీనికి కారణం ఆ కావ్యానుభూతులు కేవలం ఆ నాయికా నాయకులని మాత్రమేగాక అందరిని కావడమే. అందుకే ప్రత్యేకించి వారిపేర్లు తెలుసుకోవాలనే కుతూహలం కలుగదు. ఆ వియోగానుభూతులలో తన్మయులు కావడం సహజం. ఇది కాళిదాస ప్రతిభకు నిదర్శనం. కావ్యమంతా ఉత్కంఠతో చదివిన తరువాత చివరకొక మధుర బాధాజనితమైన నిట్టూర్పు విడవడమేగాని, కుశంకలేమీ కలుగవు. పాఠకుల హృదయాల్లో ఇలాంటి ప్రయోగం కాళిదాసమహాకవి కావాలని చేశాడా అనిపిస్తుంది.

## సందేశాన్ని గూర్చి:

కాళిదాస మహాకవి మేఘుణ్ణే సందేశ వాహకునిగా నిర్ణయించుకొనడానికి కారణమేమిటి? ఇది అలంకారిక సమ్మతమేనా అని కొందరు భావించవచ్చు. భామహుడు తన కావ్యాలంకార సంగ్రహంలో "వాగింద్రియాలులేని జడాలైన మేఘాదులను దూతకార్యానికి ఉపయోగించడం యుక్తంకాదని ధీశాలురైన కవులిట్టి పనిచేయరనే"[1] అంటూ మేఘదూతాన్ని ఉదాహరించాడు. ఇదంత సమంజసమైనదని తోచదు. కారణం రామాయణ భారత భాగవతాలు మనం చూచినట్లైతే వానిలో అర్హులైన రాముడు, దమయంతి, గోపికలయొక్క ప్రవర్తన తీరును బట్టి కామార్తుడైన యక్షుడు చేసిన పని అయుక్తంకాదనిపిస్తుంది.

మాయలేడి వెంట వెళ్ళి మరల తన పర్ణశాలకు తిరిగివచ్చిన రాముడు సీత కనపడక పోయేసరికి అక్కడి వృక్షాలను, లతలను, పక్షులను వియోగ జనిత దుఃఖోద్విగ్నతతో నా సీత జాడ మీకేమైనా తెలుసా అని అర్తుడై ప్రశ్నిస్తాడు

---

[1] 42, 43, 44 శ్లోకములు, తొలి పరిచ్ఛేదం కావ్యాలంకార సంగ్రహం భామహుడు.

[2] యత్నాన్మృగయమాణస్తు నాససాద వనే ప్రియాం
శోకరక్తేక్షణశ్శోకా దున్మత్త ఇవ లక్ష్యతే!!

నలపరిత్యక్తయైన దమయంతి తన ప్రియునిజాడ తెలియక పేరైన తెలిపి సహకరించండని సహకారాదివృక్షాలను గిరి ఝురులను వేడుకొంటుంది [1]

ఒక్క క్షణంకూడ కృష్ణవియోగాన్ని సహింపలేని గోపికలు ఆకుమాటున పొదల చాటుల వెదుకుతూ వచ్చి "మల్లియలారా మీ పొదల మాటున లేడు

---

వృక్షాద్వృక్షం ప్రధావన్ గిరేశ్చాద్రిం నదాన్నదేం
బభూవ విలపన్రామ శ్శోక పంకార్ణవాప్లుతః!!
భూత వీప మహాసాలన్ పనసాన్ కురవాన్ ధవాన్
బాడి మానసనాన్ గత్వా దృష్ట్వా రామోమహాయశా!!

మల్లికామాధదీశ్చైవ చంపకాన్ కేతక్ స్తథా
పృచ్ఛన్ రామోవనే భ్రాంత ఉన్మత్త ఇవలక్ష్యతే!!
23 నుండి 26 శ్లోకములు అరణ్యకాండము,

1 సీ॥ సహకార మత్ప్రియ సహకారులున్నాగ
పున్నాగుదిలక భూ భువన తిలకు
జందన బుధ హరి చందను
బుప్పితాశోక సహృజ్జనశోక దమను
వకుళకులై కదీపకు విభీతక భయో
వేతార్తి హతు నలు బ్రీతి తోడ
గానరేకానలలోన లోకోత్తరుని
ప్రానిమ్రానికి నరిగియరిగి

గీ॥ అడుగునడుగు లెండ బొడవాడబొక్కిన
నిర్ఘరాంతరముల నిలుచుబొలుచు
గిరులదరులయెడల నురుగుహాగృహములు
దొంగి తొంగి చూచి తోయజాక్షి

అరణ్యపర్వం — ద్వితీయాశ్వాసం 95వ పద్యం

గదమ్మ తెల్పరే" అని ఈ విధంగా వేడుకొన్నారు1

తీవ్రావేదనలో విరహ శోకంతో ప్రతివ్యక్తి చేతనాచేతన విచక్షణ కోల్పోరి ప్రవర్తించడంఎన్ని సహజమో కవులు తమ కావ్యాలలో నిరూపించారు. కాళిదాస మహాకవి ఆ మార్గాన్నే అనుసరించాడు.

మేఘకావ్యంలో క్షణమైన ప్రియా విరహాన్ని భరించలేని యక్షుడు స్వాధి కార ప్రమత్తుడై ఒక్క సంవత్సరం రామగిర్యాశ్రమంలో ప్రియావియోగాన్ని అనుభవిస్తూ కాలం గడుపవలసినదిగా ధనదునిచే శపింపబడ్డాడు. ఆశ్రమ వాతా వరణం అత్యంత రమణీయంగా ఉన్నది. ఇక గోరుచుట్టుపై రోకటిపోటన్న విధంగా ఆషాఢ ప్రథమదివసాన చిత్రకూట పర్వత సానువుల్లో తొలకరి మబ్బు ప్రత్యక్షమైంది.2 ఈ పరిస్థితులాతణ్ణి యుక్తాయుక్త వివేక శూన్యుణ్ణి

---

1 గాయన్త్య ఉచ్చైరము మేవ సంహితా
విచిక్యురున్మత్త కవద్వ నాద్వనమ్!!
ప్రపచ్ఛురాకాశ వదన్తరం బహిః
భూతేసుస న్తం పురుషం వనస్పతీన్!!
దృష్టోవః కచ్చిదశ్వత్థప్లక్షన్యగ్రోధనో మనః
నన్దసూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః!

కచ్చిత్కురవకాశోకనాగపున్నాగ చమ్పకాః
రామానుజో మానినీనాంగతోదర్ప హరస్మితః!
మాలత్యదర్శినః కచ్చిత్ మల్లికేజాతియూథికే
ప్రీతివోజనయన్యాతః కరస్పర్శేన మాధవః!!
ఇత్యున్మత్తవచో గోప్యః కృష్ణాన్వేషణకాతరాః
లీలాభగవతస్తాస్తాహ్యను చక్రుస్తధాత్మికాః!!
30వ అధ్యాయం దశమస్కంధం
శ్రీమద్భాగవతం. (1-5)

2 ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్టసానుం

చేసాయి. తనకందుబాటులోన్న కొండ మల్లెపూలతో మేఘుణ్ణి పూజచేసి స్వాగతం పలికి నా ప్రియురాలికొక సందేశం తీసుకుపోవాలని ప్రార్థించాడు.[1] అలంకారికులు అధిక్షేపిస్తారని ఊహించిన మహాకవి తన రచననిలా సమర్థించుకొన్నాడు. "ధూమజ్యోతి స్సలిలమరుత్తుల సమ్మేళనమైన మేఘమెక్కడ? మనిషి తీసుకొనిపోదగిన ఈ సందేశమెక్కడ? కామార్తులు యుక్తాయుక్త వివేకశూన్యులుగదా"[2] అని. కాబట్టి ఈ మేఘంచేత పంపిన సందేశం సమర్థనీయమే. అంతేగాక ఆకాశంలో మేఘాలు ఎన్నియుగాలు సంచరిస్తుంటాయో అంతకాలం అజరామరమై ఉంటుందీ కావ్యమనడంలో సందేహం లేదు.

ఇక ఈ కావ్యంలో వస్తువర్ణనలు తక్కువ. చైతన్యప్రకృతిని ప్రదర్శించే రసవత్తర ఘట్టాలే. ప్రకృతి యిందులో అడుగడుగునా ప్రతిబింబిస్తుంది. సహృదయ హృదయా కాశంలో మేఘంతోపాటు సాగి పయనిస్తుంది. కాళిదాసుని ప్రేమ సందేశం భారతీయ జానపద సుందర ప్రకృతిని సహృదయుడు మనో నేత్రంతో సందర్శించి ఆనంద పరవశుడౌతాడు.

---

వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం దదర్శ! మేఘసందేశం 1-2

[1] స ప్రత్యగ్రైః కుటజ కుసుమైః కల్పితార్ఘాయతస్మై

ప్రీతః ప్రీతి ప్రముఖ వచనం స్వాగతం వ్యాజహార!!

మేఘసందేశం 1-4

[2] ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః

సందేశార్థాః క్వపటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః!

ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యకస్తం యయాచే

కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనా చేతనేషు!!

మేఘసందేశం 1 5

# సంస్కృత సందేశ కావ్య వికాసం

మేఘసందేశ రచనకు ప్రేరకమైనది వాల్మీకి రామాయణంలోని హనుమద్దౌత్యమైతే, ప్రపంచ వాఙ్మయంలోను అందునా సంస్కృత వాఙ్మయంలో ఒక నూత్న కావ్యశాఖావిర్భావానికి తద్వికాసానికి కారణభూతమైనది మేఘ సందేశ కావ్యం. అంతేకాదు భవభూతిలాంటి మహాకవులు కూడ మేఘసందేశ కావ్యాకర్షణకులోనై అనివార్యంగా దాన్ని తమ కావ్యాలలో అనుకరించారు. మాలతీ మాధవంలో నాయకుడైన మాధవుడు తన ప్రియురాలైన మాలతికి తనక్షేమవార్త తెలుపమని మేఘంద్వారా కబురుపంపాడు.

దైవాత్పశ్యేర్జగతి విచరన్ మత్ప్రియాం మాలతీం చేత్
అశ్వాస్యాదౌ తదనుకథయేన్మాధ వీయా మనస్థాం
ఆశాతన్తుర్నచ కథ యతాత్యన్తముచ్ఛేదనీయః
ప్రాణత్రాణం కథ మపి కరోత్యా య తాక్ష్య స్సఏక

ఇందలి ఉత్తరార్థం కేవలం మేఘ దూతంలోని ఈ క్రింది పాదాలను అనుకరించి ఉన్నది. ఆశాబన్ధః కుసుమ సదృశం ప్రాయశోహ్యఙ్గనానాం

సద్యః పాతి ప్రణయ హృదయం విప్రయోగే ఋణద్ధి—
మేఘ సందేశం 1-10.

ఇంతేగాక మేఘదూతాన్ని ఉపజీవ్యంగా గ్రహించి సంస్కృతంలోనే శతాధికంగా సందేశ కావ్యాలుద్భవించాయి. విభిన్నాలైన వస్తువులు వాటిలో గోచరిస్తాయి. శృంగార పరమైనవి కొన్ని, మరికొన్ని భక్తి ప్రధానమైనవి. ఇంకకొన్ని వేదాంత పరమైనవి.

కొందరు కవులు కాళిదాస మేఘ దూతంలోని ప్రతిశ్లోకంలోను నాల్గవ పాదాన్ని గ్రహించి తక్కిన మూడుపాదాలు పూరిస్తూ సందేశకావ్యాలు వ్రాశారు. అందులో అగ్రగణ్యమైనది క్రీ॥శ॥ 1869లో మేఘ విజయకవి వ్రాసిన మేఘ దూత సమస్యాలేఖనం. విక్రమకవి వ్రాసిన నేమిదూతం; చేతోదూతం, సుందర్ గణికవి వ్రాసిన శీలదూతం మొదలైనవి ఉన్నాయి.

# మేఘదూతానికి పూరక కావ్యాలు

అభినవ కాళిదాస బిరుదాంకితుడు శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి అనే పండితుడు మేఘదూతానికి పూరకంగా యక్ష సందేశం లేక యక్షోల్లాసం అనే కావ్యాన్ని వ్రాశాడు. యక్షుని ప్రార్థన విన్న మేఘుడు అలకకు పోయి రావటం, యక్షుడు శాపవిముక్తుడై తనపురానికి వెళ్ళి తన ప్రియురాలితో సుఖంగా కాలక్షేపం చేయడం ఇందులోని కథ. మడికలు రామచంద్రశాస్త్రిగారు మేఘప్రతి సందేశ మనే పేరుతో యక్షిణి చేత మేఘునిద్వారా ప్రతి సందేశాన్ని రామగిరికి పంపించారు. త్రైలోక్యమోహనగుహానియోగి కవికీర్తి అనే కవి మేఘదౌత్యమనే పేరుతో యక్షపత్ని తన పతి శాపాన్ని తొలగించమని ప్రార్థిస్తే కుబేరుడు శాపాన్ని తొల గించి భార్యాభర్తల సుఖదాంపత్యానికి అనుమతించిన విషయాన్ని వర్ణించాడు. కోరాడ రామచంద్రశాస్త్రిగారు, యక్షిణిచే ప్రార్థితుడైన యక్షుడు అలకాపురం పోయి వార్తనందించి తిరిగి రావటం, యక్షయక్షిణుల సమాగమం ఇతివృత్తంగా ఘన వృత్తమనే కావ్యాన్ని వ్రాశారు.

## మేఘసందేశానుసరణాలు

అనన్య సామాన్య ప్రతిభా దర్పణమైన కేవలం స్వచ్ఛమైన, కవిత్వానికి ఆకరమైన మేఘదూతంచేత సంస్కృత వాఙ్మయంలో కవులెందరెందరో ప్రభా వితులై అదే విధంగా స్వతంత్ర సందేశ కావ్యరచన చేయడానికి సాహసించారు. అట్టి కవులు కొందఱు తమ ప్రయత్నంలో కృతకృత్యులైనారు.

## శ్రీరామచంద్రనాయక సందేశకావ్యాలు :

సీతారాములు నాయికా నాయకులుగా కొందఱుకవులు కావ్యరసన చేశారు. రుద్రన్యాయ వాచస్పతి అనేకవి జానకీదాశరథుల వియోగం ఇతివృత్తంగా భ్రమరదూత రచన చేశారు. కృష్ణచంద్ర తర్కాలంకారుడనే కవి సీతారాముని కడకు చంద్రుని దూతగా పంపడం విషయంగా చంద్రదూతమనే కావ్యాన్ని వ్రాశాడు. వేదాంత దేశికులు యుద్ధసన్నద్ధుడైన రాముడు ఒకానొక ప్రభాత సమ

యంలో కనులఎదుట కన్పడిన హంసను ప్రార్థించి సీతకు సందేశం పంపడం ఇతి వృత్తంగా హంస సందేశరచన కావించారు.

## శ్రీకృష్ణనాయక సందేశకావ్యాలు :

లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు నాయకుడుగా అనేక సందేశ కావ్యాలు వచ్చాయి.

రూపగోస్వామి అనేకవి రాధాకృష్ణుల విరహం ఇతివృత్తంగా హంస దూతమనేరచన చేశారు. వైద్యనాధ భట్టు అనేకవి గోపికలు శ్రీకృష్ణుని కడకు తులసీదళమును దూతగా పంపిన విషయాన్ని తులసీదూతముగా వ్రాశారు. శ్రీకృష్ణ కవి సార్వభౌముడు గోపికలు శ్రీకృష్ణుని పదచిహ్నాలను గుర్తించడం అనే విష యంలో పదాంగ దూత వ్రాశారు. రూపగోస్వామి అనేకవి గోపికల దగ్గరకు ఉద్ధవుని దూతగా పంపిన ఘట్టాన్ని ఉద్ధవదూతంగా చిత్రించాడు. మధురలో నున్న కృష్ణునివద్దకు గోపికలు కీరాన్ని దూతగా పంపడం ఇతివృత్తంగా కీర దూతాన్ని రామగోపాలుడనేకవి వ్రాశాడు.

## భక్తిరసప్రధానకావ్యాలు :

వంగదేశీయుడైన విష్ణుదాసుడనేకవి, ఆంధ్రుడైన వింజమూరి వీరరాఘవా చార్యులుగారు మొదలైనవారు మనోదూతమనే పేరుతో భక్తిరస ప్రధానాలైన దూతకావ్యాలు విరచించారు.

## వేదాంత కావ్యాలు :

విష్ణుదాసుని వంశం వాడైన రామకవి, మహామహోపాధ్యాయలక్షణ సూరి మనోదూత, మానస సందేశమనే పేర్లతో వేదాంత పరమైన దూతకావ్యాలు వ్రాశారు. మరొక కవి హంససందేశమనే పేరుతో వేదాంతకావ్యం వ్రాశారు. వేదాంత పరిభాషలో హంస అంటే మనస్సు. తమ మనస్సునే హంసతో దేవు నకు సందేశం పంపాడు.

# ఇతర సందేశ కావ్యాలు

చిత్ర విచిత్రాలైన తమ అనుభవాలే కథావస్తువులుగా కొందరు కవులు సందేశ కావ్యరచనచేశారు వంగాదేశాధీశ్వరుడైన లక్షణసేనుని సభలోని పంచరత్నాలలో ఒకడైన ధోయీ కవిరాజు పవనదూతమనె కావ్యాన్ని వ్రాశాడు. లక్షణసేనుడు భువన విజయం కావించిన తరువాత మలయాద్రిమీది కనక నగరిలో నివసించే కువలయవతి అనే గంధర్వకన్య అతణ్ణి జూచి ప్రేమించి విరహవేదనాన్ని సహింపలేక మలయపవనుని అతని వద్దకు దూతగా పంపింది. మేఘదూతంలోని నాయక విప్రలంభం. ఇందులో నాయికా విప్రలంభం దేవుల పల్లి నరసింహశాస్త్రికవి వ్రాసిన శుకసందేశమనే కావ్యంలో సింహాచల నివాసి యైన ఒక జమిందారు భార్య జూదంలో తనరాజ్యం పోగొట్టుకొన్న తన ప్రియుని గూర్చి విచారిస్తూ చెన్నపురిలోని తన న్యాయవాది వద్దకు తనపెంపుడు చిలకను దూతగా పంపడం కథావస్తువు. సంసార విముఖుడై లేచిపోయిన నేమినాథుని కడకు అతని భార్య మేఘాన్ని దూతగా పంపడం కథా వస్తువుతో మేరుతుంగుడనే కవి మేఘ దూతాన్ని వ్రాశాడు.

ఈవిధంగా సంస్కృతవాఙ్మయంలో కీర, శుక, హంసాది పక్షులచే పంపిన సందేశాలు, చంద్ర, పవన, మేఘాదులతోడి దూతకావ్యాలు, మనోదూతాదులు ఉద్ధవాదుల సందేశాలతో గూడిన దూతకావ్యాలెన్నో శతాధికంగా రచింపబడ్డాయి.

వీనిలో ఏప్రాంత కవి వ్రాసిన కావ్యంలో ఆ ప్రాంతంలోని నదీనదాలు గిరిఝరులు, పుణ్యక్షేత్రాలు, జనపదాలు, జాతిజీవనవిధానం దూతకు మార్గనిర్దేశ మనే పేరుతో అతి మనోహరంగా వర్ణితాలు. దానికి ఒరవడి పెట్టింది కూడ కాళిదాస మహాకవి.

ఇలా ప్రపంచ వాఙ్మయంలో నభూతోనభవిష్యతి అనిపించుకొన్న మేఘ సందేశం సంస్కృత వాఙ్మయంలో సందేశకావ్యశాఖ ఆవిర్భావానికి తద్వికాసా నికి కారణభూతమైంది. తామర తంపరగా ఎన్నో సందేశకావ్యాలు ఆవిర్భ వించినా కవితాగుణంలో అవి మేఘదూతానికి సాటిరావనే అనాలి. అంతటి అను

భూతి సాంద్రత వీటిలో లభించదు. కవిత్వంకూడా ఆ రీతిగా పరిష్కృతం కాదు.[1]

కవి అయిన వాడు, కవి కాదలచిన వాడు— మేఘసందేశ కావ్యాన్ని పారాయణం చేస్తునే ఉంటాడు. అచ్చమైన భావుకతా శక్తినది ప్రోదిచేస్తుంది. ఈ లఘుకావ్యంపై ప్రపంచంలో పరిశోధన లఘుసంఖ్యలో ఆవిర్భవించాయి. అసంఖ్యాకమైన వ్యాఖ్యానాలు వెలసినాయి. తెలుగులో ఈ కావ్యానికి విపులమైన వ్యాఖ్య విరచించి వేదం వేంకటరాయశాస్త్రిగారు వెలయించారు. ఈ కావ్యం ఎంత ప్రతిభాపూర్వకమో అంతగా వ్యుత్పన్నము నయింది. అయితే వ్యుత్పత్తి నధఃకరించి ప్రతిభమాత్రమే పైకి గోచరిస్తుంది. అందువల్లనే సామాన్యులు కూడా ఈ శ్లోకాలు గళమెత్తి తమకున్న సంగీత శక్తికొలది హాయిగా ఆలాపించి ఆనందిస్తారు. ధీమాన్యు లంతటితో తృప్తిపడక కవీశ్వరుని లోకజ్ఞత, శాస్త్రజ్ఞత, వివిధ కళాభిజ్ఞతల్ని వ్యాఖ్యాన సహాయంతో సంపాదించు కొని హృదయ శక్తితోపాటు, మేధాశక్తిని కూడా సముపార్జించుకొంటారు. మిగతా సందేశ కావ్యాల కీవిధమైన గౌరవం లేదు. అంటే అవి కేవలం ప్రతిభా మాత్రమో, వ్యుత్పత్తిమాత్రమో అవుతాయి.

కాళిదాసు తక్కిన కావ్యాలేవి రచించక పోయినా ఆయన యశః కాయన్ని అజరామరణం కావించటానికి మేఘసందేశ కావ్య మొక్కటే చాలు. సంస్కృతం ఎందుకు చదువుకోవాలి? అని ప్రశ్నిస్తే 'అభిజ్ఞాన శాకుంతలం' పఠించి ఆనందించటానికి అంటారు. కాని మేఘసందేశ కావ్యం చదువుకోని ప్రణయరసైకజీవి కావటానికే అని నా అభిప్రాయం.

---

1 ఈ రచన కాధారం : సంస్కృత వాఙ్మయ చరిత్ర ద్వితీయభాగం — పుటలు 223 నుండి 227. సూర్యనారాయణశాస్త్రి మల్లాది.

# ద్వితీయాధ్యాయము



## అనువాద సందేశకావ్య సమీక్ష

**ఇందులో :**

మేఘసందేశము - అనువాదాలు

హంస సందేశము - అనువాదాలు

హంసదూతము : అనువాదం

భూసుర సందేశము : అనువాదం

మరుత్సందేశము : అనువాదం

# సంస్కృత సందేశ కావ్యాలు తెలుగు అనువాదాలు

సంస్కృతం భారతీయ భాషలన్నిటికి తల్లి లాంటిది. ప్రాంతీయమైన భారతీయ భాషలన్నింటిని అదెంతో ప్రభావితం చేసింది. సంస్కృతంలోని భారత, భాగవత, రామాయణాలు, అభిజ్ఞాన శాకుంతలం, ఉత్తరరామ చరిత్ర మొదలైన నాటకాలు, అష్టాదశపురాణాలు, హర్షనైషధం రఘువంశం మొదలైన కావ్యాలు, హిందీ, బెంగాలి, మరాఠీ మొదలైన ఉత్తర భారతీయ భాషల్లోను, తమిళం, కన్నడం, మొదలైన దక్షిణ భారతీయ భాషలలోను అనువదింపబడ్డాయి. అదే విధంగా సంస్కృత వాఙ్మయంలోనే ప్రత్యేక సాహిత్యప్రక్రియగా ప్రవర్ధమానమైన సందేశకావ్యాలుకూడ ఉత్తర, దక్షిణ భారతీయభాషల్లోకి పరివర్తితమైనాయి.

ఇతర ప్రాంతీయ భాషల్లోలాగానే తెలుగులోను ఆ సందేశకావ్యాలకు అనువాదాలు వచ్చాయి.

నాకు లభించినంతవఱకు తెలుగులో అనువదింపబడిన సందేశకావ్యాలుఇవి:

1. మేఘ సందేశః
   "కవికుల తిలకుడు" కాళిదాస మహాకవి.
2. హంస సందేశః
   "కవితార్కికకేసరి" వేంకటనాధుడు (వేదాంతదేశికులు)
3. హంసదూతమ్
   చైతన్య మహాప్రభు శిష్యులు రూపగోస్వామి
4. భూసుర సందేశః
   "విద్యాభూషణ" నేమాని నారసింహకవి
5. మరుత్సందేశః
   "గణితావధాని" పులవర్తి శరభాచార్యులు.

ఈ కావ్యాలకు తెలుగులోవచ్చిన అనువాదాలను పరిశీలించడానికి ముందు అనువాద విధానం, అనువాదకుని ఉండవలసిన లక్షణాల్ని గూర్చి సంగ్రహంగా వివరిస్తాను.

## అనువాద విధానం

"అను" ఉపసర్గ పూర్వక వద్ ధాతువునకు ఘఞ్ ప్రత్యయం చేర్చగా అనువాదమనే పదమేర్పడ్డది.

అను – అనుసృత్య ఉద్యతే – ఉచ్యతే ఇత్యనువాదః

అనుసరించి చెప్పుట లేక తిరిగి చెప్పుట అనిదీని అర్థం. కాళిదాస మహాకవి చిలుక పల్కులను అనువాదమన్నాడు [1] కాని కాలక్రమంలో అనువాదమంటే ఒక భాషలోని విషయాన్ని మరోభాషలో చెప్పడం అనగా భాషాంతరీకరణమనే అర్థంలో రూఢమైంది. ఇంగ్లీషులోని "ట్రాన్స్‌లేషన్" అనేపదం లాటిన్ భాషాజన్యం. దీనికి అవతల వైపుకు తీసికొనివెళ్ళడమని అర్థం. అది కూడ కాలక్రమంలో భాషాంతరీకరణమనే అర్థంలో రూఢమైంది.

ఒక భాషలోని కళాఖండాన్ని మరోభాషలోకి యథాతథంగా అనువదించ గల్గడం అసంభమని కొందరంటారు. అంటే మౌలిక సౌందర్యాన్ని వైశిష్ట్యాన్ని అది భావగతమైనా శబ్దగతమైనా కళాగతమైనా అనువాదంలో చూపించగల్గడం అసంభవమని అభిప్రాయం. ఇటాలియన్ భాషలో అనువాదకుణ్ణి ద్రోహి అన్నారు [2]

విక్టర్ హ్యూగో అనే రచయిత అనువాదం అసాధ్యము వివేక శూన్యము అని అన్నాడు. శ్రీ మాన్‌చక్రవర్తుల రాజగోపాలాచార్యులు మూలాన్ని యథా

---

1 అయమపిచ గిరం నస్త్వత్ప్రబోధ ప్రయుక్తాం
అనువదతి శుకస్తే మంజువాక్పంజరస్థః !!

రఘువంశం - 5వ సర్గ 74వశ్లోకం,

2 A translator is a traitor.

తదంగా అనువదిస్తే అది అనువాదమై భాషాప్రకృతికి అనుగుణంగా ఉండక ఎబ్బెట్టుగా ఉంటుంది. ఆ భాషాప్రకృతికి అనుగుణంగా అనువదిస్తే అది అనువాదం కాకుండా పోతుందన్నాడు.[1]

ఏదియేమైనా చాలా ప్రాచీనకాలంనుండి ప్రపంచంలోని అన్ని భాషలలోను భాషాంతరీకరణం జరుగుతునే ఉన్నది. ఈ అనువాదాన్ని ఒక కళగా భావించిన పండితులు అనువాదానికి గల సమస్యల్ని, తీరుతెన్నుల్ని విశ్లేషించి వివరించారు. ముఖ్యంగా ఐరోపాఖండంలో ఈ విధమైన పరిశ్రమ ఎక్కువగా జరిగింది. దాని కొలకు కొన్ని సంస్థలే వెలిసాయి.

భారతదేశంలో కూడ అటువంటిదే ఒక సంస్థ ఉన్నది. దాని పేరు 'ట్రాన్స్లేషన్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా'. ఇటువంటి సంస్థలద్వారా ప్రభుత్వ ప్రోత్సాహంతో అనువాదానికి సంబంధించిన శాస్త్రవిశ్లేషణ చేస్తూ చక్కని గ్రంథాలు వెలువరిస్తున్నారు.

## అనువాదరీతులు

అనువాదసాహిత్యాన్ని బహుధా పరిశీలించిన పండితులు అందలిరీతుల్ని కూడా నిర్వచించారు. ఈ అనువాదరీతులు స్థూలంగా నాల్గు విధాలుగావిభజింపవచ్చు. అవి శబ్దానువాదం, భావానువాదం, సృజనానువాదం, కావ్యానువాదం

### శబ్దానువాదం :-

ఒక భాషలోని భావాన్ని మరియొక భాషలోకి అనువదిస్తున్నప్పుడు మూలంలోని ప్రతి పదానికిగల ప్రాధాన్యాన్ని గుర్తించి దానికి సమమైన పదమో

[1] If you are true to Original you will infact be faithful to it and if you make free with the original you will not produce a translation. Rare exceptions have escaped this dilemma. But these are really original works and not translations Original works built one the substance of works in another language but self dependent for art and beauty.

పర్యాయపదమో వాడుతూ మూలంలోని భావాన్నే యథాతథంగా అనువవించడాన్ని శబ్దానువాదం అంటారు. దీనిని ఇంగ్లీషులో 'లిటరల్' లేక 'వెర్బల్ ట్రాన్స్లేషన్' అంటారు.

ఈ విధమైన అనువాదం శాస్త్ర గ్రంథాలకైతే చక్కగా సరిపోతుంది. సాహిత్య గ్రంథాలలో కూడ కొంతరవకు బాగానే ఉంటుంది. ఎందుకంటే మూలాన్ని ఉన్నదున్నట్లుగా అనువదించడంలో కల్పనకు తావుండదు. మూలంలోని గొప్పతనాన్ని గూర్చిగాని హైన్యాన్ని గూర్చిగాని పాఠకుడొక అభిప్రాయాన్ని ఏర్పరచు కోవడానికి అవకాశమున్నది. మూలంలోని భావాలకోసం ప్రత్యేకంగా మూలాన్ని చూడాలనే ఆకాంక్ష పాఠకునకు కలుగదు. ఆధునికంగా ఈ విధమైన అనువాద పద్ధతిఅధికంగా అభిమానింపబడుతున్నది.

## భావానువాదం :-

మూలంలోని భావాలకేగాని వాక్యపద నిర్మాణ వైశిష్ట్యానికి ప్రాధాన్య మివ్వక చేసిన అనువాదాన్ని భావానువాదమనవచ్చు. మూలరచయిత ఉద్దేశించిన భావాలను తను అనువదించే భాషాప్రకృతికి అనుకూలంగా తమ భాషారచనలవలె భాసించేట్లుగా అనువదిస్తే భావానువాదమౌతుంది. ఇది కొంత ఆదర్శానువాద పద్ధతి కావచ్చు. కాని ఈ పద్ధతిలో మూలరచనా వైశిష్ట్యంఅంతగా గోచరించదు. మనపురాణేతిహాసాలన్నీ ఇంచుమించుగా భావానువాదాలే.

## సృజనానువాదం :-

అక్కడక్కడ స్వతంత్రధోరణి కూడ గోచరించినట్లైతే అది సృజనాను వాదమనవచ్చు (Transcreation). పోతన్నగారి భాగవతానువాద మిటువంటిదిగా భావించవచ్చు.

## కావ్యానువాదం :

శబ్దాతిశాయి అర్థాతిశాయి విలసితమైంది కావ్యం. అటువంటి కావ్యాను వాదం చేసేటప్పుడు శబ్ద సౌందర్యం, అర్థసౌందర్యం దెబ్బతినకుండా కాపాడాలి.

ఇది భావానువాదంకంటే కష్టమైనది ఇందులో భావాలే కాకుండా కావ్యంలోని విలక్షణ శబ్ద ప్రయోగాల్ని యథాతథంగా అనువాదంలో దించాలి అప్పుడే అనువాదం మూలాన్ని సంస్మరింపజేస్తూ అందగిస్తుంది ఇటువంటి అనువాదానికి శ్రీకారం చుట్టినవాడు తెలుగులో శ్రీనాథ కవిసార్వభౌముడే. సందేశ కావ్యానువాదాలలో తెలుగు కవులు విశేషంగా కావ్యానువాద వైఖరినే అనుసరించాలి. కేవలం కథానువాదం హృదయరంజకంగా ఉండదు ఇందులో కథ స్వల్పం కాబట్టి.

## అనువాదకుని లక్షణాలు

ఒక కావ్యాన్ని అనువదించదలచిన వానికి రెండు భాషలలోను సమానమైన పాండిత్యం ఉండాలి. ఆయా భాషాగత జాతీయాలు నుడికారాలు మొదలైన వాటితో సమ్యక్ పరిచయం ఉండాలి. సంస్కృతి, సాంఘిక సంప్రదాయాల పరిజ్ఞానముండటమే గాక తాను అనువదించ దలచిన విషయం పట్ల శ్రద్ధాసక్తులు చాలా అవసరం. అవి ఉన్నప్పుడే చక్కగా అధ్యయనం చేసి మూల రచయితతో తాదాత్మ్య చెంది సహృదయులు మెచ్చుకొనేట్లు అనువాదం చేయగలవాడు. కేవలం మూలంలోని భావాలనేగాక శైలీగత వైశిష్ట్యాన్ని, వాక్యరచనా చాతుర్యాన్ని కూడ అనువాదంలో చూపించగల్గుతాడు. మూలరచనలోని భావగత శబ్దగత సౌందర్యాన్ని ప్రదర్శిస్తూనే తన అనువాదాన్ని మౌలిక కృతిగా భాసింప జేయడమే ఆదర్శ అనువాదకుని లక్ష్యం కావాలి. అప్పుడే అనువాదం సరసంగా పాఠకుల మనసును హత్తుకుంటుంది. [1]ఆంధ్రు లనువాదకళలో ఆరితేరిన వాళ్ళుగా ప్రాచీన కాలంనుండి ప్రశస్తిగాంచారు ప్రాచీనకాలంలో సంస్కృత కావ్యాలు, ఆధునిక కాలంలో ఆంగ్లభాషాకావ్యాలు అనువాదాలు కావించి, అనువాదం అనే అభిప్రాయం కల్గనీకుండ రచించారు.

సందేశకావ్యానువాద రచయితలీవిషయంలో ఎంత వఱకు కృతకృత్యు లయ్యారో పరిశీలించాలి

---

1 చూ : అనువాదరీతులు : ప్రొఫెసర్ భీమ్‌సేన్ నిర్మల్
ప్రొఫెసర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం.
తెలుగు : వైజ్ఞానిక మాసపత్రిక : జనవరి – మార్చి, 1973.

# మేఘసందేశము - తెలుగు అనువాదాలు

కాళిదాస మహాకవికి ప్రపంచ పరివ్యాప్తమైన యశస్సునార్జించి పెట్టిన లఘుకావ్యం మేఘసందేశం. దీనికి ప్రపంచంలోగల ఎన్నో భాషలలో అనువాదాలు వచ్చాయి.[1]

---

## 1. ఇతర భాషానువాదాలు :

| భాష | అనువాదకులు | సంవత్సరం |
|---|---|---|
| ఇంగ్లీషు | హెచ్.ఎం. విల్సన్ | 1813 |
| ఇంగ్లీషు | ఎస్.సి. సర్కార్ | 1906 |
| ఇంగ్లీషు | కె బి. పాఠక్ | 19 6 |
| ఇంగ్లీషు | ఎం. ఆర్. కాలే | 1916 |
| ఇంగ్లీషు | గంటి జోగిసోమయాజి | 1934 |
| ఇంగ్లీషు | గుంటూరు శేషేంద్రశర్మ | 1970 |
| జర్మన్ | మాక్స్‌ముల్లర్ | 1847 |
| జర్మన్ | ఎస్.సి సిట్జ్ | 1859 |
| ఫ్రెంచ్ | ఎ. గెరినాట్ | 1901 |
| మరాఠీ | డా॥ సి.డి. దేశ్‌ముఖ్ | — |
| మరాఠీ | కుసుమాగ్రజ | — |
| మరాఠీ | ఆర్.ఎస్. గద్రే | — |
| మరాఠీ | శ్రీ ఖండే | — |
| మరాఠీ | వాసివాడేకర్ | — |
| హిందీ | డా॥ వాసుదేవశరణ్ అగర్వాల్ | — |
| హిందీ | డా॥ సరస్వతీ ప్రసాద్ చతుర్వేది | — |

---

[1] విరహి (మేఘదూతానువాదం) - ఉపోద్ఘాతం / ఆధారం - లక్ష్మణశాస్త్రి, కప్పగంతుల.

ఈ విధంగా, ఎందరెందరో కవులు మేఘ దూతాన్ని అనువదించటానికి ప్రయత్నించారు. అయినా మేఘసందేశం అనుకరణాని కతీతమైంది ఎందుకంటే అది విషయ ప్రధానమైందికాదు కేవలం వర్ణనలు ప్రధానమైందికాదు. మేధా పరిశ్రమ మాత్రం కాదు అది మధురము, స్వచ్ఛము, ఆత్మాశ్రయమునైన కేవల కవిత్వం కావటమే కారణం.[1]

ఆ కవితామృతాస్వాదన చేసిన తెలుగు కవులు తమ భాషాప్రజలకు గూడ అట్టి భాగ్యాన్ని కల్గించాలనే సత్సంకల్పంతో అనువాద రచన కుద్యమించారు. దీని కంకురార్పణ క్రీ॥శ॥ 1790లో జరిగింది. కొటికలపూడి వేంకట కృష్ణ కవి పండితుడు తొలిగా దీనిని తెలుగులోకి అనువదించాడు. అది నేడు అలభ్యం.

ఈ తొలి అనువాద రచనకు పూర్వం తెలుగు వాఙ్మయంలో కొందరు కవులు కాళిదాస మహాకవి మేఘసందేశ కావ్యగత భావాలను తమ కావ్యాలలో అక్కడక్కడ జొప్పించారు. ఆదికవి నన్నయ్య భారతారణ్య పర్వంలోని తృతీయా శ్వాసంలో పాండవులు చూచిన గంధ మాదన పర్వతాన్ని వర్ణించే సందర్భంలో

నానావర్ణ శిలా విహ
గానేక మృగాభిరామమై భూ నారీ
నానా భరణ విభూషిత
పీనోన్నతకుచము వోలె వెలిగెడుదానిన్ (అరణ్య-3-292)

అని అన్నాడు.

---

[1] "A large number of attempts was made in later times to imitate the poem, but the Meghaduta remains unsurpassed as a masterpiece of its kind not for its matter nor for its description nor it as an exercise of intellect and ingenuity but purely for its poetry" —Prof Suseel Kumar Dev.

ఉపోద్ఘాతం - మేఘ సందేశం - నేలటూరి రామధాస అయ్యంగార్ నుండి ఉద్ధృతం. 10-9-1968.

ఈ పద్యంలోని భావం కాళిదాస మహాకవి మేఘదూతంలోని "మధ్యే శ్యామః స్తన ఇవ భువ శ్శేష విస్తార పాండుః" అన్న భావానికి ప్రతిబింబంగా ఉన్నది.

"తస్యాం పాతుం సురగజ ఇవ వ్యోమ్నిపశ్చార్ధ లంబీ" అన్న మేఘ దూతంలోని కాళిదాసోక్తిని విపులీకరిస్తూ నన్నయ భారతారణ్య పర్వంలోనే తృతీయాశ్వాసంలో

"వారిధారలననివారిత నిర్గళ
దానధారలదటి ద్ధామములను
దళనధామంబుల నళనిఘోషంబుల
ఘోరబృంహిత బృహద్ఘోషణములను
నివి ఘన బృందంబు లివి గజయూథంబు
లని విచారింపంగనక్కజంబు
లైలలితోత్తుంగ శైల శృంగమ్ముల
ద్రిమ్మరు జలధర ద్విరద తతుల" (అరణ్య-3-355)

అని రచనచేశారు. ఈ విధంగానే భాస్కర రామాయణంలో రావణుడు సీతను చెరగొని పోయే సందర్భంలో దిక్కుతోచని సీత తన కనులయెదుట కనపడ్డ మేఘపంక్తిని చూచి "మేఘములార వేగజని మీరయినం బతితోడ జెప్పరే" అన్నది సీతచే భాస్కరుడు అనిపించిన ఈ మాటలుకూడా అమూలకాలు. కాళిదాసమహాకవి ప్రభావజనితాలే. ఇట్లా అన్వేషిస్తే ఎంతమంది కవుల మీదనో మేఘసందేశ కావ్య ప్రభావం గోచరిస్తుంది. ఇది ప్రత్యేక పరిశోధనాంశం.

నేను సేకరించినంతవఱకు లభ్యమైన అనువాద కావ్యాల్లో ప్రాచీనతమ మైనది వసురాయ కవిగా లోకంలో ప్రసిద్ధులైన వడ్డాది సుబ్బారాయకవిచే క్రీ॥శ॥ 188 లో విరచితమైన అనువాదం.

అది మొదలు నేటివఱకు రసపిపాసువులైన అనేక పండిత కవులు మేఘ సందేశానికి తమదైన మార్గంలో అనువాదరచనచేస్తూ కృతకృత్యులు కావడానికి శక్తివంచనలేక ప్రయత్నంచేశారు. అవి ఇంచుమించు ఏబదికి పైగా ఉన్నట్లు ఆధారాలు లభిస్తున్నాయి.

అనువాదం చేయడం అసిధారావ్రతం. అందునా కాళిదాస భావకవితను భాషాంతరీకరించడం మిక్కిలి కష్టసాధ్యమైన విషయం. అతడు గొప్ప శబ్దశిల్పి అతని భావాలు లలితమైనవి. భావప్రకటన విధానం అంతకంటే లలితమైనది. ఆకవి రచనలోని శబ్దశక్తి అనువాద దుర్లభమైనది. దానికితోడు ఛందోగతమైన క్లిష్టత కూడ ఉన్నది. మందాక్రాంతానికున్న ధీర మందగమనం మరొక వృత్తానికిలేదు ఆ వృత్తాన్ని యథాతథంగా దేశభాషల్లోకి తీసుకొని ధారాళంగా రచించాలంటే అతడు కాళిదాసంత కాళీదాసుడు కావాలి.

కాని కాళిదాస మేఘదూతంలోని కవిత్వ లాలసులైనన తెలుగుకవులు సంపెంగ చుట్టూ తిరిగే భృంగాల్లాగా నిరంతరవరనాసక్తులు. భావకవుల కిది పారాయణ కావ్యం. నిద్రలోకూడా పలవరించేవారట. నిరంతరం మేఘదూత చేతపెట్టుకొని తిరగని భావకవి లేడంటే అతిశయోక్తికాదని[1] రాయప్రోలు సుబ్బారావుగారన్నారు.

ఇంతటి మహత్వకవిత్వపటుత్వ సంపద కల్గిన మేఘదూతానికి తెలుగులో వచ్చిన అనువాదాలలో ఛందస్సులోగాని, రచనా విధానంలోగాని, ఏదేని ప్రత్యేకతను సంతరించుకొన్నవానిని కొన్నింటిని సంగ్రహంగా సమీక్షిస్తాను. తక్కినవానిని ప్రకరణాంతంలో పట్టికగా కూర్చుతాను.

## మేఘసందేశము
### (తొలి అనువాదం)
### వడ్డాది సుబ్బారాయకవి
### (వసురాయకవి)

మేఘసందేశానికి లభించిన అనువాదాలలో తొలి అనువాదం క్రీ॥శ॥ 1884లో వెలువడింది రచయిత వడ్డాది సుబ్బారాయకవి రాజమహేంద్రవరం వాస్తవ్యులైన వీరు శతాధికగ్రంథకర్తలుగా ప్రసిద్ధులు. వీరి అనువాదం ఆనాటి విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా నిర్ణయింపబడ్డది ఆనాటి ప్రముఖ కవిపండితులు

---

1 రాయప్రోలు సుబ్బారావుగారితో ముఖాముఖి తేది 15-7-79 ప్రదేశం సికింద్రాబాద్

వేదం వేంకటరాయ శాస్త్రిగారు.[1] సత్యవోలు సుందరరావుగారు[2] వీరిఅనువాదాన్ని సముచితంగా ప్రశంసించారు

సరసపదార్థ గుంభనం, శబ్దమృదుత్వము మొదలైన విశిష్ట గుణాలుగలిగిన కావ్యంగా కొనియాడబడ్డది వీరి అనువాదం.

## అనువాదవిధానం

**మూలం :**

తన్వీశ్యామా శిఖరిదశనా పక్వ బింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకిత హరిణీ ప్రేక్షణా నిమ్న నాభిః
శ్రోణీ భారా దలస గమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యాతత్రా స్తే యువతి విషయే సృష్టిరాద్యేవధాతుః

—మేఘదూతం 2_21.

**అనువాదం-**

వలుచనమైదీగ బాగైన యెలనాగ
యౌవన మధ్యస్థయైన చాన
మొనలుదేరిన దంతముల నొప్పు కలికి
బింబాధరోష్ఠంబు నమరుతరుణి
నడచిన నసియాడు నడుమున్న నవలయు
బాలమృగీశావిశాలనయన

---

[1] "మీరువ్రాసిన మేఘసందేశం పాఠ్యంగా నిర్ణయింపబడినందువలన చదువవలసి వచ్చినది అది చదివిన తరువాత అందలి మహిమచూచి మీ పుస్తకాలింకా చదవాలని పిస్తోంది." —అభిప్రాయం -వేంకటరాయశాస్త్రి వేదం -3 పుట

[2] సరసపదార్థ గుంభనము శబ్దమృదుత్వము శయ్యపెంపు భా
స్వర యమక ప్రచారము ప్రశస్త రసాంచిత వాక్యచాతురీ
పరిణతవృత్తిరీతి పరిపాక వివేకము నీదుకవిత్వమం
దరయగ నిండియుండె నహహా కవి! యుబ్బితి సుబ్బరాట్కృతీ!!

—అభిప్రాయం 3 సుందరరావు సత్యవోలు. _3 పుట.

గంభీరమైన చక్కని నాభిదగునాతి
కటిభరాలసగతుల్గలుగు చెలువ
వలుదవ్రటువ యిఱుకు నిబ్బరపుగుబ్బ
చనుల్ వ్రేగున నుంతవంగిన నెలంత
కంబడునంత నీకు వాల్గంటి యచట
మొదటనలువ సృజించిన ముదితయనగ

మేఘునికి యక్షుడు తన ప్రియురాలి ఆనవాలు చెప్పే సందర్భం.

ఈ అనువాదమునందు "తన్వీ శ్యామా" అన్న రెండుపదాలకు "పలుచని మైదీగ బాగైన యెలనాగ యౌవన మధ్యస్థయైనచాన" అని పద్యపాదంలో వివరించడం కాళిదాస కవితకు వ్యాఖ్యానంవలెనున్నది. ఇందు చాన, కలికి, తరుణి, నవల, నాతి మొదలైన విశేషణాలు మూలంలో లేనివి. అనువాదం సీసంలో సాగటంచేత అలా చెప్పవలసివచ్చింది. సీసపద్యం చక్కని పదాలతో మందగమనంతో సాగింది. వర్ణించేది అలసగమనను కాబట్టి కొంతసరిపెట్టుకోవాలి. సంస్కృతంలో నాల్గక్షరాల్లో చెప్పింది పెద్ద పద్యపాదంలో చెప్పవలసివచ్చింది. సంస్కృతంలోని అల్పాక్షరాలు అనువాదంలో అనల్పాలైన కారణంగా ఈ అనువాదం సహృదయులకు కొంతవిసుగు కల్గించకమానదు.

మూలం ఒకే ఛందస్సులో (మందాక్రాంతంలో) ఉన్నదిగాబట్టి అనువాదం ఒకే ఛందంలో ఉండాలనే నిబంధనా శృంఖలాలతో కవితనకు తాను చేతులు కట్టివేసుకోలేదు. ఏయే సందర్భాలలో విషయవివృతి తగునో, ఎక్కడెక్కడ విషయ సంకోచముచితమౌతుందో పరిశీలించి వేదంవారు, పైని ఉదాహరించి నట్లుగా మేఘసందేశకావ్యానువాదాన్ని కావించా రనవచ్చు.

## ఆంధ్రమేఘసందేశం

—కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

శ్రీ వేంకటరామశాస్త్రిగారు రాజమహేంద్రవరంలోని ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేశారు. సాహితీచతురులు, వ్యాకరణజ్యోతి శ్శాస్త్రాల్లో అపార పాండిత్యం కలిగినవారు సంస్కృతాంధ్ర భాషాసాహిత్యాల్లోనే

గాక ఆంగ్లంలోను పండితులు. క్రీ॥శ॥ 1885లో ఆంధ్ర మేఘసందేశం పేరుతో మేఘసందేశాన్ని అనువదించారు. దీనిని కందుకూరి వీరేశలింగం పంతులు[1] గారు, కోరాడ రామచంద్రశాస్త్రి[2] గారిలాంటి ఉద్దండ పండితులు ప్రశంసించారు.

వీరేశలింగం పంతులుగారన్నట్లు సంస్కృత మేఘదూతం ధ్వన్యాత్మకమైన కావ్యం. దీన్ని తెలిగించడం మహాసాహసమౌతుంది. సాహసించిన శాస్త్రిగారు చాలవరకు కృతార్థులైనారనవచ్చు. పూర్తిగా కృతకృత్యత అసాధ్యంకదా!

---

[1] అయ్యా! మీరు తెనిగించిన మేఘసందేశము సాంతముగా చదివి చూచినాను. ఒక భాషలోనొక పద్యమందున్న భావమంతయు మరియొక భాషలో నొకేపద్యమందిముడ్చుట మిక్కిలి కష్టము. అట్లయినను మీరాంధ్రీకరించిన ఈపుస్తకమునందలి ప్రతిశ్లోకముయొక్క అర్థమును ధ్వనులను సరిగా వచ్చినవని చెప్పగల్గినందు కెంతో సంతోషించుచున్నాను. అక్కడక్కడ నొకానొక పద్యార్థము కాళిదాసకృతము మూలగ్రంథము చదువనివారికి సుబోధకము కాకపోయినను, పుస్తకము మొత్తము మీద కఠినముకాని మృదు మధురశైలిని వ్రాయబడినదనియు నా అభిప్రాయము. మీరు తెనుగు కవిత్వమును చెప్పుటకిదియే ప్రథమ ప్రయత్నమైనను, పుస్తకము చదువువారికిది ఆంధ్రకవిత్వమునందారితేరినవారి కవిత్వము లాగున తోచకపోదని నమ్ముచున్నాను.

రాజమహేంద్రవరము, మీ విధేయుడు,
కందుకూరి వీరేశలింగము

[2] కల్లూరి వేంకట రామశాస్త్రిగారిచే నాంధ్రీకృతమైన ఈ మేఘసందేశకావ్యము మృదుపదములచే మిగుల నుల్లాసకరమై యున్నది. కావ్యలక్షణ లక్షితమై కాళిదాసోక్తివలెను, సరసహృదయ రంజకంబును ధ్వన్యలంకారాది భూయిష్ఠంబునైన సంస్కృత మేఘసందేశ ప్రతిబింబంబో యననున్నదని నే నెంచెదను.

బందరు మిషన్ హైస్కూలు సంస్కృతోపాధ్యాయులు
కోరాడ రామచంద్రశాస్త్రి.

# అనువాదవిధానం

మూలము :

కశ్చిత్కాంతా విరహ గురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాఽ స్తంగమిత మహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామ గిర్యాశ్రమేషు.

అనువాదం :

ఇలనేమారుట స్వాధికారమున కీవేడాది ప్రీ బాసి చిం
తలపాలై మనుమంచు రేడలుగ బున్నాగాళి జొంపంపుజా
యల సీతాభిష వానఘాంబువుల నింపౌరామగిర్యాశ్రమం
బుల యక్షుండొకడుండె నాత్మ మహిమంబుంబాసి శాపంబునన్

ఈ అనువాదపద్యంలో "శాపేనా స్తంగమిత మహిమా" అన్వయాలను "ఆత్మమహిమంబుంబాసి శాపంబునన్" అని తెలిగించారు. సంస్కృతపదం ధ్వనిగర్భితమైనది. అస్తమించుట మరల ఉదయించుటకొఱకేనని, సంవత్సర కాలం తరువాత శుభోదయమౌతుందని కాళిదాస హృదయగత భావన. అనువాదంలో ఈ భావం స్ఫురించడంలేదు.

మూలం :

తస్మిన్నద్రౌ కతిచిదబలా విప్రయుక్తస్సకామీ
నీత్వామాసాన్ కనకవలయ భ్రంశ రిక్త ప్రకోష్ఠః
ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ.

అనువాదం :—

పొంగడియమ్మజారి తన ముంజెలు బొంపర గొంత దూరుడౌ
వెంగలి కొన్నిమాసములు వేగగనగ్గిరిపై గనెందటన్
త్యంగితుడౌటచే బరిణత ద్విరదంబన గన్పు వండువౌ
షుంగళ దేహశ్లేషు శుచిమాసము తొల్తిటి వాసరంబునన్

గాక ఆంగ్లంలోను పండితులు. క్రీ॥శ॥ 1885లో ఆంధ్ర మేఘసందేశం పేరుతో మేఘసందేశాన్ని అనువదించారు. దీనిని కందుకూరి వీరేశలింగం పంతులు[1] గారు, కోరాడ రామచంద్రశాస్త్రి[2] గారిలాంటి ఉద్దండ పండితులు ప్రశంసించారు.

వీరేశలింగం పంతులుగారన్నట్లు సంస్కృత మేఘదూతం ధ్వన్యాత్మకమైన కావ్యం. దీన్ని తెలిగించడం మహాసాహసమౌతుంది. సాహసించిన శాస్త్రిగారు చాలవరకు కృతార్థులైనారనవచ్చు. పూర్తిగా కృతకృత్యత అసాధ్యంకదా!

---

1 అయ్యా! మీరు తెనిగించిన మేఘసందేశము సాంతముగా చదివి చూచినాను. ఒక భాషలోనొక పద్యమందున్న భావమంతయు మరియొక భాషలో నొకేపద్యమందిముడ్చుట మిక్కిలి కష్టము. అట్లయినను మీరాంధ్రీకరించిన ఈపుస్తకమునందలి ప్రతిశ్లోకముయొక్క అర్థమును ధ్వనులను సరిగా వచ్చినవని చెప్పగల్గినందు కెంతో సంతోషించుచున్నాను. అక్కడక్కడ నొకానొక పద్యార్థము కాళిదాసకృతము మూలగ్రంథము చదువనివారికి సుబోధకము కాకపోయినను, పుస్తకము మొత్తము మీద కఠినముకాని మృదు మధుర శైలిని వ్రాయబడినదనియు నా అభిప్రాయము. మీరు తెనుగు కవిత్వమును చెప్పుటకిదియే ప్రథమ ప్రయత్నమైనను, పుస్తకము చదువువారికిది ఆంధ్రకవిత్వమునందారితేరినవారి కవిత్వము లాగున తోచకపోదని నమ్ముచున్నాను.

రాజమహేంద్రవరము, మీ విధేయుడు,
కందుకూరి వీరేశలింగము

2 కల్లూరి వేంకట రామశాస్త్రిగారిచే నాంధ్రీకృతమైన ఈ మేఘసందేశకావ్యము మృదుపదములచే మిగుల నుల్లాసకరమై యున్నది. కావ్యలక్షణ లక్షితమై కాళిదాసోక్తివలెను, సరసహృదయ రంజకంబును ధ్వన్యలంకారాది భూయిష్ఠంబునై సంస్కృత మేఘసందేశ ప్రతిబింబంబో యననున్నదని నే నెంచెదను.

బందరు మిషన్ హైస్కూలు సంస్కృతోపాధ్యాయులు
కోరాడ రామచంద్రశాస్త్రి.

## అనువాదవిధానం

మూలము :

కశ్చిత్కాంతా విరహ గురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాఽస్తంగమిత మహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామ గిర్యాశ్రమేషు.

అనువాదం :

ఇలనేమారుట స్వాధికారమున కీవేడాది ప్రీ బాసి చిం
తలపాలై మనుమంచు రేడలుగ బున్నాగాళి జొంపంపుజా
యల సీతాభిష వానఘాంబువుల రింపౌరామగిర్యాశ్రమం
బుల యక్షుండొకడుండె నాత్మ మహిమంబుంబాసి శాపంబునన్

ఈ అనువాదపద్యంలో "శాపేనాస్తంగమిత మహిమా" అన్న పదాలను "ఆత్మమహిమంబుంబాసి శాపంబునన్" అని తెనిగించారు. సంస్కృతపదం ధ్వనిగర్భితమైనది. అస్తమించుట మరల ఉదయించుటకొఱకేనని, సంవత్సర కాలం తరువాత శుభోదయమౌతుందని కాళిదాస హృదయగత భావన. అనువాదంలో ఈ భావం స్ఫురించడంలేదు.

మూలం :

తస్మిన్నద్రౌ కతిచిదబలా విప్రయుక్తస్స కామీ
నీత్వా మాసాన్ కనకవలయ భ్రంశ రిక్త ప్రకోష్ఠః
ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ.

అనువాదం :—

పొంగడియమ్ముజారి తన ముంజెయి బొంవర గాంత దూరుడౌ
వెంగలి కొన్నిమాసములు వేగగనగ్గలిపై గనెందటన్
త్యంగితుడౌటచే బరిణత ద్విరదంబన గన్పు వండువౌ
షంగళ దేహామ్మేఘు శుచిమాసము తొల్తిటి వాసరంబున

కాళిదాస కవితలోని శబ్దప్రయోగంలో ఎంతోనవ్యత ఉన్నది. ఈపద్యం లోని 'అబలా విప్రయుక్తః' అన్న పదానికి కాంతదూరుడౌ అన్నది అనువాదం. 'అబలా' అన్నది సార్థకమైన పదం. దానికి అనువాదమైన 'కాంత' అన్నది సార్థకం కాదు మూలంలోని 'కామీ' అన్న పదానికి 'వెంగలి' అన్నది కేవలాను వాదమేగాని సార్థకతలేదు. యక్షుని శాపానికి బాధలకు వాడి కాముకతయే కారణం గాబట్టి కాళిదాసు "కామీ" అనడంలోని ఔచిత్యాన్ని గుర్తించవచ్చు. అనువాదం తేలిపోతోంది.

ఈ కావ్యాన్నంతా వృత్తపద్యాలలో సాగించారు. ప్రతిపద్యంలోను తెనుగుదనముట్టి పడుతోంది. కాని రచనలో ధారాశుద్ధి అంతగా సంతృప్తినీయదు.

## మేఘదూత

—దీపాల పిచ్చయ్యశాస్త్రి

"ఆయనతో గోష్ఠి సాహిత్యక్రీడాంగణంగా నవ్వుల జల్లుగా సరస్వతీ సమారాధనంగా సాగుతుండేది[1]" అని సాహితీ మిత్రుల ప్రశంసలు గన్న పిచ్చయ్య శాస్త్రిగారు క్రీ॥శ॥ 1931 సంవత్సరంలో మేఘదూత అనువదించారు. సహృదయ విమర్శకులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు[2] ఈ అనువాదాన్ని గూర్చి బహుధా

---

[1] ఇంద్రకంటి హనుమత్‌శాస్త్రిగారితో ముఖాముఖి. తేది : 15-7-1982

'భాషాంతరీకరణములో వీలయినంత స్వాతంత్ర్యమవలంబించిన ధీరులు వేరొకరు నాకు కనిపించరు. ముక్కకు ముక్కగా పరివర్తనము చేయువారంత వచ్చును. ఆంగ్ల సాహిత్య సంపర్కముచే మనకు ఈ దాస్యముత్పన్నమైనది. శ్లోకానికి పద్యం సరిపోవాలన్న ఆలోచన ఆధునికులకు పట్టుకున్న దురూహ. మూలకవి అనుభూతి పద్యం లోపల లేకపోతే ఆ రచన వ్యర్థం. పట్టవి వస్తువులను ఎలాగో ట్రంకుపెట్టిలో కుక్కి పార్శిలుచేసి నట్లుంటుంది ఆ పద్యం నాకు. దీపాలవారు ఆ పిచ్చిపనికి దిగలేదు. తిక్కన్న తెనిగింపుమ బహువారం త్రావిత్రేన్చిన మనిషికి సంస్కృతాన్ని తెలుగులోకి ఎట్లాతేవాలో కొట్టినపిండి. 124 శ్లోకాల మేఘసందేశానికి 188 పద్యాలు వ్రాశారు. పూర్వమేఘాన్ని ఉత్తర మేఘాన్ని రెండుముక్కలుగా చూడక సమూహపరంగా ఒక చిత్రపటంచూచి ఏరంగు ఏరేఖ ఎక్కడదిద్దాలో అక్కడచేర్చి సమగ్రసుందరమైన కావ్యమూర్తిని పునఃసృష్టిచేసినట్లు నాకనిపిస్తుంది." ముందుమాట - మేఘసందేశానువాదం.

ప్రశంసించారు. వీరి ఈ అనువాదాన్ని గూర్చి ఇతర అనువాదకర్తలు, విమర్శకులు అయావట్టుల ఉత్తమానువాదంగా ప్రశంసాత్మకంగా ప్రస్తావనలు చేశారు. వీరు తమ అనువాదమునందు స్వాతంత్ర్యాన్ని వహించడమేగాక మూలంలోని ఒక శ్లోకానికి ఒక పద్యంగాకాక వలసినచోటుల్లో నాలుగైదు పద్యాలు వ్రాయడానికి కూడ వెనుకాడలేదు. స్వీయభావాన్ని చేర్చి కాళిదాసవాణికి పరిపుష్టిని గూర్చారు. రాళ్ళపల్లివారు ఈ అనువాదాన్ని తిక్కనన్న అనువాదంతో పోల్చారు. కారణం పిచ్చయ్యశాస్త్రిగారిది నెల్లూరు కాబట్టి. కాని యిది పోతనగారి అనువాద పద్ధతికి సమచీనం.

## అనువాదవిధానం

కావ్యారంభంలోని—

కశ్చిత్కాంతా విరహ గురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమిత మహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామ గిర్యాశ్రమేషు.

అన్న శ్లోకానికి

జానకీస్నాన పుణ్యోదకానుషంగ
ములును, మేరుమహీరుహభూషితములు-
నైనయాలరామ గిర్యాశ్రమాంతరముల
బురుషుడొక్కడు నొంటి గ్రమ్మరుచునుండె

అని ప్రారంభించి నాల్గుపద్యాలలో ఆ శ్లోక భావాన్ని అనువదించారు. ఈ నాల్గింటిలోను ఆ పురుషునిరూపం, అంతర్యం వాఖ్యానిస్తూ ఒక విషణ్ణ వాతావరణాన్ని సృజించి పాఠకులు పూర్వ రంగాన్ని ఊహించి తీవ్రవనిష్ఠతో కావ్యం

చదివేందుకు దోహదం చేశారు. ప్రారంభంలో ఈ రచనా విధానం మూలానికి వన్నె పెట్టేదిగా ఉన్నది.[1] అంతేగాక విరహిహృదయ సమగ్రచిత్రణ కూడా ఉన్నది.

అనువాదంలో స్వాతంత్ర్యం వహించిన కవి సమకాలిక సమాజాన్ని కూడ అక్కడక్కడ ప్రతిఫలింప జేయటానికి ప్రయత్నించారు. మేఘుడు తన ప్రయాణంలో కురుక్షేత్రం మీదుగా పోయే సమయంలో కేవలం కురుక్షేత్ర సంగ్రామ ప్రస్తావన చేసి అర్జునుని ప్రతిభను కాళిదాసు పొగడగా జాతీయోద్యమ ప్రభావం ప్రగాఢంగా మనసులోపడిన దీపాలవారు మూలంలోని "పిశునమ్"అన్న పదాన్ని గ్రహించి

వరుసనచ్చట బొడగట్టు భారతీయ
కదన వీర కపాల కంకాళ సమితి
కన్నులారగ నొకపరి గన్నచాలు
పందకైనను మగటిమి పతిభవిల్లు

అని స్వతంత్రకల్పన చేశారు. ఈ విధంగా సాగిన ఈ రచనను 'అనుసృజన' (Transcreation) అనవచ్చు.

ఇందులో పాఠకుడికి ఏవి కాళిదాసు భావాలో ఏవి పిచ్చయ్యశాస్త్రిగారి భావాలో విదితం కావు. పడుగుపేకలాగా ఆ రెండు కలిసిపోయినవి. కాబట్టి ఆ వివక్షాపేక్షలేనపుడు ఈ రచన ఉత్కృష్టోత్తమ మనిపించుకుంటుంది. కాని ప్రతి సహృదయుడికి ఆ వివక్ష ఉంటుంది. అందుచేత స్వకీయభావాలు రానీకుండా పిచ్చయ్యశాస్త్రిగారు నిగ్రహం చూపిస్తే బాగుండేది.

---

1 ఆధియో వ్యాధియోగాని అతని దేహ
యష్టిచాల కృశించి కూలారియుండె
నవ్వులోనన యొకవింతనవ్వు నవ్వు
నాతడున్మత్తుడో విరహాతురుండొ
లలితమగు ప్రియంగు లత జూచి తలయూచు
కనులార చిరుతరంగముల నరయు .. "
కవికుమారుడో! యాతడు కాముకుండో!!

## ఘనసందేశము

—రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు.

బ్రాహ్మణభూషణులు, పండితరత్న బ్రహ్మశ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఘన సందేశమన్న పేరుతో మేఘసందేశాన్ని అనువదించారు.

ఈ అనువాదంయొక్క ప్రయోజనాన్ని వారే ఇలా చెప్పారు. "కావ్యము నందలి మధుర భావములను పాఠకలోకమున కందించుటయే ఈ యత్నమునకు ఫలము. అనువాదము ద్వారా ఆ మహాకవి హృదయమును గొంత గ్రహించి, విడువబడిన యంశములున్నచో మూలమును జదివియానందింప బ్రార్థన."

ఈ విధంగా వారి రచన మూలభావానికి ఏవిధమైన లోపము రానీకనూతన కల్పన లేవియు చోటుచేసుకొననీక యథాతథంగా సాగింది.

### అనువాద విధానం

మూలం :

ధూమజ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః క్వమేఘః
సన్దేశార్థాః క్వపటు కరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యక స్తం యయాచె
కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేత నాచేతనేషు

అనువాదం :

ధూమజలాగ్ని వాయు చయ తోయద మెక్కడ? యుత్తమేంద్రియ
గ్రామజనాది వాచ్యమభిదామము వాచిక మేడ యంచు? దా
నేమియు నెంచకంబుదము నెంతయు వేడెనతండు
కామ పీడితుల్ జగతి గాంతురె వాసి జరా చరంబులన్

ఈ పద్యంలో "ధూమ జ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః క్వమేఘః" అన్న వాక్యాన్ని 'ధూమజలాగ్ని వాయుచయ తోయదమెక్కడ?' అని అనువదించారు. మూలానికి యథాతథానువాదమిది ఇదేవిధంగా అనువాద రచన అంతా సాగింది. లక్ష్మీనారాయణశాస్త్రిగారు భావించిన విధంగా ఘనసందేశం

చదువుతుంటే కాళిదాస మేఘసందేశం చదివిన అనుభూతి కలుగుతుంది.

## ద్విపద మేఘదూతము

పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు.

వీరు గుంటూరు టౌన్ హైస్కూలులోను హిందూ కళాశాలలోను ఓరియంటల్ కళాశాలలోను బహుకాలం సంస్కృతోపాధ్యాయులుగా పనిచేశారు. ఆంధ్ర కాదంబరి, ద్విపద హంసదూతం మొదలైన అనేక కావ్యకర్తలుగా లబ్ధప్రతిష్ఠులు.

కాళిదాస మహాకవి ప్రతిభాచాతుర్యానికి, కల్పనా చమత్కారానికి, లోకజ్ఞతకు, రసపరాకాష్ఠకు పరమోదాహరణమై ప్రతిపద శిరః కంపాన్ని కల్గించే మేఘదూతాన్ని తెనిగిస్తూ తాను తెనిగించడానికి గల కారణాన్ని వారే ఈవిధంగా తెలియజేశారు.

"ఎంతవానికైన కాంతానుషంగం కడు ముప్పునకె మూలకారణమని ఆంధ్రజనులు తెలిసికొంటే చాలు ఈ అనువాదం సఫలమైనట్లే"[1] అన్నది వీరి ఆశయం.

---

[1] ఎంతవారికైన గాంతానుషంగంబు
కడుముప్పునకె మూలకారణంబు
దానప్రమాదంబు తప్పదెంతటి మహా
ఘనునికైననిజాధికారమందు
అద్దానయజమానునధికాగ్రహమునకు
గుఱియై మహత్త్వంబుగోలుపోవు
దానిచే నధిక సంతాపసంతప్తుడై
యష్టకష్టంబులననుభవించు
జనుడనెడునీతి నిందు యక్ష కథవలన
నవిదితామరభాషలౌ నాంధ్ర జనము
లెఱిగినన్ జాలు బహువర్ణ్యలేల? యదియ
యస్మదనువాదమునకు మహాఫలంబు

కృతి ప్రశంస – ద్విపద మేఘదూతమ్.

## ఛందో వైవిధ్యం

భావపూర్ణాలైన మూలశ్లోకాలు ఒకే వృత్తమైన మందాక్రాంతంలో ఉండడం చేత తెలుగులో కూడా ఒకే ఛందంలో వ్రాయదలచి అందుకనుకూలంగా ఉంటాడనికి ద్విపదపంక్తుల్లో అనువదించారు. చాలా వఱకు ఒక్కొక్క మందాక్రాంతాన్ని నాలుగు ద్విపదలలో కూర్చడానికి ప్రయత్నించారు కొన్నిటిని అవకాశాన్నిబట్టి అంతకంటె ఎక్కువ ద్విపదలలో చెప్పడానికి ప్రయత్నించారు. ఈ విషయాన్ని ఆచార్యులవారే తమ పీఠికలో వివరించారు.

## అనువాద పద్ధతి

మేఘసందేశానువాదరచయితలు చాలా వఱకు మల్లినాథసూరి వ్యాఖ్యానాన్నే అనుసరించారు. పూర్ణప్రజ్ఞాచార్యులుగారు కూడ వారివలెనే ఎక్కువగా మల్లినాథుని వ్యాఖ్యనే అనుసరించారు ఒక్కొక్కచోట మరొక ప్రసిద్ధ వాఖ్యానమైన విద్యుల్లతను అనుసరించానని పీఠికలో వారే వివరించారు.

## అనువాదవిధానం

మూలం :

కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్షశ్చక్రే జనకతనయా స్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు

అనువాదం :

అపధానుడటు విజాధికారమున
ధనపతికినుకకు దానకంబగుచు
ఏడాది ప్రియురాలి నెడబాయుమనుచు
వాడియౌ శాపంబు వడిసి యద్దాన
దనదు సామర్థ్యమంతయుగోలుపోం

వనటయుక్షుదొకంతు వాసంబు జేసె
భూతనయాస్నానపుణ్యోదకముల
శీతలచ్ఛాయనిచ్చెడు చెట్లగముల
గొమరారు తచ్చిత్రకూటాశ్రమముల
గమనీయవాసయోగ్యప్రదేశముల

మూలంలో "భర్తుః" అన్నదానికి ధనపతి అన్నంపదం అనువాదం. ధనపతి అన్నపదం సార్థకమైనదిగా కాళిదాసమహాకవి తరువాతి శ్లోకాలలో ప్రయోగించాడు. అది తొలిపద్యంలోనే వీరు ప్రయోగించడం, కాళిదాస హృదయం తెలిసి ప్రయోగించినట్లున్నది. కాని చివరికి 'రామగిర్యాశ్రమేషు' అన్నదానికి 'చిత్రకూటాశ్రమముల' అన్నారు. ఇది సరియైన అనువాదంకాదు. కావ్యం మొదటి శ్లోకంలోనే సీతా రాముల ప్రస్తావన కాళిదాసు కావాలనిచేశాడు. ఇట్టి వియోగాన్నే యింతకుపూర్వం సీతారాములు పొందారని ధ్వనిగర్భితంగా తెలియజేయడం కాళిదాసు ఉద్దేశ్యం. కాని ఈ అనువాదం ఆ ప్రయోజనాన్ని సిద్ధింపజేయటంలేదు. వ్యాఖ్యానాన్ని ఆశ్రయించి పాదపూరణచేసిన విధంగా ఉన్నది. భావ గాంభీర్యం లోపించింది.

మూలం :

జాతంవంశే భువనవిదితే పుష్కలావర్తకానాం
జానామిత్వాం ప్రకృతి పురుషంకామరూపంమఘోనః
తేనార్థిత్వం త్వయివిధివశాద్దూరబన్ధుర్గతోహం
యాచ్ఞా మోఘావరమధిగుణేనాధమేలబ్ధకామా.

అనువాదం :

పుష్కలావర్తకంబులవంశమందు
విష్కల్మషుండపునీవు పుట్టితివి
కరుణావరుండవు కామరూపుడవు
పురుహూతునకు ముఖ్యపురుషుండవీవు
నీ విశేషం బెన్న నేనెంతవాడ
జీవించు నీకూర్మిచేత లోకములు

మందయానను జాపిమనలు చున్నాత
అధముని విషయకంబగు వేడికోలు
అధిగతఫలమయ్యు నానందమిడదు
అధిగుణవిషయికంబగు వేడికోలు
అధికతయే గూర్చున ప్రాప్తమయ్యు

యక్షుడు మేఘుని ప్రస్తుతించే సందర్భం. సాధారణంగా నాల్గుద్విపదలలో జరిగే అనువాదం ఆరుద్విపదలలో సాగింది. ఈ అనువాదం మూలాన్ని ఆదర్శంగా గ్రహించి వ్యాఖ్యానరూపంలో సాగినదిగా ఉన్నది.

'విష్కల్మషుండవై'
'నీవిశేషం బెన్న నేనెంతవాడ
జీవించు నీమూర్తిచేత లోకములు'

అన్నవి అమూలకాలు. మూలంలోని 'భువనవిదితే' అన్నది అనువాదంలో లేదు. మూలంలోని సంక్షిప్తతలోపించడంచేత కాళిదాస కవితా ప్రతిభ అనువాదం అందుకోలేదు. అట్లా అందించటం కవి ఆశయం కాదుగూడా.

మొత్తము పై వీరి ద్విపదానువాదం లలితమైన పదాలతో చక్కని శైలితో గానానుకూలంగా సాగింది. ద్విపదచ్ఛందంలో వ్రాయడంచేత తక్కిన అనువాదాల కంటే ఇందులో కొంత విలక్షణత గోచరిస్తోంది. వీరు ఆశించిన ప్రయోజనం సిద్ధించేందుకు ఆంధ్రజనుల కందరికి అర్థమయ్యే రీతిలో అతి సులభశైలిలో రూపొందింది వళ్ళపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారి అనువాదం.

## మొయిలు రాయబారము

## (యక్షగానము-ఏకాంకిక)

—శ్రీ త్రిపురాన వేంకట సూర్యప్రసాదరాయకవి.

శ్రీ త్రిపురాన వేంకట సూర్యప్రసాదరాయ కవి విజయపుర సంస్థాన గౌరవాస్థాన కవులు. ఆంధ్ర కాళిదాస, కవిభూషణ బిరుదాంకితులు. వీరు కాళిదాస మహాకవి కావ్య, నాటక సాహిత్యాన్నంతటినీ అనువదించ సంకల్పించి వానిలో మేఘదూతాన్ని మొయిలు రాయబారమనే పేరుతో తెనిగించారు వీరు ఈ

కావ్యానువాదంలో ప్రత్యేకశ్రద్ధ కనపరచి విలక్షణమైన యక్షగాన ప్రబంధంగా తీర్చిదిద్దారు.

సంస్కృతకావ్యానికి దూతము, సందేశము అన్న పేళ్ళతో ప్రసిద్ధ వ్యవహారమున్నది. కాని ప్రసాదరావుగారు తన అనువాదాన్ని రాయబారమన్నారు. రాయబారం రాజభార శబ్దభవం. ఈ శబ్దం రాజకీయదూత్యాలకే పరిమితంగా ఉపయోగించబడుతోంది. కాని శృంగార నైషధంలో శ్రీనాథుడు ప్రణయ దూత్యాన్ని రాయబారమని పేర్కొన్నాడు.[1] దాన్ని చూచి త్రిపురానవారు తన కావ్యానికి రాయబారమని పేరు పెట్టిఉంటారు.

మొయిలు దూత్యం, మొయిలు సందేశం అనడంకంటె మొయిలు రాయబార మన్నదే సరియైన పదం. దేశి ఛ్ఛందస్సుతో చేస్తున్న రచనలో 'మేఘాన్ని' 'మొయిలు' అనడం దానికి 'రాయబారమన్న' పదం జోడించి 'మొయిలురాయబార' మనే అచ్చతెనుగు సమాసం శ్రవణపేయంగా ఉన్నది.

పేరుపెట్టడంలోనే నవ్యతను కనబరచిన త్రిపురానవారు రచనావిధానంలోను అనువాదకు లందరికంటె విలక్షణమైన త్రోవ తొక్కారు.

## కథనంలో నవ్యత :

మేఘదూతానికి వ్యాఖ్యానం వ్రాసిన కొందరు పండితులు యక్షుణ్ణి కుబేరుని వద్ద పుష్పవటుకోద్యోగిగా భావించారు. మరికొందరు ఉద్యానవన పాలకునిగా భావించారు. అవేవీ త్రిపురానవారికి అంగీకారయోగ్యం కాలేదు. కావిలాభావించారు.

కాళిదాస మహాకవి యక్షుని "స్వాధికారాత్ప్రమత్తః" (తన అధికారము నందు ప్రమత్తుడైనవాడు) అన్నాడు. ఇక్కడ అధికారం జాగ్రత్తగా గమనించ వలసినది. పైన చెప్పిన రెండు విషయాల్లో, పుష్పవటుకోద్యోగి, ఉద్యాన పాలకులకు అతిముఖ్యమైన అధికారమేమీ ఉండదు. వాళ్ళను సేవకులుగా భావించాలి. ధనికుని కోపానికి కారణమైన అధికారమేమై యుండవచ్చునో ఊహించినట్లైతే

---

1. ఉన్మాదులు సంఘటింపగ సమర్థులె యెందును రాయబారముల్

—శృంగార నైషధము — 4ఆ - 95 పద్యం - శ్రీనాథుడు.

కుబేరుని ధనాగార రక్షణలో ఒకముఖ్యోద్యోగియై యుండవచ్చునని భావించ వచ్చు. త్రిపురానవారు ఈ విధంగానే భావించారు.

మొయిలు రాయబారం చూళికలో యక్షుడు తనలోతాను ఇలా అనుకొన్నాడు. "ప్రణయ కుపితయైన నా చిన్నారి చిలుకల కొలికి నలుక దీర్పుచు విధి రక్షణాధికార నిర్వహణమునకై పోవలసిన వేళ కాక్కొంతసే పాలసించితిని ఎంతపని చేసితిని?" అనుకొని మరల "ప్రాచుబామును మెడచుట్టుకొన్నటులన్ యెరింగియు నీ ధనరక్షణాధికార వృత్తిని ప్రవేశించుట నాదే తప్పు" అనుకొన్నాడు ఈ మాటలలో త్రిపురానవారు యక్షుని ధనాగార రక్షకుడైన ముఖ్యోద్యోగిగా ఊహ చేసినట్లు స్పష్టమౌతుంది.

మేఘదూత అనువాదంలో అనేక విషయాలలో మార్పుచేశారు. దానినొక యక్షగాన ప్రబంధంగా తెనిగించారు "కామార్తా హిప్రకృతి కృపణాశ్చేత నాచేతనేషు" అన్న శ్లోకాన్ని నేపథ్యగానంగా పలికించి తరువాత యక్షునిగూర్చి కాళిదాసు అన్న నాల్గు శ్లోకాల భావాలను యక్షభాషణంలో చూళికగా రూపొందించారు. చివరకు యక్షయక్షిణుల సమాగమాన్ని సంభాషణగా రూపొందించారు. ఈ మార్పులతో ఈ కావ్యం ఏకపాత్ర యక్షగానంగా రూపొందించబడ్డది.

త్రిపురానవారు ఈ మొయిలురాయబారం వియోగ శృంగార గేయ ప్రబంధం కాబట్టి ప్రతి ఘట్టానికి చివర మకుటాన్ని చేర్చారు.

1. క్రొమ్మెఱుపు వడగాలి కూర్మినంగడికాడ
క్రొమ్మొయిలురేడ! గైకొమ్మ నా విన్నపము
అన్నది కొన్నిటికి

2. కలిమిచెలి కాపురము మాయల
కాపురము నొబగొందు గలదా?
జలద! నీ క్రొమ్మెఱుపు జూపులు
నవలమున నగి చూడవలదా?
అనే మకుటం కొన్నిటికి

కావ్యానువాదంలో ప్రత్యేకశ్రద్ధ కనపరచి విలక్షణమైన యక్షగాన ప్రబంధంగా తీర్చిదిద్దారు.

సంస్కృతకావ్యానికి దూతము, సందేశము అన్న పేళ్ళతో ప్రసిద్ధ వ్యవహారమున్నది. కాని ప్రసాదరావుగారు తన అనువాదాన్ని రాయబారమన్నారు. రాయబారం రాజభార శబ్దభవం. ఈ శబ్దం రాజకీయదూత్యాలకే పరిమితంగా ఉపయోగించబడుతోంది. కాని శృంగార నైషధంలో శ్రీనాథుడు ప్రణయ దూత్యాన్ని రాయబారమని పేర్కొన్నాడు.[1] దాన్ని చూచి త్రిపురానవారు తన కావ్యానికి రాయబారమని పేరు పెట్టిఉంటారు.

మొయిలు దూత్యం, మొయిలు సందేశం అనడంకంటె మొయిలు రాయబార మన్నదే సరియైన పదం. దేశి ఛ్ఛందస్సుతో చేస్తున్న రచనలో 'మేఘాన్ని' 'మొయిలు' అనడం దానికి 'రాయబారమన్న' పదం జోడించి 'మొయిలురాయబార' మనేఅచ్చతె సమాసం శ్రవణపేయంగా ఉన్నది.

పేరుపెట్టడంలోనే నవ్యతను కనబరచిన త్రిపురానవారు రచనావిధానంలోను అనువాదకు లందరికంటె విలక్షణమైన త్రోవ తొక్కారు.

## కథనంలో నవ్యత :

మేఘదూతానికి వ్యాఖ్యానం వ్రాసిన కొందరు పండితులు యక్షుణ్ణి కుబేరుని వద్ద పుష్పవటుకోద్యోగిగా భావించారు. మరికొందరు ఉద్యానవన పాలకునిగా భావించారు. అవేవీ త్రిపురానవారికి అంగీకారయోగ్యం కాలేదు. కావిలాభావించారు.

కాళిదాస మహాకవి యక్షుని "స్వాధికారాత్ప్రమత్తః" (తన అధికారము నందు ప్రమత్తుడైనవాడు) అన్నాడు. ఇక్కడ అధికారం జాగ్రత్తగా గమనించ వలసినది. పైన చెప్పిన రెండు విషయాల్లో, పుష్పవటుకోద్యోగి, ఉద్యాన పాలకులకు అతిముఖ్యమైన అధికారమేమీ ఉండదు. వాళ్ళను సేవకులుగా భావించాలి. ధనపతి కోపానికి కారణమైన అధికారమేమై యుండవచ్చునో ఊహించినట్లైతే

---

1. ఉన్మాదులు సంఘటింపగ సమర్థులె యెందును రాయబారముల్
—శృంగార నైషధము — 4ఆ - 95 పద్యం - శ్రీనాథుడు.

కుబేరుని ధనాగార రక్షణలో ఒకముఖ్యోద్యోగియై యుండవచ్చునని భావించ వచ్చు. త్రిపురానవారు ఈవిధంగానే భావించారు.

మొయిలు రాయబారం చూళికలో యక్షుడు తనలోతాను ఇలా అనుకొన్నాడు. "ప్రణయ కుపితయైన నా చిన్నారి చిలుకల కొలికి నలుక దీర్చుచు విధి రక్షణాధికార నిర్వహణమునకై పోషలసిన వేళ కొక్కింతసే పాలసించితిని ఎంతపని చేసితిని?" అనుకొని మరల "త్రాచుబామును మెడచుట్టుకొన్నటులన్ యెరిగియు నీ ధనరక్షణాధికార వృత్తిని ప్రవేశించుట నాదే తప్పు" అనుకొన్నాడు ఈ మాటలలో త్రిపురానవారు యక్షుని ధనాగార రక్షకుడైన ముఖ్యోద్యోగిగా ఊహ చేసినట్లు స్పష్టమౌతుంది.

మేఘదూత అనువాదంలో అనేక విషయాలలో మార్పు చేశారు. దానినొక యక్షగాన ప్రబంధంగా తెనిగించారు "కామార్తా హి ప్రకృతి కృపణాశ్చేత నాచేతనేషు" అన్న శ్లోకాన్ని నేపధ్యగానంగా పలికించి తరువాత యక్షునిగూర్చి కాళిదాసు అన్న నాల్గు శ్లోకాల భావాలను యక్షభాషణంలో చూళికగా రూపొందించారు. చివరకు యక్షయక్షిణుల సమాగమాన్ని సంభాషణగా రూపొందించారు. ఈ మార్పులతో ఈ కావ్యం ఏకపాత్ర యక్షగానంగా రూపొందించబడ్డది.

త్రిపురానవారు ఈ మొయిలురాయబారం వియోగ శృంగార గేయ ప్రబంధం కాబట్టి ప్రతి ఘట్టానికి చివర మకుటాన్ని చేర్చారు.

1. క్రొమ్మెఱుపు వడగాలి కూర్మిసంగడికాడ
   క్రొమ్మొయిలురేడ! గైకొమ్మ నా విన్నపము

అన్నది కొన్నిటికి

2. కలిమిచెలి కాపురము మాయల
   కాపురము పొడగాందు గలదా?
   జలద! నీ క్రొమ్మెఱుపు జూపులు
   సఫలముగ నధి చూడవలదా?

అనే మకుటం కొన్నిటికి

3. జీవితేశ్వరి నిన్ను బాసియు
జీవితముతోనుంటినకటా!
దేవి! ఈకఠినాత్మదుర్దశ
తెలగొాకించుక వినగదే అనే మకుటం యక్షుడు తన గోడువెళ్ళబోసుకొనే ఘట్టంలోను

4. తెగువ సేయకుమాన
తెగగోసికొని యింక
మగువ అది తగదునా
మాట మన్నింపుమా

అనే మకుటం యక్షుని సందేశానికి ఉన్నది.

ఈ మకుటాలు కొన్ని పదునాల్గు మాత్రలలోను మరికొన్ని 20 (5×4) మాత్రలతోను, కొన్ని 10 (5×2) మాత్రలతోను ఉన్నాయి.

యక్షులు గానప్రియులు. యక్షుడు తన గోడు రాగయుక్తంగా చెప్పుకోవడం అతని యనురాగానికి దోహదకారి.

**భాషా ఛందస్సులలో నవ్యత :**

త్రిపురానవారు తమ అనువాదంలో దేశిచ్ఛందస్సుకు పట్టంకట్టారు. గానానుకూలత గల్గిన మందాక్రాంతానికి దగ్గర పోలికలో ఉన్న దేశిచ్ఛందాలైన సీసం, తరువోజ రగడలతో ఆయా సందర్భాన్ని బట్టి రసౌచిత్యాన్ని భావౌచిత్యాన్ని పాటిస్తూ, ఏ భావం ఏ ఛందస్సులో ఒదిగిపోతుందో ఊహించి తెనిగించారు. వృత్తౌచిత్యమంటే ఇదే.

## అనువాద విధానం

మూలం :

త్వామారూఢం పవన పదవీ ముద్గృహీతాలకాన్తాః
ప్రేక్షిష్యన్తే పథిక వనితాః ప్రత్యయాదాశ్వ సన్త్యః
కః సన్నద్ధే విరహ విధురాంత్వయ్యుపేక్షేత జాయాం
నస్యాదన్యోఽప్యహమివజనోయః పరాధీన వృత్తిః

మేఘసందేశః 1–8

**అనువాదం :**

గగనవీధిని నీవుగనవచ్చినంతనే
మగలు వచ్చెదరంచు మిగుల సంబరమంది
తగిలిపాంథాంగన సొగసు ముంగురుల బై
కెగద్రోసికొనుచు నిన్నెలమి జూచెదరయ్య
జలదకన్నులవిందు సలుపు నీవేతేర
వలపులాడిని బాసి నిలచునా యెవడైన
దలయమ్ముకొని యస్వతంత్ర వృత్తిని జిక్కి
వలవించునావంటి భాగ్యహీనుడు దక్క          ॥క్రొమ్మెఱపు॥

ఇది యక్షుడు మేఘమునకు అలకకుపోయే మార్గాన్ని వివరించే సందర్భం.

'ప్రత్యాయాత్' అన్న పదానికి 'మగలు వచ్చెదరంచుమిగుల. సంబరమంది' అని తెనిగించారు. సంస్కృతంలోని చిన్న పదానికి అనువాదం వ్యాఖ్యానంగా ఉన్నా సందర్భాన్నిబట్టి అనువాదమే రసవంతంగా ఉన్నది. 'పరాధీనవృత్తిః' అన్న పదానికి 'తలయమ్ముకొని అస్వతంత్రతజిక్కి। వలవించు నా వంటి భాగ్యహీనుడుదక్క।' అన్నది అనువాదం అనువాద వాక్యం చక్కని తెలుగు నుడికారం గల జాతీయోక్తి. మూలానికి వన్నెకూర్చేదిగా ఉన్నది.

భావ సౌకుమార్యంలోను, పదాల పోహళింపులోను, పరిణత ప్రజ్ఞతో కావ్యం సాగిపోయింది.

కాళిదాస వాణి ప్రతిపద చమత్కార భరితమైనది కావడం చేత, రస సిద్ధులైన త్రిపురానవారు అనువదించడంచేత, ఛందస్సుదేశీయమైనది కావడంచేత ఈ మొయిలు రాయబారం తెలుగువాణికొక అమూల్యాలంకారంగా విలసిల్లుతోంది. అంతేకాదు, త్రిపురానవారి పేరు చెప్పగానే 'మొయిలు రాయబార' కావ్యం స్ఫురిస్తుంది. ఇది చాల సంవత్సరాలు స్నాతక తరగతులకు ఆధునిక పాఠ్య కావ్యంగా ఉండటంచేత వేలాది విద్యార్థుల హృద్గతమైంది.

# దూతమత్తేభము

## యతిప్రాసరహిత పద్యకావ్యం

—రాయప్రోలు సుబ్బారావుగారు

ఆంధ్రసారస్వతానికి భావం, భాష మొదలైన సకల విషయాల్లో నవ్యతా ముద్రవేసి, స్వీయభావ ప్రధానమైన ఖండకావ్య రచనకు, దేశభక్తి ప్రబోధకమైన కవిత్వానికి మార్గదర్శకులైనవారు రాయప్రోలు సుబ్బారావుగారు.

కథనంలో, భావప్రకటనా విధానంలో, వర్ణన నైపుణ్యంలో తన సమకాలికులకు తరువాతి తరాలవారికి క్రొంగ్రొత్తదారులు చూపించారు. అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రతిపాదించి దానికి లక్ష్యభూతంగా తృణకంకణమనే రసవత్కావ్యాన్ని సృష్టించి అభినవ కవితాచార్యులైనారు.

ఆర్ష సంప్రదాయంపై అతిగాఢమైన అభిమానం కల్గి, ఋషులవలె ప్రకృత్యుపాసకులై భావగాంభీర్యంతోపాటు భాషా సౌకుమార్యం తోడుకాగా కష్టకమల, స్వప్నకుమారం మొదలైన కావ్యాలెన్నింటినో శ్రీ సుబ్బారావుగారు సృష్టించారు.

ఈ అభినవాంధ్రకవితా నిర్మాత తన జీవితపు నాల్గోపాదంలో మేఘ దూతాన్ని దూతమత్తేభం అనే పేరుతో తెనిగించారు.

ఇట్టి ప్రతిభా సంపన్నులైన రాయప్రోలు వారికి కాళిదాసకవితపైగల అమూల్యాభిప్రాయం తెలిసికోవాలని కుతూహలం కలిగి అడగగా అపుడు ఎనుబది సంవత్సరాలు పైబడ్డ వృద్ధ సాహితీమూర్తి, కవికుల తిలకుని జ్ఞాపకం చేయగానే ఆనంద కందళిత హృదయుడై "నేచేసిన ఆంధ్ర సాహిత్య సృష్టిలో నాకు గర్వకారణమైనది, ఆనందాన్ని కల్గించేది దూతమత్తేభ' మన్నారు.

వారు తమ సంభాషణను ఇంకా ఇలా కొనసాగిస్తూ 'శాంతినికేతన్'లో రవీంద్ర కవీంద్రుల సన్నిధిలో ఉన్న కాలంలో ప్రభాత సమయాన అందరం కలసి కావ్యగానం చేసుకొంటూ మామిడితోటల్లో శోభాయాత్ర చేసేవాళ్ళం. మామిడి కొమ్మలపై కిసలయాలు సేవిస్తున్న కోకిల స్వాములు కూడ మాతో

గొంతు కలిపేవారు. మేము వాల్మీకి రామాయణంలోని ముఖ్య ఘట్టాలతోపాటు మేఘసందేశం కూడ గానం చేసేవాళ్ళం. పున్నమి వెన్నెల వెలుగులలో మామిడి చెట్ల నీడలలో కాళిదాస వాణిని కమనీయంగా గొంతెత్తి గానం చేస్తుంటే ఆనందంతో తనువు పులకించేది.

ఆ విధంగా నన్ను స్పందింపజేసిన మేఘదూతాన్ని తెనుగుచేసి నా ఆనందాన్ని తెలుగు వారికి కూడా పంచిపెట్టాలనుకొన్నాను. దాని పర్యవసానమే ఈ దూతమత్తేభ ఆవిర్భావం" అన్నారు.

ఇలా వివరిస్తుండగా వాకిట్లోని మామిడి కొమ్మపై కోకిల శ్రావ్యంగా కూయసాగింది. అది విన్న రాయప్రోలువారు ఇనుమడించిన ఆనందంతో 'నా రమ్యాలోక రచనకు ముందు ఈ కోకిలస్వామికే అంజలించాను. ఇలా నా వాకిటిముందు మామిడిచెట్టు పెంచడానికి కారణం కూడ మేఘదూతమే. కాళిదాసు వర్ణించిన ఆశ్రమకూటవర్ణన చదివి ఒక చెట్టయినా పెంచాలనుకొన్నాను. పెంచాను. మేఘసందేశం నన్నింతగా ప్రభావితుణ్ణి చేసింది. అది నాకొక పారాయణ గ్రంథంగా ఉండిపోయింది'' అని తన అనుభవాల పరంపరను రాయప్రోలువారు తెలియజేశారు.[1]

ఎందరో కవులు ఎన్నో రకాలైన ఛందస్సులలో మేఘదూతాన్ని అనువదిస్తుండగా వీరు కేవలం మత్తేభంలో మాత్రమే అనువదించడానికి కారణం మేఘాన్ని కాళిదాసు వర్ణించిన విధంగా[2] మేఘం ఎప్పుడూ గున్న ఏనుగులా కనులయెదుట ప్రత్యక్షమయ్యేదట. అందుకే కావ్యానికి దూతమత్తభమనే పేరు పెట్టారు. ఈ పద్యాల్లో యతిప్రాసలు పాటింపబడలేదు. మేఘాకారానికిగాక మేఘ గమనానికి కాళిదాసువలె రాయప్రోలువారు ప్రాముఖ్యమిచ్చి యతిప్రాసలు పాటించకుండా మందాక్రాంత వృత్తాన్నే స్వీకరించి ఉంటే బాగుండేదని అనిపిస్తుంది.

---

1 రాయప్రోలువారితో ముఖాముఖి

2 గత్వా సద్యః కలభతనుతాం. —మేఘసందేశః 2-20

"విరహధ్యాన ప్రదీప్తమగు ప్రణయ యోగ పరిణతి తోపన్" యతిప్రాసలకై వెదుకాడక అనువాద రచన చేశారట.[1]

బహుభావచేతన సముద్దీప్త సుందరి కాళిదాస భారతి యతిప్రాసలనే కృత్రిమాలంకృతులు లేనిది. ఆ విధంగానే రాయప్రోలు వారుకూడ తన సాహిత్య సరస్వతిని తీర్చి దిద్దాలనుకొన్నారు. యతిప్రాస లలవోకగా వేయగల రచయిత రాయప్రోలు. తెలుగుపద్యం ఆ రెండిటి సహజ సౌందర్యంతో కూడింది. వాటిని కావాలని పరిహరించారు— శక్తి కల్గికూడా. అందుకు కారణం మౌలిక శోభను అధికంగా సంపాదించాలనుకొన్నారు. ఎంత సమర్థత ఉన్నా యతిప్రాసల కోసం ఎక్కడోఅక్కడ అధిక పదాలు రాక తప్పదుకదా! వీటిని పరిహరించి నందువల్ల అనువాదం రసవత్తరమైతే ఆ ప్రయత్నం ప్రశంసనీయమే. సంస్కృతాంధ్రానువాదాల్లో అందరుకవులు ఇటువంటి స్వేచ్ఛ తీసుకోవచ్చు. కాని తీసుకోరు. బంధాలకలవాటిపడి, అవిలేకపోతే ఏదో కోల్పోయినట్లు భావిస్తారు.

## అనువాద విధానం

**మూలం :**

జాలోద్గీర్ణైరుపచిత వపుః కేశ సంస్కార ధూపై
ర్బన్ధు ప్రీత్యాభవన శిఖిభిర్దత్తనృత్తోపహారః
హర్మ్యేష్వస్యాః కుసుమ సురభిష్వధ్వ ఖేదం నయేథాః
పశ్యన్ లక్ష్మీం లలిత వనితా పాదరాగాంకితేషు॥ మేఘసందేశః 1-36.

**అనువాదం :**

కిటికీలూదెడి కేశధూపముల పుష్టించెంది చిట్టాల విం
దుగ పుట్టింటి నెమిళ్ళసల్పెడి సపర్యానృత్యముల్ చూచి పౌ
రభముల్ నిండిన సుందరీ చరణ లాక్షాచిహ్న హర్మ్యాళిను
జ్జయినీ సజ్జిత శోభలన్ తనియు మధ్వక్లేశముల్ తీఱెడిన్

---

1 ఇదికాళిదాసకృతి మే
ఘదూత–తెనిగించితి యతిప్రాసముకై
వెదుకక విరహధ్యాన
ప్రదీప్తమగు ప్రణయ యోగ పరిణతి తోపన్
దూతమత్తేభానికి ముందుమాట—సుబ్బారావు రాయప్రోలు

ఉజ్జయినీ నగర శోభను చూచి కొంత విశ్రాంతి పొంది పొమ్మని యక్షుడు మేఘునకు చెప్పిన సందర్భం

ఈ పద్యంలో మూలంలోని 'జాలోద్గీర్ణైరుపచిత వపుః కేశ సంస్కార ధూపైః' అన్న పాదానికి 'కిటికిలూదెడి కేశధూపముల పుష్టింజెంది' అన్నది అనువాదం 'జాలోద్గీర్ణైః' (కిటికీలనుండి బయల్వెడలెడి) అన్నపదానికి 'కిటికీలూదెడి' అనటం సంక్షిప్తంగాను, చమత్కారంగాను ఉంది తెనుగుదనం ఉట్టిపడుతోంది ఆవిధంగానే 'కేశసంస్కార ధూపైః' అన్నదానిలో 'సంస్కారం' అన్న పదం విడచి 'కేశధూమములు' అని తెనిగించాడు. సంస్కారశబ్దం లేకుండానే ఆ అర్థం సిద్ధిస్తున్నది కేశసంస్కారార్థం వేసిన ధూమాలని మధ్యమపదలోపసమానంగా చెప్పుకోవచ్చు

కేవలమత్తేభవృత్తంలోనే వ్రాయడం చేత వృత్తౌచిత్యానికి కొంతలోపం కల్గినా ఆర్ద్రహృదయులైన రాయప్రోలువారి దూతమత్తేభ రచనారామణీయకం ప్రశంసనీయమైంది

## విరహి

## (మేఘసందేశానికి కేవల సీస పద్యానువాదం)

– కలచవీడు శ్రీనివాసాచార్యులు

శ్రీ కలచవీడు శ్రీనివాసాచార్యులుగారు అనంతపురం వాస్తవ్యులు వీరు గురుకుల క్లేశమనుభవించి వ్యాకరణాలంకారాది శాస్త్రాలు అధ్యయనం చేసినవారు, సాహిత్య తపస్వి, పరివర్తనము, ఆసియాజ్యోతి మొదలైన కావ్యాలు రచించిన సత్కవులు

కవికుల తిలకుని మేఘదూతాన్ని 'విరహి' అన్న పేరుతో అనువదించారు. అనువాదాన్ని ఒక్కొక్క శ్లోకాన్ని ఒక్కొక పద్యంలో వ్రాయాలనే సంకల్పంతో శార్దూలాది వృత్తాలలో వ్రాయడానికి ప్రయత్నించి మహాకవి కవితలోగల ధ్వని వ్యంగ్యాలంకారాదులు చెడకుండ యథాతథంగా అనువదించాలంటే వృత్తాల్లో సాధ్యం కాదని భావించి సీసపద్యంలో వ్రాయడానికి ఉద్యుక్తులైనారు మందాక్రాంతాన్ని ఒకరు మత్తేభంలో మరియొకరు ద్విపదలో ఒకే ఛందస్సులో వ్రాయ

దానికి ప్రయత్నించగా శ్రీ శ్రీనివాసాచార్యులుగారు ఒక్కొక్క సీసంలో తెనిగించారు ఆ సీసపద్యంలోను మందాక్రాంతంవలె సంగీతచ్ఛాయలో నడచునట్లుండుటకై సీసపద్యాల్లో ఐదుమాత్రల గణాలనే ఎక్కువగా ఉపయోగించా'నన్నారు.

## అనువాద విధానం

### మూలం

త్వామాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైశ్శిలాయాం
ఆత్మానంతే చరణపతితం యావదిచ్ఛామికర్తుమ్
అస్త్రైస్తావన్ముహురుపచితైర్ దృష్టిరాలుప్యతేమే
క్రూరస్తస్మిన్నపిన సహతే సఙ్గమం నౌకృతాంతః

మేఘసందేశం 2-44.

### అనువాదం .

సీ॥ ప్రణయకోపోద్రిక్త భవదీయరూపమ్ము
నైరికధాతురాగములచేత
బండపై జిత్రించి పాదప్రణవుడుగా
నన్ను జిత్రించుకొనంగ నుండ
జొటజొటరాలు నశ్రుల దృష్టిలోపించి
యత్నభంగంబ్మైన నార్తి గలిగె
పాడుదైవము జిత్రపటమునందైనను
సైపనోపడు మన సంగమమును

గీ॥ మనసులోనె మరల మనపూర్వ దాంపత్య
జీవితము లిఖించి చింతనడప
దలతుగానియపుడు తలపులైనను నిశ్చ
లముగ నిల్వవయ్యె కమలవదన

---

1 స్వవిషయం – విరహి. పుట. 23 – శ్రీనివాసాచార్యులు కలచవీడు

యక్షుడు ప్రణయకుపితయైన తన ప్రియురాలి చిత్రమును గీచి పాదముల వద్ద తన చిత్రమును వేయుటకు ప్రయత్నించి విఫలుడనైతినని మేఘుని తన ప్రియురాలికి చెప్పమన్న సందర్భం

ఇక్కడ మందాక్రాంతంలోని భావం సీసపద్యం నాల్గుపాదాలకే సరిపోతుంది ఎత్తుగీతిలో ఉన్న భావమంతా అనువాదకుని కల్పన ఈ భావాలెంత సొగసుగా ఉన్నా మూలరచయిత కన్యాయంచేసినట్లేకాగలదు కాళిదాసు భావాలేవో అనువాద రచయిత భావాలేవో తెలుసుకొనలేక పాఠకుడు సందిగ్ధంలో పడతాడు.

తన్వీశ్యామా . అన్న శ్లోకానికి కూడ పై విధంగానే ఎత్తుగీతి పూర్తిగా అమూలకం

కేవలం ఒక వృత్తానికి ఒక సీసం వ్రాయాలన్న నియమంలోనే ఈ అసౌకర్యమున్నది స్వీయ భావాలను విపరీతంగా చొప్పించదలచినట్లైతే అనువాదమే చేయనవసరంలేదు. తన ప్రతిభతో మరొక కావ్యమే వ్రాయవచ్చు

ఈ కావ్యంలోని భాషాసారళ్యం పదలాలిత్యం భావప్రకటనా విధానం మెచ్చదగినవే

## మేఘదూత
## (గేయానువాదం)

— డా॥ ముకురాల రామారెడ్డి

కొందరు మేఘదూతాన్ని యథాతథంగా అనువదిస్తే మరికొందరు ఔచిత్య భంగం లేకుండా స్వతంత్ర కల్పన చేస్తూ పద్యంలోనే రచన చేశారు కొందరు వివిధ ఛందములలో వ్రాస్తే మరికొందరు ఒకే పద్యఛందంలో (మత్తేభంలోగాని సీసంలోగాని, ద్విపదలోగాని) వ్రాశారు[1] డా॥ ముకురాల రామారెడ్డిగారు మందాక్రాంతానికి గేయరూపమిస్తూ అనువాదాన్ని సమకూర్చారు.

---

1 మత్తేభం — దూతమత్తేభం — సుబ్బారావు రాయప్రోలు
సీసం — విరహి — శ్రీనివాసాచార్యులు కలచవీడు
ద్విపద — మేఘదూతం — పూర్ణప్రజ్ఞాచార్యులు పళ్ళె

"మెరుగులనుజిమ్ము నీ మేఘమును అనువాద
సరళిదించవలచి సాహసించితి గాని
వెన్నెలలవడబోసి విందు చేయుట యెట్లు ?
పరిమళాలవసందు పట్టి చూపుట యెట్లు ?
విశ్వమోహనమైన విరహిరాగమునీది
ఆంధ్రితోనేసొంత మాలపించుట యెట్లు - కానీ
పూలఘుమఘుమ పిల్లగాలి మోసిన యట్లు
హిమగిరిని వెండి తెరకెత్తి చూపినయట్లు
ముద్దులమూటలౌ నీ ప్రణయకృతులకు
తెల్గుపాటల గూర్చితిని
నిలువుటద్దము వంటి నీ ప్రతిభలో నుండి
నా భావరూపమైనా రచన బింబించు"

అని తానే చెప్పుకొన్న విధంగా మహోన్నతమైన హిమగిరివంటి మేఘదూత్నా తెల్గుపాటల లద్దంలో ప్రతిఫలింపచేశారు డా॥ ముకురాల వారు

ఇది గేయకృతి పద్యరచన లయితే వ్యర్థపదాలనుచేర్చి ఛందస్సును సరిపెట్టి పాదపూరణం చేయవచ్చు గేయంలో ఒక్క వ్యర్ధపదం చేర్చినా సొగసు చెడుతుంది పాఠకులకు పలుగు రాయివలె తగులుతుంది కాళిదాసు యక్షకాంతను బ్రహ్మతొలి సృష్టి అన్న విధంగానే ఉత్తమ శిల్పి తన నైపుణ్యాన్నంతటిని పొదిగిన తొలి శిల్పంవలె వీరి రచనసాగింది.

కావ్యారంభంలోనే తననైపుణ్యాన్ని ప్రదర్శించారు రచయిత డా॥ రామారెడ్డిగారు

## అనువాద విధానం

### మూలం

కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారా త్ప్రమత్తః
శాపేనాస్తం గమిత మహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్షశ్చక్రేజనకతనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు

అనువాదం .

యక్షుడొక్కడు ప్రేయసికి దూరమై
విలపించె విరహ జీవితము భారమై
కొలువుపోయిన పోయె నెలవుదవ్వాయె తొలి
తొలి నాళ్ళ లోననే చెలి ముద్దు కరువాయె
తప్పేమి చేసెనో। తన స్వామి కోపించె
యేడాదిపాటు ఇద్దరిని యెడబాపె ॥యక్షుడు॥

అలనాడు సీతమ్మ జలకమాడినచోట
వెదకిరాములవారు సొదను మింగినచోట
ఆ రామగిరిపైన ఆ యాశ్రమములున్న
జాడలో సురపొన్న నీడలో దినమొక్క
యేడు గాతల పోయు ఏడెట్లు గడుచునో ॥యక్షుడు॥

ఇందులో కాళిదాసుమూలానికి కొంత కల్పన జరిగింది "కొలువు పోయిన పోయె" అన్నది కల్పన ఇందులో కొంత ఔచిత్య మున్నది క్షణమైనా భార్యా విరహాన్ని సహించలేని యక్షుడికి కొలువులేకపోయినా సంతోషమే కానీ ఆ సంతోషం కంటె బాధ కల్గించే విషయం వియోగం. వియోగి యక్షుని హృదయ భావనకు వ్యాఖ్యానం లాగా ఉన్నది "తొలితొలినాళ్ళలోనె చెలిముద్దు కరువాయె" ఇదీ అమూలకమే అయినా మూలానికివన్నె పెట్టేదిగా ఉంది. "వెదకి రాములవారు సొదను మింగినచోట" ఈ భావంకూడ కాళిదాసీయం కాదు యక్షుని బాధ అతనికే పరిమితంకాదని రాముని ప్రస్తావన చేయడం రసపుష్టికి దోహదం చేసేదిగా ఉన్నది. యక్షుడొక్కడు . . . అనే రెండు పాదాలు పల్లవి. మూలం ఏవిధంగా గానానుకూలమో అనువాదం కూడ గానయోగ్యమై ప్రతిభకు దర్పణమై మేఘకావ్యానువాదాలలో డా॥ ముకురాల రామిరెడ్డి గారి రచన ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది

## మేఘసందేశానికి మరికొన్ని అనువాదాలు

కాళిదాస కవిత్వాన్ని అనువదించడం గర్వకారణంగా భావించినకొందరు కవులు, ఆ మహనీయుని కావ్యాలలో అలఘుతర ప్రతిభ గల్గిన లఘుకావ్యం

కావడంచేత మేఘదూతానువాదానికి ప్రయత్నం చేసి, తమ శక్తియుక్తులు ప్రదర్శించి శరపరంపరగా వచ్చిన అనువాదాలలో తమదే మేల్తరంగా ఆంధ్ర జనులు భావించాలని కుతూహలపడ్డారు. ఆ కావ్యాలను, కవులను నాకు తెలిసి నంతవఱకు ఒక పట్టికగా ప్రదర్శిస్తున్నాను.

| కావ్యం పేరు | కవి పేరు |
|---|---|
| మేఘసందేశం | శ్రీ వత్సవాయి వేంకట నీలాద్రిరాజు |
| మేఘసందేశం | శ్రీ నిడమర్తి జలదుర్గాప్రసాదరావు |
| ఆంధ్ర మేఘసందేశం | శ్రీ విద్వన్మణి శిష్టా నరసింహశాస్త్రి |
| మేఘసందేశం | శ్రీ భువనగిరి విజయరామయ్య |
| ఆంధ్రీకృత మేఘసందేశం | శ్రీ మాడభూషి వేంకటాచార్యులు |
| మేఘసందేశం | శ్రీ కానాడ వేంకటాచారి |
| మేఘసందేశం | శ్రీ బండారు వేంకట సుబ్బయ్య |
| యక్షప్రవాసం | శ్రీ సున్నం వీరరాజకవి |
| మేఘదూతం | శ్రీ గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యం |
| మేఘసందేశం | శ్రీ దామెర రాజగోపాలరావు |
| మొయిలు రాయబారం | శ్రీ చర్ల గణపతిశాస్త్రి |
| మేఘసందేశం | శ్రీ అయినంపూడి గురునాధరావు |
| జలదగీతి | శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు |
| మేఘసందేశం | శ్రీ కె నారాయణరావు |
| సాంధ్రమేఘసందేశం | శ్రీ లోకనాధ కవి |
| యక్షవిరహం | శ్రీ పులవర్తి వినయభూషణశర్మ |
| మేఘసందేశం | శ్రీ మల్లాది లక్ష్మీపతి శాస్త్రి |
| మేఘసందేశం | శ్రీ భమిడిపాటి అప్పయ్యశాస్త్రి |
| మేఘసందేశం | శ్రీ వెలగలేటి వేంకటాద్రికవి |
| కాళిదాసు మేఘసందేశం | శ్రీ విద్వాన్ విశ్వం |
| ఆంధ్ర మేఘదూతం | శ్రీ సోమంచి సూర్యనారాయణశర్మ |
| మేఘసందేశం | శ్రీ గాజుల వీరయ్య |
| మేఘసందేశం | శ్రీ దివాకర్ల వేంకటావధాని |

**మేఘదూతను తెనుగు జేసిన మరికొందరు కవులు :**

శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్రీ పడాల రామమూర్తి
శ్రీ చింతకుంట సూర్యనారాయణరావు
శ్రీ పారనంది వేంకట నరసింహమూర్తి
శ్రీ దాకోజు లింగమూర్త్యాచార్యులు
శ్రీ శ్రీపాదశ్రీరామమూర్తి
శ్రీ స్వామి ఆత్మానందగిరి
శ్రీ భళ్ళమూడి లక్ష్మీపతిశాస్త్రి
శ్రీ రావూరి దొరస్వామి శర్మ
శ్రీ రాయప్రోలు వేంకట రామసోమయాజులు
శ్రీ భీమరాజు సత్యనారాయణ
శ్రీ బండ్ల వేంకట సుబ్బయ్య
శ్రీ గుజ్జం వేంకట సుబ్బరామయ్య
శ్రీ పంగనామాల రామచంద్రరావు
శ్రీ జనమంచి వేంకటరామయ్య
శ్రీ అడవి సాంబశివరావు
శ్రీ కొటికలపూడి వేంకట కృష్ణకవి
శ్రీ అనంత పంతుల రామలింగస్వామి
శ్రీ పోచి రాజు వీరన్న

ఈ విధంగా తెలుగు వాఙ్మయంలో ఏబదిమందికి పైగా కవులు మేఘదూతాన్ని అనువదించి కాళిదాసకవి ఋణం తీర్చుకోవాలనియత్నించారు

ఈ పట్టికలోని కొన్ని అనువాదాలు లభ్యంకాలేదు కొన్ని అనువాదాల గూర్చి ఆయా రచయితలనుగూర్చి యితర అనువాద గ్రంథాలలోని ప్రస్తావనల్ని బట్టి కవుల పేర్లుమాత్రం క్రోడీకరించాను లంతేగాక ఈ విషయంమీద కొన్ని పరిశోధక వ్యాసాలావిర్భవించాయి

# హంస సందేశం - అనువాదాలు

కాళిదాస మహాకవి మేఘకావ్యప్రేరణతో వచ్చిన సంస్కృతసందేశ కావ్యాల్లో హంససందేశం ప్రథమంగా పేర్కొనదగ్గది ఈ కావ్యరచయిత వేదాంతదేశికులుగా లోకంలో ప్రసిద్ధులైన వేంకటనాథకవి అన్ని విషయాల్లోను మేఘసందేశంతో పోటీపడ్డ ఈ కావ్యానికి మేఘకావ్యానికిలాగానే తెలుగులో అనేకానువాదాలు వచ్చాయి

## హంససందేశాన్ని అనువదించిన కవులు :

1. శ్రీ మాడభూషి వేంకటాచార్యులు
2. శ్రీ కిళాంబి వేంకటవరదాచార్యులు
3. శ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు
4. శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి
5. శ్రీ కొండూరి దక్షిణామూర్తి
6. శ్రీ పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రి
7. శ్రీ మోచెర్ల రామకృష్ణయ్య
8. శ్రీ మత్తిరుమల పురిహెళ్ళెరోనప్పాచార్యులు
9. శ్రీ పులగుర్తు వేంకటరామారావు
10. శ్రీ ఎన్ ఎ నరసింహాచార్య
11. శ్రీ అత్తిలి వేంకటరమణ

ఈపైపేర్కొన్న వారిలో శ్రీమాడభూషి వేంకటాచార్యులుగారు, కిళాంబి వేంకటవరదాచార్యులుగారు కలసి జంటగా హంససందేశానువాదం చేయగా, కల్లూరి వేంకటరామశాస్త్రిగారు అసంపూర్తిగా మిగిల్చిన అనువాదాన్ని వారి ప్రియశిష్యులు కొండూరి దక్షిణామూర్తిగారు పూర్తిచేశారు ఇక్కడ మరోవిశేషం మాడభూషి వేంకటాచార్యులుగారు, పళ్లెపూర్ణప్రజ్ఞాచార్యులుగారు, కల్లూరి వేంకటరామశాస్త్రిగారు కాళిదాస మేఘసందేశాన్నికూడ తెనిగించారు.

వీరి అనువాదాలను గూర్చి సమీక్షించడానికి పూర్వం వేంకటనాథుల హంససందేశాన్ని గూర్చి తెలియజేస్తాను



రామచంద్రుడు హంసతో

అండజాధీశ! నీ అక్షుల పంట
పండెనా! నీ కంటబడు నందు సీత
కడగండ్లు బడుచు రక్షః స్త్రీల నడుమ
నొడ లెఱుంగని మూర్ఛ నొప్పుచుగాని
స్వకుశలమయమైన సందేశ వాక్కు
శుక శారికల చెవి జొనుపుచుగాని
అనతికాలములోన యనుకూలవార్త
వినుశుభ శకునముల్ వెలయుట కతన
కనుల గప్పగ బాష్పకణములీ వైపు
పనివడి నిజదృష్టి బరపుచుగాని

- హంస సందేశము

# హంస సందేశము

## (సంస్కృత సందేశకావ్యం)

— వేంకటనాథ కవి క్రీ॥శ॥ 1268-1369
(వేదాంతదేశికులు)

సంస్కృతంలో హంససందేశాన్ని రచించిన వేంకటనాథకవి తమిళ దేశంలోని కాంచీమండలమందలి తుప్పిల్ గ్రామంలో క్రీ॥ శ॥ 1268 లో జన్మించారు సకల విద్యలను అభ్యసించి "[1]సర్వతంత్ర స్వతంత్రుడు", "కవితార్కిక కేసరి" అన్న బిరుదాలచే భూషింపబడి, సుప్రసిద్ధ వైష్ణవక్షేత్రమైన శ్రీరంగంలో స్థిరనివాస మేర్పరచుకొన్నారు సంస్కృత, ప్రాకృత, ద్రావిడ భాషలలో శతాధిక గ్రంధరచన చేశారు తమ ప్రబోధాలచే ప్రజలను ధార్మిక మార్గంవైపు మళ్ళిస్తూ తమజీవితాన్ని ధన్యంచేసికొన్న పరమ భాగవతోత్తములు వంద సంవత్సరములపైగా జీవించిన పూర్ణపురుషులు.

ఈ మహనీయుని కుమారులైన వరదాచార్యులుగారు కూడ కవితా చతురులై హరిణసందేశము, శుకసందేశము, కోకిల సందేశము అనే కావ్యాలను రచించారట. అవి నేడు అలభ్యాలు.

---

1 శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।
వేదాం తాచార్యవర్యోమే సన్నిధత్తాం సదాహృది॥
ద్విపద హంసదూతం పీఠిక పుట - 3
పూర్ణప్రజ్ఞాచార్యులు పళ్ళె

2 పరశ్శతంవా పరస్సహస్రం।
శ్రీ వేంకటాచార్య కృతిప్రబంధాః॥
తత్రాఽలమేకః ఖలుభుక్తిముక్త్యోః।
కార్త్స్యేనకస్తాన్ గణయేత్ సమస్తాన్॥
—ద్విపదహంసదూతం. పీఠిక - పు. 3. పూర్ణప్రజ్ఞాచార్యులు పళ్ళె

వేదాంతదేశికులనికూడ ఈ మహనీయునుకు లోకంలో వ్యవహారమున్నది. శిష్యగణములచేత హయగ్రీవుల అవరావతారంగా భావింపబడే వీరి శతాధిక గ్రంధాలలో పేరెన్నికగన్న సంస్కృత లఘుకావ్యం హంససందేశము

వాల్మీకి రామాయణానికి, కాళిదాస కవికృత మేఘసందేశానికి ఉన్న సారూప్యాలవలె తరచిచూస్తే మేఘసందేశానికి, ఈ హంస సందేశానికి పోలికలు పుష్కలంగా గోచరిస్తాయి.

# కథా సందర్భం

హనుమంతుడు లంకకు పోయి సీత జాడ తెలిసికొని వచ్చి రామునికి నివేదించాడు. వెంటనే రాముడు సుగ్రీవాదులను పిలిచి లంకపై దండయాత్రకు సేనను కదిలించడానికి నిశ్చయించాడు ఆ రాత్రి సీతావియోగతప్తుడైన రామునికి శరత్కాలం కావడంచేత నవనవంగా వికసించిన తామర పూవులతో కళకళ లాడుతున్న సరోవరంలో ఒక రాజహంస గోచరించింది ప్రసన్నరూపమైన ఆ హంసను అనునయించి తన సందేశాన్ని సీతకు వినిపించవలసినదిగా కోరుతాడు. ఇది హంస సందేశానికి పూర్వరంగం

ఈ కావ్యంలోని ఇతివృత్తం ప్రసిద్ధమైనదేగాని హంససందేశంమాత్రం కల్పితం వేదాంత దేశికులు కాళిదాస మేఘసందేశానికి సమమైన గౌరవాన్ని తమ కావ్యానికి కల్పించాలని ఉద్దేశించి ప్రత్యేక ప్రయత్నంతో ఈ రచన గావించారు

మేఘసందేశ కావ్యనాయకుడు ధీరలలితుడుకాగా హంససందేశ కావ్యానికి నాయకుడు ధీరోదాత్తుడు మందాక్రాంతావృత్తాన్నే గ్రహించారు మేఘసందేశ సృష్టికి మార్గదర్శకమైన రామాయణ కధనే, స్వీకరించడంలో వేదాంతదేశికుల విజ్ఞత విదితమౌతుంది హంసకు మార్గంచెప్పడంలోను, వర్ణనానైపుణ్యంలోను ప్రత్యేకాభినివేశం ప్రదర్శితమైంది వేదాంతదేశికుల హంససందేశం, సందేశ కావ్యాలలో మేమసందేశం తరువాత అంతటి స్థానాన్ని సంపాదించింది

# మేఘ – హంస సందేశాలకుపోలికలు

మేఘసందేశకావ్యానికి హంససందేశకావ్యానికి ఈ క్రింది సామ్యాలు గోచరిస్తాయి.

1. విరహార్తిలోనున్న ప్రియునికి దూత సందర్శనం
2. సుదూరంగానున్న ప్రియురాలి విరహార్తిని సంస్మరించటం
3. విరహం ఎక్కువకాలముండదని, సహిష్ణుతగల్గి భవిష్యత్తుకై నిరీక్షించాలనే సందేశాన్ని పంపనుద్యమించడం
4 దూతపట్ల సోదరభావన ఆదరం కల్గి ఉంపటం?
5 సందేశహరణంలో దూతసామర్థ్యపట్ల సమధిక విశ్వాసం
6 శుభశకున సందర్శనోత్సాహం
7 మార్గనిర్దేశవర్ణనాదిక్యం
8 ప్రయాణంమార్గం మధ్యలో దూత ఆనందింపదగిన వివిధ వినోద కాలక్షేపాదికం.
9 వివిధ పుణ్యక్షేత్ర సందర్శనం - ఆధ్యాత్మికానుభూతి విశేషాలు
10. గమ్యస్థాన వర్ణనం
11. దూత సందర్శించే సమయంలో ప్రియురాలి భౌతిక మానసికస్థితి వర్ణన.
12 ఆమె సుకుమార మనస్థితికనుకూలంగా సందేశాన్ని సముచితంగా అందివ్వటం.
13. మధురాతి మధురమైన సందేశపారం
14 దూత ఋజుప్రవర్తన
15. దూతకు ప్రియుడు చేకూర్చే ఆర్ద్రాభివందనాలు.

తొలి సందేశకావ్యమైన మేఘసందేశానికి హంససందేశానికి ఇన్ని సారూప్యతలున్నాయి ఇంతేగాక మేఘదూతంకంటే తమ కావ్యం గొప్పదని సహృదయపారకలోకం భావించాలని వేదాంతదేశికుల ఆశయం. అది మనసులో నుంచుకొని, కావ్యనాయకుడు, దూత, దూత్యకల్పన, వర్ణనావిధానం మొదలైన విషయాలలో ఎంతో జాగరూకత వహించి తమ కావ్యనిర్మాణం చేశారు

## హంససందేశము - కావ్యగతవిశేషాలు

**కావ్యం :**

మేఘసందేశాన్ని హంససందేశాన్ని ఒకదానివెంట ఒకటి చదివే దృష్టి ఉత్తర భారతంలోని కైలాసశిఖరం మొదలుకొని దక్షిణప్రాంతంలోని లంకా

ద్వీపం వఱకుగల యావద్భారతం మీద ప్రసరిస్తుంది ఈవిధంగా వేంకటనాధుని కృతి కాళిదాసకృతికి పూరకమౌతుంది.

## కావ్యనాయకుడు :

వేంకటనాధుని కావ్యనాయకుడు శ్రీరాముడు. అతడు ధీరోదాత్తుడు ధర్మ విగ్రహుడైన రాముని కావ్యనాయకునిగా గ్రహించి ఒక సందేశాన్ని లోకానికం దించాలనే తలంపు వేంకటనాధునికి ఉన్నదనుకోవచ్చు. ఇక్కడ మరో విషయం తొలి సందేశ కావ్యమైన మేఘదూతంలో నాయకుడు యక్షుడు అతడు ధీరలలితుడు. యక్షులకు యువతీ మధుపానసేవే పరమార్థం. ఈ అనుభూతులకు అనుగుణంగానే మేఘదూతంలో ఇంద్రియ లోలుపత అంతర్వాహినిగా గోచరిస్తుంది. దానికంటె తన కావ్యం ఉదాత్తమైనదనిపించుకోటానికి రామానాయకంగా హంససందేశం రచించారు.

## దూత :

వేంకటనాధుడు కావ్యంలో దూతగా హంసను స్వీకరించాడు కధాసంద ర్భానికి హంసదూతగా తగినదై ఔచితీవంతంగా ఉన్నది రాముడు లంకపైకి దాడికి ఉద్యమించడం శరత్కాలంలోనే జరిగింది. హంసలు హిమాలయంలోని మానససరోవరం నుండి దక్షిణాగ్రానికి ప్రయాణం చేసేదికూడ ఈ శరత్తులోనే, కాబట్టి ఆయుద్ధసన్నాహ సమయంలో రామునకు హంస కనపడడంలో ఎంత ఔచిత్యమున్నదో హంసను తనవార్తను సీతకు చెప్పమని కోరడంలోను అంతే ఔచిత్యమున్నది.

## రసపోషణలోని ఔచిత్యం :

మేఘసందేశాన్ని చదివిన తరువాత సందేశకావ్యాలలో మితిమీరిన, శృంగారవర్ణన ఉంటుందనుకోవడం సహజం. రామునివంటి ఉదాత్తుడు నాయకుడుగా గల్గిన కావ్యంలో మితిమీరిన శృంగారవర్ణనలుండడం ఔచ్యితానికి భంగం. కాబట్టి హంస సందేశంలో భౌతిక శృంగారవర్ణనలు ఔచిత్యభంగం కాకుండా మెరుపుమెరిసినట్లు సరళంగా తరళంగా భాసిస్తాయి యుద్ధసన్నాహ సమయంలో ప్రణయసందేశమేమిటనే ప్రశ్న ఉత్పన్నంకావచ్చు అసలు ఈ యుద్ధసన్నాహమంతా సీత కోసమే అప్పుడప్పుడూ రాముని మనస్సు సీతమీద

ఆమెకష్టాలమీద ఆమెతో తాననుభవించిన సుఖాలమీద ప్రసరిస్తూ ఉంటుంది. రామునికి పరిసరాలలో ఎటుచూచినా సీతరూపురేఖలు స్ఫురిస్తాయి అతనిదృష్టి సమీపాన ఉన్న కమలవని మీద పడ్డది. అక్కడొక హంసవిహరిస్తూ ఉన్నది దాన్ని చూడగానే సీత జ్ఞాపకం వచ్చింది దానికి సీతకు పోలికలున్నాయి. దాని నడక సీతనడకనుపోలియున్నది దాని కాంతులు సీతమేనుకు తీసిపోవు. దాని కూజితం సీత మంజీరనినద సదృశం. ఈ కారణాలచేతనే రాముని చూపు సీతమీదలగ్నమైంది. అందువల్ల అంతయుద్ధసన్నాహాలలోను, సర్వాన్నీమరచి సీతదే లోకంగా ఆమెప్రిణయస్మృతిలో పడ్డాడు హంస కనపడడానికి సీతా విరహం రామునికి అధికం కావడానికి ఇంత అవినాభావసంబంధమున్నది. మేఘ దూతం కన్నా ఈ కల్పన ఎంతోఔచితీయుతంగాను, రసపుష్టిని కల్గించేదిగాను కవి అద్భుతప్రతిభకు నిదర్శనంగాను ఉన్నది.

## దౌత్యాన్ని పంపడంలోని ఔచిత్యం

సర్వాన్ని మరచి సీతదే లోకంగా ప్రిణయస్మృతిలోపడ్డ రాముడు ప్రయాసపడి తాను 'లక్ష్మణస్యాగ్రజన్మా' అని మేల్కొన్నాడు ఇలా అనుకోవడం ఎంతో అర్దవంతం. అప్పుడప్పుడు రామునిలో బేలతనం కనపడినపుడు లక్ష్మణుడే హెచ్చరికచేయవలిసివచ్చేది. సీతాపహరణం పచ్చిపుండుగా ఉన్నప్పుడు మతిచెడి పంచవటిలో చెట్టుపుట్టల్ని, కొండగుట్టల్ని జాలిగావేడుకొన్నప్పుడు అతనికి దుఃఖోపశమనం కల్గించింది లక్షణుడే తన తమ్మునికి మరల అటువంటి పని పెట్టడం రామునికి ఇష్టం లేదు ఒక పనిచేత రెండుప్రియోజనాలు సిద్ధించే విధంగా సందేశంద్వారా తనకు దుఃఖోపశమనం సీతకు బ్రితుకుపై ఆశ కల్గేవిధంగా హంససందేశాన్ని పంపాడు రాముడు.

## హ. సదౌత్యం

బాధాతప్తుల మనస్సులకు ఆలోచనా శూన్యత ఏర్పడుతుంది. రామునికి పక్షియెక్కడ, సందేశమెక్కడ అనే సందేహం రాలేదు. అదీగాక నల దమయంతులను కూర్చింది కూడ హంసేగదా తప్పక తన కార్యాన్ని నిర్వర్తిస్తుందని రామునికి మిక్కిలి విశ్వాసం ఇక్కడ కాలదోషం పట్టించుకో కూడదేమో!

## మార్గోపదేశం :

హంసదక్షిణాగ్రానికి పయనించాలి. అటువైపు రాక్షసులుంటారు వెళ్ళ డానికేమైనా సందేహించవచ్చు హంస ప్రయాణానికి ఉత్సుకత కలిగేవిధంగా పోవలసిన మార్గాన్ని ఆ మార్గంలోని వింతలు విశేషాలను రమణీయంగా వర్ణించి అవి అన్నీ తప్పక చూడాలని అనిపించేలా ఎప్పుడు పోదామా అని కుతూహలం కలిగేలా చేశాడు రాముడు అంతేగాక దూత్యోద్దేశ్యమే పవిత్రమైనది జనక తనయా జీవితార్థం అది సత్కార్యంకాబట్టి ఎన్నిఇబ్బందులైనా ఎదుర్కొనాలని, కార్యం సఫలం చేయాలని హంసకు కలగాలి. రాముని మాటలతో, అతని ముఖంలోని దైన్యభావనలో, రామునికి సహకరించాలనే భావన హంసకు కలిగింది. రాముని ప్రయోజనం సిద్ధించింది.

ప్రయాణం ప్రారంభమైనది మొదలు హంస చేయవలసిన పనులు రాముడు వివరించాడు. ఆ రాముని మాటలలో అంతర్లీనంగా అతని విరహవేదన గోచరిస్తోంది. ప్రథమంగా ప్రియాణారంభంలో హంస తన ప్రియురాలు పద్మినికి చెప్పిపోవాలి అలా చెప్పకపోతే ఎంతోకాలానికి ప్రియుని కౌగిలికి నోచుకున్న పద్మినికి ఆశాభంగమెదురౌతుంది తీయని మాటలతో నచ్చచెప్పి పొమ్మన్నాడు రాముడు. పద్మిని అంగీకరిస్తుందా? అంగీకరించదనే నమ్మకం రామునికిలేదు సీత హంస ప్రియురాలు ఇద్దరూ పద్మినులే [1] వారిద్దరికీ గాఢ స్నేహం ఆడుదాని కష్టాలు వింటే సాటి ఆడుదాని మనసు కరిగిపోకమానదు. ఇటువంటి అభిప్రాయమే మేఘసందేశంలో కూడ ఉన్నది[2]

---

1 ప్రక్షిణాం త్వద్విరహసమయే జాత హర్షామిదానీం
ప్రత్యాయస్యన్నమయశనైః పద్మినీం స్వాదువాచా
సాతేతంత్రీస్వన సుభగయా స్యాది తీహాభ్యనుజ్ఞాం
మన్యే కుర్యాన్మధుకర గిరామైధిలీసౌహృదేన - హంససందేశం - 1-15

2 సౌదామన్యాశ్య కనక నికష స్నిగ్ధి యాదర్శనాయోర్వీం!
తోయోత్సర్గ స్వనిత ముఖరో మాస్మభూర్విక్లబాస్తాః!!
మేఘసందేశం – 1-41

గాలిలో ఎగిరిపోతున్నపుడు హంస ఎన్నో వింతలు విశేషాలు చూడ గలుగుతుంది పల్లెటూరి వనితలు తన్నొక వింతగా చూస్తారు. 'భ్రూభంగే పృథిక శభగైర్నిశ్చితాంగః కటాక్షైః" ఇక్కడ కూడ కాళిదాస భావన మనకు స్ఫురిస్తుంది [1] ఇలా ఎన్నో వింతలు విశేషాలు మార్గంలో హంసకెదురౌతాయి.

## లంకలో సీత స్థితి :

లంకను చేరిన హంస సీతనుచూచే సమయానికి ఆమె తనగోడు రామునికి తెలియజేయమని పిట్టల్ని వేడుకుంటూ ఉండవచ్చు హనుమంతుడన్న విధంగా ఉత్తర దిక్కుకై తన స్వామిరాక కోసం ఎదురుచూస్తూ ఉండవచ్చు [2] రామ చంద్రుని స్పర్శవలన కలిగిన ఆనందాన్ని గూర్చి తన ఆభరణాల్ని అడుగుతూ ఉండవచ్చు లేదా పాతకాలపు మంచి రోజుల్ని తలచుకుంటూ కళ్ళుమూసుకొని సంతోషిస్తూ ఉండవచ్చు [3] అని బావించాడు రాముడు

సీత శ్వపచుని ఇంట్లో కౌముదివలె, భయంకరమైన విషవృక్షాలమధ్య ఉన్న పారిజాతంవలె, జడివానలో తూలిన పద్మినివలె, బురదలోని బిసతంతు వల్లివలె మేఘసంవలితమైన శశాంకరేఖవలె, దంతీంద్రుని వీడిన మాతంగిని

---

1 త్వయ్యాయత్తం కృషిఫలమితి భ్రూవి కారానభిజ్ఞైః
ప్రీతి స్నిగ్ధైర్జనపద వధూ లోచనైః వేయమానః!!
మేఘసందేశం — 1-16

2 అత్యాసన్న ప్రియవచనతాం సూచయద్భిర్నిమిత్తై
రేతామ్రశ్రుస్థగిత నయనం వీక్షమాణా దిశంవా - హంససందేశం 2-11.

3 ఆకల్పాన్యాస విధ నిహితా నాలపంతీవిమోహా
దంగస్పర్శోర్యరఘుకుల పతే స్మర్యతే వానవేతి — హంససందేశం 2-12.

వలె, పులికంట పడిన లేడిపిల్లవలె, లంకలో ఉండవచ్చునని రాముడు ఊహించాడు.[1]

ఇలా రాముని మీదనే ధ్యానం నిలిపి బాహ్యలోకం మరచిన సీత ఉంటుంది. ఆ స్థితిలో తగిన సమయం చూచి తన మాటలు వినిపించమని రాముడన్నాడు హంస అందించవలసినది రహస్యమైన సందేశం రాక్షసాంగనలు తూగుతుంటారు కాబట్టి ఆ దగ్గరి కొలకుల్లో రాత్రిగడపడం మంచిదని సలహా యిచ్చాడు రాముడు. ప్రభాతాయాత వాతాంకురాలకు మేల్కాంచి శుచియై తగిన సమయం కొఱకు వేచి ఉండి తన పల్కులు వినిపించమన్నాడు

సీతకు తన్నెరిగించుకోడానికి హంస జనకుని వంశాన్ని మెల్లగా కీర్తించాలి. ఆమె తనవంక తిరిగి తన్ను చూచినపుడు ఇలా మాట్లాడాలి "నీ స్వామికి నేను నమ్మినబంటును నేను రావడమంటే శరత్తురావడమే శరత్తు రాబోయేదాడిని సూచిస్తుంది"[2] అని. మన రాజనీతి గ్రంథాల్లోదాడికి శరత్తు అనుకూలమని చెప్పబడ్డది కాబట్టి ఈ వార్తవింటే ముడుచుకొన్న సీత హృదయకుసుమం వికసిస్తుంది తన స్వామిక్షేమంగా ఉన్నాడన్న ధైర్యం కలిగిందంటే తక్కిన

---

1 శుద్ధామిందోః శ్వపచ భవనే కౌముదీం విస్ఫురంతీ
మాఖేతాంవా విషతరువనే పారిజాతస్య శాఖాం
సూక్తిం రమ్యాం ఖల పరిసరే సత్కవేః కీర్త్యమానాం
మన్యేదీనాం నిశిచర గృహ మైథిలస్యాత్మజాతాం హంససందేశం 2-13
వర్షాకీర్ణామివకమలినం వ్యాహతార్థామివోక్తిం
పఙ్కాశ్లిష్టామివ బిసలతాం పత్యవేతామివేభీమ్
మేఘచ్ఛన్నామివ శశికలాం విఘ్నరుద్ధామివాశాం
వ్యాఘ్రోపీతామివ శశవధూంపీతలజ్జామివేష్టామ్ హంససందేశం 2-14

2 పత్యుర్దేవి ప్రణయ సచివంవిద్ధిదీర్ఘాయుషోమాం
జీవాతుంతేదధతమనఘం తస్య సందేశమంతః
శూరాణాం యశ్శరదుపగమే వీరపత్నీవరాణాం
సమ్మానార్థం సమయముచితం సూచయేత్కాజిత్రైస్త్వైః
హంససందేశం 2-28

సందేశంవినేందుకు ఓపిక, ధైర్యం ఉంటాయి. ఈ విధంగా లంకలో హంస వ్యవహరించవలసిన తీరును గూర్చి వివరించాడు.

## రాముని వేదన

వసంతోదయానికి ముందే సీతాపహరణం జరిగింది. ఇది శరత్కాలం. ఇంతకాలం రాముని వేదన అద్వితీయం సీతను తలచుకొని దుఃఖోద్విగ్నుడయ్యేవాడు సీత ఉన్న చోటికిపోవద్దని వసంతుణ్ణి వేడుకొన్నాడు. ఎఱ్ఱని అశోకాలు, తెల్లని కురుంజాలు చూచిన రామునికి తన పెళ్ళిలో చేసిన లాజ హోమం గుర్తుకు వచ్చింది వెంటనే తన మామ జనకుడు గుర్తుకు వచ్చాడు. జనకునకు ఈ విషయం తెలిసి ఎంత బాధపడతాడు సీత ఏదని జనకుడు తన్ను అడిగితే 'ఏమని సమాధానం చెప్పాలి[1] అనుకొన్నాడు రామునంతటి ఉదాత్తగుణనిధికి ఇలాంటి తలపుకలగడం ఉచితము సహజము కూడా. వానకారులో మయూరాన్ని చూడడమే కష్టమనిపించేది రామునికి అది ఈడుజోడుగా జంట కట్టి విహరిస్తోంది బాధ అధికమైంది దానిపాలిట రాక్షసులు లేరు గదా[2]యని వేడి నిట్టూర్పులు విడిచాడు ఇన్ని కష్టాలలోను అతనికి దుఃఖోపశమనం కల్గించేది ఒక్కటే భౌతికంగా సీత దూరవర్తియైనా గతస్మృతులతో మానసికంగా ఆమె తన సమీపవర్తియే అన్నిటికన్న బాధ గల్గించే విషయం తన్ను నమ్మి వచ్చిన సీత ఇపుడు రక్కసిమూకల్లో దిక్కుమాలి ఉండడం.

---

1 మందోవక్ష్యేకిమివజనకం కింను యోగీశ్వరోమా
మిత్యేవం మే సుతను మనసోవర్తయంతిస్మ ఖేదం
రక్తాశోకే జ్వలతి సవిధే లాజవర్షాభిరామైః
పుష్పైస్త్వత్పరిణయ దశాం వ్యంజయంతః కరంజాః

హంససందేశం 2-37

2 రక్షః పీడా రహితదియితాశ్లేష ధన్యో మయూరాః

హంససందేశం 2-38

## రాముని సందేశం :

హంసతో రాముడు లంకలోని సీతకు ఈవిధంగా సందేశం పంపించాడు

రక్షోమౌళి స్తబక లవనాద్వైర బంధే విముక్తే
గత్వాచోర్వీంగగన పదవీ స్వైరిణా పుష్పకేణ
సిద్ధారమ్యాసపది భవతా మాధి రాజ్యభిషేకాలు
త్సంపాప్స్యావశ్చిర విరహతస్సంబితాన్ దేవి భోగాన్

"యుద్ధంలో రాక్షసుల్ని హతమార్చి అతి వేగగమనంతో కూడిన పుష్పకంలోపయనించి అయోధ్యకుపోయి స్వరాజ్యపట్టాభిషిక్తులమై అమేయ సుఖ భోగాలు అనుభవిద్దామని" రాముడు అన్నాడు

నాయీ వార్తను నీవు తప్పక తీసుకుపోతావు ఎందుకంటే పరోపకార పరాయణత పూర్వుల నుండి కూడ అభిజన సద్గుణం సలదమయంతులకు సమాగమాన్ని కూర్చింది కూడ మీ పూర్వులే గదా అన్నాడు[1] రామచంద్రుడు

## వర్ణన వైభవం .

సందేశకావ్యాలలో కథ అత్యల్పం కావ్యమంతా వర్ణనాభూయిష్ఠమే విస్తారమైన వర్ణనలకు అవకాశం కల్పించేది నాయకుడుగాని నాయికగాని దూతకు వివరించే గమ్యస్థానానికి మార్గం వేదాంతదేశికులు కూడ 'వర్ణనా నిపుణః కవిః' అన్న ఆలంకారికోక్తిని సార్థకం చేస్తూ భారతదేశంలోని ముఖ్య ప్రదేశాలను అతి వైభవంగా వర్ణించారు

సహ్యాద్రి అడుగునుండి సాగరానికి మెల్లగా పాకుతున్న కావేరీనదిని చూస్తుంటే, అత్తవారింటికి పోయే కొత్తకోడలు జ్ఞాపకం వస్తోందట ముత్తైదువలు ముద్దు ముద్దుగా తావి గుబాళించే పూలు సింగారించారు పెద్దలూ బ్రాహ్మణులూ

---

1 ప్రాగప్యేవం పరిణతగుణాం నైషధే నీక్ష్యవార్తా
మార్తత్రాణం వ్రతమితి విదుర్వాంత శుద్ధాత్మనాం వః
— హంససందేశం 2-47

ఆశీర్వదించారు. పెద్దలతో బయలుదేరింది కోడలు అత్తవారింటికి అంటాడు కవి.[1]

శ్రీరంగం వెళ్ళిన హంస అక్కడి గుడిలో పూజలుచేసి పాండ్యమండలం ప్రవేశించాలి ప్రియునికోసం ఎదురుచూచే ప్రేయసిలా హంసకోసం తామ్రపర్ణి ఎదురుచూస్తుంటుంది ముందు మహాసముద్రం దాటాలి కాబట్టి ఇసుక తిన్నెల మీద కాస్త అలసట తీర్చుకొని ప్రయాణం సాగించమంటాడు రాముడు. అది కేవలం విశ్రాంతికాదు అశ్లేష సౌఖ్యం[2]

ఆంధ్ర కర్నాటక ప్రాంతాలలో మామిడి చెట్లనీడల్లో పడుకొని పంటలు కాచే కాపు పడతుల పల్లెపదాలు హంసకు శ్రవణపేయమౌతాయి అక్కడ ముఖ్యంగా దర్శించవలసింది తిరుపతి కొండల్ని పైనించి చూస్తే పాములా కనిపించే యీ కొండలకు శేషాద్రినామం సార్థకమైనదే ఈ కొండల పైభాగాల్లో ఎట్టిటి చందనపురాళ్ళుంటాయి అవి రత్నాలవలె భాసిస్తాయి.[3]

---

1 స్రోతోవేగా దధ జనపదం సౌమ్య సీమంతయంతీ
ప్రత్యాదేశో నిబుధసరితస్స్యందతే సహ్యకన్యా
కాలేకాలే పరిణతి వశాత్పర్వభేదావకీర్ణైః
పుండ్రేక్షూణాం పులిన విశదైర్గదదా మౌక్తికాఘైః
— హంససందేశం 1-42

2 శీతీభూతస్తరళ లహరీ బాహు సంశ్లేషణేవ — హంససందేశం 1-52

3 విశ్లేషాద్వాసాదవని వహనాద్బద్ధరత్నైః శిరోభిః
శేషస్సాక్షాదయమితి జనైస్సమః గుస్నియమానః
అభ్రైర్యుక్తోఽలఘు భిరచిరోన్ముక్త నిర్మోక కల్పై
రగ్రే భావీతదను నయనే రంజయన్నంనాద్రిః — హంససందేశం 1-21

సుదూర ప్రయాణాలు మొదలు పెట్టేముందు గుడికి వెళ్ళి పూజించి రావడం మంచిది. బయలుదేరేటప్పుడు పూజచేయకపోయినా దారిలో అవకాశం దొరికినప్పుడు దైవార్చన చేయడం మంచిది. వేంకటేశ్వరుని పూజించ మంటాడు రాముడు.[1]

శేషాద్రిని విడిచిపోతున్నపుడు హంసదృష్టి తప్పక సువర్ణముఖిమీద పడుతుంది ఈనది శేషాద్రికి కొన్ని మైళ్ళు దక్షిణంగా పారుతుంది గట్టుమీద చెట్లనుండి పూలురాలి తేలిపోతూ ఉంటే కాళహస్తీశ్వరుని అర్చించటానికి కన్నెనడలతో సువర్ణముఖి ఈ పూలన్నీ తీసుకుపోతుందా అనిపిస్తుంది [2]

జలకమాడిన జవరాలొకతె నిండుభక్తితో, పుష్పాంజలితో ఆలయానికి ప్రియుని కలుసుకొనే వరం పొందడానికి పోతుంటే ఆమె మనసు తెలిసిన దేవుడు కోరకముందే వరం ప్రసాదించాడా అన్నట్లుగా ప్రియుడు దారిలోనే కలుసుకుంటే అతని చూపులు కనపడీకనపడని ఆమె అంగాలను వెతకు తుంటాయట ఈ మాటలలో రమ్యమైన ధ్వని ఉన్నది. సువర్ణముఖరి సైకతస్థలిలో కాస్త సుఖించనిదే ప్రయాణం ప్రారంభించడానికి హంసకు మనస్కరించదు. ఇలాంటి కోర్కెను అణచుకున్నా తుదకెలాగో అది బయటపడి కార్యభంగం కల్గిస్తుంది అందుకే ఎవ్వరూ లేనిచోట ప్రియురాలి కౌగిట్లో తన్నుతాను మరచిపోయి యిసుక తిన్నెలమీద విశ్రమిస్తూ వినోదించమంటాడు హంసను రాముడు నీ మనసు తీరిన తరువాత నా పని మరువక వెంటనే కదల మన్నాడు[3] రాముడు.

---

1 సాధారణ్యాత్ఫల పరిణతే స్సంఘశోబధ్యమానాం
శక్త్యాకామం మధు విజయినస్త్వంచ కుర్యాస్సపర్యాం
— హంససందేశము 1-22

2 స్తోకో న్మగ్న స్ఫురిత పుళినాం త్వన్నివాసేచ్ఛయేవ
ద్రక్ష్యస్యారాత్కనక ముఖరాం దక్షిణా మంజనాద్రేః
ఆసన్నానాం వనవిటపినాం వీ చిహస్తైః ప్రసూనా
న్యద్భ్వా హేలో రుతహరతి యానూన మర్ధేందు మౌళేః
— హంససందేశము 1-23

3 నిర్విశ్యైనాం నిభృత మనభి వ్యక్తమంజు ప్రణాదో
మందాధూతః పులినపవనై ర్వంజుళామోద గర్భైః
అవ్యాసంగస్సపది పదవీ సంశ్రయాన్స్వైరలంఘ్యా
బంజకిర్యుస్తటవసతయో మా భవంతం కిరాతాః
— హంససంధేశము 1-24

**సామాజిక స్పృహ :**

మార్గోపదేశం చేస్తున్న సమయంలోను ఇతర ప్రస్తావనలలోను సమకాలీన సమాజం కూడ ప్రతిబింబించింది వీరి రచనలో తననాటి సమాజాన్ని అయా పట్టుల అవకాశం దొరికినపుడు, చక్కగా చిత్రించారు

చోళపాండ్య మండలాల మధ్యనున్న అడవిలో పయనిస్తున్న సమయంలో కీచురాళ్లు అరుస్తుంటే గొంతుచీరేలా కూస్తూ ఉంటే గంభీరంగా మౌనం వహించ మంటాడు హంసను రాముడు

హంస పరోక్షంలో తమను గూర్చి గొప్పగా చెప్పుకొన్న నెమళ్ళు దాని యెదుట మూగవౌతాయట.

ప్రతిభాశాలియైన కవిని చూచి ప్రతిభలేని అల్పులు ఈర్ష్యపడతారట [1]

అశోకవనంలో సీతగతి దుర్జనులైన సమకాలికులనడుమ సత్కవిసూక్తులు పడేపాట్లను తలపిస్తాయట [2]

ఇవి ఆనాటి ఈర్ష్యాద్వేషాలతోకూడిన సమాజానికి దర్పణాలు.

**రాజవైభవం :**

హంసబయలుదేరేటప్పుడు మలయమారుతం ధవళాతపత్రం పట్టిందట

హంస చోళమండలం ప్రవేశంచేసే సమయంలో రాజవైభవంతో కూడిన

---

[1] వాచాలానామివ జడధియాం సత్కవౌ దూరయాతే
కైలాసాయత్వయిగతవతి క్షిబతా మాశ్రితానాం
సమ్మోదస్తైపధిపరిణమేచ్చంద్రకై రుజ్ఝితానాం
మేఘాపాయే నిపిన శిఖినాం వీక్ష్యవాచం యమత్వం
— హంససందేశం 1-10

[2] సూక్తిం రమ్యాం ఖల పరిసరే సత్కవేః కీర్త్యయానాం
— హంససందేశం 2-13

సత్కారం లభిస్తుంది. అక్కడి పోకమొక్కలు కళ్ళకు విందు కల్గిస్తున్నాయి. స్వామి కామదేవుని కోసం బంటు వాయుదేవుడు మహోన్నతంగా స్వాగతం ఏర్పాటుచేశాడట[1] ఇవి అనాటి రాజవైభవానికి ప్రతిబింబాలు

కావ్య నిర్మాణంలో కాళిదాస మహాకవివైన, కొన్నిభావాలకు, ఆదికవి వాల్మీకి పైన ఆధారపడినాగాని వేంకటనాధుడు అనేక ఘట్టాలలో వారిద్దరిని మించిన వానిగా తన ప్రతిభను, భావనాపటిమను, లోకానుభవాన్ని వర్ణనా నైపుణ్యాన్ని ప్రదర్శించి సహృదయ హృదయావర్జకంగా హంససందేశాన్ని తీర్చిదిద్దాడు.

ఈ కావ్యానికి తెలుగులో అనేకానువాదాలు వచ్చినాయి. ఇది ఆ కవి ప్రతిభకు దర్పణం

సంస్కృత వాఙ్మయంలో మేఘసందేశం తరువాతి అంతటి స్థానాన్ని ఈ హంససందేశం ఆక్రమించింది తెలుగు అనువాదాలలో కూడ కాళిదాస మహాకవి తరువాతి స్థానాన్ని వేంకటనాధుడే ఆక్రమించాడు

## హంససందేశము

## (తొలి అనువాదం)

— మాడభూషి వేంకటాచార్యులుగారు

— కిళాంబి వేంకట వరదాచార్యులుగారు

క్రీ॥శ॥ 1901 సంవత్సరంలో విద్వాన్ అభినవ పండితరాయ శ్రీ మాడభూషి వేంకటాచార్యులుగారు, కిళాంబి వేంకట వరదాచార్యులుగారితోకలసి వేదాంతదేశికుల హంససందేశాన్ని తెనుగులోకి అనువదించారు. హంససందేశాను

---

1 సూక్ష్మాకారైర్దినకరకరైః కల్పితాంతశ్శలాకాః
శారోపాన్తాశ్శతమఖ ధనుశ్శేష చిత్రాంశుకేన
ఉద్ధాః పశ్చాదుదితగతినా వాయునా రాజహంస
చ్ఛత్రాణ్యేరన్నభసి భవతేశ్కారదా వారిహాహాః

— హంససందేశము 1–13

వాదాలలో ఇది తొలిది. మోచర్ల రామకృష్ణయ్యగారి హంససందేశానువాదానికి తొలిపలుకులు వ్రాసిన కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆచార్యవర్యుల అనువాద రచనగూర్చి ప్రస్తావించి వారి అనువాదం సరసంగా సాగిందని, కాని అది ఒక శ్లోకానికి ఒకపద్యంగా ఉండడంచేత భావం కుదించినట్లుగా ఉన్నదేమోనని సందేహించారు.

## అనువాద విధానం

**మూలము .**

మార్గౌసమ్యఙ్మమ హనుమతావర్ణితౌ ద్యౌతయోస్తే
సహ్యాసన్నో ఒవ్యనమ సుభగః పశ్చిమో నిత్యవర్షః
ప్రాచీనేష ప్రతిజనపదం సంహతావద్భుతానాం
మగ్నాదృష్టిః కధమపిసఖే మత్కృతేతేనివార్యా

**అనువాదం ·**

మారుతి నాకొగిన్దెలిపె మార్గయుగంబు ప్రతీచ్యమందులో
జేరువయైన నిండుబడి చేగడు మంచిదిగాదు ప్రాచ్యమం
దారయ నీవృతంబులు మహాద్భుతముల్గలవందు నీదుచూ
పూరక నిల్చకెట్లయినయో సఖ నావనికై మరల్చుమా

ఇందులో పద్యంగమనంలో కుంటువడకుండా సాగిపోయిందే తప్ప వేరే ప్రత్యేకతలేమీలేవు మూలపదాలకు పర్యాయాలు ఉపయోగించారు ఉదాహరణకు హనుమ అన్న పదానికి మారుతి అన్న పదం ఉపయోగించారు

**మూలము**

ఇక్షుఛాయేకి సలయ మయం తల్పమాతస్దుషీణాం
సల్లాపైస్తైర్ముదిత మనసాం శాలి సంరక్షకాణాం
కర్ణాటాంధ్రవ్యతికరవశాత్కుర్చరేగీతి భేదే
ముహ్యంతీనాం మదనకలుషం మౌగ్ధ్యమాస్వాదయేథా

**అనువాదం .**

ఇంచులనీడ బల్లవము లేర్పడు శయ్యలనర్మ్మయు_క్తిభా
షించుచు హృష్టచిత్తత వసించుచు కన్నడమాంధ్రముస్యమీ
పించుట జేసి చిత్రమనిపించెడి గీతి విశేషమందు మో
హించెడి శాలిపాలికీలయింపగుమౌగ్ధ్యము జూచి మెచ్చుమా

వేటూరి ప్రభాకరశాస్త్రిగారన్న విధంగా సరసంగా రచన సాగింది ఆచార్యవర్యుల అనువాదం వారి పాండిత్యప్రకర్షను చాటుతోంది.

## ద్విపద హంస దూతము

— శ్రీ పశ్శెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు

ఆంధ్రకాదంబరి. మేఘదూతము మొదలైన బహుగ్రంథ రచనాధురీణులు, పాణినీయ పాథోధిధురీణులు అయిన శ్రీపశ్శెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు సంస్కృతాంధ్రలలో అత్యంతప్రతిభా సంపన్నులైన పండితులు వీరు ద్విపదలో హంస సందేశాని తెనిగించారు మూలంలోని శ్లోకాలన్నీ ఒకే ఛందం మందాక్రాంతంలో ఉండడంచేత తెలుగులోనూ ఆ విధంగానే ఉంటే బాగుంటుందని భావించి ద్విపద ఛందస్సునెన్నుకున్నారు ఒక్కొక్క శ్లోకాన్ని నాల్గుద్విపదలలో పట్టించడానికి ప్రయత్నంచేశారు. అక్కడక్కడ కొన్ని శ్లోకాలను మాత్రం ఐదారు ద్విపదలలో విపులీకరించవలసివచ్చింది. వీరి అనువాదం చాలావరకు మూలాన్ని అనుసరించే సాగినా కొన్నిచోట్లమాత్రం స్వతంత్రించారు

## అనువాద విధానం

**మూలం**

శ్లో॥ వంశేజాతస్పనితురనఘేమానయాన్మానుషత్వం
దేవశ్శ్రీమాన్ జనకతనయాన్వేషణే జాగరూకః
ప్రత్యాయాతేపవన తనయే నిశ్చితార్థ స్సకామీ
కల్పాకారం కథమపినిశా మావిభాతం విషేహే

**అనువాదం :**

శ్రీనిత్య నిలయంబు చిన్మయమూర్తి
మానుషత్వంబు సమ్మానించు కొఱకు
రవివంశమున రఘురాముడై పుట్టి
అవనిజాన్వేషమందవహితుండగుచు
పావని మరలిరా భావి కార్యంబు
నీవిధంబని నిర్ణయించి యాకామి

**తల్పంబెకూర్కు జెందమికి సౌఖ్యముగ**
**గల్పమట్లానిశగడపె నెట్లెట్లొ**

ఇది కావ్యారంభ శ్లోకానికి అనువాదం ఒక మందాక్రాంతం వాల్లు ద్విపదలలో ఒదిగింది ఇందులో 'తల్పంబెకూర్కు చెందమికి సౌఖ్యముగ' అన్న పాదం అమూలకం అయినా మూలానికి వన్నెకూర్చేదిగానే ఉన్నది ఒక్కాస పద్యమంతా మూలవిధేయంగానే సాగింది. వంశానికి విశేషణమైన ఒనము శబ్ద అనువాదంలో లేదు

**మూలం .**

శంకేతేవ్రాం భవతి సమయే శాసనం మీనకేతోః

**అనువాదం**

సమయమందున బుష్పశరుశాసనంబు
క్షములకునేని దుస్సహమగ్నికంటె

రాముని విరహబాధాదికతను తెలియజేయాలంటే సారాలంకారం కూర్చితే బాగుంటుందనిపించిన పూర్ణప్రజ్ఞాచార్యులుగారు మూలంలోలేని అగ్నికంటె అన్నపదం తమ అనువాదంలో చేర్చారు ఇలా అనువాదంలో అక్కడక్కడ స్వతంత్రించి కావ్యానువాదంగా తమ తెనుగు రచనను శ్రీ పశ్యపూర్ణ ప్రజ్ఞా చార్యులు గారు తీర్చిదిద్దారు

# హంససందేశము

— కల్లూరి వేంకట రామశాస్త్రి

మహామహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు గుప్తార్థప్రకాశికా రచయితగా జగత్ప్రసిద్ధులు. బహుభాషాకోవిదులైన శ్రీ శాస్త్రిగారు కాళిదాస మేఘదూతాన్ని తెలుగులోకి అనువదించి పండితుల ప్రశంసలను పొందారు అలాగే సందేశకావ్యాలలోదాని తరువాతి స్థానమాక్రమించిన హంససందేశానువాద రచనకుపక్రమించారు అసంపూర్తిగా మిగిల్చి దివంగతులయినారు అపుడు వారి తనయుడు, శాస్త్రిగారి ప్రియశిష్యుడైన కొండూరి దక్షిణామూర్తిగారిచేత అనువాద రచన పూర్తిచేయింప సంకల్పించి అర్థించగా, అది తన గురువునాజ్ఞగా భావించి శ్రీ కొండూరి వారు పూర్తిచేశారు

## కల్లూరి వారి అనువాద విధానం

**మూలం**

ప్రక్షీణాంత్వద్విరహసమయే జాత హర్షామిదానీం
ప్రత్యాయాస్యాన్ననుసయశనైః పద్మినీంస్త్వాదువాచా
సాతేంతంత్రీస్వనశుభగయా స్యాదితస్యాభ్యనుజ్ఞాం
మన్యేకుర్యాన్మధుకరగిరా మైధిలీ సౌహృదేన

**అనువాదం :**

తనలో భేదము మోదమూనుగద నీ దన్వంతికంబొంద ప
ద్మినిస్వాదుక్తుల నేడేవత్తుననియామెన్మెల్లలాలింపును
వ్యనితామైత్రిని వీణమించు మధుకృద్వ్యాజ్మాధురిన్నీకునీ
వనిలో మంచిదియన్న సమ్మతిని దెల్పం జూచునంచెంచెదన్

"ప్రక్షీణాం త్వద్విరహసమయే" అన్న వాక్యాన్ని మూలాన్ననుసరించిగాక భావచ్ఛాయలను మాత్రమే స్వీకరించి తెనుగుజేశారు పద్యం కుంటుపడకుండా ఝురీవేగంతో సాగిపోయింది.

## కొండూరివారి రచన

**మూలం :**

తస్యాస్తీరే సరసిజభువస్సౌమ్యవైతాన వేదిః
దివ్యం కుర్వ స్ద్రిమిద విషయం దృశ్యతే హస్తి శైలః
యస్యోపాంతేకృతవసతయోయాపయిత్వా శరీరం
వర్తిష్యంతే వితమసిపదే వాసుదేవస్య ధన్యాః

**అనువాదం**

ఆ నదిగట్టున స్సరసిజాసనునుత్తర వేదిరూపమై
జానగుహస్తిశైలముప్రశస్త మొనర్చుచు ద్రావిడంబునన్
ఏనదిసజ్జనుండు ఘనులీతను వూడ్చిన నిస్తమస్క ముం
బూనిన వాసుదేవు పదముంగనియందురొసౌమునిచ్ఛలున్

వేగవతీ నదీతీరంలోని హస్తిశైలాన్ని వర్ణించే ఘట్టమిది ఆ ప్రదేశంలో మరణించిన వారు విష్ణుపదాన్ని పొంది ధన్యులౌతారట. ఈ భావాన్ని తెనిగించే సందర్భంలో కొండూరివారు తమగురువైన వేంకటరామశాస్త్రిగారినే అనుసరించారు. సాధ్యమైనంతవఱకు మూలపదాలనే స్వీకరించారు సరసిజభువః అన్న దానికి సరసిజాసను అని అన్నారు హస్తిశైలః,సౌమ్యవాసుదేవస్యపదాలను ఆ విధగాంనే స్వీకరించారు మూలవిధేయంగా వీరి రచన సాగించారు

హంససందేశానికి ఈ గురుశిష్యుల అనువాదం సరసంగాను, సుందరంగాను సాగింది.

## హంససందేశము

— పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రిగారు

శ్రీ పెనువర్తి వేంకటశ్వరశాస్త్రిగారు అమరుకము మొదలైన గ్రంథాల అనువాద రచయతలుగా లబ్ధప్రతిష్ఠులు. వీరు తమ మిత్రుని ప్రేరణతో వేదాంతదేశికుల హంససందేశాన్ని తెనిగించారు వేదాంతదేశికుల మందాక్రాంత వ్రతాన్ని తెలుగులో ఒకేవృత్తంలో వ్రాయదలచి ఉత్పలమాలావృత్తంలో అనువ

దించారు. సంస్కృతాంధ్రాలలో సమానమైన పాండిత్యంగల శ్రీశాస్త్రిగారు వేదాంత దేశికుల హృదయం తెలిసి అనువదింపప్రయత్నించారు. ఈ పద్యాలలో బాగా ఉన్నది.

**మూలం :**

తస్మింత్సీతాగతి మనుగతే తద్దుకూలాంకమూర్తే
తస్మం జీర ప్రతిమ నినదే న్యస్త నిష్పంద దృష్టిః
వీరశ్చేతో విలయ మగమత్తన్మయాత్మా ముహూర్తం
శంకే తీవ్రం భవతి సమయే శాసనం మీనకేతోః

**అనువాదం :**

జానకిబోలి యాననము జానకి యందెలబోలి మ్రోత నా
జానకి జిల్గుచీరగల చక్కని చిహ్నమునై నయంచపై
మానక మాపు నిల్పియెదమ్రిన్పడె వీరుడు దన్మయాత్ముడై
యానికగాదె? మీనుసిడునాసతియున్నమయానుకూలమై

సీతనెడబాసిన రామునికి పున్నమి వెన్నెల రాత్రిసమయంలో ఒక మరాళం కనిపించింది. సీతనే భావిస్తున్న రాముడు హంసలోని ప్రతికదలిక సీతను పోలి యున్నదిగా భావించాడు

సంస్కృతశ్లోకంలోని 'తత్' అన్నపదం సీత అనే అర్థంలో ప్రయోగింప బడ్డది. కాని తెలుగులో 'జానకి' (జనకునికూతురు) అన్నమాటనే పలుమార్లు ప్రయోగించడంచేత సీత కేవలం రాముని భార్యయేగాక ఆమె చక్రవర్తి కూతురని, సుకుమారియనే భావం స్ఫురిస్తోంది

**మూలం :**

వేదోదన్వద్విభజన విదో వంశజం విశ్వమూర్తే
రాహుస్సిద్ధాః కమలవసతేరౌపవాహ్యంభవన్తమ్
లబ్ధంయేనప్రగుణగతినాతత్ప్రియాయాస్సకాశీ
క్షత్వా వర్ణ్యం శ్రవణరసనాస్వాదయోగ్యాసుధాచ

**అనువాదం :**

వేద సముద్రమున్గడగి వెతౌనరించిన విశ్వమూర్తి నీ
కాదిమ పురుషుండు కమలాసనుతేరికి దే జీవీవునీ
కాదట వాణినేర్పె జదువంతయు వీనులనాల్కకింక నా
స్వాదము నీడు పల్కుసిత వర్ణము పల్కువెలందితుల్యమౌ

సీతవద్దకు హంసను రాయబారిగా పంప నిశ్చయించిన ఘట్టంలో రాముడు హంసను స్తుతించిన సందర్భం పద్యం ఝురీవేగంతో సాగింది. భావంలో స్వతంత్రించిన పట్టుఏమి లేకపోయినా భాషమాత్రం స్వేచ్ఛగా శ్రవణ పేయంగా ఉన్నది.

శ్రీ పెనుమర్తివారు తెనుగుభాషకు తగినధారాశుద్ధితో అనువాదమని ముందుతెలియనివారికి ఇది వారి స్వీయరచనగా భ్రమపడేవిధంగా అనువదించారు.

## హంససందేశము

— మోచర్ల రామకృష్ణయ్య

శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు నెల్లూరు వాస్తవ్యులు. గంగాలహరి మొదలైన కృతుల అనువాదకులుగా జగత్ప్రసిద్ధులు వీరు క్రీ॥శ॥ 1939 సంవత్సరంలో వేదాంతదేశికుల హంససందేశాన్ని తెనిగించారు. "శ్రీసీతారామ ప్రణయ కథా సందర్భగర్భితమైన ఈ కావ్యమును ఐహికాముష్మిక కళ్యాణ హేతువన్న ప్రత్యయమున నేనాంధ్రీకరించితిని" అని తాము అనువాదం చేయడంలోగల ప్రయోజనాన్ని వివరించారు. ప్రసిద్ధ విమర్శకులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వీరి అనువాదాన్ని గూర్చి సముచితంగా ప్రశంసించారు [1] మూలం

[1] రామకృష్ణయ్యగారు తమ తెనుగుకూర్పున చాలా స్వాతంత్ర్యపు నేర్పును చూపుదురు తెలుగు సీత జాల పట్టుల చక్కగనున్నది. ఇటీవల కొందరెవ్వరివో చూచినట్లు స్మరణము నా చూచిన రచనలలో రామకృష్ణయ్యగారి రచనమే చతురతరమన గలను ఇందుకు ప్రధాన కారణము మూలచ్ఛాయానుసారిగా కవి గైకొన్న స్వాతంత్ర్యమనదగును

మోచర్లవారి అనువాదానికి తొలిపలుకులు — ప్రభాకరశాస్త్రి వేటూ

లోని నూట పది శ్లోకాలు అనువాదంలో నూట డెబ్బది పద్యాలుగా రూపు దాల్చింది దీనికికారణం అనువదించడంలో కొంత స్వాతంత్ర్యాన్ని ప్రదర్శించడమే.

## అనువాద విధానము

**మూలం**

సామేదృష్టిశ్శఫరనయనా సన్నతభ్రూస్సుకేశీ।
తన్వీతుంగ స్తన భరనతాత ప్తజాంబూనదాభా॥
బాలాయుష్మత్ప్రితిమగమనా వేది మధ్యావరాంగీ।
శృంగారాఖ్యం నిధి మధిగత శ్రేయసే దేవతేవ॥

**అనువాదం :**

బేడిస కమలపూబోడి నీ పోడిమి
గమన విలాసంబుగలనెలంత
కాంతకుంతల కలితపాశలావణ్యాబ్ధి
యాగవేదీ సమానావలగు
పుటపాకశోభిత స్ఫుటసువర్ణ సవర్ణ
సన్నత భ్రూలతా సాధువదన
శృంగారనిధినధిష్ఠించిన దేవత
భాసురగాత్రి సౌభాగ్యలక్ష్మి

జనకభూజానితనయ లక్షయవివేక
నిలయవేలలేని కలిమినా యెలమిచెలిమి
కలుష మెఱుగని రూపు నాకంటి చూపు
అయ్యశోకవన సీమ నరయుమయ్య

మందాక్రాంతానికి అనువాదం సీసంలో సాగింది సీసం యొక్క పరిధి విస్తృతం. అందువల్ల మూలంలోలేని భావాలు కూడ చోటు చేసుకొన్నాయి

'జనక భూజానితనయ అక్షయవివేక', 'కలుషమెఱుగని రూపు', 'అయ్యశోక వనసీమన నరయుమయ్య' మొదలైనవి అమూలకాలు,

రచనా విధానంలో పాదపూరణంకోసం వ్యర్థ పదమెక్కడా కనిపించదు శబ్దశక్తి బాగుగా తెలిసిన మోచర్లవారు సార్థకాలైన పదప్రయోగాలేచేశారు. వీరు కేవలం వృత్తాలేగాక గీత పద్యాలు, కందాలలో సీసపద్యాలలో రచన చేశారు

వేటూరివారు చెప్పిన విధంగా చతురతరంగా సాగిన వీరి అనువాద రచన కావ్యానువాద పద్ధతిననుసరించింది

## హంససందేశము

— శ్రీ మత్తిరుమల పురిహెళ్ళవేంకట కోనప్పాచార్యులుగారు

రాజమహేంద్రవరం వాస్తవ్యులైన వేంకట కోనప్పాచార్యులుగారు ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలలో చాలకాలం అధ్యాపకులుగాను ప్రిన్సిపాల్లుగాను పనిచేశారు ఏన్నో సంవత్సరాలు విద్యార్థులకు హంససందేశాన్ని పాఠప్రవచనం చేశారు దానితో వేదాంతదేశికులపైన గాఢమైన అభిమానం కలిగింది కాళిదాస మేఘదూతనికి సాటిరాగలదని ధృఢమైన అభిప్రాయం కల్గిన వీరు ఈ హంస సందేశాన్ని తెనుగుజేసి తెలుగుపాఠకలోకానికి అమృతోపమానమైన వేదాంత దేశికుల వాణిని వినిపించాలని కుతూహలం కలిగింది. క్రీ॥శ॥ 1958 సంవత్సరం లో హంససందేశాన్ని తెనిగించారు.

వీరి అనువాదం మూల విధేయంగానే సాగినా, తెలుగునుడికారానికి ఏమాత్రం లోటురానీయలేదు

## అనువాద విధానం

**మూలం**

వంశేజాతస్సనితురసఘే మానయన్మానుషత్వం
దేవశ్శ్రీమాన్జనకతనయాన్వేషణే జాగరూకః
ప్రత్యాయాతేపవన తనయే నిశ్చితార్థస్సకామీ
కల్పాకారం కథమపినిశామావిభా తాంవిషేహే

**అనువాదం.**

శ్రీమత్సౌరకులుండు మానుషతనుశ్రీగొన్న దివ్యుండు
శ్రీమంతుండు మహీజనుర్గ్రిహణ నిర్ణిద్రుండు కీశాధిరా
జామాత్యాగతిగార్య నిశ్చయము చయ్యన్ జేసి యెట్లోమహా।
కామార్తిన్ సహనంబొనర్చిగడిపెన్ గల్పాకృతిన్ యామినిన్

శ్లోకంలో ఆదిమగణం ఉంటే అది పాఠకునికి స్థైర్యసిద్ధిప్రద వేదాంత దేశికులు కావ్యారంభశ్లోకంలో ఆదిమగణం వేశారు. దాన్ని తెనుగుజేసిన శ్రీమాన్ ఆచార్యులుగారు వేదాంతదేశికుల హృదయం గమనించి అనువాదంలో కూడ ఆదిమగణం వేశారు. మూలంలోని 'జనకతనయా' అన్న పదానికి 'మహీజను' అని 'పవనతనయే' అన్నదానికి 'కీశాధిరాజామాత్యుడు' అని అన్నారు. పవనతనయుడన్నది ఒక నిధంగా సార్థకం సుగ్రీవుని మంత్రి అన్నది మరియొక విధంగా అర్థవంతం మొదటిది తనకు చెప్పిన పనిని చేయడంలోని వేగాన్ని సూచిస్తుంటే రెండవది అమాత్యపదంచేత కార్య నైపుణ్యం సూచితం దీన్నిబట్టి అనువదించడంలో కొంత స్వాతంత్ర్యాన్ని కన్పరచారనే భావించాలి భావానికి ఏమాత్రం భంగంలేనపుడు శబ్దాలు కేవలం మూలంలోవే ప్రయోగించాలనిలేదు

**మూలం·**

సామేదృష్టిశ్శఫరనయనా సన్నతభ్రూస్సుకేశీ
తన్వీతుంగ స్తన భరనతాతప్త జాంబూనదాభా
బాలాయుష్మత్ప్రితిమగమనా చేది మద్యావరాంగి
శృంగారాఖ్యాం నిధిమధిగతాశ్రేయసీ దేవదేవ

**అనువాదం**

మీననయన సుకేశి జాంబూనదాభ
స్తనభరానత తన్వియు సన్నత భ్రు
వమల వేదికామధ్యవరాంగి బాల
నాకు సర్వస్వమామె సౌందర్యరాశి

మూలంలోని మందాక్రాంతానికి అనువాదం గీతపద్యం. చిన్న గీత పద్యంలో కుదించినా మూలభావానికేమాత్రం లోటు రాలేదు. ఇది కవి ప్రతిభకు నిదర్శనం.

మూలంలోని నూటపది శ్లోకాలకు అనువాదం నూటపది పద్యాలే.

ఇలాసాగిన కోసప్పాచార్యులుగారి అనువాదశైలి యథా మూలానువాదంగా సాగింది

## హంసదూతము
## (సంస్కృత కావ్యం)

— శ్రీల రూపగోస్వామి

శ్రీల రూపగోస్వామి భక్త్యుద్యమనిర్మాతయైన కృష్ణచైతన్య మహాప్రభువుల శిష్యులలో అగ్రగణ్యులు. వీరు విదగ్ధ మాధవం లలితమాధురళ, భక్తి రసామృతసింధువు, ఉజ్జ్వల నీలమణి మొదలైన పెక్కు గ్రంథాలు రచించారు. రాధామాధవుల అలౌకిక ప్రణయ కథను ఆధారంగా సంస్కృతంలో 'హంసదూతము' అన్న పేరుతో దూత కావ్యాన్ని వ్రాశారు.

## హంసదూత కథ

శ్రీకృష్ణుడు రాధను వీడి మధురాపురానికి పోయాడు కృష్ణవియోగాన్ని ఒక్క క్షణమైనా సహించలేని రాధ మంద చేష్టయై యమునానదీ తీరానికి చేరింది. అక్కడ శ్రీకృష్ణునితో కలిసి తాను కొద్దిరోజులు గడిపిన కుటీర మొకటి కనపడ్డది అది గోరుచుట్టుపై రోకటిపోటు విధంగా బాధించింది. రాధ మూర్ఛపోయింది. రాధ చెలికత్తెలామె స్థితిని చూచి వెంటనే కమలినులతో శయ్య నేర్పాటు చేసిదానిపై ఆమెనుంచి శైత్యోపచారాలు చేస్తున్నారు. రాధ బాధ ఉపశమించి కనులు తెరిచింది ఇంతలో ఆమె కనులయెదుట హంస ప్రత్యక్షమైంది బాధనుండి కొంత తేరుకొని మెల్లగా హంసను సమీపించి నమస్కరించి దీనిని శౌరివద్దకు దూతగా పంపిస్తే బాగుంటుందనే ఆలోచన చేసింది. ముందుగా హంసను పొగిడింది. తన కార్యాన్ని వివరించింది నీ మార్గం నిర్విఘ్నమౌగాక యని యమునా తీరాన్నుండి మధురకు మార్గాన్ని వివరించింది

కృష్ణునితో తాను చెప్పాలనుకొన్నవన్నీ చెప్పడానికి ప్రయత్నించినా దుఃఖాతిరేకంతో నోటమాటరాలేదు ప్రక్కనున్న చెలికత్తెలది గమనించి రాధ మాటలుగా ఆమె బాధను సవిస్తరంగా శ్రీకృష్ణునికి చెప్పమని హంసకు చెప్పి పంపారు.

## కావ్య విశేషాలు

కాళిదాస కావ్యంలో యక్షుడు సందేశం పంపాడు, వేదాంత దేశికుల కావ్యంలో రాముడు పంపాడు వీరిరువురు పురుషులు. రూపగోస్వామి కావ్యంలో రాధ సందేశం పంపింది పై రెండు కావ్యాలలోని వియోగం కంటె రాధా వియోగం విలక్షణమైనది ఈమె హృదయార్పణం చేసిన భక్తురాలు తన స్వామికి హృదయార్పణ భావంతో పంపిన సందేశం ఈ కావ్యంలో ఈ విశేషమే శ్లోకాలలో అంతటా కన్పడుతుంది

కృష్ణుడు మధురలో ఉండే స్థితిని హంసకు తెలియచేస్తూ కీర్తనము, పాద సేవనము మొదలైన వాని ప్రస్తావనచేసి కృష్ణుని కొలువులో అట్టి ఉపచారాలు జరుగుతూ వుండవచ్చునంటుంది రాధ.

కులవృద్ధుడైన వికద్రుడు కృష్ణుని కీర్తిస్తూ ఉంటాడట[1] ఉద్ధవుడు పాద సేవచేస్తూ ఉండవచ్చునట[2]

ఈ మాటలతో రాధ యొక్క ఆత్మార్పణతత్త్వం కనపడుతుంది ఇదిగాని లౌకిక శృంగార వాసనలేమి లేవు

---

1 వికద్రుః పౌరాణీ రఖిల కులవృద్ధో యదుపతే
రదూరాదాసీనో మధురభణితిర్గాస్యతి సదా
పురస్తాదాభీరీ గణభయ దనామాస కరిణో
మణిస్తంభాలంబీ కురుకుల కథాం సంకలయితా — హంస 49

2 సిరీణాముత్తంసః కలితకృతవర్మా వ్యూథయతః
ప్రణిశ్చ్యుతే వాలవ్యజనయుగళాందోళన విధిం
భుజాభ్యామష్టావద భువని మాలంబ్యభవితా
గురోశ్శిష్యో నూనం పద కమల సంవాహనరతః — హంస 50

# మార్గవర్ణనం

యమునకు మధురా నగరానికి మధ్యగల మార్గాన్ని వర్ణించడంలో కవి తన ప్రత్యేకతను కనపరిచాడు. హంసచూడదగిన ప్రదేశాలలో శ్రీకృష్ణుడు గోపికలకు వస్త్రాపహరణంచేసిన ప్రదేశంకూడ ఒకటి" మా వలువలు దొంగిలి ఒడ్డునఉన్న చెట్టెక్కి-కూర్చున్నాడు కృష్ణుడు. శ్రీకృష్ణుడు తననేగదా అధిరోహించాడనే తీవితో చిగురించిన చెట్టు తన నీడతో సరస్సును కప్పివేసి సూర్యుని కూడ చొరనీయడం లేదు.[1]

అక్కడ కొద్దిసేపు విశ్రాంతి తీసుకోనీ శ్రమవెంటనే పోతుంది అని రాధ లంటుంది. ఇలా లలిత శృంగార మధుర భక్తిమయదాపనతో శ్రీకృష్ణునితో సంబంధంగల అయా ముఖ్యప్రదేశాలనన్నింటినీ మార్గవర్ణన నెపంతో రాధ ముఖాన చక్కగా వర్ణించారు రూపగోస్వామి.

## సందేశం

రాధ పక్షాన ఆమె చెలులు హంస కృష్ణునకు చెప్పవలసిన మాటలెన్నో చెప్పారు. ఇక్కడి గోవులు "నీ కోసం ఎదురుచూస్తున్నాయి అని ప్రారంభించి నీవే సర్వస్వమనుకొన్న రాధ మూర్ఛపోగా పెద్దలంతా భూతావిష్ట అయిందో, సర్పదష్టఅయిందో అని భయపడుతున్నారు అని ఎన్నెన్నో పలికి చివరకు "ప్రేమదాన్ని వీడి, ప్రాణసఖులను వదలి, వనంలో విపరీతమైన బాధననుభ విస్తున్న రాధను ఒక్క నిముషం సుఖపెట్టు. నీ విధు నామం సార్థకం చేసికో" ఎప్పటికైనా వస్తావనే ఆశతో ఇంతవఱకు ప్రాణాలు నిలుపుకొన్నది, నేటితో

---

1 అకస్మాదస్మాకం హరిరపహరన్నంశుకచయమ్
యమారూఢో గూఢ ప్రణయిభిః హరీః కదళిఖితుం
తవాశాంతస్యాంతః స్థగితరవిబింబః కింసలయైః
కదంబః కాదంబ త్వరితమవలంబస్వాంబవిత్తా — హంస 16

ఆ ఆశ కూడ లేకుండా పోతోంది నీవు వెంటనే రాకపోతే మాచెలి శాశ్వతంగా కన్నుమూస్తుంది"[1] అని ప్రార్థించారు

హంస సందేశం తీసుకుపోయింది రాధకు కొంత ఊరట గల్గింది ప్రక్కనున్న తన చెలికత్తెలతో "మురళీ కాకలీ స్వనం చేతనే ఆకర్షించే మాధవుని ఏనాటికైనా చూడగలనా"[2] అని వేడి నిట్టూర్పు విడుస్తుంది.

ఈ మాటలతో కావ్యం ముగిసింది

## హంసదూతము

### అనువాదం

— నాదెండ్ల వేంకటరావుగారు

కొవ్వూరు రామానంద గౌడీయ మఠం వారుకోరగా శ్రీ నాదెండ్ల వేంకట రావుగారు రూపగోస్వామి హంసదూతాన్ని తెలుగులోకి అనువదించారు.

---

విశీర్ణాంగీ ముంత్తర్ధ్వన విలుంఠనాదుత్కలికయా
పటీనాం ఛాయస్యా సతతమపరాధ వ్యతికరాం
పరిధ్వస్తామోదాం విరమిత సమస్తాళి కుతుకాం
విధ్యోపాద స్పర్శాదపి సుఖయ రాధాకుముదినీం — హంస 93

విపత్తి భ్యః ప్రాణాన్ కథ మపి భవత్సంగమ సుఖ
స్పృహాధీనా శౌరే! మమ సహచరీ రక్షతవతీ
అతిక్రాంతే సంప్రత్యవధి దివసే చేన విధౌ
హతాశా నిశ్శంకం వితరతి దృశౌతత్రిముకులే — హంస 94

2 కదాప్రేమోన్మీలన్మదనమదిరాక్షీసముదయాన్
బలాదాకర్షంతం మధురమురళీ కాకలికయా
ముహూర్భ్యామ్యచ్ఛిల్పి చుళకిత కులస్త్రీవ్రతమహం
విలోకేయం? లీలా విశదపాంగే మురభిదం — హంస 101

సంస్కృతంలో గౌడీయ సంప్రదాయానికి చెందిన కృష్ణభక్తురాలు రాధ పాత్ర ఆలంబనంగా తన హృదయవేదనను వ్యక్తం చేసిన కావ్యం హంసదూతం దాన్ని తెనుగుచేయడానికి అంతటి భక్తి తత్పరత, హృదయార్పణ భావం కావాలి. లేకుంటే కేవలం భాష తెలిసినంత మాత్రాన దాన్ని అనువదించడానికి పూనుకొంటే మూలంలో వ్యక్తమైన భావోద్విగ్నత లోపించి రతనాలకు రాళ్లకు ఉన్నంత తేడా స్పష్టంగా గోచరిస్తుంది.

## అనువాద విధానం

ఇది రాధ చెలికత్తె శ్రీకృష్ణుని గూర్చి నిష్ఠూరంగా పలికిన సందర్భం.

**మూలం :**

వయంత్యక్తా స్స్వామిన్ యది హాతవ కిం దూషణమిదం
నిసర్గ శ్యామానా మయమతి తథా దుష్పరిహారః
కుహూకారై రంకావధి సహనివాసాత్పరిచితా
విసృజ్యంతే సద్యః కలిత నవపక్షైర్బలిభుజః

**అనువాదం :**

స్వామీ మమ్ము బరిత్యజించితివి ,దోసంబెమి నియందిటన
శ్యామ స్వాముల కిద్ది దుష్పరిహరస్వాభావికంబేగదా
మోముల్ తెక్కలు విప్పి కూయువఱకున్ ముగ్ధంబులై స్నిగ్ధతన్
వ్యామోహంబున బెంచు కాకులవెసన్వర్జింపవే? కోకిలల్

అనువాదంలో మూలంలోని భావానికే మాత్రం లోపం రాలేదు. తెలుగు భాషకు స్వాభావికమైన మార్దవం ఈ పద్యంలో ఉన్నది. 'వయంత్యక్తా స్వామిన్' అన్న మాటలకు 'స్వామీ మమ్ము పరిత్యజించితివి' అనడంలో ప్రార్థనాయుతమైన ఆర్ద్ర హృదయం తెలుగులోనే స్పష్టంగా వ్యక్తమౌతోంది. 'విసృజ్యంతే సద్యః కలితనవపక్షైర్బలిభుజః' అన్న పద్యపాదానికి 'కాకుల వెసన్వర్జింపవే కోకిలల్' అని అనువాదం. అనువాదంలో [illegible] సౌందర్య సంపాదకమైంది.

**సమూలం :**

చిరాన్వేష్యగ్యంతీనాం పశుప రమణీనామపికుతై
ర్లబ్ధ్వం కాళింది పులిన విపినే లీన మభితః
స్ఫుర్ద్దాలోకోల్లాసిస్మిత పరిచ్ఛిన్నాస్యం సహచరి
స్ఫురంతల వీక్షిష్యేపు నరపిత మగ్రే మురభిధం

**అనువాదం :**

చిరమన్వేషణ సేయుగోపికలకున్ జిక్కంగ బోనట్టిదై
దరహాసాంచితమై కళిందతనయాంతస్సైకత తారణ్యసం
వరణంబౌహరి సుందరాస్యముగ నన్వచ్చున్ బురోభాగమం
గరయున్ నీ బహుపూర్వ జన్మకృతపుణ్యశ్రేణిచే హంసమా

శ్రీకృష్ణదర్శన సౌభాగ్యాన్ని గూర్చి హంసకు తెలుపుతున్న సందర్భం

స్వీయకల్పనలేక మూల భావం ఉన్నదున్నట్లుగా తెనిగించారు మూలం లోని ధారాశుద్ధి అనువాదంలో ఏమాత్రం కొఱవడలేదు.

ఈ విధంగా శ్రీ నాదెండ్ల వేంకటరావుగారు ధారాశుద్ధితో పరమభక్త శిఖామణి రూపగోస్వామి హృదయం తెలిసి అనువాద రచన చేశారు

## భూసుర సందేశం

## (సంస్కృత కావ్యం)

— శ్రీ నేమాని వేంకట నారసింహకవి

భూసుర సందేశకావ్యరచయిత విద్యాభూషణ బిరుదాంచితులు నేమాని వేంకట నారసింహ కవివర్యులు పీరు పర్లాకిమిడి సమీపంలోవున్న కెంగువ అగ్రహార వాస్తవ్యులు. పర్లాకిమిడిలోని ఒక ధర్మసత్రంలో మిత్రులందరు సభ చేసియున్న సమయంలో నారసింహ కవిగారు అక్కడికి వెళ్ళగా పీరి ఆగమ నానికి సంతసించిన మిత్రులు . నాల్గురోజులుండి కల్పనాకధతో రసవత్తరమైన కావ్యాన్ని ఆశువుగా చెప్పమనికోరారు. అది ఏమంత కష్టంగా భావించక అతి

స్వల్పకాలంలోనే ఈ భూసుర సందేశాన్ని వ్రాశారు.[1] ఈ కావ్యాన్ని వీరు విద్యార్థిదశలోనే వ్రాయడం విశేషం కాళిదాసమహాకవి మేఘదూతం వలె ఇది కూడ మందాక్రాంత వృత్తంలోనే సాగింది

ఆనాటి ప్రముఖ పండితులైన శ్రీ గురుదంతి చెలమయ్యశాస్త్రి, శ్రీపారనంది రామశాస్త్రి శ్రీ గుమ్మలూరి నారసింహశాస్త్రిగారలు యువకవి నేమాని వారి కావ్యాన్ని గూర్చి సముచితంగా ప్రశంసించారు.[2]

## భూసుర సందేశ కథ

చంద్రికానగరం రాజధానిగా కామపాలుడనే రాజు రాజ్యపాలనం చేస్తున్నాడు. ఒకనాడు ఆ రాజు ప్రమదాటవికి వేటకు పోయాడు ఆ అడవిలో సారంగ గానసిత కుంతలయు, స్మేరాననయు మధురవాగ్యుక్తయునైన ఒక వనితను చూచి మోహించి గాంధర్వవివాహంచేసి కొన్నాడు. కాంత కాలం మీనకేతన సుఖ సౌఖ్యారంభులై కలిసి కాలక్షేపంచేశారు. ఇదే సమయంలో ఇది అదనుగా

---

1 "పర్లాకిమిడి ధర్మసత్రమునందు నా స్నేహితులందరు సభచేసి హఠాత్తుగా నేనక్కడి కేగితిని. వారునన్నుంజూచి యమందానంత సందోహా లింగితాంగులై నన్ను సత్కరించి నాల్గురోజులలో కల్పనాకథ కలదియు శృంగారాది నవరసప్రధానమైనదీయును - ఒక్క ఖండకావ్యమును యాశుధారగా చేయవని వేడగా అది కష్టసాధ్యమని తలంచక తత్కర్తృత్వంబును వహించితిని"

ఉపోద్ఘాతము భూసుర సందేశం - వేంకట నారసింహకవి, నేమాని.

2 శృంగారాఖ్యరసానిత్వం గుణయుతం భావోజ్వలం భాసురం
నానాలంకృతి బంధురం కవిజన శ్లాఖ్యం సువృత్తం నవం
నేమాన్యన్వయ వేంకటేశ కవితాసాహిత్య విద్యా విదా
ఖండం కావ్యమకారి వీక్ష్యరసికానందంతుతత్పండితాః

పర్లాకిమిడిం సంస్కృత పాఠశాలా పండితులు గురుదంతి చెలమయ్య శాస్త్రిగారు.

భావించిన పరరాజు కుతనిపై దండయాత్రచేసి బంధించి చెరసాలలో పెట్టించాడు. అపుడు ఆ జైలులో జీర్ణవస్త్రుడైన కామపాలుడు శుష్కించిన శరీరం కలవాడై చింతాక్రాంతుడైనాడు ఇట్టిస్థితిలో ఒకనాడు సుందరరూపం కల్గిన వాడు విద్యా వివేకములు కల్గినవాడు, సత్యవాగ్మి అయిన ఒక విప్రవరుణ్ణిచూచి "ఓ విబుధ స్వామీ! రామప్రేషితు డైన వాయునందనుడు సీతకు సందేశం అందించిన విధంగా నా రామారత్నానికి నీవు సందేశం అందించమని"[1] ప్రార్థించాడు. భూసురుడు అంగీకరించాడు. కామపాలుడా విప్రుడు గమ్యం చేరడానికి మార్గం వివరించాడు ఆ మార్గాన్ననుసరించి పోతుండగా మార్గమధ్యంలో పరదేశపు రాజ భటులు ఈ విప్రుని అనుమానించి బంధించి ప్రభువు ముందు నిలిపారు. ఆ రాజుతో తాను చేయవలసిన పనినిగూర్చి వివరించి తనను వదలివేయమన్నాడు విప్రుని మాటలనుబట్టి ఆ బంధింపబడిన వాడు తన అల్లుడే అని తెలిసికొని, అల్లునికిట్టి ఆపద సంభవించినందుకు కలత చెంది, ఆ కామపాలుని బంధించింది తన మిత్రుడే అని తెలిసికొని అతని విడిపించడానికి ప్రయత్నం చేశాడు. కామపాలుడు బంధ విముక్తుడైనాడు.

## కావ్యగత విశేషాలు

ఈ భూసురసందేశ కావ్యరచన కాళిదాస మేఘదూతం ఆదర్శంగాసాగింది విప్రునిదూతగా వరించే సందర్భంలో 'రఘుపతిప్రేషితుడై సీతకు హనుమ వార్తనందించిన విధంగా[2] అన్న మాటలలో మేఘదూత వ్యాఖ్యానంలోని మల్లినాథుని మాటలు స్ఫురిస్తున్నాయి[3] ఛందస్సుమందాక్రాంతమే నాల్గురోజుల్లో

[1] వంశేతస్మిన్విబుధ గణితే బ్రాహ్మణ శ్రేష్ఠ కానాం
జాతం వంద్యం వరమపురుషైస్త్వాంసమాలోచయామి
తన్మే జాయాం బుధ భవహరన్ త్వం ప్రసిద్ధ శ్చరిత్రిం
పూర్వం సీతా మిద రఘుపతి ప్రేషితో వాయుపుత్రః
— భూసుర సందేశం 1-9

[2] పూర్వం సీతామివ రఘుపతి ప్రేషితో వాయు పుత్రః
— భూసుర సందేశం 1-9

[3] సీతాంప్రతి రామస్య హనుమత్సందేశం మనసినిధాయ
కవిః మేఘ సందేశం కృతవాన్ — మల్లినాథుడు

ఆశువుగా చెప్పిందయినాగాని ధారా శుద్ధికి కొదువలేదు  మార్గోపదేశం కూడ కల్పనా కథకు తగిన విధంగా ఉంది ప్రమదావనం, సింధునది మొదలైన ప్రదేశాలవర్ణన, అరణ్యంలో పులులకాన్పు మొదలైన విషయాలు వివరింపబడ్డాయి

### వర్ణనా నైపుణ్యం

ప్రమదారణ్యంలోని గర్భసంజాతలైన పులులు ప్రసవించే సమయాన్నిలా వర్ణించాడు కవి

"ఆ వనంలోని ఆడపులులు ప్రసవించే సమయంలో గర్భసంజాత భారం చేత పరభయం కలిగి ఉంటాయి  స్థైర్యం లేక పోవడంచేత కంపించి పోతుంటాయి  ఆ సమయంలో వాటినేమనవద్దు  వాటిని కదిలిస్తే మిక్కిలి కోపంతో తిరగబడతాయి  ఎట్టివారైనా ఆపద సమయంలో కుపితులుగావడం సహజంగదా? అలాగే అవి భయంవల్ల విపరీతమైన కోపం కల్గి ఉంటాయి ".[1]

ఇది అత్యంత స్వాభావికమైన వర్ణనగా ఉన్నది  కవి పరిశీలనాదక్షతకు అక్షర దర్పణం పడుతుంది  ఇలాగే అత్యంతవర్ణనా నైపుణ్యంతో కావ్యరచన చేశారీ నేమాని నారసింహకవి.

## ఆంధ్ర భూసుర సందేశం

— భమిడిమల్లి సీతారామయ్యగారు

క్రీ॥శ॥ 1901 సంవత్సరంలో రచితమైన భూసుర సందేశానికి క్రీ॥శ॥ 1904 సంవత్సరంలోనే అనువాదం వచ్చింది  రాజమహేంద్రవరం వాస్తవ్యులు భమిడిమల్లి సీతారామయ్యగారు ఆంధ్రభూసుర సందేశం విరచించారు  వీరి

---

1 యత్ర వ్యాఘ్ర్యః పరభయయుతా గర్భసంజాత భారాః
స్థైర్యాభావాత్ప్రసవ సమయాన్సంభవేయుః పురాతే
మా కుర్వీథాః కుభయ సహితం తథా చేద్వివక్షాః
ప్రాయోముఖాన్ విషమసమయే కోపరూక్షాభవంతి

— భూసుర సందేశం 1-12.

మిత్రులకు మిత్రుడైన నేమానివారు వీరి రచనలను చూచి తన సంస్కృత కావ్యాన్ని వీరిచే తెనిగింపజేస్తే బాగుంటుందనే ఉద్దేశ్యంతో అనువదించమని కోరుతూ ఉత్తరం వ్రాశారు వారియందున్న అభిమానంతో శ్రీ సీతారామయ్య గారు అంగీకరించినట్లు తెలిపారు.

## అనువాద విధానం

**మూలం** ·

వంశేతస్మి న్విబుధ గణితే బ్రాహ్మణ శ్రేష్ఠ కానాం
జాతం వంద్యం పరమ పురుషైస్త్వాం సమాలోచయామి
తన్మేజాయాంబుధ భవహరన్ త్వంప్రసిద్ధి శ్చరిత్రం
పూర్వం సీతామివ రఘుపతి ప్రేషితో వాయుపుత్రః

**అనువాదం**

శ్రీమన్నిర్మలపూరుషపరిణుత చారిత్రుండవీవో బుధ
స్వామీ! బాసుర భూసురాన్వయమణీ జాతుండ వౌదింక మ
ద్రామారత్నము గాంచి నాదువర వార్తన్ జెప్పుమాసీతకా
రామప్రేషితుడైన వాయుసుతుడున్ వార్తన్ జెప్పినట్టుల్ గృపన్

సందేశ హారిగా భూసురునికోరే సమయంలో కామపాలుడు ఆ బ్రాహ్మణుని ప్రస్తుతిస్తూ పల్కిన మాటలు

ఇందులో 'నిర్మల' లాంటి ఒకటి రెండుపదాలు ఛందస్సు కోసం ప్రయోగించినా అనువాదమంతా మూల విధేయంగానే యున్నది 'భాసుర భూసురాన్వయము' లాంటి పదాలు అమూలకాలయినా ఆహ్లాదజనకాలే.

**మూలం**

నా హం చోరో నహివిలువరోనోకిరాతో న శూద్రో
నా హం మూర్ఖోనకుటిలచరోనాపి విద్యా విహీనః
కింతుప్రాజ్ఞో బుధకుల గతో బ్రాహ్మణో నింద్రకర్మా
కాళింగోహంపురమభినవం కాముదాదర్శిష్టకామః

**అనువాదం .**

చోరుడగాను కాను విటశూరుడ శూద్రుడగాను కానికన్
గ్రూరుడగాన విద్యకుడ గుత్సితబుద్ధినిగాను గాని వి
ద్యారమణీయ భూసురసదన్వయ జాతుడ భవ్యకీర్తినే
కూరిమి నీ పురంబుగను గోరిక జొచ్చితి నిందు వెట్టినె

కామపాలుని పనుపున పోతున్న సమయంలో మార్గమధ్యంలో పరరాజు రాజ్యంలోని పట్టణంలో నడుస్తున్న విప్రిని భటులు పట్టుకొని రాజుముందు నిలబెట్టిన సందర్భం

ఈ శ్లోకానువాదం కూడ మూలవిధేయంగానే ఉన్నది మూలమెంత సరళమైనదో అనువాదం కూడ అంతే సారళ్యాన్ని సంతరించుకొన్నది రచన ఝురీవేగంతో సాగింది.

## మరుత్సందేశము
## (సంస్కృతం)

— పులవర్తి శరభాచార్యులవారు

శ్రీ పులవర్తి శరభాచార్యులవారు బహుకాలం విద్యాధికారిగా ఆంధ్ర ప్రదేశ్‌లోని అనేక ప్రాంతాలలో పనిచేశారు వీరు సంస్కృత, ఆంధ్రాంగ్ల భాషలలో పండితులు నివేదనము, యశోధర, మాణిక్యజోతిః, సంగీతనాటికా, గాంధీ సూక్తి మాలికాః మొదలైన గ్రంథాలు అనేకం వ్రాశారు అంతేగాక వీరు గణితావధానం కూడ చేసేవారు.

క్రీ॥శ॥ 1958 సంవత్సరంలో విద్యాదికారిగా పనిచేస్తున్నకాలంలో వివిధ రాష్ట్రాలు తమ ప్రణాళికా ప్రగతినిగూర్చి డిల్లీకిచెప్పమని అర్థించినట్లు అనుభూతి కల్గింది ఆ అనుభూతియే ఒక సందేశకావ్యంవ్రాయాలనే ప్రేరణకు దోహదకారి అయింది అన్ని రాష్ట్రాలకు సంబంధించిన విషయం కాబట్టి తెలుగులోవ్రాయడం కంటే భారతదేశంలోని అన్ని ప్రాంతీయభాషలకు తల్లివంటిదైన సంస్కృత భాషలో కావ్యరచనచేయ సంకల్పించారు. దాని పర్యవసానమే అమరవాణిలో మరుత్సందేశ కావ్యావిర్భావం

ప్రేరణ క్రీ॥శ॥ 1958లో కలిగితే రచనకు కథాబీజం క్రీ॥శ॥ 1962లో పడింది. భారతదేశం పైకి చైనా దండయాత్ర చేసిన సందర్భంలో జరిగిన హఠాత్ సంఘటన ఆధారంగా కథాకల్పన చేశారు.

## కావ్యకథ

ఆంధ్రదేశంలోని కర్నూల్ నుండి ఒక యువజనుడు భార్యతో కూడి కాశ్మీరదేశయాత్రకు వెళ్లాడు ఆ సమయంలో చైనా భారతదేశాలకు ఘోరమైన యుద్ధం సాగుతోంది ఆ యుద్ధసంరంభంలో లడక్‌లో ఆ యువకుని భార్య తప్పి పోయింది. విచారమగ్నుడై తన దేశానికి తిరిగివచ్చాడు ఒంటరితనం వేధిస్తోంది భార్యస్మృతులు బాధిస్తున్నాయి ఆ సమయంలో దక్షిణాన్నుంచి ఉత్తరదిశకు పోతున్న గంధవహుడు తన్ను సమీపించాడు. విరహబాధ అధిక మైంది తన భార్యకు తన సందేశాన్ని తీసుకుపోవడానికి, ఆమెను అన్వేషించ డానికి ఈ గంధవహుడు తగినవాడని భావించి, ఆతణ్ణి ప్రార్థించి దూతగా పంపాడు తుదకు తన ప్రియాసమాగమాన్ని తెలిపే లేఖను ఆ యువప్రియు డందుకోవడంతో శుభాంతంగా కావ్యం ముగుస్తుంది

## కావ్యగతవిశేషాలు

మరుత్సందేశం అరాచీన సంస్కృత సందేశకావ్యం ఇది ముమ్మూర్తులా మేఘ హంస సందేశాలను పోలియున్నా వాటిలో లేని కొన్ని విశేషాలు దీనిలో ఉన్నాయి.

మేఘదూతంలో యక్షుడు శాపంచేత విరహి అయ్యాడు హంస సందే శంలో నాయకుడు అన్యుల దుశ్చర్యల వల్ల విరహి అయ్యాడు. కాని మరుత్సం దేశంలో నాయకుడు విహారయాత్రలో హఠాత్ వియోగాన్ని పొందాడు. యువ జనుడు కావడం చేత విరహాన్ని తట్టుకొలేక పోయాడు. తనకు సమీపంలో ఏ హంసా కీరము కనపడలేదు అతనికి వెంటనే సరసన గోచరించింది సర్వ జీవులకు ప్రాణాధారమైన వాయుదేవుడు

యక్షునికి, రామునికి తన ప్రియురాండ్రు ఎక్కడ ఉన్నారో తెలుసు. కాని ఈ నాయకునికి తెలియదు. గంతవ్య ప్రదేశం తెలుసుగావున వారు ఆ మార్గాలే

వివరించారు ఈతనికి తెలియకపోవటంచేత మార్గ నిర్దేశం చేస్తూ భారతదేశాన్నంతా సమగ్రంగా వర్ణించాడు. కవి ఉద్దేశ్యానికి ఈ వర్ణనకు చక్కగా సరిపోయింది.

కాళిదాస మహాకవి కేవలం ఉత్తరభారత వర్ణన చేస్తే, వేదాంత దేశికులు దక్షిణభారతాన్ని ప్రధానంగా వర్ణించారు అయాకాలాల్లో వారికి పరిచయమైన ప్రదేశాలు అవే కాని శరబాచార్యులుగారు ఇందులోని సందేశాన్ని ఆధారంచేసికొని పాఠకుణ్ణి దేశమంతా చుట్టబెట్టించారు ఎన్నో వింతలు విశేషాలు కనులకు కట్టినట్టు చూపారు అరవిందరవీంద్రులవంటి మహానుభావులకు నివాళులెత్తారు సమకాలిక సమాజంలోని లోపాల్ని ప్రభుత్వపాలనలోని అవకతవకల్ని చమత్కారయుతంగా విమర్శించారు తగిన అవకాశం దొరికితేచాలు మనకు తన సందేశాన్ని అందజేశారు చక్కని సూక్తుల్ని నిక్షేపించారు. మనోజ్ఞాలైనకల్పనలు చేశారు అవకాశాన్ని జారవిడువక కవితా సౌరబాలు గుబాళింపజేశారు రచన గీర్వాణమైనా ఆంధ్రాభిమానాన్ని విడువక విశ్వనాథ వంటి కవులను, నాగర్జున సాగరంలాంటి ఆనకట్టల్ని, పొట్టిశ్రీరాములుగారిలాంటి స్వాతంత్ర్యయోధులను గొప్పగా అభివర్ణించారు

ఇంతేగాక తమిళదేశాన్ని, మైసూరు రాష్ట్రాన్ని, మహారాష్ట్ర ఒరిస్సా ఉత్తరప్రదేశ్, ఢిల్లి, రాజస్తాన్ మొదలలైన ప్రాంతాలలోని ఎన్నో విశేషాలను అద్భుతాంగా వివరించారు

ఇంతటితో తృప్తిపడక భారతమాతను అద్భుతంగా స్తవంచేసి పుత్రుడుగా తల్లి ఋణం తీర్చుకొని తమ జన్మధన్యమైందనుకొన్నారు

అస్తవం అద్భుతోపేతం!

## మరుత్సందేశము
## (ఆంధ్రానువాదం)

— శ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రిగారు

మరుత్సందేశానువాద రచయితలైన వంగవోలు ఆదిశేషశాస్త్రిగారు అవధాన శేఖర, కవిరత్న బిరుదాంకితులు అనంతసాగర స్తవము, ఆత్మార్పణ

స్తుతి, ధర్మపాల విజయము మొదలైన అనేక గ్రంథ రచయితలు అనేక గ్రంథాలు వ్రాసిన అనుభవంతో మరుత్సందేశానువాదాని కుద్యమించారు అనువాదం చేయడం ఒక విధంగా సుకరము, మరొకవిధంగా కష్టసాధ్యమైన విషయం భావ సంపదకు, కథాకథనానికి ఒక విధంగా మూలం మార్గదర్శకమై ఉంటుంది కాని త్రికరణ శుద్ధిగా మూల రచయితకు న్యాయం చేకూర్చాలను కొంటే కొంత కష్టసాధ్యమేకాగలదు

అనువాదాన్ని కూలంకషంగా చదివి, మూలంతో తులనాత్మకంగా పరిశీలించి నిగ్గుతేల్చడం విమర్శకులకు కొంత కష్టమే కావచ్చు కానీ మూల రచయిత తన కావ్యం అనువదింపబడేనాటికి సజీవులై యుండడం వారు అనువాదాన్ని చూచి ఆమోదాన్ని తెల్పడం అరుదైన విషయం, అందులో మూల రచయిత అనూదితమైన భాషలో కవిపండితులై యుండడం మరీ విశేషం.[1]

అనువాద రచయితకు ఇది తిరుగులేని ఆమోదముద్ర. ఈ రచయితకది లభించింది

వీరి రచన మూలంవలె కేవలం ఒకే ఛందంలోగాక సందర్భాన్ననుసరించి ఛందోవైవిధ్యాన్ని సంతరించుకొన్నది. ఇది తెలుగు మర్యాద.

## అనువాద విధానం

**మూలం.**

పార్శ్వోద్భూతైః స్వకరవిటపైస్తాళవృంతోపచారం
తన్నిద్రాంతః పతగవిరుతైశ్చాదరాలాప సాఖ్యమ్
తచ్చైత్య తల్పం దళ శత చయైర్దాత మాయాత పుంసాం
తన్వానస్త ద్వట తరురహో సద్గృహీన స్థిరో భూత్

— మరుత్సందేశం 2 40

---

[1] తాము పంపినది తెలుగు లిపిలో తొలిసారి వెలువడిన నాకావ్యానికి అనువాదం మూలభావాలు సరిగా చక్కగా అనువదించితిరి కొన్ని యెడల మీ అనూదిత భాగాలు ఉదాహరణీయ ప్రమాణ వాక్యాలుగా సుందరతరంగా కూడ ఉన్నవి నిర్దుష్టమైన మీ లేఖినీ సామర్థ్యాన్ని అభినందించుచున్నాను మీ కవిత ధారాళమై రుచిశుచిగలది మీది చక్కని చిక్కని రచన విజ్ఞపరితలకు సంప్రీతిని ఆమోదమును కలిగింపగలదనుటలో సందేహంలేదు

ఆమోదము. మూలకావ్యకర్తలేఖ — శ్రీ పులివర్తి శరభాచార్యులు

**అనువాదం**

తన కొమ్మలు పీవనలై
తన గూడుల పికతతులరుతము స్వాగతమై
తన నీడలు సుఖదములై
తనుపగనతిధుల గృహస్థ ధర్మము నెఱపున్
వటవృక్షాన్ని వర్ణిస్తున్న సందర్భం

మూలంలోని "ఆదరాలాపసౌఖ్యం" అన్నది 'స్వాగతమ్'అని 'ఆయాంతపుం సాం' అన్నది 'అతిధుల' అనిమార్పు చెందాయి మందాక్రాంతాన్ని కందంలో ఇమడ్చడం అనువాదకుని ప్రతిభకు నిదర్శనం. అల్పాక్షరాల్లో అనల్పార్ధ రచన చేయడం ఏ కొద్దిమందికో గాని సాధ్యం కాదు

అది వీరి ఈ పద్యంలో స్పష్టంగా కనవడుతోంది

**మూలము**

'తద్పోల్ పుర్యా'స్తరుషు బహుశ్లిష్టవల్లీతనూషు
ప్రోత్థసార ప్రసవతతిషు వ్యాప్తగందాన్ గృహీత్వా
'నోబెల్' విత్తాత్ సమదిక తరం స్వర్ణవర్ణం హి కుర్యాః
రాగూర్యాశ్రే రజత చిబుకే కేనవార్చ్యః కవీంద్రః?

**అనువాదం**

ఈవుబోల్పురికరిగి రవీంద్రువెండి
గడ్డమునకు వేయుమిక బంగారుపూత
తన్నికేతన తరులతాంతాలు చిమ్మ
పుష్పాదుల తోడ నది కవిమునికి నధిక
తృప్తినిడును నోబెలు బహూకృతులమించి
సుకవిచంద్రుండెవ్వనికి బూజ్యుండుగాడు?

రవీంద్రకవీంద్రుని గూర్చి దూతకు నాయకుడు చెప్పే సందర్భం

"కేనవార్చ్యః కవీంద్రః' అన్న మూలానికి 'సుకవిచంద్రుడెవ్వనికిబూజ్యుండుగాడు' అన్నది అనువాదం చివరి పంక్తి ప్రశ్నార్ధకంగా అంతాన కాకువులో ఊహ తెలిసి చదవకపోతే వ్యతిరేకార్ధం వస్తుంది అటువంటి అవ

కాశమే రచయిత ఇవ్వకూడదు. అటువంటప్పుడు ప్రశ్నార్థకం తొలగించి 'సుక విచంద్రుడందరకు పూజ్యుండు' అనటంమంచిది మూలంలో 'నోబెల్ విత్తాత్' అని ఉంటే దాన్ని 'నోబెల్' బహూకృతుల మించి అనటం సముచితం.

ఇక భారతమాతృస్తవం ఈ మరుత్సందేశానికి మకుటమై వెలుగొందు తోంది. అద్వితీయమైన దేశభక్తికిది తార్కాణం

**మూలం** ·

యాశీతాద్రిప్రకట మకుటాక్రమ కాస్మీర్ లలాటా
సంప్రేక్ష్యా శ్రీనగర్ తిలకాఖేలదబ్జాలకాంకా
విశ్వేశ శ్రీనిలయ హృదయా జాహ్నవీహార ధుర్యా
వింధ్యారణ్యా హరిత రశనామధ్య దోషా మనోజ్ఞాం
కోలార్ ఖన్యాః కనక సుషమాపాద భూషాభి రామా
రాకాచంద్రీధవల హసనాశాన్త్య హింసాప్రసన్నా
రేఖాక్షాంశాద్వివిధ ముఖశాసృష్టదోషై క్యపాశా
సౌందర్యాశ్రీ సృజన కలనాదృక్ప్రతిష్ఠాగ్రగణ్యాం
గాంధీ మార్గభ్యుదయ విభవాజ్ఞాన విజ్ఞాన భావా
కర్మాగారా శ్రియముపగతా దర్మచక్రప్రయుక్తా
ఏకం శద్వాక్పరమ మహిమా వీర సూర్దేవకామా
సోత్తిష్ఠన్తీ భరత జననీ విశ్వరాజ్యేవిరాజ్యాత్

**అనువాదం :**

శ్రీనగర్ తిలకంబు శీతాద్రి మకుటంబు
కాస్మీరుపాలభాగంబుగాగ
చరదభ్ర శకలాలు సురుచిరచికురాలు
హృదయంబు విశ్వేశుగృహముగాగ
కలుషాపహారిణి గంగాతరంగిణి
రమణీయ కంఠహారంబుగాగ
మధ్యప్రదేశంబు మధ్యంబుగను వింధ్య
శైలాటవియె మొలనూలుగాగ

కాలియందియల్ కోలారుగనులుగాగ
మొలక నవ్వులు వెలది వెన్నెలలుగాగ
శాంత్యహింసలతో సుప్రసన్నయగుచు
బ్రిత్యహముతోచుగాత మా భరతమాత

ఐకమత్యము గూర్పసక్షాంశ రేఖాంశ
వృత్త పాశమ్ములు పెనచికొనగ
సౌందర్యలక్ష్మీముఖేందు బింబద్యుతుల్
కరుణార్ద్రదృక్ప్రభాకలసదేల
గాంధీమహాత్మమార్గమువ నమ్మద
యశ్రీ మహాన్నత్యమలవరింవ
అన్నవస్త్ర గృహాదికావశ్యకోత్పత్తి
సాధకబహుపరిశ్రమలు వెలయ

ధర్మచక్ర ప్రవర్తకోద్యత్కరయయి
శత్రుమస్తక విన్యస్త చరణయగుచు
విశ్వకళ్యాణగుణకర్మవితతి తోడ
భవ్యజాగృతి వెలయుత భరతమాత

మూలంలోని మహోన్నతభావాలను తేనె తెలుగులో, కమనీయస్తవం చేశారు ఆదిశేషశాస్త్రిగారు మూలంకంటె అనువాదమే అతి మనోజ్ఞంగా సాగింది శబ్దాలంకారాలు సహజంగా సమకూరింపబడ్డాయి అందులో చక్కని శైలిలో భావాలెలా వ్యక్తంచేయవచ్చో సోదాహరణంగా చూపారు శ్రీశాస్త్రిగారు

"కొన్నియెడల పునఃఅనూదిత భాగాలు ఉదాహరణీయ ప్రమాణ వాక్యాలుగా సుందరతరంగా కూడా ఉన్నవి" అన్న మూల రచయిత పులవర్తివారి మాటలకు చక్కని తార్కాణాలు ఈ సీసాలు.

ఇదీ శ్రీ ఆదిశేషశాస్త్రిగారి రచనా విధానం పుటలో అక్షాంశ రేఖాంశాల ప్రసక్తి ఆధునికులకు నచ్చకపోవచ్చు ఇవి ఊహామాత్రమైన రేఖలేగాని వీటి వల్ల కల్గే ఐకమత్యమేమీ ఉండదు.

# తృతీయాధ్యాయము

## స్వతంత్ర సందేశకావ్య సమాలోచనం:
## ప్రణయ సందేశ కావ్యాలు

# స్వతంత్ర సందేశకావ్యాలు

సంస్కృత సాహిత్యంలోని మేఘదూత హంససందేశాది దూతకావ్యాలు ఆదర్శంగా ఎందరో తెలుగుకవులు స్వతంత్రంగా స్వకపోలకల్పనతో సందేశ కావ్యరచన చేశారు

వాగనుశాసనుడైన నన్నయనుండి నేటి వఱకు గల వేయివసంతాల తెలుగు సాహిత్యంలో ఇప్పటికి లభ్యమైనంతవఱకు ఈ శతాబ్దిపూర్వార్థంలో మాత్రమే స్వతంత్ర సందేశకావ్యరచనకు అంకురార్పణ జరిగింది పూర్వకావ్యాలలో క్వాచిత్కంగా దూతకృత్యాలు కన్పిస్తున్నాయి.

సంస్కృత వాఙ్మయంనుండి అనువదింపబడిన రామాయణ; భారత' భాగవతాది పురాణేతిహాసాల్లోను, నైషధ కావ్యాల్లోను సందేశాలున్నాయి

హనుమద్దౌత్యం, అంగదరాయబారం రామాయణంలోను, శ్రీకృష్ణ, సంజయ, ద్రుపదపురోహితులరాయబారాలు భారతంలోను, అగ్నిద్యోతను దౌత్యం, భాగవతంలో రుక్మిణీ కల్యాణ ఘట్టానికి ముందు, నైషధంలోని హంస నలదౌత్యాలు తెనుగులోకి అనూదితాలైనాయి దౌత్యశాస్త్రాన్ని దూతలక్ష ణాలను సమ్యగవగాహనచేసుకొన్న నన్నయ, తిక్కన, భాస్కరుడు, పోతన, శ్రీనాథుడు మొదలైన కవులు మూలానికి వన్నెకూర్చే విధంగా అనువాద రచన చేశారు.

## ప్రబంధ సాహిత్యం

ప్రబంధసాహిత్యంలో ఈ దూతకృత్యం పరిపక్వస్థితినందింది. దూత ముఖ్యపాత్రగా ప్రబంధకవులు కావ్యాలు వ్రాశారు

రామరాజభూషణుడు 'సానలుదేరిన జాతిరత్న'మైన వసుచరిత్రలో మంజు వాణిని అద్భుతమైన పాత్రగా తీర్చిదిద్దాడు పాత్రకు ఆ పేరు పెట్టడంలోనే ఔచిత్యమున్నది దూతకు మంజు వాఙ్నైపుణ్యం ఉండాలని కవిభావన మంజు వాణి తన చతురవచో నైపుణ్యంతో సహృదయులను నాయికానాయకులకంటె ఎక్కువగా ఆకట్టుకొన్నదనడంలో సందేహం లేదు

ప్రభావతీ ప్రద్యుమ్నంలో పింగళి సూరన సృష్టించిన శుచిముఖికూడ మంజువాణితో పోటీపడ్డది. మల్లన రాజశేఖరచరిత్రలోని కీరం శుచిముఖీమంజు వాణులకు తానేంతక్కువ కానంటూ పాఠకులను ఆనందమగ్నుల్ని చేసింది

**ఆధునిక సాహిత్యం** ·

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తన రామాయణ కల్ప వృక్షంలో అమూలకమైన హంససందేశ కల్పనచేశారు

కపికులమంతా రఘుకులస్వామి ఆజ్ఞతో సుగ్రీవుని నేతృత్వంలో యుద్ధ సన్నాహం చేస్తోంది ఒకరోజు సాయం సమయాన శ్రీరాముడు సముద్ర పులించున ఇసుకతిన్నెల్లో దీర్ఘాలోచనామగ్నుడై కూర్చున్నాడు అపుడాయన కళ్లఎదుట ఒక రాజహంస ప్రత్యక్షమైంది ఇప్పటి తన ఈ పరిస్థితిలో ఆదు కోడానికి ఆప్తులెవరో వచ్చినట్లుగా బావించాడు.

"స్వామీ! హంసకులావతంసమ! ధరాజాతా వియోగవ్యధన్ నాపై యెంత కృశించెనో కనెదె?" అని ప్రారంభించాడు నా మనవినాలించి నేను యుద్ధ సన్నద్ధుడనై ఉన్నానని నా ప్రాణసమాన అయిన జానకికి తెలియజేయమని కోరాడు హంస రాముని కోరికను తీర్చింది

ఈ విధంగా ఆయాకావ్యాల్లోని దౌత్యాలు తెలుగుకవుల అద్భుత కల్పనా శక్తికి, పాత్రచిత్రణకు నిదర్శనాలుగా చిరస్థాయిని పొందాయి

## ఇందు శతకము–దూతకావ్యలక్షణాలు

క్రీ॥శ॥ 17వ శతాబ్దివాడైన సూతారిసోమయామాత్యకవి "ఇంద్రదూత"అనే నాయికంతరవ్యవహారంగల ఇందుశతకాన్ని రచించాడు[1]

కాళిదాసమేఘదూతాన్ని ఈ చంద్రదూతం సంపూర్ణంగా పోలియుండక పోయినా దౌత్యం ప్రధానాంశంగా ఉన్నదికాబట్టి కొంతవరకు ఆ ఛాయలోనే సాగిందని చెప్పవచ్చు

## ఇందు శతకవిధి

బృందావనంలో బాల్యంనుండి గోపాలుని సాన్నిధ్యంలో గడిపిన ఒక

---

[1] వ్యాసప్రభ – ప్రభావతి జే పుటలు 1-9

గోపిక వివాహం కావటంచేత అత్తవారింటికిపోయి బృందావనికి శ్రీకృష్ణునికి దూరమైపోయింది

పున్నమి రాత్రి ఆమెకు ఆనందం కల్గించాల్సిందిపోయి బాధాతప్త హృదయను చేసింది ఆమె మనసంతాకృష్ణుడు ఆవరించాడు. విరహవేదన అధికమైంది చంద్రుణ్ణి చూడగానే అతని ఆగమనం బృందావనం నుంచే అని భావించింది మనసును ప్రశ్నలు కలచివేస్తున్నాయి వాటిలో కొన్నింటిని మాత్రమే చంద్రుడికి అడిగింది

బృందారణ్యము సేమమా? అచటి గోప బృందముల్ లెస్సలా?
నందుండున్ సతియున్ సుఖాన్వితులె? నానాగోపగోపాలికా
సందోహంబులతోహలాయుధుడు కృష్ణస్వామి క్రీడింతురా?
ఇందూనందనుమందనుండి కదనీవేతెంచుటల్ రాకలన్

ఈ గోపికకు గోపాలునితో ఎంతటి సాన్నిహిత్యముందో ఈ ప్రశ్నల్లో వ్యక్తమౌతోంది

బాల్యంలో తాను విహరించిన బృందావనం, కృష్ణునితో గడిపిన మధుర క్షణాలు, క్రీడలు సల్పిన యమునానది ఒకటొకటిగా స్మృతిపథంలో మెదిలాయి. మనస్సును తొలచివేశాయి. విరహబాధ ఇంకా అధికమైంది ఆమెకొక సందేహం కల్గింది. ఇవన్నీ ఆ గోపికాలోలుడు మరచిపోయాడేమీ! అవేకాదు, నన్నుకూడా మరచిపోయాడేమో! అని అనుకొన్నది. ఆ విషయమే మనస్సులో దాచుకోలేక చంద్రుణ్ణి అడిగింది[1] మందనుండి తప్పిపోయిన లేగదూడలా గోవులకు, గోపాలునికి, గోపికలకు, బృందావనికి, దూరమై ఇక్కడ దుర్భరమైన జీవితం గడుపుతున్నాను నా హృదయకుసుమాన్ని ఆ గోపికాలోలుని పాదాలకే

1 నందాగారవిహారియైన హరినానాశైశవక్రీడలా
యందంబుంగనివేడ్కగల్గుమదభీష్టవ్యాప్తిగావింపసూ
వంగంవారసి యెప్పుడైన మదిలో చర్చించు నా జాలితో
ఇందూనందనుమందనుండికద నీవేతెంచుటల్ రాకలన్

అంకితం చేశాను. ఆతని విరహం భరించలేను. ఆ మహనీయుని పాదసందర్శన భాగ్యం కల్గించు అని వేడుకుంది.[1]

మదనుడును, నీవును దంపతుల అన్యోన్యానుసంధానానికి తోడ్పడే ఆప్తులు. మీ యిద్దరిలో నీవు పెద్దవాడివని, ప్రాణికోటి అంతా నీ కిరణాలవల్ల దనంతో జీవిస్తూ నిన్నాశ్రయించి ఉన్నది గనుక ఈకార్యభారాన్ని నీపై మోపు తున్నాను "నీవుమరల బృందావనానికిపోయి నాసందేశాన్ని శ్రీకృష్ణునికి తెలియ జేసి కృతార్థుడవై నామనోరథాన్ని నెరవేర్చు'' అని పలికి "నేను బృందావనిలో వున్న సమయంలో ఒకరోజు "ఇదెకందర్పాసురుదేగుదెంచెనను ప్రేమన్‌గావవే'' అంటూ పరుగున వచ్చి నన్ను గాఢంగా కౌగిలించుకొన్న ఆ గోపికాలోలుని దర్శన భాగ్యాన్ని ఒక్కసారి నాకు కల్గించు చంద్రాయని చంద్రుణ్ణి ఆర్తితో ప్రార్థించింది గోపిక

ఈ కావ్యంలో ప్రతిపద్యం "ఇందూనందనుమందనుండిగద నీవేతెంచుటల్ రాకలన్" అనే మకుటంతో సాగింది కాబట్టి ఇది శతకసాహిత్యశాఖకు చెందింది చంద్రుని దూత్యమున్నందున స్వతంత్ర సందేశకావ్యాలను బీజప్రాయమైంద నవచ్చు

ఈవిధమైన దౌత్యవిధానంతో ఈ శతాబ్ది పూర్వార్థంలో స్వతంత్రసందేశ కావ్యరచనకు అంకురార్పణ జరిగింది. ఇప్పటికి లభించినంతవఱకు తెనుగు కవుల పదునైన స్వతంత్రసందేశ కావ్యాలు సమీక్షింపబడతాయి.

కావ్యవస్తువునుబట్టి, కవికోరుకొన్న కావ్యప్రయోజనాన్నిబట్టి, ఈ సందేశ కావ్యాలను రెండువర్గాలుగా విభజింపవచ్చు

1. ప్రణయసందేశకావ్యాలు
2. సామాజిక సందేశకావ్యాలు

---

[1] కందర్పుండును నీవు దంపతులకుంగార్యానుసంధాతలే
యందుంబెద్దవుప్రాణికోటికుపజీవ్యంబయ్యెనీవల్ల నా
సందేశంబెరిగించి కార్యఘటనాసంతోషివై రేపుర
మ్మిందూనందనుమందనుండె గదనీవేతెంచుటల్‌రాకలన్

## ప్రణయసందేశ కావ్యాలు

ఏదోకారణంచేత వియోగాన్ని పొందిన ప్రియుడుగాని, ప్రియురాలుగాని, తమ వియోగాన్ని భరింపలేక విపరీతమైన వేదన ననుభవిస్తున్న సమయంలో తమకు ప్రత్యక్షమైన శుకపికాలనో, శశిభృంగాలనో, చకోరమయూరాలనో, ఘనపవనాలనో ప్రార్థించి తమపక్షాన దూతకృత్యం నిర్వహింపుమని వేడుకొనడం, దూతవారి ప్రార్థనను మన్నించి కార్యంసానుకూలం చేయడం కథావస్తువుగాగల కావ్యాలు ప్రణయసందేశకావ్యాలు –

అవి క్రమంగా –

1 ఆంధ్రమేఘ ప్రతి సందేశం – రావాడ వేంకటరామశాస్త్రిగారు.
2. చకోర సందేశం – మోటూరి వేంకటరావుగారు.
3 సమీర సందేశం – సోమంచి వాసుదేవరావుగారు.
4 శశిదూతం – విశ్వనాథ సత్యనారాయణగారు.
5. కీర సందేశం – సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు.
6. పవనసందేశం – గంటి కృష్ణవేణమ్మగారు.
7 శుకసందేశం – మూలా పేరన్నశాస్త్రిగారు.

## సామాజిక సందేశకావ్యాలు

కవులు సామాజిక చైతన్యాన్ని బాగా పుణికి పుచ్చుకొంటారు. తామున్న సమాజంలో నిత్యం సంచరిస్తూ సమాజంలోని కష్టసుఖాలను, మంచిచెడులను వీరు కూడఅనుభవిస్తుంటారు. అవి వారిమనసులలో నాటుకొంటాయి. కవులు కావడం చేత ఆఅనుభవాలను ఎక్కడో ఒకచోట తమ కావ్యాలలో నిక్షిప్తంచేసి వాటికి కళాత్మకమైన శాశ్వతపు విలువలు కల్పిస్తారు

సమాజంలోని సమస్యలు కొన్నింటికిపరిష్కారాన్ని తెలియజేస్తారు. తమకు తోచకపోయినట్లైతే ఆ పరిష్కారాన్ని సమాజానికే వదిలేస్తారు. అంతేగాక తన కావ్యంలో తానిచ్చే సందేశం సార్వకాలికము సార్వజనీనము అయ్యేవిధంగా చూస్తారు.

ధనవంతుడు ధనహీనుని అక్రమంగా బాధించినపుడు, అంటరానితనం సాకుతో ఒక వర్గాన్ని మరొకవర్గం హీనంగా చూచినపుడు, ఉత్తమ సమాజ నిర్మాణానికి కేంద్రబిందువైన స్త్రీ అవమానాలపాలైనపుడు, వేనవేల వర్షాలుగా ఈ సమాజం అనుసరిసున్న సాంఘికధర్మం భ్రష్టమైనపుడు, విధివక్రించి కరువు కాటకాలు కరాళనృత్యం చేస్తున్నపుడు ఆర్ద్రహృదయుడైన కవివాటికి స్పందించి అవి కథావస్తువులుగా కావ్యరచనచేయడానికి ఉద్యమిస్తాడు

తాను భక్తుడైతే సమాజాన్ని గూడ ఆ భక్తి మార్గాన నడిపించాలనే కోరిక కవిలో కల్గడం సహజం ఆ విధంగా కవి సందేశకావ్యారచనకుపక్రమిస్తాడు

అవి క్రమంగా —

| | | |
|---|---|---|
| 1. గబ్బిలం | — | గుఱ్ఱం జాషువకవి. |
| 2. తెనుగుసందేశం | — | పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు |
| 3 మేఘదూతము | — | పుట్టపర్తి నారాయణాచార్యులుగారు |
| 4. శుకసందేశము | — | కందుకూరి వీర బసవరాజుగారు |
| 5 వృషభరాజ సందేశము | — | గిద్దలూరి చెంచుబసవరాజుగారు. |
| 6. అనిల సందేశం | — | పి వెంకటసుబ్బయ్యగారు |
| 7 ఇన సందేశం | — | ఎడ్లపల్లి జోసెఫ్ కవిగారు. |
| 8. తుమ్మెద సందేశం | — | శ్రీమతి సుంకరమణి రామచంద్రరావుగారు |

ఈ ప్రణయ, సామాజిక సందేశకావ్యాలలోని సందేశకావ్యలక్షణాలను పరిశీలించి కావ్యగత విశేషాలను సమీక్షచేస్తాను.

## ఆంధ్రమేఘ ప్రతి సందేశము

ఈ ఆంధ్రమేఘ ప్రతిసందేశం క్రీ॥శ॥ 1939వ సంవత్సరంతో ప్రచురితమైంది. దీని రచయిత రావాడ వేంకటరామశాస్త్రిగారు. వీరు బళ్ళారి మున్సిపల్ హైస్కూల్ లో ప్రధాన ఉపాధ్యాయులుగా పనిచేశారు.

ఈ కావ్యం పేరునుబట్టి కాళిదాస మహాకవి కావ్యానికి పూరకమైన స్వతంత్ర సందేశ కావ్యంగా భావించవచ్చు

## ప్రతి సందేశానికి పూర్వరంగం :

క్షణమొకయుగంగా వర్షభోగ్యమైన ప్రభుశాపాన్ని అనుభవిస్తూ యక్షుడు రామగిర్యాశ్రమభూముల్లో తిరుగుతున్నాడు ఇలా ఎనిమిది మాసాలు గడిచేసరికి భరింపలేని ప్రియురాలి విరహవేదనతో చిక్కిశల్యమైన అతనిముంజేతి స్వర్ణ కంకణం జారి క్రింద పడిపోయింది ఇక గోరుచుట్టుపై రోకటిపోటులాగా ఆషాఢ ప్రథమ దివసాన రామగిరిసానువుల్లో సల్లమబ్బు ప్రత్యక్షమైంది కామార్తుడై చేతనాచేతన జ్ఞాన శూన్యుడైనవాడు ఆ మేఘంద్వారా తన ప్రియురాలికి సందేశం పంపించాడు ఆ సందర్భంలో "తొలివియోగంచేత అత్యంతశోకాతురయైన నా కాంతను నా మాటలతో ఊరడించిన విధంగా ఆమెనుండి కూడ సందేశాన్ని తెచ్చి నాప్రాణాలుకాపాడుమని" వేడుకున్నాడు.

కావ్యాంతంలోని యక్షుని మాటలు ఆధారంగా సంస్కృతంలోను, తదితరాలైన భారతీయ భాషల్లోను ఎందరో కవులు యక్షకాంతనుండి ప్రతి సందేశం పంపించారు.[1]

తెలుగు సాహిత్యంలోను రావాడ వేంకటరామశాస్త్రిగారు ప్రతి సందేశ రచన గావించారు

## ప్రతి సందేశ రచయితకు కావలసిన సామర్థ్యం

కాళిదాస మహాకవి మేఘదూతాన్ని కూలంకషంగా అవగాహనచేసుకొంటే గాని ఏ కవి అయినా ప్రతి సందేశ రచనలో కృతకృత్యుడు కాలేడు ఆ మహాకవి తన కావ్యాన్ని ధ్వన్యాత్మకంగా తీర్చిదిద్దాడు అందులో ఎన్నో నిగూఢమైన విశేషాలు నిక్షిప్తం చేశాడు కృతి అల్పమైనదేగాని, వ్యాఖ్యాతలలో అగ్రగణ్యుడైన మల్లినాథుడన్నట్లుగా ఈః కావ్య వ్యాఖ్యానజ్యోతిని వెలిగించి జ్ఞాన

---

1 ఆశ్వాస్యైవం ప్రథమ విరహోదగ్రశోకాం సఖింతే
శైలాదాశుత్రినయన వృషోత్ఖాత కూటా న్నివృత్తః
సాభిజ్ఞానం ప్రహితకుశలైస్తద్వచోభిర్మమాపి
ప్రాతః కుంద ప్రసవ శిథిలం జీవితం ధారయేథాః
— మేఘసందేశః 2-53.

కాంతులు మనకు ప్రసాదించడానికి ఆ మహనీయుడు తన జీవితాన్నిల్లెలంలా వ్యయం చేయవలసివచ్చింది.[1] అందువల్ల కాళిదాస హృదయంబాగుగా గుర్తెరిగిన వాడే గాని ఇట్టి రచన చేసి కృతార్థుడు కాలేడు

కాళిదాసే తన కావ్యంలోని నాయిక యక్షకాంత బాహ్యాంతర స్వరూపాల ను యక్షుని ద్వారా చెప్పించాడు.[2]

ఈ ప్రతి సందేశంలో అంతర్లీనంగా ఆ స్వభావం ప్రతిబింబించాలి యక్షుడు భోగలాలసుడుగా కాముకుడుగా కనపడతాడు సందేశంతోపాటు యక్షకాంతకు తనకేగాని అన్యులకు తెలియని ఒక రహస్యం చెప్పాడు [3] అది యక్షుని కాముకతను తెలియచేస్తుంది అదికూడ ఈ కావ్యంలో వ్యక్తం కావాలి.

దీనితోపాటు స్వతంత్రమైన శైలీ విన్యాసం, తనదైన కల్పనాచాతుర్యం, ప్రతిభ, లోకానుభవం వ్యక్తంకావాలి. అనువాదం కంటె ఈ విధమైన స్వతంత్ర

---

1 మాఘే మేఘే గతం వయః — మల్లినాథసూరి

2 బాహ్యస్వరూపం —

తన్వీశ్యామా శిఖరి దశనాపక్వ బింబాధరోష్ఠీం
మధ్యేక్షామాచకిత హరిణీప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీభారాదలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యాతత్రస్యా ద్యువతి విషయే సృష్టిరాద్యేవధాతుః

— మేఘసందేశః 2—21.

అంతరస్వరూపం—

తాంజానీథాః పరిమిత కథాం జీవితం మేద్వితీయం
దూరీభూతేమయి సహచరే చక్రవాకీమివైకాం

— మేఘసందేశః 2—22

3 భూ యశ్చాహ త్వమపి శయనే కంఠలగ్నాపురామే!
నిద్రాంగత్వాకిమపిరుదతీ సస్వరం విప్రబుద్ధా॥
సాన్తర్హాసం కథితమసకృత్పృచ్ఛ తశ్చ త్వయామే!
దృష్టః స్వప్నేకితవ రమయన్కామపి త్వం మయేతి.॥

— మేఘసందేశః 2—51.

రచనచేయడమే అతి జటిలమైన విషయం ఈ కావ్యం చదివే ప్రతిపాఠకుడు తులనాత్మక పరిశీలన చేస్తాడు ఈ కవి కాళిదాస మహాకవి స్థాయికి ఎదగలేక పోయినా, తనదైనరచనాసామర్థ్యంచేత పాఠకునికి సంతృప్తిని కల్గించాలి ఇది మిక్కిలి శ్రమైకసాధ్యమైన విషయం ప్రతిభ, వ్యుత్పత్తులు, లోకానుభవం కల్గిన కవి మాత్రమే దీనినిసాధించగలడు

## కథాసందర్భం .

పురగిరి ఝరులనుదాటి అలకను చేరిన మేఘుడు యక్షకాంతకు పతి క్షేమవార్త తెలిపాడు ఆవార్త విన్న యక్షకాంత సంభ్రమోల్లసితనేత్రయై[1] రామగిరిలో తననుగూర్చి తనపతి ఊహించిన విధంగానే వార్తా మాత్రంచేత ప్రేయసునే యొడిగూడిన విధంగా ఆనందాన్ని పొందింది అతనికి తనపైగల ప్రేమకు పలించిపోయింది మాటికి మాటికి బుజంపైగల కంకణాన్ని ఎగదోస్తూ గవాక్షం వద్దకువచ్చి మేఘునికి ప్రాంజలించింది మరల తన పతికి ఆ మేఘుని చేతనే సందేశం పంపించడానికి నిశ్చయించుకొన్నది.

## రచనావిధానం తులనాత్మకపరిశీలన

మేఘం కనపడగానే యక్షుడు కొండ మల్లెపూలతో పూజించి స్వాగతం పలికి "జాతం వంశేభువనవిదితే పుష్కలావర్తకానాం! జానామి త్వాం ప్రకృతి పురుషం కామరూపం మ ఘొనః" అని తన అవసరానికి పొగిడాడు

ప్రతి సందేశంలోని యక్షకాంత ధూమజ్యోతిః సలిలమరుత్తుల సన్నిపాత మైన మేఘానికి అర్ఘ్యమిచ్చి స్వాగతించడానికి

"సురటినివీచు పెందులకు జూడగ వాయు విచాలితాత్మనిన్
వరశిశిరాంబుసేచనము వ్యర్థము నీకుదక స్వరూపికిన్"

అని తన అర్ఘ్యపాద్యాలు వ్యర్థమని చమత్కారంగా సమర్థించింది ఈ భావన ఔచిత్యవంతం

---

1 సీమంతినీనాంకాన్తోదన్త స్సుహృదుపనత స్సంగమాత్కించి దూనః
— మేఘసందేశః 2–39.

"కావు నరుండవెత్తరిని ఖర్వుడ వెంతయుగావుమింటిపై
దేవతవౌలెదృశ్యుడవదృశ్యుడవైదనరారుదంబుదా"

అని అర్థియైన యక్షకాంత అంబుదుణ్ణి ప్రశంసించింది కాళిదాస యక్షుని పొగడ్తకంటె ఇందులోని యక్షకాంత ప్రశంసయే చమత్కారంగా ఉన్నది

"నీవు చెప్పిన నా ప్రియుని క్షేమ వార్తలచే బాధకొంత ఉపశమించింది. కాని భయం మాత్రంనన్ను వీడలేదు భర్త విషం మింగినా ధైర్యంగా ఉండడం ఒక్క పార్వతికే చెల్లింది[1] నా భర్త క్షేమవార్తలు మళ్లీమళ్లీ చెప్పినాకు ఊరట కల్గించు వియోగతప్తలకు ప్రియుని మధురవాక్కుల శ్రవణంకంటె మరియొక్కటి ఆనందదాయకమైనది లేదు గదా!" అన్నది యక్షకాంత ఈమాటలు తన పత్నిని గూర్చిన యక్షుని ఊహలకు ప్రాణం పోశాయి[2]

"నా ప్రియుని గూర్చి నీవు చెప్పిన మాటలలో అతడనుభవిస్తున్న వ్యధ నూహించాను నా విన్నపాన్ని నా భర్తకు తెలియజేసి నీ సాధుత్వాన్ని లోకానికి తెలియజెప్పుకొమ్మని ప్రాంజలితో నిన్ను వేడుకొంటున్నాను",[3] అన్నది యక్షకాంత

"నా మాటలు విన్న నీవు మౌనంగా ఉన్నావు నీమౌనం చేత నాప్రార్థన నంగీకరించావనుకొంటున్నాను ఆర్యుల అంగీకారానికి చిహ్నం మౌనమేగదా?"

---

1 అన్న వచింపు నీవు ప్రియునంచిత గాథలనాలకించుటన్
గ్రన్నన జింత బాసితిని గాని యధైర్యము బాయదింకనున్
మిన్నక భర్తకాపదజనించునొకోయని కూర్మిదప్తనే
నెన్నగశంకలేనిదొకయీశ్వరియే కద ఈధరాస్థలిన్
— ఆంధ్రమేఘప్రతి సందేశం 1–10

2 కాంతోదంతః సుహృదుపనతస్సఙ్గమాత్కించిదూనః
— ఆంధ్రమేఘప్రతి సందేశం 2-39

3 వారిద! నాదు విన్నపము భర్తకు జెప్పిత్వదీయసాధుతన్
ధారుణిజాటవయ్య — ఆంధ్ర మేఘసందేశం 1-14

అన్నది  యక్షుడు ఏ విధంగా భావించాడో యక్షకాంతకూడ అదే విధంగా భావించింది [1] ఇది నీ చెల్లెలి పనియని కూరిమినిగాని మిత్రుని మైత్రిని పురస్కరించుకొనిగాని నాయీ ఆపదను గట్టెక్కించమని వేడుకొన్నది  కాళిదాసుని యక్షుడు నీ సోదరుని భార్య లనుకొమ్మన్నాడు [2] ప్రతి సందేశంలో యక్షకాంత నీ చెల్లెలివని అనుకొమ్మంది [3] కాళిదాసు మాటలు పురుష స్వభావాన్ని వ్యక్తం చేస్తుండగా రావాడవారి మాటల్లో స్త్రీ సహజమైన స్వభావం ద్యోతకమౌతుంది ఏ స్త్రీ అయినా తనకేదయినా ఆపదవాటిల్లినపుడు అన్నదమ్ముల వద్దకు సహాయం కోసం పోతుందిగాని, దావలను, మరుదలను అర్థించదు  యక్షకాంతకు ఇదే సహజంగా ఉన్నది  ఈ విధంగా రావాడవారి కల్పన సమర్థనీయం

"వెంటనే రామగిరికి వెళ్ళు నీవక్కడికి చేరిన సమయంలో నాపతి నిద్రచే గాక వియోగశోకంచేత అలసి కనులు మూసియున్నట్లైతే సమీపించేటప్పుడు గర్జించకు. నీశీతల జలసేకంచేత ఊరడించు ఇక ఆతరువాత నామాటలు మెల్లగా వినిపించు  చంద్రుని మాటుచేయు నీగర్భంచేత శుకపికశారికాసముదయ కిలకిలా రావాలను దూరం చేయి  నెమళ్ళను నీ విల్లు చూపి భయపెట్టు  తుమ్మెదలను నీటిలో ముంచు. కాకపోతే ఇవన్నీ నాపతిని శత్రువులై బాధిస్తాయి" అన్నది [4]

---

1 నీ పూరకయుంట బార్థనము నొప్పిన వాడవటంచు నెంతునే
నారయనియ్యకోలునకు నార్యుల చిహ్నము మౌనమేగదా?
నిశ్శబ్దోఽపిప్రదిశసిజలంయాచితశ్చాతకేభ్యః
ప్రత్యుక్తం హి ప్రణయిషుసతా మీప్సితార్థః క్రియైవ 2-54

2 అవ్యాపన్నామవితథగతిర్ద్రక్ష్యసి భ్రాతృజాయాం

3 చెల్లెలదన్నకూరిమినొ చెల్వుని మైత్రిబురస్కరించియో
యుల్లసితోరునైజకృపనో ప్రియు నాపద బాపవే

4 నిదురనుగాదు శోకమున నేత్రనిమీలనమొంపు నాప్రియున్
మాటుముచంద్ర మండలము మానక నీమెయిగప్పిశోత్రత్రిసం
పాటన కారిశారి శుకపై కరవాళి జయింపుగర్జచే
నాటలనాడు నెమ్మలను నంజాగజేయము విల్లుచూపుచున్
వేటులనీట ముంపుపతి దెల్పెడు వేళ మదీయవార్తలన

తన ప్రియురాలు నిదురపోతుంటే లేపవద్దని యక్షుడన్నాడు. నిద్రలో తనతోడి కౌగిలివల్ల కలిగే సుఖాన్ని అనుభవిస్తుండవచ్చునట నీ చినుకులచే చెట్లను తడిపి చల్లగాలికి నా ప్రియురాలు సేదతీరిన తరువాత నా సందేశాన్ని వినిపించమన్నాడు నీ మెరుపులచేత భయపెట్టవద్దన్నాడు[1]

పతి సేవాభావం యక్షకాంతది కాముకత యక్షుడిది అంతేగాక ఇక్కడొక విశేషమున్నది యక్షుడు నిదురపోతుంటే లేపవద్దన్నాడు విరహులకు నిద్ర ఎలాపడుతుంది? అది యక్షకాంత సమాధానం

యక్షుడు తన భార్యను "పరిమిత కథాం"[2] అన్నాడు తక్కువగా మాట్లాడుతుందని ఆతని భావన తక్కువగా మాట్లాడేవాళ్ళు ఎప్పుడు తూచి తూచి పలుకుతూ అర్థవంతంగా మాట్లాడుతుంటారు అదే విధంగా మేఘునికి అతిథి మర్యాదలు చేసే విషయంలో "నీవు వాయు స్వరూపుడవు, నీకు వీవనతో వీచవలేనా? నీవు ఉదకస్వరూపివి అర్ఘ్య పాద్యాదులెందుకు?" అనడంలో ఆమె వాక్చాతుర్యం వ్యక్తమౌతోంది నాసందేశాన్ని వినిపించే సమయంలో శుకపికశారికలు నెమళ్ళయందు జాగ్రత్తగా వ్యవహరించమంది దీనివల్ల ఆమె ఊహలెంత సుకుమారమైనవో, భర్తపై ఆమెకున్న అనురాగ మెంతగాఢమైన వ్యక్తమౌతుంది. పాత్రచిత్రణలో ఇటువంటి మెలకువ ప్రతిభను వ్యక్తంచేస్తాయి.

**సందేశం :**

కాళిదాసుని యక్ష సందేశంలో బాహ్యసౌందర్యాకర్షణ ప్రస్ఫుటంకాగా ప్రతి సందేశంలోని యక్షకాంత మాటలలో నాథునికై సర్వస్వార్పణం చేసిన ప్రియురాలి హృదయవేదన వ్యక్తమౌతుంది.

ఆమె తన సందేశాన్ని ఈ విధంగా వివరించింది

---

1 తస్మిన్కాలే జలద యదిసా లబ్ధనిద్రా సుఖాస్యా
దన్వాస్యైనాం స్తనితవిముఖోయామమాత్రం సహస్వ 11—36

తాముత్థాప్యస్వజలకణికాశీత లేనానిలేన
ప్రత్యాస్వస్తాం సమభినవైర్జాలకైర్మాలతీనాం 11—37

2 తాంజానీథాః పరిమిత కథాం జీవితం మే ద్వితీయం —

**తన స్థితినిగూర్చి :**

"నేనిక్కడ యత్నం లేని బుద్ధిలాగా, సంపదలేని సుఖేచ్ఛవలె, సుగుణ వర్జితమైన ఆకృతిలా, సత్యములేని వాక్కులా నీ వియోగం చేత వ్యర్థనై ఉన్నాను వాకిట్లో గడ్డిపోచకదిలినా నీవే వస్తున్నావని చూస్తూ యిన్ని మాసాలు గడిపాను నీ వియోగతాపాన్ని సహించలేక ఉపశమనం కోసం ఎన్నో వ్యర్థ ప్రయత్నాలు చేశాను నాపట్ల మన్మధుడు హంతకుడుగా, చంద్రుడు ఉరుతాపుగా బాధిస్తున్నారు నన్నీ విరహం రంపంలాకోస్తోంది కాని నిన్నుచూడాలనే కోరిక మాత్రమే నన్నీ ఉసురులతో నిలుపుతోంది[1]" ఇది కాళిదాస భావనకు ప్రతిస్పందన నిన్నే ధ్యానిస్తున్న నేనీ దుస్థితిని పొందాను ఆ స్థితిలో ధ్యాన మగ్ననైయుండగా సర్వం మరచి సదమల చిత్తాద్వైతస్థితి పొందాను. కానీ నీవు ఏకాకివై ఏ బాధలు పొందుతున్నావన్నదే నా విచారం నన్నొక అనుమానం వేధిస్తోంది. నన్ను వదలి ఎనిమిదినెలలు ఇక్కడగడిపావంటే నరవనితలతోడి సౌఖ్యాన్ని చవిచూస్తున్నావాయేమి?

హరి! హరి! అట్టి నా ప్రియుని ఇటువంటి మాటలతో తూలనాడదగునా? నాయీ దుర్విధికినీవేంచేస్తావు? ఈ మాటలన్నందుకు నన్ను క్షమించు ఆహారం ఇష్టం లేకుండా పోయింది" అన్నది.

**గృహస్థితి :**

గృహశారికలు దిగులుచెంది ఉన్నాయి. నెమలిశోకంతో ముడుచుకుపోయి ఉన్నది నీరుపోసినా పాదపాలపూలు వాడిపోతున్నాయి. దివ్యకాంతులతో వెలుగొందే మందారం నీవు లేక వెలవెలపోతోంది ఈ కృత్రిమాచలాలు నీతో గడిపిన మధుర క్షణాలు గుర్తుచేస్తున్నాయి. నీ తొడపై తలనాన్చిన లేడిపిల్లలను

---

[1] ఆశాబన్ధః కుసుమసదృశం ప్రాయకోహ్యంగ నానాం
సద్యఃపాతి ప్రణయిహృదయం విప్రయోగే రుణద్ధి 1–10

(స్త్రీల ప్రాణాలు పూలవలె కోమలాలు. విరహతాపం తాళలేక రాలిపోతాయి కాని భర్త విషయమైన అతి తృష్ణ తొడిమవలె పట్టుకు నిలుపుతుంది).

అక్కున జేర్చి లేతపచ్చిక నోటికందించి ప్రేమతో పెంచావు. అవి నేడు చాలా కాలన్నించి నీవు కనపడకపోవడంచేత తండ్రి కనపడక విలవిలలాడే పిల్లలలవలె దీనంగా కన్నీరు కారుస్తున్నాయి

నీవు చండివై నీప్రియుణ్ణి వదిలేశావా లేక అతడే నిన్ను వదిలేశాడా? అని గోరుచుట్టుపై రోకటిపోటులా పొరుగింటి అమ్మలునన్ను బాధిస్తున్నారు. సేవకులు బంధువులు నాపై చూపే సానుభూతి నీ వియోగంకంటే బాధిస్తోంది. నాచిత్తరువు వేసి కన్నీరు అడ్డురాగా చూడలేకపోయావునీవు కలలోనైనా నిన్ను చూద్దామంటే నిద్రకు నేను దూరమైనాను విధిమనల్ని ఇలా బాధిస్తోంది. ఇక్కడివాళ్లంతా నీవెవరినో తీసుకుపోయావనుకొంటున్నారు. ఆమాటలు నన్నెంత బాధిస్తున్నాయో తెలుసా? ఏట్లా సహించేది? దయాస్వరూపుడైన శివుడు మనలను ఈ వియోగ బాధకు దూరం చేయగలడు

ఈ నాల్గునెలలు కళ్లుమూసుకు గడపమన్నావు? అదెలా సాధ్యం? ఇంతలో నాప్రాణాలుపోతే నిను చూచి సుఖించే భాగ్యమెవ్వరికోగదా? నాకలలో నీవు పరసతిని కూడినట్లు చూచి పరుషాలు పల్కినందుకు కోపించావా ఏమి? అలా అయితే నన్ను క్షమించు నెలపదిహేను రోజుల్లో నీవు రాకపోతే ప్రాణాలు పంచభూతాల్లో కలిసిపోతాయ"న్నది యక్షకాంత.

**సందేశం :**

ఇంతగోడు వెళ్లబోసుకొన్న యక్షకాంత చివరకు యక్షునిలా నమ్మకం కోసం తామిద్దరికేగాని పరులకు తెలియని ఒక రహస్యాన్ని తెలిపింది.

"ఓ మేఘుడా! శివారాధనకై చేసిన మాలను నామీద గాఢమైన ప్రేమతో నాకొప్పులో తురుమగా మరలగుర్తుకువచ్చి దానిని శివారాధనకై కొనిపోయి కుబేరునకీయగా అతడు శివుని కర్పించాడు శివుడీ మాలను తిరస్కరించాడు. అందకు కారణాన్ని తెలిసికొన్న కుబేరుడు భయంకరమైన శాపాన్నిచ్చి మరల

జాలితో దాన్ని వర్షపరిమితం చేశాడు[1] ఈ సంఘటన నాకు నా పతికేగాని అన్యులకు తెలియదు. నీ వాతనికిది వినిపించు" అన్నది

కేవలం సందేశమేగాక పతికత్యంత ప్రియమైన శుభవార్తను తెలియ జేసింది.

శివుని ఆదేశంతో కుబేరుడు శాపవిమోచనాన్ని కల్గించాడు ఈ నాల్గు నెలలు అక్కడ ఉండకుండా వెంటనే వచ్చేయమన్నది[2] యక్షకాంత. అంతేగాక

---

1 వివిధములైన సూడిదల భృత్యులు గైకొని వెంటరాగవే
శివుని భజింప యక్షపతి చేరి సభన్ దనకాన్కలీయగా
శివుడును వానినన్నిటిని చేతులనాదృతినందె గానియా
పువుసరమంటకుండ సఖి మోమును గాంచుచు నవ్వెనల్లనన్॥

అపుడె జనింప సిగ్గుమది యక్ష విభుండ వికాశియాచు నీ
యపకృతి చిత్రకంరునిదె యాననిధ్యానముచే నెఱింగియో
చపల! యిదేరి మూలమున సల్ప్రితి వాసతినొంద వ్రక్కలై
ప్రపతనమొందు నీ శిరము పాపుడ పొమ్మని యిచ్చె శాపమున్॥

దారుణశాపమున్ వినిన తక్షణమగ్ని జొరంగ బాఱు నన్
దారుచు సర్వ సంపద ధనాధిపుపూజయొనర్చినంతనే
జేరినిజేశుపాదముల చెంతనువై వనతండుశాంతుడై
పారములేని శాపమొకవత్సరభోగ్యమొనర్చె సత్కృపన్॥

2 గిరిశుదయాతిరేకమున గిల్బిషమంతయుబాసెకిన్నరే
శ్వరుడు ప్రసన్నుడయ్యెగడుభాధలగాంచెఢు కాళ్ళమేగె

మరల విషయవాంఛలకు లోనుగాక ఈశ్వరార్చనాపరుడవై శేష జీవితము గడుపుమన్నది.[1]

ఇంత సుదీర్ఘమైన సందేశంలోను మొదట వ్యక్తమయ్యేది ఆమె హృదయ సౌకుమార్యం. ముందు నీకొఱకు వేచియున్నానన్నది. తరువాత స్త్రీ సహజమైన ఈర్ష్యలో ధూర్త సాధువు వేషంలో అక్కడి నరకాంతల సౌఖ్యాన్ని కోరు కొంటున్నావా? అని ప్రశ్నించింది వెంటనే పశ్చాత్తాపాన్ని పొంది యోగినీవృత్తి నవలంబించి నీకై ధ్యాననిమగ్ననై యున్నానన్నది. ఇరుగు పొరుగు వారు నన్ను హేళన చేస్తున్నారన్నది నీవు లేక గృహవాతావరణమంతా చిన్న బోయినదన్నది నాల్గునెలలుగాదు వెంటనే రమ్మన్నది. నీ దర్శనం మాత్రం చాలు. ఇక్కడకొచ్చి నా ఇంద్రియలోలుడవుగాక మిగిలిన కాలం నాల్గునెలలు ఈశ్వరార్చనలో గడపమన్నది. కుబేరుడు నీ మీద కనికరించాడన్నది.

ఈ యక్షకాంతమాటలలో కామవాంఛకు దూరమైన ప్రణయిని అయిన స్త్రీ హృదయం గోచరిస్తుంది. ఈశ్వరుని ఆదేశం మేరకు కుబేరుడు యక్షుని అనుగ్రహించుననే కల్పనకు కాళిదాస కావ్యంలోనే బీజమున్నది[2] ఆ కావ్యంలో మేఘుని వార్త కుబేరుడు విన్నట్లుగా ఉండగా, ఈశ్వరుని ఆదేశమే కుబేరుని అనుగ్రహానికి కారణమైనట్లు ప్రతిసందేశకావ్యంలో కల్పన అధికులు అల్పులపై జాలిచూపడంకాదు కావలసింది. అనవసరమైన ఆవేశం ప్రదర్శించగూడదనే సత్యం ఈ కల్పనలోద్యోతకమౌతుంది. తన భృత్యుని తాను శపిస్తే తన దైవం తన్ను ఆదేశించాడు కరుణించమని. ఇది కుబేరులకు (ధనవంతులకు) హెచ్చరిక లాంటిది

---

1 చెంగటనుండు శంకరుని సేవను సంజ్ఞలచేసి నీదు న
ర్థాంగినినన్ ద్వదీయచరణాంబుజ దర్శన ధన్యజేయుచున్
లొంగకధీరతన్ విషయలోలతగాంచక కొంతకాలమి
బ్బంగి జరించు మింటికడ బాపు సుఖంబున కాలశేషమున్

2 శ్రుత్వావార్తాం జలదకథితాం తాంధనే శోఽపి సద్యః
శాపస్యాంతం సదయహృదయః సన్నిధాయాస్తకోపః
సంయోజ్యైతౌ విగళిత శుచౌ దంపతీహృష్ట చిత్తౌ
భోగానిష్టానభిమతసుఖాన్ ప్రాపయామాసభూయః॥ ii_57

# యక్షకాంత మేఘునకు వివరించిన మార్గం

సందేశకావ్యాల్లో మార్గోపదేశం ముఖ్యమైన భాగం. మేఘునకు తిరుగు ప్రయాణమైనా యక్షకాంత మార్గముపదేశించింది కార్యార్థులైనవారి ఆతృత అటువంటిది వచ్చినమార్గం గుర్తులేక మారు మార్గంపడితే ఆలస్యం జరగవచ్చు ఎటు వెళ్ళాలో తెలీక నిలబడి పోనూవచ్చు కాబట్టి యక్షకాంత మార్గంనిర్దేశించడం సమంజసమే. అయితే స్త్రీ కదా! గడపదాటి యెరుగని మానవతి. ఇన్ని ప్రాంతాల్ని ఎట్లా అభివర్ణింపగల్లుతుంది? ఇంతటి లోకపరిశీలన మెట్లా ఏర్పడి ఉంటుంది? ఈ దృష్టితో చూస్తే యిక్కడ ఔచిత్యం దెబ్బతింటుంది అందుకేమి చేస్తే బాగుంటుంది? మేఘనిచేతనే తాను వచ్చిన మార్గాన్ని చెప్పించి, దాన్నే దృఢంగా జ్ఞాపకం పెట్టుకోమనాలి ఇదో పద్ధతి. లేదా ఇంకో విధానంకూడా ఉన్నది అది ముమ్ముందు విదితం

యక్షకాంత వివరించిన మార్గాన్ని బట్టి అలకా పట్టణంలోని చైత్రరధం నుండి బయలుదేరిన మేఘుడు రజతాద్రి, హిమాలయం, కాశ్మీరం (శ్రీనగర్), పంజాబ్ (అమృతసర్) హస్తినాపురం, సింహళం, జైపూర్, ఉదయపూర్ చిత్తోడ్, ఉజ్జయిని, వింధ్యపర్వతం విదర్భ దాటి ఆంధ్రదేశం మీదుగా రామగిరి చేరకోవాలి ఒకవేళ అక్కడ యక్షుడు కనపడకపోతే విరహోన్మత్తుడై ఎక్కడికి పోయాడో వెదకి సందేశాన్ని వివరించాలి వెదక వలసిన ప్రాంతాలు కూడ వివరించింది యక్షకాంత

పంపానది, ఋష్యమూక పర్వతం, తుంగభద్ర, హంపి విజయనగరం మండికల్ ఆవుటకొండ, పినాకిని, నందికొండ, బెంగుళూరు, యాదగిరి, శ్రీరంగం, కీలాద్రి, రాఘవేంద్రస్వామిమఠం, అటునుండి కేరళ, కొచ్చిన్, కాలడి, తమిళదేశం, దర్భశయనం, రామేశ్వరం, మధుర మొదలైన ప్రాంతాలు వెదకి ఎక్కడ కనిపించినా నా వార్తలు నా పతికి తెలియచేయమన్నది

ఈ సందేశకావ్యాల్లో మార్గోపదేశం రచయత లోక పరిశీలనాదక్షతకు వర్ణనానైపుణ్యానికి తార్కాణం కవి తన జీవనప్రయాణంలో ఎన్నో అద్భుతమైన దృశ్యాలు చూస్తాడు పుణ్యక్షేత్రాలు ప్రకృతి రామణీయక దృశ్యాలు చూస్తాడు అలాగే లోటిమానవులను, వారిలోని చిత్రప్రవృత్తిని పరిశీలిస్తుంటాడు.

కవియైనందువల్ల ఇవి అన్నీకూడ ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఆతని కావ్యాలలో చోటు చేసికొంటాయి

కవికి ఈ సందేశ కావ్యాల్లో ఉన్న తన అనుభవాలనన్నింటినీ ఆత్మాశ్రయరీతిలో వ్యక్తం చేయగల అవకాశం ఈ కావ్యాల్లో చక్కగా ఉన్నది. ఉత్తముడైన కవి దీన్ని సద్వినియోగం చేసికొంటాడు రావాడవారు ఈ మార్గోపదేశాన్ని తమపరిధిలో తమ కావ్యనాయిక యక్షకాంతచేత సముచితంగా పలికించారు.

## మార్గనిర్దేశంలోని విశేషాలు

అలకాపురం నుండి రామగిరిచేరేవఱకు చాలావఱకు ఉత్తరభారతంలోని అనేక ప్రాంతాలు వర్ణింపబడ్డాయి. కవి అంతటితో తృప్తిచెందలేదు ఇక్కడ ఒక చిన్న కల్పన చేశాడు కవి ఉన్మత్తుడై తిరుగుతూ తిరుగుతూ రామగిరిపైన ఉండక యక్షుడు ఎటైనా పోతే సందేశం చేరవేయడంలో ఉపేక్షచేయవద్దని అతడెక్కడ ఉండగలడో ఆయాప్రాంతాలు వెదకి నా వార్తచెప్పమని యక్షకాంత చేత అనిపించి, ఆ యాసమీప ప్రాంతాల్ని వివరించాడు దక్షిణ భారతంలోని ముఖ్యప్రాంతాలన్నీ ఈ సమయంలో వర్ణింపబడ్డాయి కాబట్టి ఈ ప్రతిసందేశంలోని మార్గవర్ణన అఖండ భారత సమగ్రచిత్రణంగా రూపొందింది

ఇందుకొన్ని అనౌచిత్యాలు లేకపోలేదు అలకలోని యక్షకాంతకు ఈ భారతదేశంలోని పుణ్యగిరిఝురులు, క్షేత్రాలు ఎలా తెలిసి ఉండవచ్చు? దీనిని కవి ఆమెచేతనే సమర్థింపజేశాడు తాము ఎప్పుడప్పుడు ఆ పుణ్యభూములకుపోయి వచ్చేవారమని, అందువల్ల మార్గం చెప్పగల్గుతున్నానని[1] యక్షకాంత ఈశతాబ్ది

---

[1] వారిద! నన్ నవోఢమును వల్లభుకాడట వెంటగొంచుదా
భారతదేశమందు గనుపండువులై భవదధ్వగంబులే
యేరమణీయభాగముల నింపదరన్ విహరింపజేసె నా
సారపరీ నదీగమన శైలములన్ వినుమా వచించెదన్
— మేఘ ప్రతి సందేశము 2-17,

లోని ఆధునిక భారతదేశ వర్ణనచేసింది ఈ వర్ణనలో బెంగుళూరు, మైసూరు, అక్కడి పాఠశాలలు, కళాశాలలు యంత్రాగారాలు మొదలైనవి ఉన్నాయి ఈ వర్ణనలు కాలౌచిత్యనికి భంగాన్ని కల్గిస్తున్నాయి ఇది స్వతంత్రకావ్యమైనా మేఘప్రతిసందేశం కాళిదాసు పంపిన మేఘమే మరల తిరిగి పంపబడ్డది అదీగాక నాల్లునెలలు నేను సహించలేను వెంటనే రమ్మన్నది ఆనాటికి ఈనాటికి ఎంతో అంతరమున్నది

ఈ సందేశ కావ్యరచయితలందరూ కాలానికింత ప్రాముఖ్యమీయరేమో! ఆనాటి తనచుట్టూఉన్న సమాజాన్ని వర్ణించారు

వేదాంతదేశికులు హంస సందేశంలో నాయకుడు శ్రీరాముడు అతనిచేత లంకలో ఉన్న సీతకు సందేశం పంపిస్తూ తన కాలం నాటి దక్షిణ భారత దేశంలోని ఎన్నో విశేషాలు వర్ణింపజేశారు. అదే విధంగా ఈ వర్ణనను కూడ సమర్థించవచ్చు

## వర్ణనా వైభవం

మార్గోపదేశంలోని భావాలన్నీ కవి అనుభవాలే పాత్ర కేవలం ఉపకరణం మాత్రమే చెప్పేదితానే అయినా పాత్ర స్వభావాన్నిబట్టి చెప్పే విషయాలన్నీ ఆమె మాటలుగానే ఉంటాయి

మేఘానికి రజతాద్రిలోని విశేషాలు తెలిపే సందర్భంలో యక్షకాంత పల్కిన మాటలు తెలుగింటి ఆడబడుచు పల్కిన పలుకులుగా ఉన్నాయి

ఆ రజతాద్రిలోని సతులు పార్వతిని పేరంటానికి పిలిచి ఆమెకు చందనాదులతో సత్కరించి ముచ్చటలాడుతూ "నిన్ను చేపట్టినందువల్లనే శివుడు త్రిలోకవల్లభుడైనాడు. విషం మ్రింగినా సజీవుడై ఉన్నాడు సతుల సౌభాగ్యం వల్ల పతులకు సౌఖ్యమబ్బుతుందన్నది నీ పట్ల సార్థకమైంది" అన్నారు ఆ మాటలకు పార్వతి లోలోపల నవ్వుకొంది "నీ పిల్లలకు పెండ్లి కాలేదేమి?

పాత్రులను పొందితేనేగదా కాపురానికి నిండుదనం చేకూరేది" అని ఒక పడతి పల్కగా ఆ మాటలకు కూడ చిరునవ్వే పార్వతి సమాధానమైంది.[1]

ఈ సంభాషణ ఆంధ్రసంస్కృతికి అద్దంపడుతుంది. తెలుగువారి లోగిళ్ళ లో ప్రతిపండుగకు ఏదోరకమైన పేరంటం జరుగుతుంది సహజంగా అక్కడ జరిగే సంభాషణలు ఈ విధంగానే ఉంటాయి కావ్యం ఏకాలానికి సంబంధించి నదైనా రచయిత అనుభవాలు చోటు చేసికొంటాయనడాని కిదొకచక్కని తార్కాణ.

**తెలుగు పడతులు** ·

భూరివిభూషలై సరస బుద్ధిమెలంగుచు శ్యామలౌచు సా
ధ్వీరమణీయ శీలలయి ప్రేయసునందనురక్తలాంధ్ర రం
భోరువులచ్చటన్ గనుచునుందురు త్వత్ప్రియదృశత్వమందినిన్
జారుతటిద్యుతున్ సజల శ్యాము సదధ్వగు సాంధ్యరాగునిన్

యక్షకాంత ఆంధ్ర స్త్రీలను సరసబుద్ధులు, సాధ్వీరమణీయ శీలలు అ న్నది అంతేగాక నిండుగా ఎప్పుడూ ఆభరణాలు ధరించి ఉంటారట మన

---

1 పేరటమాచరించుటకు బిల్వగ బార్వతి నీ పుకీసతుల్
వారలయిండ్లకేగు ఒకివారముతో గిరిపుత్రియచ్చటన్
గారవమొప్పనా సతులు గౌరికి కుంకుమ చందనాదులన్
భూరిగనిచ్చిమైత్రిగొని ముచ్చట లాడుదురెంత ధన్యలో॥
అమ్మరో! చెట్టవట్టినినునయ్యె శివుండు త్రిలోకవల్లభుం
డిమ్ములనాతడుండుగ దయిద్దరిమేడల, భూమి స్త్రీల భా
గ్యమ్మున సౌఖ్యముల్ పతుల కబ్బెడు నంచును మాట నీక
సార్థమ్మగునంచు బేరవనితల్ పలుకన్ మదినవ్వగౌరియున్॥
అంబ! భవత్కుమారుల కహోఇటచన్మను లేదు పెండ్లి బా
లాంబయు నీదు పుత్రతగినట్టివరున్ గనకుండు బౌత్ర భా
గ్యంబుగనంగ నెట్టులగు గాపురమింకను బొందదంచు ప్రే
మంబున నోర్తు బల్కవిని మానసమందె హసించు గౌరియున్॥

ప్పటికీ ఈస్థితిని చూస్తుంటాము ఆంధ్రస్త్రీలకు ఆభరణాలంటే మక్కువ ఎక్కువ ఆంధ్రస్త్రీలపట్ల ఈ వర్ణన అద్దం పట్టినట్లుగా వున్నది కాని ..క స్త్రీ పరపురుష నితో పలికే సందర్భంలో స్త్రీలను గూర్చి "రంభోరులు" అని అనడం ఔచిత్యా నికి భంగమనక తప్పదు

**బెంగుళూరు వర్ణన .**

అచ్చటియెల్ల వీధులను నాంగ్లభటుల్ విహరింతురెప్పుడున్
బచ్చలు లక్షలక్షలుగ వర్తకముల్ బచరింతురాయెడన్
హెచ్చగ గార్యశాలల జరించుచునుందురు గర్మకారులున్
నిచ్చలు యంత్రచక్రముల నిస్వనముల్ మినుముట్టుచుండెడిన్

ఈ వర్ణనలో కవి తాను చూచింది మాత్రమే వ్యక్తంచేశారు పట్టణ వర్ణన అనగానే ప్రాచీన ప్రబంధాలలోని ఆ మేడలు ఆకాశాన్ని అంటుతున్నాయి లాంటి వర్ణన చేయక సహజస్వభావ వర్ణన చేశారు

బాటలు జనసమ్మర్దంగా ఉంటాయట. శకటాలు వేగంగా తిరుగు తుంటాయట. వర్తకులు లక్షలలో వ్యాపారం చేస్తున్నారట, పెద్దపెద్ద కర్మా గారాలతో నిరంతర ధ్వనులు మిన్నుముట్టుతూ ఉంటాయట ఇది ఆ పట్టణాన్ని గూర్చి వాస్తవికమైన ఆలోచనను పాఠకునికి కల్గించేదిగా ఉన్నది.

**యాదగిరి నరసింహస్వామి వర్ణన :**

వరతులసీసరోగన్వితము భాసిత భాస్కర ముఖ్య దీపి కాం
కురము త్రయీనుతంబయి యకుంఠ వినూత్న మనోజ్ఞమూర్తియై
నిరతము భక్త హృత్కుహర నిష్ఠితమై కమలాశ్రితంబునై
కరమలరారు తేజమును గాంచు తదాలయమందు వారిదా!

వరసిద్ధప్రదుడు, మహిమాన్వితుడు అయిన త్రయీనుతుడు నృసింహ స్వామిని భక్త్యావేశంతో వర్ణించారు రావాడవారు మేఘునిమాట ఎలాఉన్నా ఈ కావ్యాన్ని చదివిన ప్రతి పాఠకుడు నృసింహమూర్తిని తప్పక దర్శించి సేవించి తరించాలనుకుంటాడు.

ఇంకా ఈ రచయిత పంపా, పినాకినీ మొదలైన నదులను, కాలడిచిత్తోడి, జైపూర్ మొదలలైన పట్టణాలను, రంగనాథుడు, మహాకాలుడు మొదలైనదేవతలను

వివిధ విద్యాసంస్థలను కన్నడ చేడియలను, ఆదిశంకరులను, మధురలోని మీనాక్షి సుందరేశ్వరులను ఉపాధ్యాయుల బ్రదుకు తెరువును ఈ విధంగా తన అనుభవం లోని ఎనెన్నో విశేషాలు వర్ణించి సుదీర్ఘమైన మార్గోపదేశంతో పాఠకులకు విసుగుజనింపని రీతిలో వర్ణించారు. అక్కడక్కడ కాళిదాస మహాకవి ప్రభావం కూడ చోటు చేసికొన్నది.

యక్షుడు మేఘునితో సీతారాములను గూర్చిన మారుతవల మాకు సహకరించినట్లైతే సౌదామనితో వియోగంలేని సౌఖ్యాలతో కాలక్షేపం చేయ గలవని అన్నవిధంగానే యక్షభామకూడ అన్నది [1]

చివరకు నాయికా నాయకుల సమాగమం ఉదాత్తంగా సాగింది కాళిదాస కావ్యంలో. మేఘుని మాటలు విన్న ధనదుడు యక్షునిపై దయగలిగి శాపా వసానాన్ని కల్గించాడు.

ఈ కావ్యంలో జక్కులరేడు చారముఖాన యక్షకాంతమాటలు విని ఒక రథాన్ని రామగిరికి పంపి సాదరంగా అలకకురప్పించాడు.

ఈ ఆంధ్రమేఘ ప్రతి సందేశం ముమ్మూర్తులా కాళిదాస కావ్యాన్ని పోలింది శ్రీ రావాడవారు తెలుగు రచనలో ప్రతిభకులోటురానీక సరసమైన కల్పనాచాతుర్యంతో పాఠకలోకానికి స్త్రీపరమైన వియోగబాధలోని అంతర్యాన్ని ఆమె హృదయాన్ని ఆవిష్కరించడానికి ప్రయత్నించి కృతకృత్యులైనారు.

తొలి తెలుగు సంప్రదాయ సందేశ కావ్యకర్తగా శ్రీ రావాడవారు పరిగణనీయులు.

---

1 ఇత్యాఖ్యాతే పవన తనయం మైథిలీవోన్ముఖీ సా
త్వా ముత్కంఠోచ్ఛ్వసిత హృదయాం వీక్ష్య సంభావ్యచైవ 2-39
ఇష్టాన్ దేశాన్ జలదవిచర ప్రావృషా సంభృతశ్రీః
మా భూ దేవం క్షణమపిచతే విద్యుతావిప్రయోగః 2-55
రామగనిన్ విముక్తుని ననారతవిహ్వలుగాంచి యెచ్చటన్
రాముని సీతజేర్చు కపినాధుని క్రైవిడి నీవు మమ్ములన్
ప్రేముడిగూర్చిలోకముల నిచ్చలు దన్పుచుస్వాంబు దృష్టి సౌ
దామని గూడియుండు ఘన! తద్గత సౌఖ్యము నీకునబ్బుతన్



"చకోరముతో యక్షిణి"

అతికృశాంకిత నిజాకృతి నమ్మలేక
వెతనుగూరి గవాక్షవేదికంజేరి
పతికోసమైనభః పధరాశి శూన్య
గతులనన్వేషింప కందోయి కెదియొ
సితమరీచిక రుచుల్ చిలుకుచుందోచె
గురుతువట్టుచు నిట్లు చిరతరంబైన
పరమ సుస్నేహభావంబు జాలువార
మధురాతి మధుర కోమల శబ్దఫణితి
విధురజీవిత గాధ విన్పింపదొరగె

వినవె చకోరికా వినవె నా చెల్లి
వినిపింతుగన్నిటి విరహగీతికల
అనుకంప నీదుప్రత్యణువులో దొనక
నినదింతు నేనె నిల్వున గరంగుచును.

— చకోరసందేశం

# చకోరసందేశము

ఈ చకోర సందేశ కావ్య రచయిత మోటూరి వేంకటరావుగారు విరు 'సింహబలి' అనే వీర రసాత్మక కావ్యాన్ని 'హిమగళము' అనే ఖండకావ్య సంపుటిని, 'మృగతృష్ణ' అనే కావ్యాన్ని వ్రాశారు. వీర రస ప్రధానమైన సింహబలితో పండిత లోక ప్రశంసలు పొందిన వీరు తరువాత వియోగ శృంగారాత్మకమైన ప్రణయసందేశకావ్యాన్ని వ్రాసి కవులచే స్తుతించబడ్డారు. వీర శృంగారాలతో కావ్యం వ్రాసి సహృదయులను మెప్పించగలనని నిరూపించారు. రెంటిని ఏకరీతిని పరిపోషించిన ఘనతవీరికి దక్కుతుంది.

కఱకు కత్తుల ధాళధళ్యానికి యుద్ధోత్సాహానికి ప్రతిబింబం సింహబలి కాగా, వెన్నెలచకోరాలు, ఆరామసీమలు, కేళిగృహాలు, గిరులు, చంద్రశాలలు క్రీడా సరస్సులు, కలువపూలు తొలకరి జల్లులు మలయానిలం మొదలైన వాటియొక్క సుకుమార వర్ణనలకు అక్షరదర్పణం చకోరసందేశం.

ఈ చకోర సందేశం కవికులగురువైన కాళిదాసమహాకవి మేఘసందేశానికి స్వతంత్రభావనాకుశలతతో కూడిన ప్రతిరూప సందేశకావ్యం.

ఎందరో కవులు నాయకుని చేత నాయికకు సందేశం పంపిస్తూ చర్విత చర్వణాలైన కావ్యాలు వ్రాస్తుండగా మేఘ, హంస సందేశాదులను అనువదిస్తూ కొందరుండగా వీరు విలక్షణమైన ఊహచేసి యక్షకాంత నుండి యక్షునకు సందేశం పంపించారు.

ఇంతకుముందు రావాడ వేంకటరామశాస్త్రిగారు మేఘ ప్రతిసందేశం వ్రాశారు. మేఘుడు అలకకు వచ్చి యక్షుని వార్తను చెప్పిన అనంతరం ఆ మేఘునిచేత తన వార్తను కొంతవఱకు కుదటబడ్డ మనస్సుతో తన పతికి ప్రతి సందేశంగా పంపింది యక్షకాంత. పరమేశ్వరుని ఆదేశం చేత యక్షునకు కుబేరుడు శాపోపశమనం కల్గించగా ఆ శుభవార్తను తన ప్రియునికి తెలిపేది మేఘ ప్రతిసందేశం.

కాని మోటూరి వేంకట రావుగారి చకోర సందేశంలో మేఘుడు యక్షుని వార్త యక్షకాంతకు తెల్పియపర్చకముందే ఆమె చకోరాన్ని తన దూతగా

సందేశం పంప నుద్యుక్తమైంది కావ్య రచనలో ఇదికొద్దిమార్పుగా పైకి కనిపించ వచ్చు, కాని కాళిదాస మహాకవితో ప్రతిభటత్వం వహించినటువంటి స్వతంత్ర రచన కావించారీ మహాకవి.

## ఈ కావ్య రచనకు ప్రేరణ

చకోర సందేశ సృజనకు ఆధారమైంది కాళిదాస మేఘసందేశమైతే ఈ రూపాన్ని సంతరించుకోడానికి అడుగడుగున మార్గదర్శకమైంది శ్రీ త్రిపురాన వేంకట సూర్యప్రసాదరావుగారి మొయిలు రాయబారం.

అందులో తన కన్నబిడ్డయైన మొయిలు రాయబారకన్నెను శ్రీ త్రిపురాన జయపురాధీశులైన విక్రమ దేవవర్మగారికి పెంపుడు బిడ్డగా సమర్పించారు.

ముందు తనకన్న బిడ్డను దత్తపుత్రికగా విక్రములచే స్వీకరింపజేసి అనంతరం విక్రములచే ఆమెను రామునకు సమర్పింప చేస్తారు. అనంతరం కృతికన్య కృతజ్ఞతాభివందనములు పలుకింది ఇది కావ్యానికి పూర్వరంగం.

ఈ విధంగానే చకోర సందేశంలో సఖీసంధానం అనే పూర్వరంగంలో కవ్యభ్యర్థనను, అదివిన్న కాళిదాస మహాకవితపోవాక్కులను అనంతరం కృతి కన్యకాభ్యర్చనాన్ని అటుతరువాత మేఘసందేశ కృతికాంతాసంభాషణను, చివ రకు కృతికర్త ధన్యవాదాలను కూర్చారు.

చకోర సందేశకృతికర్త తనకావ్యకన్యను నీ పుత్రికతో స్నేహాన్ని కూర్చాలనుకొంటున్నానని కాళిదాసకవిని అడుగగా ఆయన సంతోషాన్ని వ్యక్తం చేశాడు అప్పుడు మేఘకావ్యకాంతను తన కృతికన్యను సోదరిగా స్వీ కరించమని కోరాడు. ఆమె కూడ అంగీకరించింది. తన కృతికన్యను మేఘకావ్య కాంతకు అప్పగించి ధన్యవాదాలు చెప్పాడు. ఇది అంతా త్రిపురానవారి ప్రభావమే

త్రిపురాన మొయిలు రాయబారంలో మకుటాలు కూర్చారు. అదే విధంగా మోటూరివారు

"వినవె చకోరికా! వినవె నా చెల్లి!!
వినిపింతుకన్నీటి విరహగీతికల"

అనే మకుటాన్ని తన చకోర సందేశంలో కూర్చారు. కావ్యాన్ని దేశి చ్ఛందమైన-ద్విపదలో ప్రారంభించారు దీనిపై గూడ త్రిపురాన వారిప్రభావమే ఉన్నది అయితే ఇతర ఛందస్సులు కూడా వాడారు

యక్షకాంత తన మగని శాపకారణాన్ని చకోరానికి తెలియచేస్తూ

"యక్షేశ్వరుని గొల్వ అస్మదీశ్వరుడు
దక్షుడై నిధుల సంరక్షణంబూనె
అనుదినంబునునాధుడప్రమత్తతను
గనజేసి నిర్ణీతకాలంబులందు
ధనదునిం గొల్చుచుండెను"

అని అన్నది త్రిపురానవారి మొయిలు రాయబారంలో నిధి రక్షణాధికారి నని స్వగతంలో చెప్పుకొన్నాడు యక్షుడు అట్టి మాటలనే ఈ యక్షకాంత పల్కడం చేత త్రిపురానవారి మొయిలు రాయబారం ఎంతగాగాఢముద్రవేసిందో స్పష్టమౌతుంది.

## సఖీసంధానము – కవి ఉద్దేశ్యము

అయిదు భాగాలు గల్గిన ఈ సఖీసంధానంలో తన కావ్యాన్ని గూర్చి లోకానికి తెలియజెప్పాడు

### కవ్యభ్యర్థన

ఇందులో ఛందస్సు ఉత్సాహం మేఘకావ్య సఖీ సంధానంలో కవికి గల ఉత్సాహాన్ని తెలియజేస్తుంది. "హరిద్యశః ప్రకాశుడవైన ఓ కాళిదాసా! సాహసమే అయినా లేహారంగులీను నాకావ్యకన్యను నీ హిమాద్రిపుత్రికకు విమలమైత్రి కూర్చాలనుకొంటున్నాను అనుగ్రహించమ"న్నాడు.[1] ఈ మాటల్లో ప్రపంచవిఖ్యాత

---

[1] ఓ హరిద్యశః ప్రకాశ!
ఓయి కాళిదాస! ఉ
త్సాహపూర్వకానురక్తి
సాహితీప్రసక్తిమై
లేహారంగులీనునాకు
లీనకావ్యసూనకున్
నీ హిమాద్రిపుత్రికకు వి
నీలమైత్రిగూర్చగా
సాహసమ్ము నూపితిన్
బ్రసన్నతన్ గ్రహింపుమీ

మైన కాళిదాస కావ్యం సరసన అంతటి స్థానం తన కావ్యానికి పండితలోకంలో లభిస్తుందన్న ప్రత్యయం కివికి గాఢంగా ఉన్నట్లు ద్యోతకమౌతుంది.

**కాళిదాస తపోవాక్కు :**

ఈ అభ్యర్థనను విన్న కాళిదాస మహాకవి మిక్కిలి సంతోషాన్ని పొందాడు. విరాజమానుడైన కవిరాజు యొక్క వాక్కులిలా వినిపించాయి. "ఎవరోగదా నన్ను బ్రతిమాలుచు నా మనసునకు ఆనందం గల్గించారు. చెవికి ఇంపైన మధురస్తుతి చేస్తున్నాడు.[1] ఓహో ఇది విషయం! చకోర కావ్య కన్య! దీనికింతేల? నా ఘనపుత్రితో స్నేహాన్ని కూర్చు కొమ్మన్నాడు[2]" ఆ మాటలు విన్న చకోరకన్య అమితానందాన్ని పొంది మేఘభాసమానకు నమస్కరించింది.

---

1 ఎవరహా! నన్ బతిమాలుచు ఇట్లతి
హృష్టిని నామతి గూరిచినా
చెవికి సుధాకృతిగా మధురస్తుతి
చేసె మహోద్ధృతి గోరుచ్చుదా!
ప్రవిమల సంస్కృత భాషిత మత్సుత
రంజిలగా శ్రుతికారికలై
నవకవితారుతులాంధ్రవచోగతి
నరిలె సుస్రుతధారలుగా
తెలుగు కవీ తెలిచాయల వెన్నెల
తీరునత్వద్గళగానఝురుల్
వెలసి మహోజ్వల కాంతి వినిర్మల
విస్తృతమత్కళలో నమరిన్
బలజలమంచు లసన్నవకోమల
సారసరాసుల తేనెతెరల్
వలెభవదుత్కలికా మధుగీతలు
ప్రమ్మెనునా కలవాణిదరిన్

2 కలవరవల్లికగా హిమవాలుక
గాను మధూలకగా జను స
ల్లలిత చకోరక కావ్యకుమారిక!
లాస్యకళాధిక తేజమిటన్
చిలుకగరమ్మిక - నాఘన పుత్రిక
చేరువునన్ సకియై జతగా మెలగుము

పుటలు — 5, 6

"నీ సహృదయంచేత నీ సఖినై నాకు నీవు నిల్చిన చోట నీకు ప్రతిమాన రేఖనై ఉండాలన్నదే నా ఆశ" అన్నది [1]

"నీవు సంస్కృతాంచితమైన శబ్దవైచిత్రిని వచియింపగల ప్రౌఢవు. నేను జాను తెల్గులో పలుకనేర్చిన కూర్మి చెలిని. తల్లివలె సహజ వాత్సల్యాన్ని ప్రదర్శించి ఆదరించు" అన్నది చకోరకన్య

ఈ మాటలు విన్న మేఘసందేశ కృతి కాంత జాలిని పొంది "ఘన గీర్వాణంలో పుట్టిన నాకు హృదయహ్లాదాన్ని కల్గించే చెలియలేదని నేటివరకు బాధపడ్డాను. ఇపుడు దరస్మితశోభలతో నా యెదలో సుధ చిలికావు. చెలిమికి జాతి, భాష, కులం లాంటి భేదాలు లేవు[2]. నీవే కాదు నిన్ను కన్న తండ్రి కూడ మాకు బాంధవుడే" అన్నది మేఘకన్య.

ఆ మాటలు విన్న చకోరకన్య తండ్రి మహానందాన్ని పొంది "కాళిదాస

---

1 వందనమమ్మ నీ భవ్య మూర్తికి కాళి
దాసనందన! మేఘభాసమాస
చలువ వెన్నెల చాయ మొలతెంచి తియ్యంపు
సఖినైతి నీఘన స్వాంతమలర పుట - 7

నీవు వెలసిన తావునే నేను కూడ
నీకు బ్రతిమాన రేఖనై నిల్వనెంతు
నీవు మెరసిన తెరువునే నేను కూడ
నీకు బ్రతికాంతిలవమునై నెగడనెంతు పుట - 10

2 చెలిమికి బ్రేమ కెన్నడు నిషేధములున్నవె? జాతి భాషయున్
కులము విభిన్నమై చెలులకున్ విలసిల్లునె? రమ్మ చెల్లి! నీ
యలరుటెడంద నా హృదికి హత్త గవుంగిలి గ్రుచ్చెదన్ గనుం
గొలకుల మోదబాష్పమధు కుల్యలు నిరిద గూర్మి తీవెకున్ పుట - 13

మహాకవి! నేను ధన్యుడనయ్యాన"ని కృతజ్ఞతా పూర్వకంగా ధన్యవాదాలు చెప్పుకున్నాడు [1]

ఈ కావ్య రచయిత కల్పించిన ఈ సఖీసంధానంలో కాళిదాసమహాకవి, అతని ఘన వుత్రి తన కావ్యాన్ని చెలిమికి స్వీకరించిన విధంగా చెప్పడంతో ఆ రచయితకుగల ఆత్మ విశ్వాసం, తన కావ్యం స్థాయిపై అతనికున్న నమ్మకం ద్యోతకమౌతున్నాయి

తన కావ్యగుణాలను ఆ కవి అక్కడక్కడ వ్యక్తంచేశాడు సఖీసంధానంలో

"లేహోర్మ్యంగులీను నా కులీన కావ్య కన్యకన్" అని ఒక చోట తానే వక్కాణించాడు

"జలజల మంచు, లసన్నవ కోమల సారసరాసుల తేనేతెరల్" అని కవిత్వాన్ని గూర్చి కాళిదాసుచే అన్పించాడు

"జాతీయమైన జాను తెన్గునుడుల బలుక నేర్చిన కూర్మి చెలియనేను"
"ఒక నవ్య శిల్పచంద్రికలోని సౌకుమార్యమునద్ది నా సోయగముదిద్దె"

అని కావ్యకృతన్ను గూర్చి చెప్పుకున్నది

ఈ మాటల్లో కవి తనకావ్యంలోని శైలిని, ప్రపంచ వాఙ్మయంలో తన కావ్యం యొక్కస్థానాన్ని కావ్య ప్రయోజనాన్ని భంగ్యంతరంగా తెలియచేశాడు ఇది రమణీయ కావ్యసృష్టి

## చకోర సందేశం - కథాకల్పన

నిత్యనూత్న శోభలతో ప్రకాశించే పట్టణం అలకాపట్టణం ఆ పట్టణానికి తగిన విధంగా నిత్యచైతన్యంతో విరాజిల్లే ఉద్యానవనం చైత్రరథం ఆ ఉద్యాన

---

1 ధన్యోస్మి! ఓ కాళిదాసా! కవీశ!
ధన్యోస్మి! మేఘదూతా రసోపేత
చిన్నారి నా తెల్గుజిల్గుకబ్బంపు
గన్నెపూవున దావిగాజింది చెలికి
జెలియై విరాజిల్లు - శృంగారకలిత
కళయైలసత్తారకావీధి మెఱయు    పుట-14

పచనం అమరకాంతలు మృదుమధుర స్వరాలతో గీతాలాపన చేస్తూ నిత్యంధ నదును కీర్తిస్తుంటారు జక్కకవ్యలు ప్రణయార్ద్రి మధురజీవన ధాత్రులై ఆ ఉద్యానవనంలోని చంద్రశాలల్లో రతిక్రీడ సలుపుతూ అశ్రమను పోగొట్టుకోడానికి సరస్సులలో జలకాలాడుతూ భోగైక జీవనమతులై కాలక్షేపం చేస్తున్నారు.

ప్రేమపూర్ణకళావరీమళోన్మిషితరామాతి శృంగార భూమియై అలక కడు రమ్యంగా ప్రకాశిస్తుంధి.[1]

యక్షగణమంతా అకలంకభోగాలతో కాలక్షేపం చేస్తుంటే ఒక యక్షకాంత మాత్రం జంటలేక ఒంటరిగా విరహవేదననను భవిస్తోంది [2]

ఆ యిక్షకాంత పతివియోగంతో ఖిన్నయై సగమైపోయింది. బ్రతుకుపై ఆశపోయింది అలంకారాలమీద రోత కల్గింది ఉపవనాల్లో చిత్తశాంతిలేదు. కర్పూరగృహాల్లోని వెలుగును సహించలేకపోతుంది. పసిడితామరల కేళీకొలకుల చాయలకే పోవడంలేదు పంజరంలో చిలకల్ని పలకరించదు. ఒంటరిగా నిరంతర విచారంతో ఆ యక్షకాంత కుమిలిపోతుంది.

ఇలా ఉన్న ఆ యక్షకాంత ఒకరోజు వీణాపాణియై ప్రియునిపై గీతాలాపన చేయడానికి సమకట్టగా దుఃఖంతో కంఠంగాద్గదికమై స్వరంలోనికమ్రిత లోపించింది. వెంటనే వీణనక్కడ వదలి ఎదురుగా చూచుకొంది. తన

---

1 ప్రేమపూర్ణకళావరీమళోన్మిషిత
రామాతిశృంగార భూమియై, దివిజ
కామినీకాముక గ్రామణీప్రమద
సీమయై అవ్వీడు చెన్నొందెమివుల

2 అకలంకరాగభోగానుభూతులను
సకలయక్షిగణమ్మ్మసక్తమైయుండ
ఒక యక్షిమాత్రమ్మ్మసకియబోనాడి
వికళాత్మయై భూరివిరహార్తి నొందె పుట - 18

19]

ఆకృతిని తానే నమ్మలేకపోయింది గవాక్షం దగ్గరకూర్చొని దానినుండి శూన్యం లోకి చూస్తోంది ఆ సమయంలో ఆమెకు ఏదోసిత మరీచికకాంతులు విరజిమ్ముతూ కన్పించింది.[1]

అంతపీడనలోను ఆమె ఆ వెలుగులేమిటో గుర్తించి అది చకోరిక అని భావించి మధురాతి మధుర కోమల శబ్దాలతో తన జీవితగాధను విన్పింప ప్రారంభించింది.[2]

ఓ చకోరికా! నాకన్నీటి గాథను విన్పిస్తాను ఆసాంతంగా వినమన్నది [3] నా విషాదకన్నీర సరిదిద్దుకొని వేద నాకు విరహాష్పరుతులను కురిపిస్తాను ఆలకించమని, తన పూర్వవృత్తాంతాన్ని పతివిరహాన్ని చకోరిక మనసుకరిగే విధంగా తన బాధామయగాధను వినిపించింది

జతవీడివాపోయే చక్రవాకిలా విలపిస్తున్నాను మావిడబాటు ఒక్కయేడాదే గాని కాలం అడుగుముందుకు వేయక ఆగిపోయిందా అనిపిస్తుంది స్వల్పక్షణాలే

---

[1] అతి కృశాంకితనిజాకృతి నమ్మలేక
వెతనుగూరి గవాక్షవేదికం జేరి
పతికోసమై నభః పథరాశి శూన్య
గతుల నన్వేషింపకందోయి కెదియొ
సిత మరీచిక రుచుల్ చిలుకుచుందోచె — పుట — 20

[2] గురుతుపట్టుచునిట్లు విరతరంబైన
పరమసుస్నేహభావంబు జాలువార
మధురాతి మధుర కోమల శబ్ద ఫణితి
విధుర జీవితగాధ విన్పింపదొరగె — పుట — 20-21

[3] వినవె చకోరికా వినవెనా చెల్లి
వినిపింతుగన్నీటి విరహగీతికల
అనుకంపనీదు ప్రత్యణువులోదొనక
ననిదింతునేనె నిల్వున గరం గుచును — పుట — 22

కల్పంలా అనిపిస్తున్నాయి. నా మీద నీవైనాదయదలచి, రామగిరికి పోయి నా ప్రియునికి పాపిష్టిదానినైన నా పరివేదనాన్ని తెలియజేసి పుణ్యం కట్టుకో [1]

నీవు నాకీ సహాయంచేస్తే నీ పుణ్యమా అని దీపంపెట్టి నీ పేరే నిత్యం స్మరించుకొంటాను. నీ పూజచేస్తాను అని దీనంగా వేడుకొంది [2]

నాకు లాభం జరగాలనే ఆలోచనతో మహేశ్వరిని పూజిద్దామనుకొంటే మనసు నిల్వక ఖేదమధికమౌతోంది. విరిచట్టనై ఈ విధంగా దురపిల్లేనాకు ఈ కిటికీయే పరమధామమైపోయింది. ఇక్కడే నా కాలక్షేపం

అయ్యో! ఈ జన్మకు నాకింతేనేమో ఎప్పటికైనాపతిని గూడి సుఖించే యోగ్యత ఉన్నదోలేదో" అని పూర్వం తాను అనుభవించిన సుఖభోగాలను స్మృతికి తెచ్చుకొన్నది ఎంతో అన్యోన్యంగా పడుగు పేకలా కాలం గడుపుతున్నా మమ్మల్ని సుడిగాలి దొంతరలువచ్చి మా ప్రేమకళిక నార్పివేశాయి

మనలో మాట ఎవరితోను అనవద్దు ప్రభువుల సేవ అతిదుష్కరమైనది. ధనవంతుని కోపం ఆపదలకు మూలం కలవారితో స్నేహం కొరివితో తలగోక్కోవడమే [3]

---

1 ఆలించినా యెదన్ వ్యథనెల్లచేది
పాలబాటను దాదేరిపయనించి పోవె
అటరామగిర్యాశ్రమాంతరస్థలిని
అటమటించు ప్రియాత్మకందిచ్చిరావె — పుట – 22
పాపిష్ఠినగు నాదు పరిదేవనమ్ము
రూపకల్పనతో నిరూపించిరావె

2 ఈపాటి దయనీవు చూపింతువేని
నీపుణ్య మా అంచుదీపమ్ము పెట్టి
నీ పేరె ఏప్రొద్దునేనుచ్చరింతు
నీపూజలను ప్రీతినిత్యమ్మొనర్తు — పుట – 25

3 జననాధులనుగొల్చి మనుట దుష్కరము
ధననాయకులకిన్క ఘనవిపత్కరము
కరవాలుకడిది వాదరబోలగలవు
కరుణమాలిన ఏలికల మతుల్ చెలియ
శలభమ్ములకు అగ్ని బలివితర్దికను
వెలయించురీతి భాసిలురాజకొలువు
కలవారితో చెలిమికదగండ్లుకోరి
తలరుద్దు కానుట కాదె ఏరికైన? — పుట – 37

నీ దర్శనం కొడిగట్టిన దీపానికి చమురందినట్లైంది. ఒక వియోగినిని రక్షించడానికి ప్రయత్నించు. నా సఖుని చల్లనివార్త సాధించి తీసుకొనిరా అని గమ్యస్థానానికి మార్గాన్ని వివరించడానికి ప్రయత్నంచేస్తుండగా మింటనొక మబ్బుతునక ప్రత్యక్షమైంది.

చెల్లెలా! అమృతోపమేయఖగేశ్వరీ! ఆ మింటివైపుచూడు పయోధరమో ఏదో కన్పడుతోంది. నా మనసులోని గాఢమైన తమస్సునీడ అక్కడ సంచరిస్తోందా అనిపిస్తోంది.

సన్ననిగాలి చాటున మెల్లగా సాగిపోతూగున్న ఏనుగులాగుంది. మణులతో ప్రకాశించే కేశీనగంమీద కన్పడుతోంది.

ఇప్పటిదాక ఎంతకాలం గడిచిందో యక్షకాంతకు తెలియదు. మేఘం కన్పడగానే గుణించింది. అర్ధచంద్రకళాననా! నేటికి ఎనిమిది నెలలైంది అన్నది నిట్టూర్పుతో వానకారు మబ్బుకన్పడితే మానినుల హృదయాల్లో మన్మథాస్త్రాలు పరంపరగా గుచ్చుకొంటూంటాయిగదా! ఈబాధను నేనెలాభరించేది? అనుకొని, నావేదనాగ్నినిచూచి భరించలేక మేఘం[1] కరుణాశ్రువులు రాలుస్తుందనుకొన్నది.

మేఘం గర్జించింది. ఆ గర్జనలో గంభీరపూరుషముక్తకంఠరవాలు వినిపించినాయి.[2] ఆ మాటలు ఇంతకుపూర్వం పరిచితాలైనవిగా ఆమె కన్పించాయి.

---

1 ఆదెసన్గనలేవటే? కరుణాశ్రువుల్ దుసికిల్లగా
వేదనాగ్ని భరమ్ముతోహృదిప్రేగితూగి చలింపగా
రోదనమ్మొనరించెనోయనరోదసింగడలొత్తు ని
హ్లాదవీచులబుచ్చె అకృతకాచలాగ్రమునన్ మొగుల్

2 ఆ నినాదములో ఎదోహృదయమ్ముగుంజి పయింబయిన్
కానరానిరహః ప్రవ్లీకగా గతప్రణయైకిద
వ్యానుభూతిలసద్రసాంకితమై సుధామధురస్మృతి
శ్రోత్రనాశ్రవణమ్ములంబడజేసె చంద్రఖగేందిరా! పుట — 43

పరిచితాలేమిటి? తన సాధుని మనోజ్ఞగళస్వరాలేపల్లవిస్తున్నాయని ఆనందంతో పులకించిపోతు చకోరంతో అన్నది [1]

తన ప్రియునిస్నిగ్ధకంఠం మేఘగర్జలో వినిపించింది అది తనకేగాదు ఉద్యానవనంలోని చెట్టుగుట్టలకు, లేళ్లకు సెలయేళ్లకు శుకపికాలకు వినిపించింది. ఈ ధ్వనికి అవి అన్నీ పరవశించిపోయినాయి.

ఇక ఏమాత్రం సందేహంలేదు నా మనోహర మూర్తికి హృదయమై అతని క్షేమవార్త తెచ్చింది ఈ మేఘం. ఇక్కడి నా స్థితిని చూచి జాలితో నీరైపోయింది ఆ ఉరుములలో నా ప్రాణనాధునివార్తను సరిగా వినలేక పోయాను. అయ్యో! మేఘం కరిగిపోయింది. ఒక్కసారి తళుక్కుమన్న గృహోపవనంలోని ప్రకృతి వాడిపోయింది దాన్ని చూచిన యక్షకాంత విలవిల లాడిపోయింది.

మార్గం చెప్పబోతున్న సమయంలో ఈ మేఘం వచ్చింది కరిగి పోయింది వెంటనే మరీచికతో ఏమాత్రం ఆలస్యం చేయక వేగంగా పోయి నా పతికి నా వార్తతెలియజేయమని అంటూ అలకాపట్టణం నుండి రామగిరికి మార్గాన్ని అతి మనోజ్ఞంగా ఔచిత్యవంతంగా వివరించి చకోరికను సాగనంపింది

ఈ మార్గోపదేశం అతిరమణీయంగా సాగింది అలకనుండి శిప్రానది సమీపంలోనున్న విశాల నగరం వరకు మార్గాన్ని వివరించి నాకింతవరకు మాత్రమే తెలుసు ఆపైన మార్గం తెలియదు [2] ఎవరో చెప్పుకొంటుండగా విన్న

---

1 అదిగోనెచ్చెలి! ఆలకింపవె ఆవలాహకగర్జలన్
బొదురుకొంచు గభీరపూరుషముక్తకంఠరవమ్ములే
ఒదవియేవిరహార్తినోయిటులొల్కబోయుచుగుండియన్
గదిపెలేజిపురాకుకొమ్మనుగాలులూచక్రమమ్మునన్
ప్రతిరుతిక్రియబుంస్పికప్రియరాగగీతలు కోనలో
ప్రతిఫలించువితమ్మనన్ వినవచ్చి ఈస్తనితమ్మనం
దతిచిరంతనమై హృదంతరమంత పుల్కలు చిల్కగా
బతిమనోజ్ఞగళ స్వరమ్ములు పల్లవించెగదే చెలీ పుట — 43

2 అంతదాక సఖీఎఱుంగుదు ఆ పయిన్ బధమెట్టిదో
అంతగా వివరింపజాలవియచ్చరుల్ విహరింపగా
సుంతశక్యముగానిమర్త్యవసుంధరాతలమయ్యెడన్ పుట — 56

భూమిపై విశేషాలు కొన్ని చకోరానికి తెలిపి చిత్రకూటంలోని రామగిరికి ఆన వాలు చెప్పి పంపుతానన్నది

కౌముదీవిహగోత్తమా! నం భర్తఎదుట నిలిచి కనులకు విందు కల్గించు నా మీది జాలితో గాని, స్నేహాన్ని భావించిగాని నాకీమేలు చెయ్యి. నా విషాదగాథ ను వివరించడమింకచాలుగదా! మరీమరీ వివరిస్తే పునరుక్తి దోషం కల్గుతుంది. నీవు వెంటనే నా కాపురం పూర్తిచేసి మావలెగాక నీ భర్తతో ఆనందాన్ని అను భవించు అన్నది యక్షకాంత.

మొయిలు, చకోరాల దౌత్యాలచేత, పరమేశ్వరానుగ్రహంచేత యక్ష దంపతులకు పునస్సమాగమం సిద్ధించింది

## కల్పనా నైపుణ్యం

ఈ చకోర సందేశం రెండు ఖండాల కావ్యం ఇందులో ప్రధానమైన ఘట్టాలు మూడు

1 యక్షకాంత చకోరంతో తన దీనస్థితిని తెలియజేసుకోవడం దౌత్యం నిర్వహించమనికోరడం

2 మేఘసందర్శనోత్సాహపూరితమైన సంభాషణం.

3 తన దూతచకోరానికి అలకాపట్టణంనుండి రామగిరికి మార్గోపదేశం చేసి పంపడం

యక్షుడు తనపత్నికెప్పుడు సందేశం పంపాలనుకొన్నాడో ఆ సమయానికే యక్షకాంతకూ సందేశం పంపించాలనిపించింది.

యక్షుడు తమ్మునిలా భావించిన మేఘుని దూతగా పంపితే, యక్షకాంత చెల్లెలుగా భావించి చకోరాన్నిదూతగా పంపింది [1]

---

1 వినవెచకోరికా! వినవేనాచెల్లి!!

అవ్యాపన్నామవితథగతిర్ద్రక్షసి భ్రాతృజాయాం మేఘ — 1-10

మేఘుడు అలకకు చేరేలోపల చకోరికకు చెప్పవలసిన విషయాలు చెప్పింది. ఇక మార్గం చెప్పబోయేసమయంలో మేఘగర్జన వినిపించింది అందులో నాధుని స్వరం పలికింది యక్షకాంత మేను పులకించింది. ఆ ఆనందంలో మేఘగర్జలోని ఆంతర్యం గమనించలేక పోయింది. కాని అది తన నాధుని సందేశమేనని మాత్రం నిశ్చయించుకొన్నది. వెంటనే చకోరాన్ని పంపింది.

అణుమాత్రమైన ఔచిత్యభంగం కాకుండా ఉండాలన్నది మోటూరివారి తలంపు. ఈ కావ్యానికి పూర్వరంగమైన సఖీసంధానంలో కూడ యిట్టి అభిప్రాయాన్నే వెలిబుచ్చారు తనది ప్రతిసందేశంకాకూడదు. స్వతంత్రకావ్యం కావాలి. అందుకే మేఘం అలకకు రాకపూర్వమే దూతనిర్ణయం, దూతవరణం, సందేశం చెప్పడం జరిగిపోయాయి. అంతేగాక యక్షకాంత తన భర్త కంఠ స్వరం గుర్తుపట్టింది గాని ఆ ఆనందపారవశ్యంలో ఆ ధ్వనుల నర్థంచేసికోలేక పోయింది యక్షుని ప్రయత్నం అసంపూర్ణంగా ఫలించింది. కారణమేమంటే మేఘుని మాటలు అర్థమైతే చకోర సందేశం యొక్క ఆవశ్యకత ఏమాత్రం ఉండదు కానీ మేఘంకూడ తన కావ్యంతో ప్రసక్తంకావాలి ఇన్ని నిబంధనల నేర్పరచుకొన్న చకోర సందేశకావ్యరచయిత ఔచిత్యానికేమాత్రం భంగంకల్గ కుండా రచనగావించారు

## కావ్యనామం

కావ్యంపేరు 'చకోర సందేశం'. చకోరి అంటే ఆడుపక్షి చకోరం అంటే మగపక్షి. కావ్యంలో సంబోధించేటప్పడు "వినవేచకోరికా" అంది యక్షభామ పేరు మాత్రం చకోరికా సందేశంగాక చకోర సందేశం. అది అనౌచిత్యమని కొందరు భావించవచ్చు ఈ కావ్యంలో యక్షకాంత చకోరానికి మార్గం వివరించే సందర్భంలో "నీ రూపమున్ దిలకింపుమందు ద్విరూపయోగము నెక్కొనన్" నీవు నీ పతియున్ సమైక్యత నేర్చినట్లచటన్ మహిదేవుడున్ సతియున్ విభేద గతిందృజించి రసైక రూపావధిన్ పరమార్థతత్వ మహత్వమున్ బ్రకటించెడిన్" అని యక్షకాంత అన్నది

చకోరి హృదయంలో భర్తయగు చకోర హృదయం సదా అవిభక్తంగా ఉండి తాదాత్మ్యము వహించియుండెనని తెలుపుటచే చకోరీచకోరములకు ఏక

శేషచేసినపుడు పుంలింగ శబ్దమైన చకోరం మిగులుతుంది అదే చకోర సందేశ మైంది. ఈ విషయంలో రచయిత వ్యాకరణజ్ఞత వ్యక్తమౌతుంది

## పాత్రచిత్రణం

సందేశకావ్యాల్లో సందేశం పంపే వ్యక్తి స్వభావాన్నిబట్టి కావ్యమంతా ఔచిత్యభంగంకాకుండా రచన గావిస్తాడు కవి యక్షుడు పురుషుడు. అందునా కాముకుడు వాడు పలికే ప్రతిపలుకులోను భౌతిక శృంగారం కులుకులాడు తుంటుంది. యక్షకాంత సాధ్వి.పతిని దైవంగా భావించింది తప్ప భౌతికవాంఛా వాసనలకు వశంగాలేదు. ఆమె పల్కులలో ఈ భావమే వ్యక్తమౌతుంది.

ఒకే ఘట్టాన్ని యక్షుడు యక్షకాంత, చెప్పిన విధానాన్నిబట్టి వారి స్వభావాన్ని ఊహించవచ్చు

యక్షదూత మేఘుడు కైలాసగిరికి సమీపించగానే పార్వతీపరమేశ్వరుల పాదసేవచేయాలి. ఆ సందర్భంలో కాళిదాస మహాకవి శృంగారరస పరిప్లుతంగా ఒక అద్భుత దృశ్యాన్ని సృష్టించాడు. పార్వతీదేవి క్రీడా శైలంలో విహరింపదలచి శంభునిచేతి నూతగా గ్రహించి కైలాసంనుండి దిగే సమయంలో మేఘుని తనలోనిజలాన్ని స్తంభింపజేసికొని సోపాన పంక్తిగా మారి ఆమె శివునితోగూడ తనపైకాల్మోపిదిగునట్లుండుమని యక్షుడన్నాడు ఈ మాటలలో పార్వతిస్వాధీనపతికత్వము ధ్వనితమై ఎంతో మనోహరంగా ఉన్నది.

ఇదే విషయాన్ని యక్షకాంత చెప్పినప్పుడు చకోరిక రజితాద్రి చేరినపుడు

నీవు నీ పతియున్ సమైక్యత నేర్చినట్లచటన్ మహా
దేవుడున్ సతియున్ విభేదగతిందృజించిరసైకరూ
పావధిన్ బరమార్థతత్వమహత్వమున్ బ్రకటించెడిన్
కావునన్ ఖగరాజ్ఞి! భక్తి వికాసమూనిభజింపవే పుట — 48

ఈ పద్యంలో భక్తి వికాసం కొఱకై పార్వతీపరమేశ్వరులు అభేదగతితో రసస్వరూపులై లోకానికి పరమార్థతత్త్వోపదేష్టలై ఉంటారని యక్షకాంత అన్నది. అంతేకాదు. ఓ చకోరికా! వారిని కేవలం భక్తితో సేవించమన్నది. యక్షుని

భావనలో యక్షకాంత ఆలోచనలో అంత లేడా ఉన్నది ఇది మోటూరివారి పాత్రచిత్రణలోని వైశిష్ట్యాన్ని వ్యక్తంచేస్తున్నది

## మార్గనిర్దేశం

కాళిదాసు యక్షుని ముఖాన మేఘునకు వివరించిన మార్గానికి విలోమంగా యక్షకాంత మార్గవర్ణన సాగింది అడుగడుగునా కాళిదాసరచననే నెమరు వేసుకొంటూ సాగిన రచన కావడంచేత ఆ మాధుర్యమె ఈ రచనకూ అబ్బింది. యక్షకాంత హిమవత్పర్వతాన్ని వర్ణించిన సందర్భంలో

పండువెన్నెలకన్నమిన్నగ బమ్మిడివ్యకళాప్రభల్
నిండిపోవదిగంతరాః మునీవు తత్కమనీయ రు
ఖండముల్ మలుదారిబత్తెసుగా ఒడిన్ గ్రహియించి ఆ
కొండరాయని పీడి కొంచు చకోరికా పయనింపవే పుట – 51

ఈ పద్యంలోని భావం అతి కోమలమైంది పద ప్రయోగం కూడ లలిత మైనది మధురమైన ఫణితిలో ఈ పద్యరచన సాగింది

అలకాపట్టణం నుండి విశాలా నగరం వరకు చెప్పిన తరువాత భూమిపైని విశేషాలను కొన్నింటిని వివరించింది దేవభూముల కంటే భిన్నమైన ప్రకృతి శోభ భూమిపైనున్నది. ఆరు ఋతువులుంటాయి చెట్ల ఆకులు రాలుతుంటాయి. చంద్రకళ హెచ్చుతగ్గులుగా వుంటుంది. చావుబ్రతుకుల మధ్యకొట్టుమిట్టాడు తుంటారు అక్కడివారు. ఎంత సుందర స్వరూపమైనా వినాశమొందక తప్పదు. ఎన్నోరాజ్యాలు వచ్చాయి నాశనమై పోయాయి శోకరసార్ద్రమైనా భూమిపై మహామునులు, యోగులు, భూమిని, పుణ్యధామంచేస్తున్నారు. ధర్మరక్షణకోసం యుగయుగంలోను పరమాత్మ అవతరిస్తుంటాడు కర్మయోగులైన జనకాదులు కర్మసంచయాన్ని జయించి అఖండ ముక్తిని పొందారు" ఈ విధంగా భూవిశేషాలు వివరించింది యక్షకాంత ఇందులో శృంగార రహితమైన పరమ భక్తిభావన యక్షకాంత హృదయ స్థితమైందని గ్రహించవచ్చు

యక్షుడు అలకాపట్టణాన్ని వర్ణించినందుకు ప్రతిగా యక్షకాంత రామగిరిని వర్ణించింది.

ప్రేమధాముడు - రామభద్రుడు శ్రీతిమై నిజపత్ని
తామృగేక్షణ గూడినిస్తుల ధర్మవర్తనతో జగత్
స్వామియై ఋషిసత్తముల్ నుతి సల్పమున్మనినట్టిత
ద్రామగిర్యతిపావనాశ్రమరమ్యవాటిక జేరవే    పుట – 60
ప్రతిలతాసుమ పత్రరేఖయురామశబ్ద సుధాక్షర
శ్రుతులనే విరచించి అక్షయరోచియై ఉరళించి ఆ
క్షితిధరమ్మున బ్రమ్మసంటసఖీశిలాశకలమ్ములన్
ప్రతినినాదముతో నితాంతముగ్రాలునంటగదేఅటన్    పుట – 50

ఈపద్యాలలో రామగిర్యాశ్రమవాటి అంతా రామనామం ప్రతిధ్వనిస్తుందట ఆ శబ్దాలు వినాలని అంతరాంతరాల్లో యక్షకాంత కుతూహలం ఎంతో మనోహరంగా తనమదిలోని భక్తితత్పరతను మాటల్లో వ్యక్తం చేసింది యక్షకాంత

## మంగళాచరణం

కావ్యం చివర మంగళాచరణమున్నది.
"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని

కావ్యాని" అన్నది అలంకారికోక్తి ఈ మంగళాచరణానికి గూడత్రిపురాన వారి మొయిలురాయబారమే ఆదర్శం ఇది ఋషభగతిరగడలో సాగింది.

శాపభారముతో బ్రవాసవిషణ్ణుడై అలయక్షకాంతుడు
శాపమొయ్యనదీర దీపులు జార్చియేలెను యక్షకాంతను
సర్వశుభసంచయము సేకుటె – సర్వభోగములమర్రెగమ్మర
సర్వమంగళశాంతిసంగతసౌఖ్యమును సిద్ధించెబిమ్మట    పుట – 63

ఈ విధంగా ఈ చకోర సందేశం మేఘసందేశంవలె మందాక్రాంతం వంటి ఒకే ఒక వృత్తంలోగాక లయాన్వితద్విపదలతో మత్తకోకిల వృత్తాలలో

పద్యాలవలె చదువుకొనడానికేకాక పాటలవలె పాడుకోడానికనుగుణంగా మకుటాలతో విశిష్టమైన కావ్యంగా విప్రలంభశృంగార భరితంగా సాగింది

సంపూర్ణ సందేశకావ్యలక్షణాలు సంతరించుకొన్న సందేశకావ్యం ఈ చకోరసందేశం విశ్వనాథవారి మెప్పునందుకొన్నది

## సమీర సందేశం

సమీర సందేశకావ్యరచయిత సోమంచి వాసుదేవరావుగారు వీరు శంకర భగవత్పాదకృత శివానంద సౌందర్యలహరుల అనువాదకులుగా జగత్ప్రసిద్ధులు.[1] స్వకపోలకల్పితమైన కావ్యం, నూతన భావరసోన్మేషం కాగలదని భావించి, అది పండితులకేగాక పామర జనరంజకంగా కూడా కావాలని ఈ సమీర సందేశ రచనకుపక్రమించారు [2]

సహజంగా ఏ సందేశకావ్యరచనకైనా ప్రేరణనిచ్చేది కాళిదాస మహాకవి మేఘసందేశం అదే విధంగా ఈ కావ్యానికిగూడ రచనా విషయంలో ప్రేరక మైంది మేఘసందేశమే [3] ఇందులోని కథ మాత్రం మేఘకావ్యం కంటె భిన్నమైనది ఇతివృత్తం ప్రసిద్ధమైనదేగాని కావ్యం మాత్రం కల్పనతోకూడినది.

---

1 సౌందర్యలహరిని శివా
నంద లహరిమున్ దెనుగునొనర్చితి విద్వ
ద్బృందామందానందం
బందగ గడు వెలయుగతినహీనస్ఫురణన్

2 భాషాంతరీకృతములకంటె నూతన భావరసోన్మేషంబు
లగు స్వకపోలకల్పిత కావ్యంబులు పండిత జనంబు
లకేగాక సామాన్య జనులకును అత్యంతప్రీతి హేతువులని
యెంచి యీ సమీర సందేశమును రచించినంతనే ప్రకటింప సాహసిం
చితిని" మనవి – సమీర సందేశం – వాసుదేవరావు సోమంచి.

3 అల సముద్రునిబట్టమునయందు వ్రాసి
తదలఘుగుణాలి జూపింపదలచుటయగు
మేఘసందేశ నియమంబు మెయిగడంక
నిట్టి కావ్యంబు నేనురచియించుటయును

# కావ్యకథ

వశిష్ఠునితో ప్రతిఘటించిన విశ్వామిత్రుడు అతి కఠోరమైన తపస్సు చేయడానికి నిశ్చయించాడు. ఆ విషయం ఇంద్రుడికి తెలిసింది. తపస్సుకు భంగం కల్గించడానికి ఇంద్రుడు నిశ్చయించాడు రంభను పిలిచి విశ్వామిత్ర తపోభంగం కల్గించవలసిందని ఆదేశించాడు.

ఇంద్రుడు చెప్పినపని అనాయాసంగా చేయగలనని భావించింది రంభ. ఏ విధముగానైన ఆ మునిసింహునికి తపోభంగాన్ని కల్గించి చాకచక్యంగా అతనిని మోసగించి తిరిగి స్వర్గానికి వెంటనే రావచ్చునని భావించి ప్రభునాజ్ఞను ఔదలదాల్చి తపోభంగం చేయడానికి పోయింది.

ఆ సమయంలో నలకూబరుడు ఒంటరితనాన్ని సహించలేక నందనోద్యానానికి బయలుదేరాడు అక్కడి వాతావరణమతణ్ణి మరీ బాధించింది రంభా వియోగాన్ని సహించలేకపోయాడు క్షణాలు యుగాలవుతున్నాయి. తన ప్రియురాలి క్షేమసమాచారం తెలిసికోవాలనే కోరిక కల్గింది మిక్కిలి వేగంగా పోయి సమాచారాన్ని తేగల్గిన వ్యక్తి ఎవరా అని ఆలోచించి సమీరుడు తగిన దూతగా భావించి తనసందేశాన్ని పంప నిశ్చయించాడు

సమీరుని ప్రార్థించి దూత కృత్యాని కంగీకరింపజేసి తానున్న నందన వనంనుంచి విశ్వామిత్రుని తపస్సుచేస్తున్న బృందావనానికి మార్గాన్ని వివరించాడు అనంతరం సమీరునికి తన సందేశాన్ని వివరించి వెంటనే వివశత్వాన్ని పొందాడు.

ప్రావృణ్మేఘాన్ని వీడివచ్చే శంపావల్లివలె రంభ తపోభంగం కల్గించి తిరిగి వచ్చింది.

చివరకు రంభానలకూబరుల సమాగమంసుఖాంతంగా జరిగింది

# కావ్యగత విశేషాలు

ఈ సమీర సందేశం సంపూర్ణ సందేశ కావ్యలక్షణాలుగల్గియున్నది. ప్రవాసినియైన తనకాంతకోసం విరహోన్మత్తుడైన నాయకుడు ఆ విరహాన్ని సహించలేక ఆమె క్షేమవార్త తెలిసికోవాలనే కుతూహలం కలిగి తగిన దూత

నెన్నుకొని మార్గోపదేశంచేసి దూతను పంపాడు. దూరగతయైన నాయిక మరల తిరిగివచ్చి నాయకుని కలిసింది ప్రవాస విరహం, దూత నిర్ణయం, సందేశం, మార్గనిర్దేశం - ఇవి దూతకావ్యలక్షణాలు. ఇవి కావ్యంలో ఉన్నాయి.

## దూత-దౌత్యం

విరహార్తుడై ఉన్న నలకూబరుడు తన కట్టెదురనున్న పవమానునిచూచి తన ముఖంలో సన్రమత, దైన్యం ప్రతిబింబిస్తుండగా నా ప్రేయసి ఉన్న బృందా వనానికి పోయి నాయీస్థితి నామెకు తెలియజేయమన్నాడు.

దిక్పాలురలో నీ తండ్రితో సమానుడనైన నను పంపించడం తగునాయని అంటావేమో! నీవే లోకానికి ప్రాణం. జనులను రక్షించేవాడివి నీవే స్థాణుని అష్టమూర్తులలో నీ ఒకడవిగా ప్రశస్తివహించావు బలము, కారుణ్యము, గంభీరతలలోను శౌర్యధైర్యాలలోను నీవు అలఘుడవు ఉజ్వలతేజోవిభవుడవైన నిన్ను నా తండ్రితో సమానంగా గౌరవిస్తాను నా అర్చనను స్వీకరించు. నీవు సకలలోక సంచారివి కాబట్టి భూలోకంలో కౌశికుని తపోభంగానికిపోయిన రంభావనజాక్షివృత్తాంతాన్ని తెలుసుకొనివచ్చి నన్నురక్షించమని వేడుకొన్నాడు.

ఈ అర్హుడైన దూతను గ్రహించి అతనికి తగిన విధంగా ప్రార్థనార్చనలు నిర్వహించి తను దూతకార్యానికి పంపించాడు నలకూబరుడు. దూత స్వీకారం మేఘకావ్యాదర్శంగానే సాగింది

## కావ్యనాయిక

మేఘసందేశంలో కావ్యనాయిక స్వీయ, సాధారణంగా ప్రణయసందేశ కావ్యాలలో స్వీయేనాయికగా ఉంటుంది కాని ఈ సమీర సందేశంలో నాయిక సామాన్య; సామాన్య నాయికయైనట్లైతే వియోగశృంగారానికి భంగం కలగవచ్చు కానీ ఈ కవి రంభచేత –

"మునిసింహునేగతినేని నేర్పుమై
ధృతినెడలించి మోసమొనరించెదనంచు విరిశ్చితాత్మయై"

అనియు

"రణహతులదీక్షితుల వీ
క్షణ విసరప్రసరమాత్రసంతోషితులన్
బొనరించికవయని విధం
బునమునియెడనతడు"

అని అనిపించడం చేత రంభానలకూబరుల నిర్మల ప్రణయగరిమవ్యక్తమై రసపుష్టికి దోహదకారిణియౌతున్నది.

## నాయకవిరహం

నలకూబరుడు నందనానికి పోయాడు అక్కడి ప్రకృతిశోభ అతని మనస్సును కలచివేసింది ఆనూన బాణవిదలితహృదయుడై ఈ విధంగా అనుకొన్నాడు "కౌశికుడు ఎందుకీ తపమాచరించుచుండెను? దానికి ఇంద్రుడేల భయపడెను? అతడుచేయునది వసిష్ఠునిపై కోపగించికదా! ఇంద్రుడు భయపడినా తన రాజ్యాన్ని నిల్పుకోడానికి స్త్రీలనుపయోగించవలసిన దైన్యస్థితికి రానేల? వచ్చినా మేనకాద్యప్సరసలుండగా రంభనే పంపవలసిన పని ఏమున్నది? నా అభాగ్యమిలా ఉన్నది" అని అనుకొంటూ క్రూర మార భయదాస్త్రజకీల శిఖాపరంపరలకు తాళలేక పవనునిచేత సందేశాన్ని పంపాడు ఈ విరహ వర్ణనలో రంభపై నలకూబరునకు గల ప్రేమాతిశయం వ్యక్తమై నాయికా నాయకుల పరస్పర గాఢానురాగాన్ని తెలియజేస్తోంది

## మార్గనిర్దేశం

ఈ కావ్యంలో నందనవనం నుండి బృందావనం వఱకు మార్గం నిర్దేశింప బడ్డది [1]

---

1 నందనమునుండి యల్ల బృందావనమున
కిదియమార్గంబుదెలిపెదనెఱిగి కొనుము
మున్నునే నల్లరంభతో బోయినప్పు
డెరిగితి దదీయమార్గంబు నెసకమెసగ

ఈ మార్గవర్ణనలో వారణాసి, మధురపట్టణాలు, హిమాలయదేవభూములు గంగ, యమున మానససరోవరం మొదలైనవి హిమాలయంలోని ఖిల్లాంగనలు, మహేశ్వరుడు సిద్ధులు వర్ణింపబడ్డారు

మార్గవర్ణన పరిమితంగానే ఉన్నా అద్భుతంగా సాగింది

దేవతలకు భూలోకంతో పరిచయముండదు ప్రత్యేకమైన శ్రద్ధతో భూమి మీదకు వస్తేగాని ఈ భువిని గూర్చి తెలియదు మార్గాన్ని వివరింపబూనుకొన్న నలకూబరుడు తనకు భూలోక పరిచయం కల్గడానికి కారణం వివరిస్తూ

'మున్న నే నల్లరంభతో బోయినప్పు
డెఱిగితి దదీయమార్గంబు నెసగమెసగ"

నలకూబరుడు రంభను క్షణమైనావిడిచియుండలేడు [1] ఆమెకు భూలోక ప్రయాణాలు తరచుగా వస్తుంటాయి. అవకాశముంటే తప్పక ఆమె వెన్నంటి పోయి వస్తుంటాడు ఈ సందర్భంలో మాత్రం రంభ నేను వెంటనే వస్తాను గదాయని సమాధాన పరచిపోయింది తానునందనవనంలో ఉన్నాడు. ఆమె బృందావనంలో ఉన్నది రెండు ప్రదేశాలు విరహోద్దీపనకారకాలే!

## వర్ణనావిధానం

**నందనం :**

మందారమకిరంద పానానంద చలిత బంభర కోటి ఝుంకృతులు, సలలిత పారిజాతలతాంతవాసనాకలిత వాయు కిశోరవిలసనములు, సంతాన కిసలయ సంతానక గ్రాసశారికాపిక కుహూకారాలు, సుందరతర హరిచందన చ్ఛాయా విహారమయూరకేంకారాలు, విమల కమలాకర మరాళ వితతిరుతాలు కలిగి మనోహరమై యున్నది నందనవనం

---

1 పూవుతావియు పోల్కి సంపూర్ణశశియు
జంద్రికయబోలె ననుగూడు సరసిజాక్షి
నాదులేమికి నెంత సంతాపమొందు

### బృందావనం.

అఖండమైన పాండురచంద్రికలతో ధావళ్యమై ప్రకాశిస్తున్న యమునానది యొడ్డున గల ఇసుకతిన్నెలు, రాజహంస విహారరమణీయ సరసిజాకరకాంత కాంతార పరిసరాలు, మదమిళింద విరాజిహృదయంగమకురుంగ బృంద బృందావనివీచికలు, నానాలతావితానవృంతోన్మీల చంద్రకాంతోపలవితర్ది కాచయములు కలిగినది బృందావనం.

రెండు వర్ణనలు దీర్ఘసమాసాలతోను సీసంలో రచనచేశారు నందనానికి బృందావనికి వర్ణనలలో ప్రత్యేకతను కన్పరచకపోవడం కవి ప్రతిభకు కొంత లోపంగా కన్పించినా విరహోన్మత్తుడైనవాడు తన పరిసరాల్లోని వాతావరణమే బృందలో కూడనున్నట్లు ఊహించడం సహజంగానే ఉంది పాత్రపోషణలో ఇది ఔచిత్యంగా భావించవచ్చు ఇదే విధంగా కాశీపట్టణంలోని ఉపవనాలు వర్ణితాలైనాయి

## హిమాలయపర్వతం

హిమవత్పర్వతాన్ని ఎందరో కవులు వర్ణించారు. ఈ కవికూడ తన ప్రత్యేకమైన మార్గంలో ఈ విధంగా వర్ణించాడు.

ధైర్య సంపదకు నుద్ధాహృతుడగువాడు
ప్రబలవాహినులచే బరగువాడు
పారసీకహారయశస్ఫూర్తిగలవాడు
నౌన్నత్యగరిమమిన్నందువాడు
నెంతేనియునుదార హృదయంబుగలవాడు
ఘనులనాదరత గైకొనెడువాడు
రాజహంస వ్రజాశ్రియమానసమువాడు
శ్రీ విలాసములరాజిల్లువాడు

మానికముల బొలుచు సానువుల్ గలవాడు
రసిశేఖరుండు రమ్యచరిత
బొలుచువాడతండు భూ భృద్వతంసుండు
నించు వేడ్కనాదరించు నిన్ను

అనూచానంగా మనం భావిస్తున్న విధంగా హిమాలయాన్ని పర్వతరాజుగా ఊహించి రాజుకుండదగిన ఉదాత్తగుణాలను పర్వతము యొక్క సహజస్థితికి పోల్చి ఉదాత్తంగా వర్ణించాడు వసుచరిత్రలో ఇట్టి విధం గోచరిస్తుంది. "ప్రబలవాహినులు'' అన్నదానికి 'నదులు,' సైన్యము' అనే రెండర్థాలు చెప్పవచ్చు. 'ఔన్నత్యగరిమ' అన్నదానికి ఉన్నత గుణములు కలవాడని ఎత్తైనవాడని అర్థాలు చెప్పవచ్చు 'సానులు' అన్నదానికి 'రాణులు, కొండచరియలు" అనే అర్థాలూహించవచ్చు. ద్వ్యర్థీభూతంగా అతి మనోహరంగా హిమవత్పర్వతరాజవర్ణన చేశాడు.

హిమాలయుందాటిన తరువాత ప్రకాశమానాలైన నగరాలు జనపదాలు దాటుతూ వారణాస్యుపకంఠదేశాన ప్రకాశించే భాగీరథిని చేరమన్నాడు. అక్కడ గంగానదిని చక్కగా వర్ణించాడు. గంగచే పవిత్రమైన కాశికాపట్టణాన్ని విశేశ్వరుణ్ణి అక్కడికి వచ్చే భక్తులను అద్భుతంగా వర్ణించాడు.

## రవిజా, విరజానదులు :

భూరమణియొక్క వక్షోజంపై విహరించే హరినీల విభాహార వరహారాలుగా రవిజావిరజానదులు అద్భుతాహావలై ఉన్నాయి [1] వాటినడుమనున్న మధురాసగరం హారంలోని నాయకమణిలా భాసిస్తోంది.

## మధురాపట్టణం :

నవరత్నస్థగితేందుకాంతమణినా నాతుంగ హర్మ్యంబులన్
నవమల్లీలతికాకుడుంగ తరుగణ్యశ్రీ వనీసంతతిన్
ధవళాంభోజ మరాళపాళివిలసత్కాసారతండంబులన్
మివులన్ జెన్నెసలారునమ్మధుర నెమ్మింజూడు ముందానిలా

---

1 భూరమణీవక్షోజ
హారవిలాసమునదనరు హరినీల విభా
హార వరహారములనగ
నా రవిజావిరజలద్భుతావహములగున్

ఏత్తైనమేడలు, పొదరిళ్లు గల్గిన ఉద్యానవనాలు, హంసలతో గూడిన సరస్సులతో మధుర ప్రకాశిస్తోంది కవిలోనిధారాళమైన పద్యరచనా శైలి ద్యోతకమౌతుంది

**యమునానది :**

యమునానదిని ఒక కాంతగా పోల్చి వర్ణించాడు కవి

వనజవిశాలనేత్రయును భాసుర రాజమరాళనాదయున్
ఘనతర ఫేన వస్త్రిమ నఖండ తరంగల సద్యశోవివ
ర్తనయును భవ్యసైకత నితంబయునైయమునాభిధాంగనా
మణి నిను గౌరవించు బవమాన సమాహిత మాధురీధురిన్

నదినికాంతగా ఊహించి అందలి కలువలు నురుగులు, తరంగాలు, సైకతాలు కాంతకుండే అవయవ సౌందర్యాలుగా వర్ణించడం కవి ప్రతిభకు తార్కాణం ఈ కావ్యంలో వర్ణనావిధాన మీ విధంగా సాగింది మితిమీరిన శృంగారం లేక ఔచిత్యవంతంగా సాగింది మార్గవర్ణన

## సందేశం

ఈ కావ్యంలో సందేశం సుమారు పదిహేను పద్యాలలో వివరింపబడ్డది. నలకూబరుడు రంభతనచెంతలేకపోవడంచేత విరహవేదననెలా అనుభవిస్తున్నాడో వర్ణించాడు

బృందకుపోయే మార్గాన్ని వివరించానుగదా! ఇక నిపుడు రంభతో నీవు చెప్పవలసిన మాటలు తెలియజేస్తాను వినమన్నాడు.[1]

నిన్ను బృందలోవిడిచి ఇక్కడి నందనంలో ఉన్మత్తుడనై తిరుగుతున్నాను. నీ కపోలద్వంద్వసాంగత్యంతో కూడిన నా చేతిలో ఇంతకు పూర్వం ఓడిన

---

1 బృందారామపథక్రిమంబఖిలమున్ విన్పించితిన్ గాదె యా
నందంబారగ నింకనేగు మటకున్ మందానిలా! రంభతో
నందంబారగ నీవు పల్కదగునాయాపల్కులన్ బల్కియా
చందాననొదగబల్కునానుడులుగా సర్వజ్ఞమూర్త్యంతరా

మన్మథుడు. నేను ఒంటరినై యుండుటచూచి అవమానానికి ప్రతీకారంగా తుంటరియై బాధిస్తున్నాడు.

తరుణి! నీ వచన మాధురికోడి చివురు జొం
    పములడాగుచు శకుంతములు బదరి
సుదతి! నీకచపాశికొడిగి దట్టపుబూల
    పొదలడాగుచును దుమ్మెదలు మెదలి
లలన! నీ యూర్పుదావుల కోడి కరువలి
    బలగంబుమూలమూలలకు నేగి
నెలత! నీ ముఖరామణీయకంబున కోడి
    తోయదవితతి నిందుండుడాగి

నిన్ను నేమియుజేయంగనేఱకున్న
నీయెడగలట్టిగట్టి అసూయచేత
నన్నలపజొచ్చెనీయందు నాకుగలిగి
నట్టికూరిమి వలన నబ్జాక్షినేడు

నీమీద కోపంతో శకుంతాలు, చంద్రుడు, తుమ్మెదలు, నన్ను బాధిస్తుంటే నేను సహింపలేకుండా ఉన్నాను ఈ మాటలు తన పల్కులుగా చెప్పమన్నాడు. వెంటనే వివశత్వంతో మూర్ఛనుపొందాడు విరహానికి పతాకస్థాయి మూర్ఛ. ఇదంతా ప్రబంధధోరణే.

అతని దీనస్థితిని జూచిన గంధవహుడు కదిలాడు. వెంటనే మేఘాన్ని వీడివచ్చిన తట్టిల్లతలా రంభ వచ్చింది వాల్లభ్యంతో ప్రియుని సంభావించింది పవనుదౌత్యం సఫలమైంది.

## సమకాలిక సమాజం

ప్రయాగలో త్రివేణి సంగమముంది. అక్కడికి యావత్ప్రపంచంనుంచి తైర్థికులు వస్తుంటారు. ఎప్పుడు జనసందోహంతో కోలాహలంగా ఉంటుంది సమీరుని ఆ ప్రయాగను దర్శించమన్నాడు నలకూబరుడు. శివ పూజకంటే శివ భక్తసేవనం గొప్పది. కాబట్టి ఆ ప్రయాగకు వచ్చే యాత్రికులకు బడలిక పోగొట్టమన్నాడు.

అచటికేగెడు తైర్థిక నిచయమునకు
బహుళదీర్ఘప్రయాణ సంభవములైన
బడలికలుబాపుపీదగు నడవడిగడు
ఆశగలిగెడు నీకు వెంతో శుభంబు

కవితన కాలంనాటి ప్రయాగ వైభవాన్ని అక్కడి యాత్రిక కోలాహలాన్ని చక్కగా వర్ణించి అనేక ప్రాంతాలనుండి ప్రయాగ పుణ్యస్థలానికి భక్తులు వచ్చే విధానాన్ని భంగ్యంతరంగా వివరించాడు.

ఈ కావ్యంలో ప్రధానంగా వర్ణితాలైన విషయాలు .

1. నలకూబరవిరహవర్ణన
2. దూతవర్ణన
3 మార్గోపదేశం—వర్ణన
4 రంభాసౌందర్యవర్ణన
5. సందేశం(నలకూబరవిరహం)
6. రంభానలకూబరుల సమాగమం

కావ్యమంతా కథా ప్రాధాన్యమైనదిగాక వర్ణనాత్మకమైంది

సంపూర్ణసందేశకావ్యలక్షణాలు· కలిగి ప్రసిద్ధమైన కథ ఆధారంగా వర్ణనాత్మకంగా కవి సృష్టించిన రసవత్ఖండకావ్యం సమీర సందేశం.

## శశిదూతము

శశిదూత కావ్యరచయిత కవిసమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారు. ఆర్ష ధర్మ పునరుద్ధరణ ధ్యేయంగా కావ్యరచనకు కంకణం కట్టుకొన్న అపర నన్నయావతారుడు ఆంధ్రవాఙ్మయంలో వీరు చేపట్టని రచనా ప్రక్రియలేదు. కిన్నెరసాని గేయ రచనతో ప్రారంభించి రామాయణ కల్పవృక్ష మహాకావ్యం, వేయిపడగలనే బృహన్నవల విరచించిన ధిషణాధురంధరుడు.

ఇటువంటి సాహితీ విరాణ్మూర్తి రచించిన అలఘుతర ప్రతిభాయుతమైన లఘుకావ్యం శశిదూతం.

విశ్వనాథవారి గోపికాగీతలలో దౌత్యకల్పన ఉన్నది. అలాగే రామాయణ కల్పవృక్షంలో హంసదూత్యకల్పన ఉన్నది దూత కావ్యలక్షణాలు సంపూర్ణంగా లేకపోయినా దూతకావ్యంగా పేర్కొనదగింది శశిదూతం.

ఈ శశిదూతానికి ప్రేరణనిచ్చింది కాళిదాస మేఘదూతం.[1] మేఘదూతం లోని శ్లోకాల్ని కొన్నింటిని తెలుగుచేసిన విశ్వనాథ వారెందుకో ఆ అనువాదం పూర్తిచేసి ప్రచురించలేదు. అనువాదం దుర్బలత్వానికిసూచన, ఏదైన కావ్యం తన్ను ప్రభావితుణ్ణి చేస్తేదాన్ని అంతర్భుక్తం చేసుకొని స్వతంత్ర రచనకుద్య మించటం ధీరత్వానికి నిదర్శనం. విశ్వనాథ అటువంటి ధీరుడు.

## కావ్యకథ

ఆరోజు వైశాఖ కృష్ణపాడ్యమి. పగలు ఎంత తాపాన్ని కల్గించిందో రాత్రి అంత ఆహ్లాదాన్ని కలుగజేసింది

అమృతము మాడు గట్టిన దొర ఉడురాజు. తనలోని అమృతాన్ని వెన్నెల రూపంలో ప్రవహింపజేస్తున్నాడు. ఆ వెన్నెలలో ప్రాణానికి ప్రాణమైన దంపతులు ఏకశయ్యాగతులైయున్నారు. ఇంతటి ఆనందజనకమైన వాతవరణంలో రమణికోపనయై పరాఙ్ముఖియైనది తన కాంత చంద్రుని సమక్షంలోనే కుపిత కావడానికి ఆశ్చర్యాన్ని పొందాడు కాంతుడు ఎన్నోవిధాల అనునయింప ప్రయత్నించాడు. ఫలితం లేకపోయింది. ఆ విరహాన్ని సహించలేకపోయాడు. దూరాన ఉన్నట్లైతే కొంత సహించేవాడేమో! అగ్నికి ఆజ్యం తోడైనట్లు ఆమె తన శయ్యమీదనే ఉండడంచేత విరహాగ్ని ఇనుమడించింది

ఆకాశం వైపు చూశాడు శీతకిరణుడు ప్రత్యక్షమైనాడు వెంటనే "అమృతము మాడుగట్టిన దొరా!" అని ఆర్తితో పిలిచి "రమణి యొకింత కోపన

---

[1] 1916 నుండి నేటివఱకు ఒక్క తెలుగులో మేఘదూతానువాదాలు నేనొక్కడను చూచినవే వందయున్నవని చెప్పగలను. నేనా ప్రభువునను సరించి 'శశిదూతము' వ్రాసితిని నేను నా చిన్నప్పుడు మేఘసందేశము లోని చాల శ్లోకములకు తెలుగు పద్యములు వ్రాసితిని. కావ్యశిల్ప సమీక్ష — చకోర సందేశం. — విశ్వనాథ సత్యనారాయణ పుట - 5.

శర్వాణ్యమ్మాళియైనటి నాకు చెప్పుకో నమరిన దూత యిప్పుడెవరందువు నీవు వినా నిశాపతి" అని ఆనకు తన ప్రియురాలికి దూత్యాన్ని నిర్వహించమని అర్థించాడు.

"వసంతుడు మన్మధునికి మంత్రాంగాన్ని నిర్వహించేది తొలినాళ్లలోనే. కాని నెలనెల కుసుమడించిన సౌందర్యం కల్గి పొదురాఁని తొలి పూవువై గగన తలాన వెలిగే నీవొక్కడివే ఎల్లప్పుడూ మంత్రివి" అని దూతను ప్రశంసించాడు.

మ్మగ్గలు, పూలు, నీవు ఒకే విధంగా కోమల జీవులు, పూల కుటుంబం. ఒకళ్లకొకళ్లు స్నిగ్ధులౌదురు. మీరు మీరు ఒకటిగాబట్టి నాకు ఆ మృదుకోపశీలకు నీవు తగినదూతవని భావిస్తున్నాను.

ఓ ప్రసన్నతాగుణనిధీ! విరాట్పురుషుని మనస్సునుండి ఉద్భవించావని వేదాలచేత కొనియాడబడ్డావు. అఖిలౌషధాలకు ఈశ్వరుడవు ఆకాశంలోని పూల దీపానివి ఓ నా చెలికాడా! నీవు అమృతాకృతివి

వనితలు నీకు సోదరులు వారికి నీవు సోదరుడివి మీకున్న గర్భ సంబంధాన్నిబట్టి నాకార్యం సానుకూల మౌతుందని భావిస్తున్నాను అంతేగాక యుగయుగాలనుండి ప్రణయోప జీవులకు అమరిన దూతవు అని అనేకవిధాల పొగిడి తననళినాయనాక్షి నెలాగైనా ప్రసన్నను జేయమని ప్రార్థించాడు

తనపనియందాసక్తి చూపుతాడాలేదా అని అనుమానం కల్గింది. మరలా ఇలా అన్నాడు నా తొందరకొద్దీవినమని వెంటనే మొదలు పెట్టానుకాని కలువ పడతిని తనియజేయాలనుకొంటున్నావో లేక పగలు క్రాగిన చంద్రకాంత శిల లకు శ్రమను తీర్చడానికి పోతావో? ఇదంతా సొదగా భావించి సొంతపనులు చేసుకోవాలంటవా? నీవధికారివైనా ప్రాణాలకు బాధ కల్గుతోంది. గుణశాలివైన నీవు ఏమాత్రం అశ్రద్ధచేయవద్దు. ముందు నాపనిచూచి ఇక రాత్రంతా నీ ప్రియు రాలితో కాలక్షేపం చేయికాదనను అని అంటూ చంద్రునే దూతగా గ్రహించటా నికి గలకారణాన్ని ఈ విధంగా వివరించాడు. కుసుమ సుగంధాన్ని సహించ వచ్చు, మన్మధబాణాదులైమతాకినా సహించవచ్చు కానీ నీవు ఆకాశాన కన్పడితే లతాంతులు నిల్వగలవా? కాబట్టి నాకు నీవే తగిన దూతవని పలికాడు.

శయ్యపైని తనప్రియురాలి చేష్టలను, తన బాధను సవివరంగా తెలిపి, భార్యలమ భర్తలు ఏమీఅనగూడదా? నేనన్నదిగూడా పెద్దగా ఏమీలేదే. కోపాన్ని

అభినయిస్తోంది నేనన్న లెక్కసేయవద్దని వంద సార్లు చెప్పాను కానీ లాభం లేకపోయింది ఆమెను ప్రసన్నునుజేసే ఉపాయం నీకు గాక మరెవరికి తెలియదు.

నిషధేశ్వరునకు మరాళంలాగా రఘువంశదేవునకు ప్లవంగ మహావీరుని వలె, రామగిర్యాశ్రమవాసియైన యక్షునికి మేఘంవలె నీవు నాకు సౌఖ్యాన్ని ప్రసాదించమని కోరుకొంటున్నాను

హంసవలె క్రొత్తగా ప్రణయబీజం నాట నవసరంలేదు. హనుమంతుని వలె వెదకవలసిన పనిలేదు. మేఘునిలా కొండగుర్తులు పెట్టుకొని పోనవసరం లేదు నా దూత్యం సులభమైంది ఇదిగో యిక్కడనే యున్నది నా కులపత్ని అని భార్యను చూపించాడు.

మర్యాదమన్ననలు, నీతి నియమాలు అగ్నిహోత్రాలు కల్గిన వంశంలో జన్మించిన ఈమెకు నాకు నా తలిదండ్రులు వివాహం చేశారు ఈమె సాధ్వి, మదేకజీవ, ఈమె సద్గుణాలను మాచుట్టాలంతా పొగుడుతూ ఉంటారు. నా గీచిన గీటు దాటనిది ఇది కేవలం ఏకాంతంలో నిండుప్రేమతో కూడిన ప్రణయ కలహం నా మీద దయతలచి ఆ యలుకదీర్చు

నేను కూడ కోపాన్ని అభినయించి ఆమెను నమ్మిస్తేనే నాకై బాధపడి బ్రతిమిలాడుతుంది అటువటి అభినయం చేయడం అనవసరమని నిన్ను ఆశ్రయించాను. మమ్మల్ని కూర్చినట్లైతే కాన్కలతో సత్కరిస్తాము అని చంద్రుని ప్రసన్నం కమ్మని ప్రార్థించాడు

తన భార్యలో కొంతమార్పు వచ్చింది చంద్రుడు తనను అనుగ్రహించాడను కొన్నాడు నీవంటి సత్పథ విహారియైన రాజును అంజలించి ప్రార్థిస్తే ఏ మాత్రం వ్యర్థంకాదు. నీ చలివెల్గులు నా వక్షఃస్థలంపై నాప్రియురాలిని చేర్చాయి. నన్ను క్షమించమని బ్రతిమాలుతోంది తన శిరము నా ఉరముపై జేర్చి తెల్లనుల లోనను చూస్తు నా హృదయ భారాన్ని తగ్గిస్తోంది ఇదంతా నీచలువే సుమా

ఆమె కసలు కోపమే కల్గలేదట ఆమె మీద కథలల్లి నీతో చెప్పానట. అసలు కోపమేరాదట. ఈ మాటలకు నాకు కోపమొస్తోంది

ఇతరులను యాచించడం మరణంతో సమానం. కొందరు విననట్లు తల తిప్పుకుపోతారు. కొందరు నోటితో లేదనక చేత్తోలేదంటారు. ఏ మాత్రం ఆలస్యం చేయక మేలుచేయడం నీకే చెల్లిందని పొగడి ప్రయోజనాన్ని తగినట్లు పొందాడు.

## కావ్యగత విశేషాలు

దూతకావ్యాలలో ముఖ్యంగా ఉండవలసిన లక్షణం మార్గనిర్దేశం. అది శశిదూతంలో లేదు. దానినొకవిధంగా కవి సమర్థించాడు. అంతే గాక మార్గోపదేశానికి అవకాశమే లేదు ఈ కథలో "గొలగొల కొండ గుర్తులిడు కొంచును బోవుట యంత నిష్టయే సులభము నాదు దూత్యము" అంటూ మార్గ నిర్దేశ లోపాన్ని ఈ కథకు తగిన విధంగా సమర్థించాడు.

### దూత

తన కావ్యంలోని దూత్యం హనుమ ద్దౌత్యం హంసదౌత్యం మేఘదూతాలతో పోల్చి వాటిలో సమమైనదిగా భావించాడు.

ఒక నిషధేశ్వరేంద్రునకు నొక్కమరాళమతల్లికంబడిన్
ఒక రఘువంశదేవునకు నొక్కప్లవంగమవీరునింబడిన్
ఒక గిరివాసి యక్షునకు నొక్కపయోధర సాధువుంబడిన్
సుకములు గల్గె నిన్నుబడిసూ సుఖమందగనేను గోరెదన్

సందేశ కావ్యాలలో దూతను స్వాగతించి ప్రస్తుతించడముంటుంది. స్వాగతంలేదు గాని ప్రశంసమాత్రం ఈ కావ్యంలో ఉన్నది.

నీవు ప్రసన్నతా గుణఖనీ! అలవేదములందు మెచ్చు గొ
న్నావఖిలాండ బీజుని మనస్సుననుండి సముద్భవించి తం
చీవఖిలౌషధీశుడవు నీవు మహాత్ముడ వాకసంబులో
నీవొక పూలదీపమవు నీవమృతాకృతివయ్య మత్సఖా!

అని అంటూ సముద్ర మథన సమయంలో కాలకూట విషంలో మండి పోతున్న నీరప్రాంతాన్ని చల్లబరచడానికి ఉద్భవించావు. కాలకూట విషాన్ని

మింగిన ఈశ్వరుని కంఠంనుంచి వెలువడే ఉడుకుల పొంగులార్పడానికి మౌళిపై నిలిచావు. వసంతుడు తొలినాళ్లలోనే మన్మథునకు మంత్రి గానినీవు ఒక్కడివే ఎల్లకాలం మంత్రిత్వం వహించేవాడివి అని తన దూతను ప్రశంసించారు.

## చంద్రదూత్యం

చంద్రునే దూతగా ఎన్నుకోడానికి కొన్ని కారణాలు చూపించాడు. ఆ సమయంలో చెప్పుకోటం మరచిన దూత చంద్రుడేనట! తన బాధను మాన్పగల సరియైన దూతచంద్రుడే. ముగ్ధలు, పూలు, చంద్రుడు ఒకే విధమైన కోమల జీవులు, ఒకళ్లొకళ్లకి స్నిగ్ధులౌతారట మీరూ మీరు ఒక్కటి కావడంచేత నాపని సుగమమౌతుందన్నాడు.[1] చంద్రుడు నిర్వహించిన దూత్య స్వభావాన్ని వివరించాడు కవి వలపుదూత్యాలు నిర్వహించడంలో చంద్రునికొక ప్రత్యేకత ఉన్నది [2]

## సందేశం

ఈ కావ్యంలో తన ప్రియురాలికి ప్రత్యేకంగా హనుమంతుడు, మేఘుడు చెప్పిన విధంగా చెప్పవలసిన సందేశమేమి లేదు. దీనికి గూడ కథలో ఏమాత్రం అవకాశం లేదు. నాయికా నాయకులలో ఎవరూ ప్రవాసులు కారు. ఏకశయ్యాగతులు నాయకుడు చెప్పే మాటలు ఆమె వింటూనే ఉన్నది.

---

1 ముగుదులు, పూలు నీవు నొక మోస్తరు కోమల జీవులందు బి
ట్టుగ నిదియొక్క పూవుల కుటుంబము మీర లొకళ్లొకళ్లకున్
మిగులగ స్నిగ్ధులౌదురును మీరును మీరును నొక్కటౌట నీ
వగుదువు నాకు దూత్యమునకంగనకున్ మృదుకోపశీలకున్

2 వలపుల దూత్యమున్ నడపువైఖరియే యిదివేరు నీదెసన్
చలిమిరిగా రహస్యముగ సన్నగ జెప్పనియట్లు చెప్పి కాం
తలును నెఱుంగకేతమకు దాముగ నల్లలజారివచ్చిన
ట్టులు పొనరింతు ప్రేమలమడుంగులు కట్టలుపొలిపారగన్

ప్రధానంగా ఈ క్యావంలో ఉన్నవి నాల్గుభాగాలు :

1. దూతదర్శనం—ప్రస్తుతి.
2. భార్య విరహం
3. చంద్రుణ్ణి ప్రార్థించటం
4. కార్యసిద్ధి

శశిని ప్రార్థించటమే ఈ కావ్యంలో విశేషం తక్కిన వన్నీ సందేశ కావ్యాలలో ఉండేవే.

## వర్ణనావైభవం

శశిదూతంతో కథ అత్యల్పం కావ్యమంతా వర్ణనా ప్రధానమైనదే ఒకే వస్తువును వివిధమైన ఊహలతో వర్ణించడం గొప్ప ప్రతిభ కల్గిన వ్యక్తికి మాత్ర మే సాధ్యం కవి సమ్రాట్ విశ్వానాధలో సమృద్ధిగా ఈ ప్రతిభ ప్రకాశించింది. ఆ ప్రతిభ ఈ దూతకావ్యంలో వర్ణనా నైపుణ్యరూపంలో ప్రతి ఫలిస్తున్నది శశి దూతమంతా విస్తారమైన చంద్రవర్ణనతోఉంది

తాను దూతగా నిర్ణయించుకోడానికి గల కారణాలను వివరిస్తూ చంద్రుని స్వభావాన్ని గుణాలను వర్ణించాడు. తరువాత తన కార్యసిద్ధికై శశిని ప్రార్థించా డు. అందులో పక్వమైన వర్ణనా నైపుణ్యమున్నది

కపురపు బల్కులట్లు కలకండ పొడింబలె సన్నసన్నగా
లిపొరల సందుల జలించివెసన్ మణి ముక్కతుర్చించిన
ట్లు పొదలి బైటికిన్ మెఱసి లోపల లోపల చల్లచల్లనై
కృపగలనీదు రేవెలుగురేకలు మాకు ప్రసన్నమయ్యెడిన్

ఇది వెన్నెల వర్ణన. నీ వెలుగురేకలు మాకు ప్రసన్నంకావాలి అని అ న్నాడు. ఆ వెలుగురేకల యొక్క సొగసును ఈ పద్యంలో చెప్పాడు. కర్పూ రపు పల్కుల్లా కలకండ పొడిలా మణి ముక్క తుర్చించినట్లుగా బయటకు మెర సిలోపల చల్లగా ఉండే వెలుగురేకలు ప్రసన్నంకావాలట.

కలువల సిగ్గులో నాగరు గంధపు ప్రాయము నిగ్గుతోచి చ
క్కిలి గిలిగింతలోన గిలికించితముల్ సవరించి లేత చె
క్కిలి పులకింపులోన దులకింపులు మంపులు తీర్చికొన్నవె
న్నెలల జెలంగు నీ చలువనీటులు మాకు బ్రసన్నమయ్యెడిన్

చంద్రుని చలువలోని నీటుల స్వభావాన్ని తేటతెల్లులో విశేషంగా వ్యస్తపదశైలిలో వర్ణించాడు కవి. ఈ విధంగా సాగుతుంది వెన్నెలలను పది వృత్తాలలో అభివర్ణించాడు కవి ప్రతిపద్యంలోను కవి భావనామహత్వం అనుభవైకవేద్యమౌతుంది. నన్నయగారు ఉదంకునిచేత గావింపజేసిన నాగ స్తుతి గురుపద్యవిద్యకు ఉదాహరణ. ఇది సమస్త పదశైలి. వీరి ఈ శైలివ్యస్తపదాలతో సాగింది.

## సమాకాలిక సమాజం

ఈ శశిదూతంలో చివరికి ప్రయోజన సాఫల్యాన్ని పొందిన నాయకుడు చంద్రుని ఔదార్యాన్ని కొనియాడడానికుద్యుక్తుడై లోకంలోని మానవుల వివిధ స్వభావాలు ఈ విధంగా వివరించారు

అడుగుట గూడ మానవులయందున జచ్చిన యంతిపాటు తా
నడిగిన నోరు విప్పి యొకడే దలవంచుకపోదు రెల్లరున్
జడిముడినోటలేదనక చేతుల లేదనునొక్కరుండు నీ
తడయక మేలు సేత తొలిదాతలనున్ దలపించు చంద్రమా

చంద్రుడు మాట్లాడలేదు ప్రయోజనం సిద్ధించింది. కొందఱు మాట్లాడ కుండానే హితాన్ని క్రియత్మకంగా చేస్తారు అని చంద్రుని చర్యను చక్కటి కల్పనతో సమర్థించాడు.

పై పద్యాలలోని భావంలోకస్వాభావికమైనదే అయినా కవిస్వానుభవం కూడ కావచ్చు తన కాలంలోని సమాజన్ని నిశితంగా పరిశీలంచకపోతే ఏ కవికూడ ఆ భావాలను తన కావ్యంలో చొప్పించరు.

శశిదూతం శత చంపకోత్పల హారంగా సాగింది. మృదుమధురమైన శృంగార భావనలు వ్యక్తం చేయడానికి చంపకోత్పలాలే తగినవి.

ఈ కావ్యంలో దూతకావ్యలక్షణాలు సంపూర్ణంగా లేకపోయినా కవి ఉద్దేశ్యాన్నిబట్టి, కొన్ని దూతకావ్యలక్షణాలుండడంచేత, దానిని దూతకావ్యంగా పరిగణించవచ్చు

కవి సామర్థ్యాన్ని పట్టిచూపించేదీ సందేశక్యావం చిన్న విషయాన్ని గ్రహించి మధురాతిమధురోహలతో ఎంతగావో ప్రపంచించిచెప్పటం కవిప్రతిభకు నికషం అయితే పౌరాణికంగా చంద్రుడు వంచకుడు అటువంటివాణ్ణి దూతగా కోరటంలో ఔచిత్యం ప్రశ్నింపదగిందే,

## కీర సందేశము

కీర సందేశ రచయిత సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు. ఆంధ్ర దేశంలో లబ్ధప్రతిష్ఠులైన ప్రముఖపండితులూ సంస్కృతాంధ్ర కవి శేఖరులు.

శ్రీమద్భాగవతంలోని రుక్మిణీ కల్యాణ ఘటం ఆధారంగా ఈ కీరసందేశ కావ్యకల్పన చేశారు.

ప్రసిద్ధేతివృత్తమైన భూసుర సందేశయుత రుక్మిణీ కల్యాణానికి కీరసందే శాన్ని మరల కూర్చినట్లైతే పునరుక్తి దోషం కలుగదా అని కొందరనుకొంటా రేమోనని భావించిన ఈ రచయిత పీఠికలో దానికిలా సమాధానం చెపారు

నచ తేషాం ఘటతే వధిర్నచ తే దృశ్యంతే కదాపి పునరుక్తాః
యేవిభ్రమాః ప్రియాణామర్థావాసుకవి వాణీనాం॥

(అనగా ప్రియురాంఢ్రయొయ్యారాలకు సత్కవుల కావ్యార్థాలకు అవధి కానరాదు అపి పునరుక్తములుగాను తోచవు )

అన్న సూక్తిని ఆదర్శంగా గ్రహించి నేనీ కావ్యరచన చేశానన్నారు

కథ ప్రసిద్ధమైనదైనా కావ్యం మాత్రం చక్కని కల్పనతోకూడి ఉన్నది

## కావ్యకథ

భూభారాన్ని తగ్గించడానికై యదుకులంలో జన్మించిన శ్రీకృష్ణుడు భక్తా వనుడై సనక సనందనాది మునిబృందాల సేవలనందుకొంటూఉన్నాడు. వేదాంతులు

శ్రీకృష్ణునిదాంతుడు, శాంతుడు అని గోపకాంతలు రసికావతంసుడని భావిస్తూ, ఉంటారు శ్రీకృష్ణదర్శనం స్పర్శనంకోసం జంతూ సమూహాలు, వృక్షతతులు తహతహలాడుతుంటాయి అట్టి పరమాత్మ ఒక రోజు నిజ గృహపుష్పోద్యానం లో విహరిస్తూ ఒకమామిడి చెట్టుక్రింద నిలబడ్డాడు కుడికన్ను, కుడిభుజం అదిరింది ఒక మామిడిపండువాలి చేతిలో పడ్డది ఆశ్చర్యంతో అటు చూస్తుండగా ఎదుట ఒక పంచవన్నెల చిలుకవ్రాలి జయజయధ్వానాలు చేసింది అపుడు శ్రీ కృష్ణుడుదాన్ని దగ్గరకు తీసి దువ్వి ఈ విధంగా అన్నాడు

"ఇంపైన శక్రచాపఖండంలా, రంగురంగులపూల రాసిలా, చిత్రవర్ణాంబరం దాల్చిన చెలువలానాకు కన్నుల పండుగ చేస్తున్నావు ఓసి! పంచవన్నెల చిలకా నీకు స్వాగతం.

అమరలోక నిత్య నివాసం కల్గి విహారం కోసం వచ్చిన కిన్నెర కన్నెవు గాక సామాన్య విహగానివా? నీ సౌందర్యాన్ని దేవకాంతలు ఎరవు తీసుకుపోతుంటారు లేకపోతే మునుల తపస్సును ఎలా భగ్నం చేయగలరు?

నిత్య ఫల రసపానం చేతనేమో నీ వాక్కులు ఎంత మధురంగా ఉన్నాయి? ముఖమేకాదు నీ ప్రత్యంగం అమృతం స్రవింపగా మాట్లాడుతోంది

నీది ఏ దేశం? నీలాంటి మనోజ్ఞ మూర్తిని పెంచిన తరుణిమణి ఎవ్వతె? ఈ రాకకు కారణమేమిటి?" అన్నాడు

అపుడు చిలుక ఈ విధంగా సమాధానం చెప్పింది "ఓ మహాత్మా! నా జన్మచరితార్థం చేయడానికినన్నడుగుతున్నావుగాని త్రికాలజ్ఞుడవైన నీకుతెలియని దేమున్నది? ముందు నేను తెచ్చిన సందేశాన్ని విను ఆ పైని నా కధ వినిపిస్తాను

కుండిన రాజవంశాన జన్మించిన రుక్మిణి అనే రామారత్నాన్నిగూర్చి వినే ఉంటావు ఆ రత్నాన్ని స్వీకరించి నీ కంఠభూషగా చెసుకో ఓ పురుషోత్తమా! పుట్టీ పుట్టకమునుపే ఆ పట్టికి నీపై ప్రేమ పుట్టింది దానికి కారణమేమిటో నీకే తెలియాలిగాని పామరులమైన మాకేం తెలుస్తుంది?

బంగరు తొట్లో పడుకోబెట్టి నీపై పాటలు పాడుతుంటే ఏడ్పుమాని అసక్తిగా వినేది పాట ఆపితే ఏడ్చేది ఆ పాటలు ఆమె బాలారిష్టాలకు మంతౌషధంలా పనిచేశాయి.

పారాడే సమయంలో పూజాగృహంలో విష్ణుమూర్తి వద్దకు చేరేది. అత్త, తాతయని మాటలు నేర్పుతుంటే కృష్ణ కృష్ణ అంటుండేది

'ఎవరిని పెండ్లాడతావ'ని అడిగితే వెంటనే 'శ్రీకృష్ణుని' అనేది ఈ విధంగా పెరిగి పెద్దదై చంద్రునికోసం చకోరంలా నీ కోసం ఎదురు చూస్తోంది.

'నా తండ్రి స్వయంవరం ఏర్పాటుచేసి రాజులనందర్నీ ఆహ్వానిస్తాడు అందులో పుల్లాంబు జాతేక్షణుడు కూడా వస్తాడు. అతని మెడలో దండ వేస్తాను అతనికి నాకు పెండ్లి చేస్తారు' అని దోరపు మోహంతో ఉవ్విళ్లూరుతోంది. ఆ బేల స్థితిని శతాంశమైనా వివరింపలేకపోయాను సర్వజ్ఞుడవు నీకు తెలియందే ముంది?" అని ఆమె రూపాన్ని ఆకర్షకరంగా వర్ణించింది

ఆమెకు నీయందుగల ప్రేమ వార్త దశదిశలా వ్యాపించింది. శిశుపాలుడు కూడా తెలిసికొన్నాడు తన్ను వరించమని పురోహితజనంచేత కబురు పంపాడు. ఆమె తండ్రి తిరస్కరించాడు శిశుపాలుడు పట్టువీడక ఆమెను తనవైపు త్రిప్పడానికి ప్రయత్నించాడు నీమీదనున్న ద్వేషంతో, ఆమె మీది మోహంతో పట్టుదల హెచ్చి ఆమెను పొందడానికి తొందరపడుతున్నాడు. కుండినపురంపై దండయాత్రకు తలపడుతున్నాడు తన బలం ఎదుటివారి బలం గుర్తించక నీ వెదిరించినా తలపడడానికి సిద్ధమౌతున్నాడు

కుండినపురం తల్లడిలపోతోంది నాల్లువైపుల రాజుల్ని శిశుపాలుడు కూడ గట్టుకొన్నాడు. భీష్మకు నీ స్థితి నాల్లువైపుల నిప్పంటించిన ఇంటిలో ఉన్నవాని వలె ఉన్నది. ఆమె సోదరుడు రుక్మిచేసేదేంలేక శిశుపాలునికామెను సమర్పింప నిశ్చయించాడు

రుక్మిణి నెత్తిమీద పిడుగు పడ్డట్లై మూర్ఛపోయింది. తెప్పరిల్లి విపరీతమైన 'దుఃఖానికి లోనైంది తన స్థితిని నీకీవిధంగానైనా కబురుచేయాలనుకొంది. అపుడు తన చెంతనున్న నన్ను ఓ ప్రియసఖీ! నీవు వెంటనే పోయి నా స్థితిని పూర్తిగా ఆ జగన్నాధునికి తెల్పి ఇక్కడున్నట్లుగా రమ్మని కాళ్ళుగడ్డం పట్టుకొని ప్రాధేయపడ్డది

ఆ శిశుపాలుడు రేపో, మాపో ఆమెను బలాత్కారంగా వశంచేసికోగలడు" అని రుక్మిణి పంపిన సందేశాన్ని సవిస్తరంగా వినిపించింధి,

నీవు కనికరించకపోతే, అగ్నిలోగాని, నీటిలోగాని తను త్యాగంచేయ డానికి ఆమె సిద్ధపడ్డది ఇక ఆలస్యానికి సమయంకాదు. "ఆలస్యాదమృతం విషమ"న్నమాట జ్ఞాపకం చేసికో! ఆమె కథ నామూలాగ్రంగా తెలియజేశాను. నీకు కర్తవ్యం బోధించడం మాలాంటి పక్షులకు తగదు.

అని చిలుక దేవకాంత రూపాన్ని దాల్చి తన పూర్వ వృత్తాంతం ఇలా వివరించింది "లక్ష్మీదేవి చెలికత్తెను, నా పేరు విద్యుల్లత. చాపల్యంచేత లక్ష్మిచిత్ర వర్ణాంబరాన్ని దొంగిలించాను. అది గుర్తించిన లక్ష్మి కోపించి 'ఆ అంబరం లాంటి రూపుదాల్చి చిల్కరూపు వహించమ'ని శాప మిచ్చింది. క్షమించమని ప్రార్థించాను వైదర్భి సందేశం అవధిగా శాపోపశమనాన్ని అప్పటి నుండి కుండిన నగరంలోని రాజాంతఃపురంలో ఈ రోజుకోసం ఎదురుచూస్తూ కాలం వెళ్లపుచ్చుతున్నాను నీ కృపచేశాపాంతాన్ని పొందాను అని రుక్మిణి తనను పెంచిన విధానాన్ని, ఆమెకు తనకుగల అనుబంధాన్ని, రుక్మిణి అమృత హృదయాన్ని గూర్చి వివరించి కృష్ణునివద్ద సెలవుగైకొని వెళ్లిపోయింది

చిలుక చెప్పిన మాటలు కృష్ణుని హృదయాన్ని కలచివేశాయి రుక్మిణి దీనస్థితిని కనులకు కట్టినట్లు వర్ణించింది

వెంటనే కనక స్యందనాన్ని అధిష్ఠించి కుండినపురానికి వెళ్లాడు. పెద్ద సేనతో మాగధముఖ్యులతో తలపడ్డాడు. గొడుగుపై పిడుగు పడ్డవిధంగా కృష్ణుడు విరుచుకుపడ్డాడు. శిశుపాలుడు ప్రాణాలతో పారిపోయాడు వెన్నదొంగ రుక్మిణిని దొంగిలించాడు. శిశుపాలుడు వెక్కిరించబోయి వెలికిలపడిన విధంగా పరాభవాన్ని పొందాడు.

చిలకరాకకై ఆత్రుతతో ఎదురుచూస్తున్న రుక్మిణికి ఈ హఠాత్ సంఘటన ఆనందం కల్గించింది.

భీష్మకుడు కృష్ణునకెదురేగి తలవని తలంపుగా మాయిలుసొచ్చి బలిని కోరే ఈ దయ్యాన్ని పొలిమేరదాకా తరిమినందుకు కృతజ్ఞతలు తెల్పి స్వాగతించాడు శిశుపాలుని ధాటికి తాళలేక అయిష్టమైనా నా చెల్లెలిని నా దుష్టునకు సమర్పించటానికి సిద్ధపడ్డామని రుక్మి పశ్చాత్తాపాన్ని ప్రకటించాడు.

అనంతరం వేల్పులు పూలవానకురిపిస్తూండగా వైభవంగా రుక్మిణి కళ్యాణం కృష్ణపరమాత్మతో జరిగింది ఈ విధంగా శ్రీ శాస్త్రిగారి కీర సందేశ కావ్యకథ రమ్యంగా సాగింది.

## కావ్యగత విశేషాలు

### కథాకల్పన .

సాధారణంగా అన్ని సందేశ కావ్యాలలోను కావ్యనాయికగాని నాయకుడుగాని దూతను నిర్ణయించుకొని సందేశంవివరించడంతో కథ ప్రారంభమాతుంది.

కాని ఈ కావ్యం ఎవరికి సందేశాన్ని అందించాలో అతని తోడ సంభాషణతో ప్రారంభమాతుంది. సాధారణంగా సందేశకావ్యాలలో ఉండే మార్గనిర్దేశం లేదు. ఈ కథా కల్పనలోదానికి అవకాశం కూడలేదు.

కావ్యరచనలో మరోక చమత్కారమున్నది. దూతకు ఈ దూత కార్య నిర్వహణచేతనే శాపశమనం కల్గుతుంది. అందుకై నాయిక తనను ఎప్పుడు దూతగా పంపిస్తుందా అని ఎదురు చూస్తుంది.

దౌత్యం వల్ల కలగే కార్యసిద్ధి కూడ ఈ కావ్యంలో ఉండటం విశేషం

## పాత్రచిత్రణం

రుక్మిణీ దూతయైన కీరం సందేశాన్ని తీసుకొని కృష్ణునివద్దకు వచ్చింది అతని మనసు కరిగే విధంగా నాస్థితి తెలపమని రుక్మిణి కోరింది కీరాన్ని అసలే ఈచిలుక మధురంగా మాట్లాడటంలో నైపుణ్యం గల్గినది.

లొలుత కుండిన రాజపుత్రిని గూర్చి కృష్ణునకు పరిచయంచేస్తూ రుక్మిణికి పుట్టీపుట్టక ముందే అంకురించిన కృష్ణప్రేమ యౌవనవతి అయ్యేంతవరకు ఎలా క్రమపరిణామవికాసం జరిగిందో అద్భుతంగా వర్ణించింది. ఇవి రుక్మిణి చెప్పిన మాటలు కావు. చిలుక భావించి కావించిన మధురాతి మధుర వర్ణన.

బంగరుటూయలలో కృష్ణస్తుతితోకూడిన గీతాలనాసక్తిగా వినడమేగాదు' పారాడే రోజులలో పాకుతూ పోయి పూజా గృహంలో విష్ణుమూర్తి పూజకుద్యుక్తురాలు కావడమేగాక కూనిరాగాలలో కధనాలపించడమేగాక పెద్దల మాటలు నేర్పుతు అత్తా, తాత అనమంటే కృష్ణఅనేదట. తెలిసీ, తెలియని వయసులో నీ వేవరిని పెండ్లాడతావఅని ఎవరైనా అడిగితే వెంటనే శ్రీహరినని ప్రత్యుత్తరమిచ్చేదట. శ్రీకృష్ణరూపాన్ని చెలికత్తె చెప్పగా ఆమెను కౌగిలించుకొని ముద్దాడేదట. అంతేగాక ఆమెలోని కృష్ణప్రేమ ఎంత పరాకాష్ఠకు చేరిందంటే

తను భుజియించు ఫలాదులు
దలదాలుచు కమ్మపూల దండలు జెండుల్
తన పూయు చందనాదులు
మును మనమున నీ కొసంగి పూబోడిగొనున్

అన్నది చిల్క అంతేగాక కృష్ణ విరహాన్ని అనుభవిస్తూ ఎంత బాధపడుతోందో తెల్పింది

ఈ మాటలు విన్న కృష్ణునికి అమెపంపిన సందేశం వినాలనే కుతూహలం మిక్కుటమైంది. ఈ సందేశం కూడ రుక్మిణి సూత్రప్రాయంగా చెప్పినదానిని నేను వాఖ్యానించానని చిలుక అన్నది.

## రుక్మిణీసందేశం

పరమేశ్వరి సూత్రాత్మత
జరియింతువుగద సమస్త జంతువులందున్
ఎఱుగవె నాయెదగ్రాలుచు
పరితాపపుటగ్గికాగు పరిమాణంబున్

అని ఆరంభించి "బలిహరుడవైన నీవు శిశుపాలునకు నేను బలికాకుండా చూడు. నేను నీకోసమే పుట్టాను నాయీ యౌవనాన్ని నీ కోసం ముడుపు

కట్టాను. నాయీ కానుకను నీవు స్వీకరించు. నీవు మెడలో అలంకరింపదగిన మాలను. శునకం తన మెడలో వేసికోటానికి ఆరాటపడుతోంది. మనోవాక్కాయ కర్మల్లోనిన్ను వలచిన భక్తురాలిని. అమృతమిస్తావో విషమిస్తావో నీ యిష్టం. నీ కొఱకై నేనేం చేశానో సర్వవ్యాపివైన నీకు చెప్పవలసినదేమున్నది? కొండను చిటికిన వ్రేలితో ఎత్తినవాడివి నా మీద శిశుపాలుడనే కొండ విరుచుకుపడుతోంది. శరణ్యుం వేడుకొంటున్నాను, రక్షించు" అని అతి సంక్షిప్తంగా సూటిగా ఎంత వరకు చెప్పాలో అంతవరకు చెప్పి ముగించింది.

చిలుక ఆమాటలు వివరిస్తూ శ్రీకృష్ణునితో

ఆ యువతి యిట్లుసూత్ర
ప్రాయముగ వచించె ముగ్ధభావంబున నా
రాయణ! దీనికి భాష్య
ప్రాయమునా నొడివి యున్న ప్రాక్కథయెల్లన్

తనవచోనైపుణ్యాన్ని చెప్పుకొన్నది

తనపై రుక్మిణికి గల మమకారాన్ని చిలుక వివరించింది ఆ విధంగానే రుక్మిణి కూడ కనుమూసి తెరిచేలోగా రమ్మ టే కీరం ఎందుకనిరాలేదనుకొని

అనుచు చిల్కరామినాహరివచ్చిన
నావెలంది తాళకాత్మయందు
బిక్కమోగము వేసి వీక్షిందు నల్దిక్కు
బెంచియున్న వలపు పెద్దవలపు

శ్రీకృష్ణునితో వివాహమైనా ఆమె అంతరాంతరాల్లోనున్న ఆ బాధను ఆతడు గమనించి —

చిలుకలకొలికికి కృష్ణుడు
చిలుకకు శాపాంతమగుట జెప్పియు బోకం
దెలిపియు దద్వ్యథమానిచి
సలలితకేళీ విలాస సంతతిదేర్చెన్

అప్పటికి కాని ఆమె బాధ ఉపశమించలేదు.

ఈ రచయిత మరొక కల్పన చేశాడు. విదర్భలోనే వివాహం కావడం అది భాగవతంలో లేదు. దానికి పీటలమీద పెండ్లి తీసివేయడం పాపమని ఆ పీటలమీదే మరల పెండ్లి జరగాలని శ్రీకృష్ణుడనుకొన్నట్లు కవి చెప్పాడు అంతేగాక రుక్మిణి పశ్చాత్తాపం కూడ ఈ కవి కల్పనే.

కథ సుప్రసిద్ధమైనా అడుగడుగునా కల్పనా చమత్కారంతో అతి మనోజ్ఞంగా సాగిన సందేశ కావ్యం కీర సందేశం.

సందేశకావ్య లక్షణమైన మార్గవర్ణన లేకపోయినా తక్కిన అన్ని లక్షణాలతో కూడిన ఒక చక్కని సందేశ కావ్యం.

ఈ కీర సందేశం శ్రీ సన్నిధానం వారి కల్పనా ప్రతిభకు ఔచిత్యవంత మైన కావ్యరచనా దక్షతకు అక్షర దర్పణం.

## పవన సందేశము

పవన సందేశమనే ప్రణయ కావ్య రచయిత్రి గంటి కృష్ణవేణమ్మగారు. ఈమె గృహలక్ష్మి స్వర్ణకంకణ బహుమతి గ్రహీత ప్రొద్దుటూరు వాస్తవ్యురాలు. విమర్శకాగ్రేసరులైన నాగపూడి కుప్పుస్వామి అయ్యంగారి ఆశీర్వాదబలంచేత బాల్యంనుండి కవిత చెప్పడానికలవాటు పడ్డారు.[1]

ఈ కవయిత్రి గిరిజాకళ్యాణమనే ఐదు ఆశ్వాసాల ప్రబంధాన్ని, శ్రీకామాక్షీ శతకం, రాజరాజేశ్వరీ శతకం, దుర్యోధనుని ఆత్మగతం మొదలైన అనేక కావ్యరచనలు చేసి చక్కని రచనాసామర్థ్యం గలిగిన రచయిత్రిగా పండితలోకంలో కీర్తి నార్జించారు.

---

1 ధరణి విమర్శకాగ్రే
సర బిరుదాంచితుడు కుప్పుస్వామ్యార్యుడు మ
ద్గురువర్యునెంచుచు నమ
స్కరింతు సంపుల్లచిత్తసారసమందున్

# కావ్యకథ

శ్రీకృష్ణుడు దక్షిణ నాయకుడు అతడు ఎప్పుడెక్కడ ఉంటాడో ఎవరికీ తెలియదు. ఆ శ్రీకృష్ణదర్శనంకోసం నిరంతరం గోపకాంతలు తపించి పోతుంటారు. చెట్టుపుట్టల్ని గాలిస్తూ "మల్లియలార! మీ పోదలమాటున లేడు గదమ్మ తెల్పరే" అని వేడుకుంటుంటారు. సామాన్య గోపకాంత విషయమే ఇలా ఉంటే నిరంతర శ్రీకృష్ణధ్యానమగ్నయై ఉన్న రాధ సంగతి చెప్పవలసినదే మున్నది?

రాధ, కృష్ణ విరహ నిర్వేద మహాగ్నిలో గమిలిపోయి సహించలేక వేడి నిట్టూర్పులు విడుస్తూ విరహోన్మత్తయై దారి తెన్నుగానక మెల్లమెల్లగా బృందా వనంలో తిరుగాడుతోంది

గుండె బరువుతో కుమిలిపోతున్న రాధ మేనికి మందపవనుడు సోకగానే ఉలికిపడి చేతులు మోడ్చి నన్ను బాధించక రక్షింపుమని వేడుకొన్నది. బల వంతుడవు మాలాంటి దుర్బలలను బాధించుట తగదు. సులలిత హృదయుడవైన నిన్ను నాకోసహాయం చేయమని వేడుకొంటున్నాను అన్నది.

అల్పునియాచించి కార్యసాఫల్యాన్ని పొందదం కంటే అధికులను వేడి విఫలురమైనా ఫరవాలేదు.

సకలచరాచర సృష్టికి ప్రాణాధారమైన ఓ మహాత్మా! ఇసుమంత సహాయాన్ని నాకు చేయమని ప్రార్థిస్తున్నాను. నీ ఉపకారాన్ని నేను మరచిపోను.

నీవు మధురకు పోయి కృష్ణుడున్న హర్మ్యాన్ని జొచ్చి ఆయన మనసు కరిగే విధంగా మెల్లగా నా స్థితిని వివరించి ఆ జగన్నాధు నిక్కడకు వెంటనే తీసికొని వచ్చి నాకు మేలు కూర్చుమని వేడుకొన్నది.

మధుర ఎక్కడున్నదో రాధకు తెలియదు. బృందావనిదాటి బయటి కెప్పుడు పోలేదు. నాకు మధుర ఎక్కడ ఉన్నదో, ఎటువెళ్లాలో, ఎంత

దూరమో తెలియదు. సచ్చరితుడవు. జవసత్వాలు కల్గిన వాడివి గాబట్టి నా హృదయేశుడెక్కడ ఉన్నా నా సందేశాన్ని అందించమన్నది.

ఆ మధురానగరాన్ని గూర్చి, అక్కడి నాగరీక జీవనాన్నిగూర్చి అక్కడి వనితలను గూర్చి కృష్ణుని సౌందర్యాన్ని గూర్చి మనోహరంగా వర్ణించి పవనునకు తెలియజేసింది. మధురనుండి ఎవరైనా వచ్చినపుడు అక్కడి వైభవాన్ని అత్యంతాసక్తితో అడిగి తెలుసుకొనేది. దానినే పవనునికి చెప్పింది.

నీవు శ్రీకృష్ణునకు నా వ్యధలన్నీ తెలియపరచే సందర్భంలో ఆతని ముఖభావాలను గుర్తించు హృదయగతభావాలకు ముఖం దర్పణంలాంటిది గదా అన్నది.

అనంతరం అతి మనోహరమైన తన సందేశాన్ని తెలిపి ఇంతకన్నా నా స్థితిని నీకేం చెప్పగలను? నీవు చూస్తూనే ఉన్నావుగదా! ఇదంతా అతని మనసు కరిగే విధంగా తెలియజేయమన్నది.

అతణ్ణి వేడుకొనియైనా యిక్కడి కాతడువచ్చే విధంగాచూడు లేకపోతే ఆ మహనీయుని పాదధూళినైనా తీసుకొనిరా. నా అదృష్టమంతే అనుకొని సంత సిస్తాను

ఆ పాదధూళిని నా శిరస్సున, స్తనాలపైనిడుకొని సంతృప్తి పొందుతాను. లేకుంటే మరో జన్మలోనైనా శ్రీకృష్ణప్రాప్తిని కోరుకొంటూ తను త్యాగం చేస్తానని పలికి పవనుని మధురకు పంపింది రాధ

## కావ్యగత విశేషాలు

ఒక స్త్రీ మరొక వనిత విరహవేదనాభరితమైన స్త్రీ హృదయాన్ని ఆవి ష్కరించినకావ్యమే ఈ పవన సందేశం.

ఈ విరహం రచయిత్రి స్వానుభవమే కావచ్చు తన విరహవేదనాన్ని రాధికా విరహవేదనగా మలచి హరికి సంబంధించిన కథ కాబట్టి పుణ్యం కూ

దా వస్తుందని భావించి వ్రాసిన ఈ వలిగాడ్పుదౌత్యాన్ని వేంకటరమణుని పా దాల చెంత సమర్పణచేశారు.[1]

రాధా మాధవులకు సంబంధించిన ప్రణయ కధలెన్నో వచ్చాయి శ్రీల రూపగోస్వామి కృష్ణభక్తుడు కావడంచేత భక్తుడు భగవంతుని దర్శనంకోసం పడే వేదనగా రాధ విరహాన్ని చిత్రించారు ప్రేమయే దైవం అని పెద్దలు చె ప్పే మాటలు విశ్వసించిన రచయిత్రి తన విరహాన్ని రాధ విరహంగా మార్చి ప్రేమకు ఆదర్శంగా శ్రీకృష్ణుని, కామినులకు ఆదర్శంగా రాధికను భావించి ఈ కావ్యరచనకుద్యమించారు [2]

మేఘ, హంసాదిదూతకావ్యాల్లో లాగా ఇందులో మార్గోపదేశానికి ప్రాధా న్యమీయలేదీ రచయిత్రి

---

1 వలపులతోట బెంచితిని వారక ప్రేమ సుధారసంబుచే
జెలువుగ పూలు పూచె నతి శీఘ్రముగా ఫలియించె రెండు ది
వ్యలలిత భాగ్యరత్నములు, వానిని గాంచి యమేయ హర్ష మిం
పులుగన బొంగిపోయితిని పుత్తడి దుర్గము నెక్కినట్లుగా

కాని యింతలోనె కాలవాహిని బొంగి
వలపు పూవుదోట వనధి గలిసె
నంధకారపటలియావురించెను దైవ
విధిని దాటనగునె వేల్పులకును

తరుగనియావియోగ జనితానల దుఃఖ దవానలంబుచే
విరహ భరంబుచే వనరివేసరి యోదరిగానలేక యీ
వెరవునరాధికా విరహ వేదనయున్ వలిగాడ్పుదౌత్యమున్
హరికధ యంచువ్రాసితినిఅర్పణ జేసెదత్వత్పదకీతిన్

2 ప్రేమే దైవము దైవమె
ప్రేమయనుచు దెల్పుచుంద్రు పెద్దలుధరలో
ప్రేమకు నీవాదర్శము
కామినులకు రాధికయును కాదె యెచంగన్

రాధ బృందావనాన్ని దాటి బయటకు పోయియుండదని ఈమె భావనయై యుండవచ్చు. లేక తాను పంపే సందేశం పవనునిచేత కాబట్టి అతడు సర్వాంతర్యామి. అసమాన జవసత్వాలు కల్గిన వాడు కావటంచేత అతనితో మధురఎక్కడున్నదో తెలియదు నీవే నా హృదయేశుని తెలిసికొమ్మంది. తనకు తెలిసినంతవఱకు మదురను,యమునను అక్కడి స్త్రీలను, కృష్ణుని రూపాన్ని ఇలా వర్ణించింది.

"మధురలో ఆకాశాన్నంటే సౌధాలున్నాయట. కనులకు మిరుమిట్లుగొలిపే కాంతలున్నారట పొంగారెడి యమునా నది ఒడ్డున రంగారెడి తోటలో తిరుగాడే శృంగారవతులు చూచేవారికి మన్మధ బాణాల్లా భావిస్తారట.

మధురలోని స్త్రీలు అతిలోక సౌందర్యవతులట. మాటలలో జాణతనం ప్రదర్శించి తమ ప్రియులను దాసులను చేసికొంటారట ఆపట్నవాసుల నేర్పులు మాకెలా తెలుస్తాయి. ఏవిధంగానైనా వారు తమ ప్రియుల మనసులు పట్టేస్తారు" అన్నది రాధ.

అక్కడ పూవులమ్మేవారు కూడ నెరజాణలే వాళ్ళు సరసాలాపాలచేత మురిపిస్తారట మగవారిని.

ఆ మధుర లలతోద్యానాలతో చెలువైన హర్మ్యాలతో సకలసిరులకు నెలవై అలకాపురాన్ని తలపిస్తుందట

సౌధాల్లో శ్రీకృష్ణుడు ఎక్కడ ఉన్నాడని చెప్పేది? నీవెఱగనితావులేదు గాబట్టి నీవే చూడు అని శ్రీకృష్ణుని ఆనవాలు చెప్పనారంభించింది.

నల్లనైనవాడు నగుమోముగలవాడు
చూడదగినయట్టి సొగసుకాడు
కంబుగళమువాడు కంజాతనేత్రుండు
సుందరుండు నందనందనుండు
నీలనీరద వర్ణుండు నిరుపమాన
వినుతచేలంబుకటిసీమదనరుచాడు
లలితవసమాలయురమునబెలగువాడు

బర్హిపింఛము సిగపైన వరలువాడు
చూపులను నాచికొనియెడి సొంపుగులుకు
రూపములను గలవాడు నవ్యరుచిర విలాసుం
డింపారు యురముగాంచిన
ఏ పడతియు విడువజాలదెంతయుప్రీతిన్
వెడద యురమువాడు కడుదీర్ఘబాహుండు
కుటిలకుంతలుండుకోమలుండు
సింహమధ్యముండు సితదంతరుచిరవి
లాసభాసురుండు లక్షణుండు

నాల్గుగీత కందపద్యాలలో శ్రీ కృష్ణరూపాన్ని అతి మనోహరంగా వర్ణించింది రాధ. వ్యర్థపదాడంబరం లేక, లలితమైన భావాలను అలవోకగా వ్యక్తం చేసింది. ఇది ఈ కావ్యరచయిత్రి కవనచాతురికి తార్కాణం.

పట్టణాలలోని నాగరికత తెలియదుగాని ప్రియుని మనసు తెలిసికొనే నేర్పుంది రాధకు. మాయోపాయలతో ప్రియునిగుప్పిట్లో పెట్టుకోడం చేతగాక పోవచ్చు ముఖంలోకి చూచి మనసులోని భావాలు గుర్తించగలదు. అదే నత దూతకు కూడ తెల్పుతోంది ఈ విధంగా

హృదయగతభావములు వెల్వరించి చూప
వదనబింబమె అద్దమువంటి దౌను
గాన నీ మాటలాలింపగలిగినపుడు
అతని ముఖవైఖరులగాంచి యరయుమయ్య

అతడేస్థితిలో నున్నాడో గమనించి ఒకటి రెండు మాటలు చెప్పు దాని కాతడు ఏం సమాధానం చెపుతాడో విని ఇక ఆతరువాత నేను చెప్పబోయే మాటలన్నీ పూసగుచ్చినట్లుగా తెలియజేయమన్నది శ్రద్ధలేని చోట వ్యర్థమైన వాగ్వ్యయంచేయ కూడదని ఆమె భావం కావచ్చు

ఆ ప్రభువులు అలసి ఉన్నట్లైతే మెల్లగా మేనికి సోకి సేదదీర్చి తరువాత చెప్పమన్నది. దానికి కారణంకూడా చెప్పింది రాధ తన దూతకు

ప్రభువులెప్పుడెట్లు బరగుదురో వారి
మనసు దెలిసి మనము మసలవలయు

నిద్దురబోయే సమయంలోను, ఏ ముద్దరాలి చెంతనైనా ఒద్దికగా ఉన్న సమయంలోను అదనుజాంతకునకు నా అవస్థ తెలియజేయవద్దని దూతను వేడుకొన్నది. ఎదుటివారి హృదయం క్షణంలో తెలియగల సమర్థుడు, సర్వలక్షణా కలితుడైన అతని మనసుకెక్కే విధంగా వానితో విషయాలెలాచెపుతావో అన్నది.

పెద్దలవద్దకు పోయేటప్పుడేమైనా కానుకలు తీసుకుపోవడం విజ్ఞాలలక్షణం. దూతను పంపేటప్పుడు ఆ విషయంలో కూడ జాగరూకత వహించాలి తన ప్రతినిధిగా దూతను పంపేటప్పుడు అతని అన్ని చర్యలకు తానే బాధ్యత వహించాలి కాబట్టి అతడు తన వద్దనుండి పోయేటప్పుడే అన్ని విషయాల్లోను జాగ్రత్త వహించడం సందేశం పంపేవారికి ఎంతైనా మంచిది.

నీవు పోయేటప్పుడు హిమకణపూరితమైన ఒక కమలాన్ని తీసికొనిపోయి కమలనేత్రునిపాదాలచెంతనుంచమన్నది. అంతటితో ఆగక ఒకే చర్యవల్ల రెండు ప్రయోజనాలు సిద్ధించే విధంగా నిన్ను వీడియున్న రాధ వదనమిలా ఉన్నదని చెప్పమన్నది.

వాడి వత్తులుగా నేలబడిన యట్టి
మాలతీలతగొనిచని మాధవునకు
పాదములజుట్టికోమలవల్లిరాధ
నిన్నుగానకయిట్టులే యున్నదనుము.

ఇలా దూతకు చెప్పిన తరువాత తన సుదీర్ఘమైన సందేశాన్ని పవనునకు తెలియచెప్పింది. ఆమె మాటలలో ప్రార్థనమున్నది వేదనఉన్నది. చనువుతో గూడిన దూషణఉన్నది భక్తి ప్రకటనఉన్నది. ఇన్ని రీతులుగా తన హృదయాధిదైవానికి సందేశాన్ని పంపింది రాధ

అన్నివిధలుగా వంతలపాల్జేసి నీవు సుఖాలనుభవించడం తగునా? ధూర్తతతో నీవీ విధంగా ఉండడానికి అంతటి మహాపరాధం నేనేంజేశాను? కలలోనైన నిన్ను చూద్దామంటే నిద్దురరావడంలేదు. రాత్రిగడవడం దుర్భరంగా ఉన్నది

నిను నమ్మిన కాంతను ఈవిధంగా ఆరడి పెట్టడం తగదు. వెంటనే రమ్ము. మధురలోని సౌధాల్లో విహరించే స్త్రీలపైనున్న మోహం నిన్ను నమ్మినవారిపై నుండతగదా?

మోసం చేయడానికి నీవే మాత్రం సంకోచించవు. ఈ కృష్ణుడు నీదాస్యుడని నీవు నాపాదాలమీదపడ్డనాడు నేను గర్వపడి మోసపోయాను. దానిఫలితం ఇపుడు తెలిసింది. నీ విరహంలో గండుకోయిలకూతల్ని మలయమారుతాన్ని వెన్నెలవెలుగుల్ని భరించలేకుండా ఉన్నాను. పల్లెసీమలో పుట్టిన వాళ్లం మేము. మా హృదయంలోకల్లకపటాలు లేవు

నిశ్చలప్రేమ మాత్రం మా హృదయం నిండా ఉంటుంది

నీ ప్రేమసామ్రాజ్యానికి నేనే శాశ్వతమనుకొన్నాను. ఆ గగన సౌధాలన్నీ గాలిలోకలిసి పోయాయి. రాత్రింబవళ్ళు కన్నీటి కాల్వలతో ఒకే రీతిగా గడుస్తున్నాయి. అరమరికలు లేని కూర్మితో గడచిన రోజుల్ని మరచి ఈ విధంగా చేస్తే ఈ భంగపాటు స్త్రీలు ఎలా భరించగలరు? నిను వీడిపోనని చేతిలో చెయి వేశావు అధిపులు నిత్యనూత్న ప్రియులని తెలియని నన్ను వంచనచేశావు. నా నొసట తిలకం దిద్ది నీ చెక్కుటద్దంలో ఎలా ఉన్నదో చూచుకొమ్మని నన్ను కౌగలించుకోగానేను మెల్లగా తోసేసరికి ప్రేమతో ఎన్నో ముచ్చటలు చెప్పిన నీకు ఇవ్వుడవి అన్నీ ఏమయ్యాయి?

నిరంతరం కన్నులు మూసికొని నిన్నే భావిస్తూ కాలక్షేపంచేస్తున్నాను. నాహృత్కమలాన్ని భక్తితో నీచరణాలచెంత చేరుస్తాను. ఎప్పుడు నిన్నేకీర్తించుతాను. మనసు, తనువు, ప్రాణం నీకర్పణచేసి నీవే నా భాగ్యమని భావించుకొంటున్నాను. ప్రణవాన్ని వేణుగానరవంలో భావించాను. మంచివాడవని నమ్మి నీకు నా తనును మనసుధారపోశాను ఇటువంటి కొంచగాడవని ఊహచేయలేదు. నా తల్లితండ్రి, ప్రియుడు సర్వస్వం నీవే అనుకొన్నాను అట్టి నీ నగుమోము చూడలేని నా బ్రతుకు వ్యర్థం నేనిక జీవించలేను అని ఈ విధంగా పలికి తన మాటలలోని కృష్ణదూషణను గుర్తించి వెంటనే పశ్చాత్తాపాన్ని పొందింది.

నేను అవివేకినై నిన్ను దూషించాను. నాతప్పు క్షమించమని వేడుకొంటూ

చనువుగనో నీపైగల
ఘనమోహంబుననొకన్నుగానక నినునే
ననిన విరసోక్తులెదనెం
చి నను క్షంతవ్యనేమిచేసెదొసామీ

అని పశ్చాత్తాపాన్ని పొంది గోపకాంతలతో నీవు కూడి యున్నపుడు ఈర్ష్యా ద్వేషాలతో జారుడని, చోరుడని అన్నాను సర్వసాధువని తెలిసికొనలేక పోయాను.

నిగమాగమసంచారా
అగణిత దివ్య స్వరూప! యభివేశనినున్
మగువను తెలియగలనా
స్రగలంకృత కంధర రతిరాజమనోజ్ఞా!

అని తన అవివేకాన్ని, అల్పత్వాన్ని వ్యక్తంచేసి నిరంతరం నీ పాదాలే ధ్యానంచేసే నాకు నీవు దూరం కావద్దని వేడుకొన్నది

ఈ కావ్యంలో సందేశకావ్యాలలోని ప్రధాన లక్షణమైన మార్గోపదేశం అత్యల్పమనే చెప్పాలి. నూట ముప్పది మూడు పద్యాలుగల ఈ కావ్యంలో ఎనభై పద్యాలవఱకు సందేశం చెప్పడంతోనే సరిపోయింది.

ఈ సంచేశంలో రాధ అహంకారం, ఈర్ష్య వ్యక్తమై క్రమపరిణామంలో కృష్ణతత్వం తెలిసి సర్వసమర్పణ చేసిన భక్తి తత్పరురాలిగా చిత్రించబడ్డది. శ్రీకృష్ణుడు నావాడే అనుకొన్న రాధ తుదకు సర్వాంతర్యామి అని తెలిసి అతని చరణాబ్జసేవనంలోనే తృప్తిపడడానికి నిశ్చయించుకొని నిగర్వియై అతడు నావద్దకు రాకుంటే అతడి పాదరేణువైనా తీసుకొనిరా! నా శిరమున దాల్చి ధన్యనౌతాననడంలో మోహంతోడి హృదయార్పణ భావం రాధ మాటలలో ద్యోతకమౌతోంది

స్త్రీ హృదయంసైజంగా కల్గిన కవయిత్రి కృష్ణవేణమ్మగారు, కృష్ణవర్ణన లోను,మధురానగర వర్ణనలోను, దూతకు సందేశాన్ని తెలియజేసే సందర్భాల లోను ఆర్ద్రిమంతమైన స్త్రీ హృదయాన్ని ఆవిష్కరించారు.

# రచనావైదగ్ధ్యం

ఈ రచయిత్రి తన ముందుమాటలో

నడకనెరుంగదు పలుకుల
యెడ నేరుపులేదు రీతులెరుగదు సుంతే
నడుగిడనేరని చిన్నది
పుడమినిమత్కావ్యకన్య బుధజనులారా!!

పండితులకు నుతసద్గుణ
మండితులకు సుకవి నికరమాన్యుల కత్యు
ద్దండ వచః ప్రావీణ్యుల
ఖండవిమర్శకులకెల్లఁ గరములు మొగుతున్

అని వినయంతో చెప్పుకొన్నా పరిపక్వము జెందిన రచనానైపుణ్యంతో అనన్యమైన ప్రతిభతో అలవోకగా ఝరీవేగంతో పద్యరచనసాగించారు.

మందారమాలతీమంజుల మాధవీ
పొదలచాటున ప్రొద్దుబుచ్చునాఁడు
బృందావనాటవీ సుందరతరులతా
మందిరమ్ములకూర్మి మసలునాఁడు
యమునానదీతీర కమనీయ సైకత
స్థలులకేళీలీల తరలునాఁడు
శరదిందుకాంతికాంతులనరుదార పచ్చిక
బయలోకవగూడి బరగునాఁడు

మొదలైన సీస పద్యపంక్తులలో కవితా మాధుర్యం తొణికిసలాడుతోంది.

ఉర్విని ధనమున్నప్పుడు
గర్వంబున లెక్కసేయగలరే మూర్ఖుల్
సర్వము బోయిన వెనుకనె
గర్వముడిగి లెక్కసేయుకాసేపదిగా

మొదతైన భావాలలో ఈ కవయిత్రి లోకానుభవాన్ని వ్యక్తంచేశారు.

ఈ కావ్యం కృష్ణవేణమ్మగారి రచనలలోనే గాక ఆధునికాంధ్ర సందేశ కావ్యాలలోనే తలమానికంగా సంభావించవచ్చు

## శుకసందేశము

శుక సందేశ కావ్యరచయిత మూలా పేరన్న శాస్త్రిగారు వీరు మధురకవి బిరుదాంకితులు వృత్తికి రైపిష్టుగా ప్రభుత్వోద్యోగియైనా ప్రవృత్తికి మధుర కవితల్ల గలిగిన ప్రజ్ఞాధురీణులు.

జగత్ప్రసిద్ధమైన శ్రీమద్భాగవతంలోని రుక్మిణీ కళ్యాణ ఘట్టాన్ని గ్రహించి శుకసందేశాన్ని కల్పించి సందేశకావ్యరచన గావించారు.

## కావ్యకథ

కుండిన రాజపుత్రిక రుక్మిణికి శిశుపాలునితో వివాహం నిశ్చయమైంది కాని ఆమెమనసు గోపాలునిపై లగ్నమైంది అతణ్ణి ఏ విధంగానైనా భర్తగా పొందాలని రుక్మిణికి గాఢమైన కోరిక తన స్థితి ఆ పరమాత్మునికి తెలిసేది ఎలాగా అని తీవ్రంగా ఆలోచించి ఒక సురప్రవరుణ్ణి గోపాలుని వద్దకు దూతగా పంపింది.

వివాహముహూర్తం సమీపిస్తున్నది. వేగిరపడ్డ మనస్సుకు భూసురుని రాక ఆలస్యంగా తోచింది క్షణమైనా ఆలస్యం సహించలేక పోయింది అపుడు తాను పెంచుకొంటున్న గుణదోష విచార నిపుణమైన ఒక కీరాన్ని దూతగా కృష్ణుని వద్దకు పంపడానికి నిశ్చయించింది.

"ద్వారకకు పోయిన భూసురుడింకా రాలేదు ఏ ఆటంకము కల్గిందోనని పరిపరివిధాల ఆలోచిస్తున్న నాకు నిద్రపట్టక కనులు కాయలుగాచాయి నీవు ద్వారకాపట్టణానికిపోతే బాగుంటుందని నా కనిపిస్తోంది. ఓయిద్విజోత్తమా! నీవు వెంటనే పోయి నీరజనాభునికి నా సందేశాన్ని 'అందించమని" రుక్మిణి అర్థించింది

'తన సందేశాన్ని ఈ విధంగా వివరించింది.

ఓవృష్ణి వంశాగ్రణీ! ఏముహూర్తంలో బుధులు వర్ణిస్తుంటే నిన్ను గూర్చి విన్నానో అనాడే నామదిలో తీపితలపులు పుష్పించాయి. మన్మథ బాణాల తాడ నానిని తాళలేకున్నాను చంద్రికలు, తుమ్మెదల ఝుంకృతి ప్రాణంతీస్తున్నాయి మలయానిలభూతం విపరీతంగా బాధిస్తోంది, యదునందనా! నీ దాసిని కరుణించు అని అంటూ తనసందేశాన్ని చిలకకు వినిపించింది పోవలసిన మార్గాన్ని తెలియజేసింది. కృష్ణుని వద్ద శుకం ప్రవర్తించవలసిన తీరును, తీసుకోవలసిన జాగ్రత్తలను ప్రవచించింది.

రుక్మిణిమాటలు విన్న చిలుక రెక్కలార్చి అంతఃపురంనుండి బయటపడి ద్వారక వైపు పయనించింది రుక్మిణి కీరం రాకకోసం ఎదురుచూస్తోంది.

రుక్మిణి చెప్పిన విధంగా చిలుకద్వారకకు పోయి తిరిగివచ్చి ఆమెతో శ్రీకృష్ణుని గూర్చి ఈ విధంగా అన్నది

నీ గుణాలు శ్రీకృష్ణపరమాత్మ మెచ్చాడు. ఎవ్వరు ఎదిరించినా వారి మదమణచి శిశుపాలునకు తగినవిధంగా బుద్ధి చెప్పి నిన్ను స్వీకరిస్తానన్నాడు. ఆ బ్రాహ్మణుడు గూడ అక్కడే ఉన్నాడు. శ్రీకృష్ణునితో కలసి వస్తున్నాడు. పెండ్లికామాత్రై రీవిలో సిద్దంగా ఉంటే వెంటనే నిన్ను ద్వారకకు తీసుకొని పోగలడు అన్నది చిలుక

రుక్మిణి కార్యసాఫల్యానికి సంతసించింది. చిలుక మాటలననుసరించింది.

## కావ్యగత విశేషాలు

శ్రీమదాంధ్రభాగవతపురాణంలోని పోతన మహాకవి కృతమైన ఈ క్రింది రెండు పద్యాలు ఈ శుకసందేశ రచనకు స్ఫూర్తినిచ్చాయి

అగ్నింజెల్లి వివాహముంగదిసెనేలారాడు గోవిందుఁడు
ద్విగ్నంబయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుడేటికిందడసె నాయత్నంబుసిద్ధించునో
భగ్నం బైచనునో విరించి కృత మెబ్భంగిన్ బ్రవర్తించునో

ఘనుఁడా భూసురుఁడేగెనో నడుమ మార్గ శ్రాంతుడై చిక్కెనో
వినికృష్ణుండది తప్పుగాఁ దలచెనో విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁదలంచనో తలపఁడో యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో నా భాగ్య మెట్లున్నదో

పై పద్యంలో 'ఉద్విగ్నంబయ్యెడి మానసంబు' అన్న రుక్మిణి వచనానికి కవితాపరమైన వ్యాఖ్యానమే ఈ శుకసందేశ కావ్యరచన

రుక్మిణి భావోద్విగ్నతకులోనైంది మనసు పరిపరివిధాల ఆలోచించింది ఇటు శిశుపాలుడు సిద్ధంగా ఉన్నాడు కానీ తనకాతడిపై కోరికలేదు శ్రీకృష్ణుని నుండి వార్తలేదు. తన మదిలోని భావాలెవరితోనైన చెప్పుకొంటే ఉద్విగ్నతకు కొంత ఉపశమనం కలుగుతుంది రుక్మిణి తనగోడు చిలకవద్ద వెళ్లబోసుకొంది.

"కృష్ణుని చెంతకేగిన భూసురుండు ద్వారకనుండి ఇంతవఱకు తిరిగి రాలేదు అసలు వెళ్ళాడోలేదో? లేక అతని మాటలు విన్న కృష్ణుడు అన్యథా భావించాడేమో? కాక బ్రాహ్మణుడు పరమ భాగవతోత్తముడు, యోగిసేవితుడు పరాత్పరుడైన శ్రీకృష్ణునిచూచిన తరువాత ఆ మహాత్ముని వదిలిరా లేక పోయాడేమో! ఇతర కార్యాలలో లగ్నమైన శ్రీహరికి ఇక్కడికి రావడానికి వీలు లేక పోయిందేమో! కంటకావృతమైన అడవిలో ప్రయాణంకావడం చేత జ్వరితుడై ఉండవచ్చు లేక త్రోవతప్పి ఉండవచ్చు లేకపోతే సపరివారంగావస్తున్న శ్రీకృష్ణునితోపాటు ప్రయాణం చేస్తుండగా శత్రువులు ఉద్ధగించారేమో?" ఇలా అనేక విధాల ఊహించింది [1]

---

1 తడయక భూసురోత్తముడు ద్వారకకేగెనొ లేక త్రోవలో
బడలిక జెందెనో శ్రమల బాల్పడెనో హఠిగాన లేక తా
నడయుచు నుండెనో వినినయంతనె కృష్ణునకన్యభావమే
ర్పడియెనొయేమి కారణమొ బ్రాహ్మణుడింతకురాడు కీరమా
భాగవతోత్తముండనుచు ప్రస్తుతికెక్కిన విప్రుడమ్మహా
భాగు పురాణ పూరుషుని భావజ సన్నిభునంగనామనో
రాగుని యోగి సేవింతుపరాత్పరు సర్వ చరాచరావనో
ద్యోగుని గృష్ణునిన్ గనిన తోడనె భక్తిని జొక్కినిల్చెనో
నందకుమార శేఖరుడు నా మనవిన్ విని కోపగించెనో
బృందను వీడి వచ్చుటకు వీల్పడదో పని తొందరన్ చిదా
నందుడు భక్తరక్షణ ఘనవ్రతుడొండొకచోటుకేగెనో
కందెనొ బ్రాహ్మణుండు తరుకంటక భూముల సంచరించుటన్
దారికనంగరాకతల దాచుకొనన్ తగుదావులేక వి
స్తార పదిశ్రమన్ నలిగిసాగగ ముందునకడ్గుపోక కాం
తారపుదారులందుపయనంబగు పట్టున దోడులేకనో

ఇక లాభం లేదనుకొని ఆ చిలుకనే కృష్ణునివద్దకు పోయి సంగతేమిటో తెలిసికొని ఇక్కడున్నట్లుగా రమ్మన్నది. ఇక్కడ చిలకను ద్విజోత్తమా! అనటం లో సంబోధనౌచిత్యం ఉట్టిపడుతోంది.

తాను పంపిన సందేశంలో తన ఆవేదనతోపాటు కృష్ణస్తుతి కూడ యున్నది.

"నాయనువారి సాయమును నందగ భాగ్యము లేనిదాననై
నీయెడ నొంటి నుంటినిజామీసనువే కరుణించి ప్రోవుమీ"

అని వేడుకొని తన మన్మధావస్తను యిలా వ్యక్తం చేసింది.

"కాయజు సాయకంబులకు గ్రాగితి మాగితిసాంద్రచంద్రిక
చ్ఛాయలచేత దుమ్మెదల ఝుంకృతి ప్రాణము తీయజొచ్చె హా
హాయన జేయుచుండె మలయానిల భూతము దాళజాల కృ
ష్ణా యదునందనా తెలియదా నిజ దాసి దురాపతాపముల్"

తన సంకేత స్థలం చెప్పి భవానీ మందిరానికి పూజకైపోతున్నాను. అంతఃపురానికి రానవసరంలేదు. అక్కడకువచ్చినను తీసుకుపోమ్మని ప్రార్థించి చివరిగా

---

పొరుడునొచ్చెనో రుజల బాల్పడెనో? మరి త్రోవదప్పెనో
పాలితదుర్నయుండు శిశుపాలుడు జాల్మడు నన్నువానియి
ల్లాలిగ జేకొనన్ దలచు నాత్మను నిత్యము నట్టివానికే
బాలిశుడైన బ్రాహ్మణుని బంపిన సంగతి దెల్సి కోపతా
పాలనుబూని మార్గమున బాపని కావద గూర్చెనోగదా
చాలదినమ్ములయ్యె ద్విజసత్తముడాయిదు నాధుడున్న ప్రాం
తాలకు నేగి యిప్పటికి దానరుదేరడు లేక నంద గో
పాలుని గూడి వచ్చు తరి బంధుర హస్తిరధాశ్వవాహినీ
జాతముతోడ శత్రువుల చట్టున మార్గము నడ్డగించెనో

పాలనమానలేని శిశుపాల జరాసుతులనొత్తుటయుంచి! శౌ
కేలు గ్రగహింపలేని వెతగీడ్పడ జేయకయుందు వేని గో
పాల! భవాంతరంబులను బ్రాణ విభుండవునీవకాగ బ్రా
ణాల బరిత్యజింతుజుమినమ్ముము నానుడి నందనందనా!

అని ప్రాణత్యాగానికి కూడ సిద్ధమైంధి.

## మార్గనిర్దేశం - వర్ణనా వైభవం

రుక్మిణి ముందుగా చిలుక ఎలా ప్రయాణం చేయాలో వివరించింది. తరువాత ద్వారకను అక్కడి స్త్రీలను వర్ణించింది. ఆ పిమ్మట మనోజ్ఞంగా తరువాత బృందావనంలోని శోభలను అక్కడి స్త్రీలనువర్ణించింది, కళిందజానదిని వర్ణించింది. కోటిభాస్కర ప్రకాశమానుడైన కృష్ణుని విస్తారంగా వర్ణించింది. తరువాత కృష్ణునివద్ద చిలుక వ్యవవహరించవలసిన తీరు వివరించింది.

### ప్రకృతి వర్ణన :

ఈ మార్గవర్ణన ప్రతిభావంతుడైన కవి చేసిన అద్భుతమైన ప్రకృతి వర్ణనగాసాగింది: రుక్మిణి ముందుగా చిలుక ప్రయాణ సౌకర్యాన్ని గూర్చి వివరిస్తూ –

శ్రమకు దలంక బోవక సరాసరిసాగుము మౌనివాసితా
శ్రమములు మేటి వౌగిరులు సాలరసాలతమాల భూరుహ
ప్రముఖములున్ మదేభ మృగరాజవనాంతరావళుల్
క్రమమగురీతి జూచుచద్వరన్ బయనింపగదయ్యయొయ్యనన్
పచ్చని చేలతో విరియబారిన కంకుల పాళితో రసా
ఘ్యచ్ఛ ఫలాళితో విపుల పుణ్యనదీనద పంక్తితో సదా

సచ్చరితంబు గల్గు జన సంఘముతో తులదూగు భూములన్
ముచ్చటమీరగాగనుచు ముందరికేగుచు జేరుద్వారకన్
ఆగినచోట నాగక ఫలాదులెఖుక్తిగ శాఖశాఖపై
నూగుటముందుగా బయన మొప్పగజేయుచు నప్రమత్తవై
సాగుము ద్వారకాపురికి చల్లనిచల్లని నాయొడంచలో
దాగిననాదు_వంత విశదంబుగ దెల్పు శుభంబునీకగున్

పై పద్యాలలో ఈ దేశంలోని ప్రకృతి సంపదయొక్క వైభవాన్ని అద్భుతంగా వర్ణించింది రుక్మిణి రాజాంతఃపురకాంత కింత ప్రకృతి పరిశీలనా దృష్టి ఉన్నట్లుగా కవివర్ణించడం పాత్రోచితమాయని కొందరకనిపించినా ఈ సందేశ కావ్యాలలో దేవకాంతలే ఈ భూలోక విశేషాలను వర్ణిస్తుంటే రాజాంతః పురకాంత ప్రకృతిని ఇంత గొప్పగా వర్ణించడంలో అనౌచిత్యమే మాత్రం లేదు శ్రీకృష్ణబద్ధ చేతస్క అయిన రుక్మిణి గురలవద్ద ఈ విశేషాధికాన్ని ఆసక్తితో గ్రహించనట్లు భావించవచ్చు కవి యొక్క ప్రకృతి పరిశీలనాదక్షత యిందులో వ్యక్తమౌతుంది.

## ద్వారకావర్ణన :

చలువలరేఖితాన పనిజానగుమేడల సొంపు సింపమె
జిలుగుగదాని బొమ్మలటు చిత్తజుమెత్తరితూపులట్లు క్రొ
వ్వలపుల గ్రమ్మ గోపికలు పాడియు బంటలతోడనేపుమై
గలగలలాడుద్వారకను గన్నుల పండువుగాగ జూడుమీ.

దీర్ఘసమాసాలు లేక అలతి యలతి పదాలతో ద్వారకను కన్నుల పండువుగా వర్ణించాడుకవి.

**శ్రీకృష్ణవర్ణనం :**

చల్లని పిల్ల తెమ్మెరలు జారెడు మువ్వపు తేనెజాలు చి
ప్పిల్ల నికుంజ మధ్యమున స్వీయమనోజ్ఞసురూపసుందరీ
వేల్లితహావభావముల వ్రేతల ప్రీతల జల్పునట్టియా
నల్లని మేనివాని యదునందును గాంచుము కంటికింపుగన్

గోపికాలోలుని వర్ణించాలంటే ఏ కవియైనా అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తాడు. స్వీయమనోజ్ఞరూపంతో గోపికలను ఆనందపరచే నల్లనిమేనివానిగా ఈ కవి కృష్ణుని భావించాడు.

## పోతన ప్రభావం

రుక్మిణీ కళ్యాణమనగానే పోతన భాగవతమే గుర్తుకువస్తుంది ఈ కథ నెందరో కవులు కావ్యాలుగా వ్రాశారు. కానీ రుక్మిణి హృదయంలోని ఆర్తిని పోతన వ్యక్తం చేసినట్లుగా మరొకరు చేయలేదు ఏ కవియైనా తాను చేసిన వర్ణనలలో పోతన ప్రభావాన్నుంచి తప్పించుకోలేకపోతాడు

భాగవతంలో అగ్నిద్యోతనుడు ద్వారక నుండి తిరిగి వచ్చి రుక్మిణితో చెప్పిన మాటలు శుకసందేశంలో చిలుకపలుకులు కొద్ది భేదంలో ఒకే విధంగా ఉన్నాయి.

**పోతన భాగవతం :**

మెచ్చెభవద్గుణోన్నతి నమేయ ధనమ్ముల నిచ్చెతా
వచ్చె సుదర్శనాయుదుడు వాడెసురాసురులెల నడ్డమై
వచ్చిననైన రాక్షసవివాహమునన్ గొనిపోవునిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలంచె గన్యకా!

**శుకసందేశం**

మెచ్చెభవద్గుణమ్ములు సుమీ! వినిపించిన దెల్ల వేడ్కతో
హెచ్చగనాలకించె నను హెచ్చగ మెచ్చి ఫలమ్ములెన్నొనా
కిచ్చి బహూకరించె మదినెంచె సుపర్వులు చైద్యురక్షకై
వచ్చిన గాంచి నిగ్గొనగ వారిజనాభుడు వారిజాననా!

రుక్మిణి యొక్క ఆవేదనను వ్యక్తం చేయటంలోగాని, తన్మయత్వంతో కూడిన కృష్ణపరమాత్మ వర్ణనలోగాని, మార్గనిర్దేశంలోని ప్రకృతి వర్ణనలోగాని తనదైన ప్రత్యేకాభినివేశం ప్రదర్శితమైంది. ప్రతిపద్యమొక రసగుళికగా, ధారా శుద్ధిమంతంగా మనోహరంగా సాగించి శ్రీశాస్త్రిగారి శుకసందేశ రచన.

సందేశకావ్యలక్షణాలైన విప్రలంభత, దూతవరణం, సందేశకల్పన మార్గ నిర్దేశం మాత్రమేగాక దూత మరల తిరిగివచ్చినాయికకు కార్య సాఫల్యాన్ని తెలియజేయడం గూడ ఈ రచనలోనున్నది. అది కావ్యానికెంతో సొగసును చేకూర్చింది.



# చతుర్థాధ్యాయము



ఇందులో

స్వతంత్ర సందేశకావ్య సమాలోచనం

సామాజిక సందేశకావ్యాల

# సామాజిక సందేశకావ్యాలు

సందేశకావ్యాలలో ప్రతిపాదితమైన వస్తువు, వస్తుగతవర్ణనలు సామాజిక స్పృహాన్వితాలైతే వాటిని సామాజిక సందేశకావ్యాలనవచ్చు.

ఇటీవలి కాలంలో "సామాజిక స్పృహ" అనే పదం బహుళప్రచారంలోకి వచ్చి అదొక నినాదంగా మారింది. ఈ సమయంలో సామాజిక స్పృహను గూర్చి తెలిసికోవలసిన అవసరమున్నది.

ఆంగ్లంలోని "సోషల్ కాన్షస్‌నెస్" అన్న పదానికి సరియైన అనువాదం "సామాజిక స్పృహ". దీనినే "సామాజిక చైతన్యం" అని గూడా అనవచ్చు. ఈ సామాజిక స్పృహ లేక చైతన్యంతో కవి కావ్య సృష్టికావిస్తే అది అభ్యుదయ కవితగా ఆధునికులభిమానిస్తారు ఏ స్పృహ అయినా సాహిత్యస్థాయినందు కోవాలి. సాంఘికరాజకీయ, వైజ్ఞానికాది బహుముఖస్పృహలు సాహిత్య స్పృహలో లీనమై ఆ స్థాయినందుకోవాలి

## సాహిత్యస్పృహ

ఈ సాహత్యస్పృహనే సాహిత్య చైతన్యం అని కూడ వ్యవహరించవచ్చు. మానవ సమాజంలో ఒక్క సామాజిక సమస్యలేగాక యింకా ఎన్నో చిత్ర విచిత్రాలైన క్లిష్ట సమస్యలున్నాయి. అవి ఆధ్యాత్మికతకు, నైతికతకు సంబంధించినవి.

ఈ మానవజీవన సామాగ్రి అంతటితోను కవికితాదాత్మ్యతకావాలి. ఈ సామాగ్రినంతా సాహత్యసామాగ్రిగా మార్చుకోగలిగే కళాత్మక ప్రక్రియయే సాహిత్యస్పృహ.

ప్రసిద్ధ సోవియట్ విదుషీమణి నెర్వినా సాహిత్యసృజనాన్ని గూర్చి చర్చిస్తూ "సామాజిక, ఆధ్యాత్మిక, నైతికేత్యాది అతీత సాహిత్య వస్తువులు మానవజీవత వాస్తవిక సామాగ్రి రసాత్మకమై ఎప్పుడు, ఎలా సాహిత్యంగా మారుతాయి అనే ప్రశ్నకు సమాధానం సాధించడం అత్యంత ప్రధానం"[1] అన్నది.

---

1 "Most important here is to achieve the solution of the question of where and how the so called "Extra-literary" Categories (Social Philosophicol Ethical) and concrete real life material acquire an aesthetic nature and became literary phenomena" (Lenin and Problems of literature)

కవిసేనమేనిఫేస్టో

(ఆధునిక కావ్యశాస్త్రం) శేషేంద్రశర్మ, గుంటూరు. పుట - 17.

ఒక కవి కేవలం సామాజిక సమస్యలకో ఆధ్యాత్మికతకో, నైతికతకకో తన కావ్య వాఙ్మయాన్ని పరిమితంచేయక యావన్మానవ కార్యరంగాలన్నిటి లోను సాధింపబడిన విజయాలన్నిటినుండి ఉత్పన్నమైన బృహన్మానవచేతనను తనలో ఆవేశింపజేసికొని ఉన్నతాత్మగా ఏ వర్గానికోగాక యావన్మానవ సమాజాన్ని ప్రతిబింబించే సాహిత్యాన్ని సృష్టిస్తే అట్టి రచన సాహిత్య స్పృహాత్మకమౌతుంది. అంటే విశ్వజనీన సాహిత్యంగా విలసిల్లుతుంది.

భారత, రామాయణాదులు ఈ కోవకు చెందినవి. ఇవి సర్వకాలికము, సార్వజనీనమైన సత్యాలను ప్రబోధిస్తాయి.

ఇట్టి బృహన్మానవచేతనాత్మకమైన సాహిత్యచైతన్యంలో ఒక భాగం సామాజిక చైతన్యం లేక సామాజిక స్పృహ.

## సామాజిక స్పృహ

కవి ఎంతగాభావాంబర వీధివిశ్రుత విహారియైనా నేలవిడిచి సాముచేయ లేడు ప్రతి కవికి సహజంగానే సమాజంలోని అందరివలెనే సామాజికస్పృహ ఉంటుంది. జీవితం అతనిపై సామాజికస్పృహను విధిస్తుంది దాన్ని కవి తన కావ్యంలో కవిత్వీకరించాలి. అది శుద్ధనినాదంగా ప్రతిధ్వనించకూడదు. అది ఎంతగా ధ్వనిస్తే సహృదయుడు దాన్ని అంత హృద్యంగా చర్వణం చేసు కొంటాడు.

ఈ సామాజిక స్పృను గూర్చి కొందరు కొన్ని దృక్కోణాలనుండి పరిశీలించారు.

సమాజానికి సాహిత్యానికి ఆధారాధేయసంబంధమున్నది. ఈ సంబంధం సాహిత్యం పుట్టిననాటినుండీ ఉన్నదిగాని ఈమధ్యకాలంలో వచ్చిందిగాదు. కాని సామాజిక స్పృహను గూర్చి కొందరి ఊహ యిలా ఉన్నది.

"సమాజాన్ని మిక్కిలి ప్రభావితం చేసేది రాజకీయ వ్యవస్థ. ఆకారణంగా రాజకీయాలే సమాజానికి ఊపిరి. కాబట్టి ఆ వ్యవస్థను, ఆవ్యవస్థను శాసించే విధానాలను సాహితీసృష్టలు మిగిలిన అందరిలాగా శిరసావహించాలి" ఇది రాజ కీయవాది దృక్పథం.

కమ్యూనిస్ట్ ప్రభుత్వం ఉన్న రష్యాలో సాహిత్యం మొదలైన కళలపై యిటువంటి ఆలోచనే వచ్చింది.

"అధికారంలో ఉన్న సోషలిస్ట్ వ్యవస్థ మార్క్స్ లెనిన్ దర్శనాన్ననుసరించి మేధావుల కృషిని పెంపొందింపజేస్తుంది. సామాజికస్పృహకు సంబంధించిన సూత్రాలలో రూపొందించిన నిర్దిష్టమైన పథకంప్రకారం పార్టీ నిర్ణయాలు కలాపాలు రెండూ సైన్స్, కళలు, సంస్కృతి అనే మూడింటినీ నియంత్రిస్తాయి".[1] దీని ఆధారంగా తెలుగు సాహిత్యంలో సామాజిక స్పృహనుగూర్చి కొందరు ప్రచారం చేస్తున్నారు.

సాహిత్యస్పృహ రెండు రకాలుగా కలుగుతింది. కేవలం లోకజ్ఞానంవల్ల కలగడం ఒక విధం శాస్త్రజ్ఞానం వల్ల కల్గడం మరోవిధం. శాస్త్రం తెలిసిన వ్యక్తి సంఘంలో అన్ని కోణాల్నీ వాటి సంబంధాల్ని సంఘపరిణామక్రమాన్ని ఆ దృక్పథంతో అర్థం చేసికొని తన రచనలలో దాన్ని ప్రతిబింబింపచేస్తాడని కొందరంటారు ఇక్కడివారి దృష్టిలో శాస్త్రమంటే మార్క్సిస్ట్ దృక్పథం ఈ ఈ ధృక్పధమింతకు ముందు వివరించిన విధంగా కవులను నియంత్రిస్తుంది. దీనివల్ల కవికి ఉండవలసిన స్వేచ్ఛమృగ్యమౌతుంది అం పవలన కవిత్వమంటే పాక్షికమైన నినాదాలుగా మాత్రమే రూపుదిద్దుకొంటుంది. కవులు సమాజంలో ఒక వర్గాన్నే ప్రతిబింబిస్తారు తమ కావ్యాలలో

ఇక్కడ మరొక విషయం సృజనాత్మక సాహిత్యంలో వాచ్యార్థంకన్న వ్యంగ్యార్థానికే ప్రాధాన్యం రాజకీయ లక్ష్యానికి తగినట్లుగా రచనలో వ్యంగ్యార్థాన్ని నియమించడం రచయితకు సాధ్యంకాని విషయం సాహిత్యానికి వ్యంగ్యార్థం నిష్ప్రయోజనమని, చెప్పేదేదో సూటిగా చెప్పాలని అలా చెప్పడానికి మాటలు, భావాలు కూడ నేనే చెప్తానని రాజకీయ వ్యవస్థ గనుక అంటే సాహిత్యం మూసపోసిన భావాల రాసిగా తయారౌతుంది.

---

1 "With Marxist-Lenist ideology as its pivot, socialist society consciouly developes its intellectual life The party directs the development of science, art and culture. The Party's decisions and practical arts conform to a definite plan and are based on the laws governing the development of social consciousness under socialism". —
సాహిత్య నేపథ్యం – సుదర్శనం [redacted] పుట – 85.

షెల్లి మహాకవి "కవులే సమాజానికి గుర్తింపులేని శాసనకర్తలు"[1] అని అన్నాడు శాసనకర్త ఎప్పుడూ విశాలదృక్పథాన్నికల్గి ఉండాలి గాని పాక్షిక మైన వర్గదృక్పథానికిబద్ధుడై యుండగూడదు

అనధికార శాస్త్రులైన కవులు స్పందించాలి తప్ప ఒకరు నియమించిన కొలబద్దలలో యిమిడిపోగూడదు. వ్యక్తిసామాజికుడు గ బట్టి అతనికి సమాజంతో అవినాభావ సంబంధముండడంచేత ఈ సమాజ లోని సమస్యలకు తనకుతానుగా స్పందించాలికాని శాస్త్రదృక్పథం పేరుతో ఒక రాజకీయ వ్యవస్థకు ప్రచార సాధనంగా మాత్రమే తన కవిత్వాన్ని ఉపయోగించడం కవితాపరమైన సామాజిక స్పృహ అనిపించుకోదు.

కవి దక్షతతో ఈ సమాజాన్ని పరిశీలించి అందలి గుణదోషాల్ని రసాత్మకంగా వ్యక్తంచేసినట్లైతే అది రమణీయ సాహిత్యస్థాయి నందు కొంటుంది. ఈ సామాజిక స్పృహ అంతర్లీనమై కావ్యాల్లో ప్రతిబింబించాలి కథావస్తువుననుసరించి కావ్యాలలో ఈ సామాజిక స్పృహ ప్రధానంగా గోచరించవచ్చు. అలా గోచరించే కావ్యాలే సామాజిక సందేశకావ్యాలు. వానిని ఒక్కొక్కటిగా సమీక్షిస్తాను

---

1 'Poets are the unacknowledged legislators of the world' - Shelly



"గబ్బిలంతో పంచముడు"

నిన్ను బహిష్కరించు నవనీ వలయంబిది యంటరానివా
డున్ననిషిద్ధ గేహము సహోదరి! నీవు సమస్త దేవతా
సన్నిధి నారగింతువు ప్రసాదములంతటి పుణ్యురాలవై
యన్నములేని పేదల గృహంబులు సొచ్చితివేల? బేలవై

- గబ్బిలం

# గబ్బిలము

గబ్బిలము అనే పేరుతో సందేశకావ్యాన్ని వ్రాసింది ప్రఖ్యాతకవీశ్వరుడు శ్రీ గుఱ్ఱం జాషువ మహాకవి కవికోకిల, నవయుగ కవి చక్రవర్తిగా పండిత లోకం ప్రశంసించగా పద్మభూషణ బిరుదంతో భారత ప్రభుత్వము, కళా ప్రపూర్ణ బిరుదంతో ఆంధ్ర విశ్వవిద్యాలయం సత్కరించాయి.

రమ్యసమతాసాధన, అస్పృశ్యతా నిర్మూలన, దేశశక్తి ప్రబోధం, సాంఘిక రుగ్మతలను తొలగించడం, మానవతను పెంపొందించడం, మూఢవిశ్వాసాలను రూపుమాపడం లక్ష్యాలుగా షుమారు ఇరువదియైదుకు పైగా ఖండకావ్యాలు వ్రాసిన నవయుగ కవి చక్రవర్తి ఆంధ్రజనులచే పొందని సత్కారంలేదు.

ఆ మహాకవి తమ ఆశయసాధనకనుగుణంగా వ్రాసిన ఖండకావ్యాలలో అగ్రగణ్యమైనది గబ్బిలం సందేశ కవులు సాధారణంగా హంసల్ని, చిలుకల్ని సందేశహరులుగా స్వీకరిస్తారు. కాని ఈ కవి గబ్బిలాన్ని గ్రహించటంలోనేదీని ప్రత్యేకత నిగదితమౌతుంది అయితే ఆడగబ్బిలాన్ని సందేశహారిణిగా స్వీకరించటంలోగల ఔచిత్యమేమిటో బోధపడదు.

అమరవాణికే అమూల్యాలంకారమైన కవి కులతిలకుడు కాళిదాస మహాకవి అద్భుత సృష్టియైన మేఘసందేశం ఆదర్శంగా వ్రాయబడిన స్వతంత్ర సందేశకావ్యం ఈ గబ్బిలం. హనుమద్దౌత్యం మనసులోనుంచుకొని కాళిదాసు మేఘసందేశం వ్రాశాడని మల్లినాధుడన్న విధంగా కాళిదాస మేఘదూతాన్ని మనసులో నుంచుకొని నేనీ కావ్యాన్ని వ్రాశానని జాషువకవియే అన్నాడు. రచనా ప్రశంశికలో ఈ కావ్యం ముమ్మూర్తులా మేఘదూతాన్ని పోలియున్నా కథాసంవిధానంలో దానికి వ్యతిరేకంగా సాగింది. కాళిదాస కవిత ప్రణయ సందేశం. ఈ గబ్బిలం తుకతుక ఉడికే అశ్రుసందేశం. మేఘసందేశానికి గబ్బిలానికిగల తారతమ్యం కవి మాటల్లోనే గ్రహించాలి.

"కాళిదాసుని మేఘసందేశమును మనస్సులో నుంచుకొని నేనీకావ్యమును రచించితిని గ్రంధనామము గబ్బిలము శ్రోతలకిది కటువుగా దోపవచ్చును. కాని అందలి కథానాయకుడు ప్రణయసందేశమునంపును. ఇతడంపునది తుకథుక

నుడుకు అశ్రుసందేశము అతని శిక్షాకాలపరిమితియొక సంవత్సరము. ఇతని శిక్ష అజన్మాంతము. (అజన్మమనాలి లేదా జన్మాంతము) తరతరముల దీని కవధిలేదు. అతడు మన్మథాగ్నితప్తుడు. ఇతడుక్షుధాగ్నిపీడితుడు. ఇరువురిలో నితడు దయనీయుడు. కులీనులగురాజులకువలె హంసలూ, చిలుకలు మున్నగు నుత్తమపక్షిధూతలు ఇతనికి జిక్కుట అసంభవము. కావుననిట్టిడుల జీర్ణకుటీర ములలో నిరంతరము దర్శనమిచ్చు గబ్బిలమును సందేశహారిగా బరి గ్రహించితిని".[1]

## కావ్యకథ

భరతోర్వరకు కడగొట్టు బిడ్డడైన ఒక అరుంధతిసుతుడు తంజావూరికి దక్షిణప్రాంతంలో జీవనం చేస్తున్నాడు అతడు గర్భదరిద్రుడైనానీతి నియ మాలకు లోటులేదు. చెప్పులు కుట్టడం అతని జీవనాధారం పాములకు పాలు, చీమలకు పంచదారపోసే ఈ సమాజం, ఈ సమాజాన్ని ఆశ్రయించి ఉన్న ధర్మదేవత, ఇతణ్ణి చూచి దూరంగా పోతుంది ఇతని యిల్లు ఇనుపగజ్జెల తల్లికి నిత్యనివాసం. అతనిగాలి సోకిందంటే నాల్గుపడగల హైందవ నాగరాజు తోక త్రొక్కినట్లు లేచి కసరి బుసకొడతాడు.

ఈ విధంగా కులహైన్యంతో బాధపడుతున్న తాను సంతతినివృద్ధి పొందించి, ఘోరనరకంలో త్రోయడమెందుకని అతడు పెళ్లిచేసుకోలేదు, పాపం.

ఇలా అతని జీవితం గడుస్తుండగా ఒకరోజు ఉదయంనుండి నెత్తురోడ్చి కష్టంచేస్తూ పడమరకు సూర్యుణ్ణి సాగనంపి తన గుడిసెకు చేరి. కుండలో మిగిలిన గంజి తాగి కుక్కిమంచంలో నడుంవాల్చాడు. ఆ సమయంలో ముక్కు మొహాలున్న చీకటిముద్దలాంటి గబ్బిలమొకటి గుడిసెలోకి ప్రవేశించింది అక్కడి ఆముదం దీపాన్ని ఆర్పి అటునిటు తిరగడం ప్రారంభించింది.

---

1 విజ్ఞప్తి — గబ్బిలము - పుట — 1 జాషువ గుఱ్ఱం.

దయ్యంపిల్లలా ఇంట్లో తిరుగాడుతున్నదాన్ని చూచేసరికి అతని హృదయం ఏవేవో ఊహలలో పల్లవించింది. ఆ గబ్బిలంతో అతడీ విధంగా అన్నాడు.

"ఓ గబ్బిలాల రాణీ! మావంటివారి ప్రవేశానికి నోచుకోని పవిత్రమైన దేవాలయాలలో దేవతలకు అతి చేరువలో సంచరించే నీవు నావంటి నిర్భాగ్యుని గుడిసెకు వచ్చావు నీకిదే నా స్వాగతం. నీకు, నీ పిల్లలకు, నీ తలక్రింది తపస్సులకు శుభం కలుగుగాక" అని ఆశీర్వదించాడు. ఆ తరువాత దాన్నిలా ప్రశ్నించాడు ఈజ్మాతలమంతా గాఢనిద్రలో మునిగియుండగా దేనికోసం నా యిల్లు వెదకుతున్నావు? ఇక్కడ ఆనందం అణుమాత్రమైనా దొరకదుసరిగదా! నీవిక్కడికి వచ్చావని తెలిస్తే ఈ సమాజం నిన్ను గూడా బహిష్కరిస్తుంది. దైవప్రసాదాలారగించే పుణ్యాత్మురాలివి, కూటికికరువైన నాయింట్లో ప్రవేశించడానికి కారణం నాకే మాత్రం బోధపడడం లేదు ధర్మదేవత ధనవంతుని పక్షానే ఉంటుంది బ్రహ్మాదిదేవతలు కూడ పేదవాని విషయంలో పెదవి విప్పలేదు

ఈ లోకంలో ఆస్తికులు ప్రతిమలకు పెళ్ళి చేయడానికి వేలవేలు ఖర్చుచేస్తారుగాని దుఃఖితమతులైన పేదవారి బొచ్చెలో ఒక్క మెతుకైనా రాల్చడానికి యిష్టపడరు. కళ్యాణాదిమహోత్సవాలు చేయించుకోడానికి ముప్పది మూడుకోట్ల దేవతలు ఎగబడే ఈ కర్మభూమిలో పేదవాని ఆకలిమంటలెలా చల్లారుతాయి?" అనే భావాన్ని విరజిమ్మే జాషువ కవీశ్వరుని ఈ క్రింది పద్యం హైందవ ధర్మానికి సవాలు వంటిది.

ప్రతిమల పెండ్లి సేయుటకు
వందలువేలు వ్యయించుగాని దుః
ఖితమతులైన పేదల, ఫకీరుల
శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీభరత మేదిని,
ముప్పది మూడుకోట్ల దే
వత లెగవడ్డ దేశమున
భాగ్యవిహీనులక్షుత్తు లారునే?

అయితే యిప్పుడు భారతదేశంలో జనాభా పెరిగింది. కాబట్టి దేవతల జనాభా-కూడా పెరిగే ఉండాలి వాళ్లే బాబాలేమో!

ఇంకా అనేక విధాల ఆ పక్షిని ప్రశంసించింది. తన్నుతాను తెగడుకోని, తన సందేశాన్ని పినాకపాణి కందించమని అర్థిస్తాడా హరిజనుడు. విశ్వనాధుడికి సత్యం చెప్పటానికి భయపడవద్దని, అతడు సృష్టికర్త అయితే అతని సృష్టిలోని ఆ పక్షికి ధైర్యం చేకూరుస్తాడు. శివుణ్ణి సృష్టికర్తగా పరిగణించటంలో సామంజస్యం గోచరింపదు. విశ్వనాదుడు కాశిలో లేకపోతే కైలాసానికైనా పోయి తనసందేశం వినిపించమంటాడు. కైలాస మార్గాన్ని కూడా కవి నిర్దేశిస్తాడు.
ఆ నిర్భాగ్యుడు చెప్పేదంతావిని అతని కోర్కె తీర్చేదానిలా గబ్బిలం కదిలింది. ఇంతలో తెల్లవారింది. మరలా ఆ హరిజనుడు తన దైనందిన కార్య క్రమంలోనిమగ్నమైనాడు.

గబ్బిలం ఏమి చెప్పిందోగాని గుబ్బలియల్లుడు కనుకొలకుల్లో అశ్రులు చెమ్మగిల్లగా తక్షణమే నల్లని మబ్బుల్లో మాయమయ్యాడు.

ఈ సందేశ పర్యవసానంగానే అన్న విధంగా హరిజనులకు దేవాలయ ప్రవేశం లభించింది. సభ్యసమాజంలో హరిజనులపై అల్పంగానైనా అనుకూల పవనాలువీచాయి హరిజనోద్ధరణమని గాంధిదేవుని వరఖార్ఝుంకారం శ్రవణ శుభగంగా గానం చేసింది పంచముడు తన చిరకాలదాస్యక్లేశాన్ని కొద్దిసేపు విస్మరించాడు. మెరపులాంటి ఆనందం అతని మదిలో చోటు చేసికొంది

ఆ అరుంధతీసుతనకు గబ్బిలం మరల దర్శనమిచ్చింది వికసించిన వదనంతో మధురవాక్కులతో స్వాగతంపలికాడు. వెళ్ళినపని కాయా? పండా? అని ప్రశ్నించాడు పండే అయిందని ప్రకృతిప్రత్యుత్తరమిచ్చింది కానీ దేశం లోని సాంఘికరాజకీయపరిస్థితులు అతని మనసును కలచి వేశాయి మరోసారి తనగోడు కైలాసవాసునకు విన్నవించుకోవాలనుకొన్నాడు దేశానికి అనర్థాన్ని కల్గించే ఎన్నో సమస్యలను ఆ గబ్బిలం ముందు ఏకరువుపెట్టాడు అతని మాటలు సాంతంగా విన్నది నోరు లేని పక్షికావడంచేత మారుమాట్లాడక ఒక సారి అతనికి ప్రదక్షిణంచేసి రెండు కన్నీటి బిందువులు రాల్చి శివాలయానికి తరలిపోయింది.

అరుంధతీసుతుని గబ్బిల సందేశ కావ్యవిషయం సంగ్రహంగా యిది.

తొలి సందేశంలో బాధా ప్రబోధం, మార్గోపదేశం ఉండగా మలి సందేశంలో గబ్బిలం ప్రయాణ విశేషాలన్ని తెలిసికొని మరికొన్ని విషయాల్ని విన్నవించి పరమేశ్వరునకు తెలియజేయమని పంపించాడు

ఈ కథ ఒక వ్యక్తిది మాత్రమే కాదు. భారతదేశంలోని కోటానుకోట్ల హరిజనుల కథ కర్మసిద్ధాంతంతో వీరినోళ్ళనుకట్టివేసి న్యాయంగా రావలసిన భాగాన్ని రాకుండా చేస్తూ ఈ అమాయికుల శ్రమశక్తిని అనుభవిస్తూ మానవతను మరచినవీరు రాళ్ళలో దేవుళ్ళనూహించి వేలాది రూపాయల ఖర్చుతో ఆదేవతలకు కళ్యాణాలుచేస్తూ అవశ్యకర్తవ్యమైన సర్వమానవసమానత్వాన్ని అనాదరించి త్రోసివేస్తున్నారు, ఇక్కడి ధనవంతులు, మతాధిపతులు, ధర్మనిర్ణేతలు

పగలంతా మునివృత్తితో మిక్కిలి ఉదాత్తమైన జీవనాన్ని గడుపుతున్న నీవు రాత్రి సమయంలో మా వంటి దరిద్రమూర్తులను పరామర్శించడానికి వచ్చిన నీవు అకలంకమైన మర్యాదకు అర్హురాలవు. మాపై నీకింత జాలికల్గింది. కాని సాటి సోదరులు జాలితో ఒక్క కన్నీటి బిందువునైనరాల్చరు

యోగవిద్యానిధులైన వాలఖిల్యాది ఋషులు బంధువులుగా గల్గిన ఓ పక్షిణీ! నీకనేక నమస్కారాలు. దయతో ఇంతదూరం వచ్చిననీవు నా చిన్న మనవి నొక దానిని ఆలకించు.

ఈ ప్రశాంతరాత్రి తన పిల్లల్ని అందర్ని తన ఒడిలో నిద్రపుచ్చింది. ఔషధంలేని లస్పృశ్యతా జాడ్యమందభాగ్యుడనైన నన్ను మాత్రం మరచి పోయింది, నిద్ర పుచ్చటం, ఈ భరతమాత.

ఈలోకం నాచేత పశువులా చాకిరిచేయించి నాశ్రమ ఫలితాన్ని సుఖంగా అనుభవిస్తోంది అదేమనినేనడగకుండానే కర్మ సిద్ధాంతంపేరుతో నానోరు కట్టి వేస్తుంది.

నీవు నాకు చేయవలసిన సహాయమేమంటే అసలు కర్మసిద్ధాంతమంటే ఏమిటో దానికి నా మీద యింతకక్ష ఎందుకో ఈశ్వరుణ్ణి అడిగి తెలుసుకొని రావాలి.

ఆలయంలో పూజారిలేని వేళ శివుని చెవికి సమీపంగా చేరి నా యీ దీన స్థితినంతటిని సంస్మరించి బాధలన్నిటికీ నన్ను దూరం చేయమని అందుకోసం సందేశం తీసుకుపొమ్మ”ని ప్రార్థిస్తాడీ అరుంధతీ తనయుడు.

## కావ్య రచనాకాలంనాటి సమాజస్థితి

ఈగబ్బిలం కావ్య రచన నాటికి పరాయిపాలనలో ఉన్నది దేశం స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతోంది కుల, మత, ప్రాంత, భాషాభేదాలతో ఉన్న జాతిని అనైక్యపరచి తమసామ్రాజ్యాన్ని సుస్థిరం చేసుకోటానికి ఆంగ్లేయులు అనేక భేదోపాయాలతో ప్రయత్నం చేస్తున్నారు ఉద్యమానికి నాయకత్వం వహించిన గాంధీమహాత్ముడు వారి కుయుక్తులను భగ్నంచేసి ఉద్యమాన్ని తీవ్రతరం చేయడానికి నిరంతరం ప్రయత్నంచేస్తున్నాడు బాహ్యపరిస్థితులిట్లావుంటే ఆయనను మరీ కలత పరిచింది ప్రబలమైన “అంటరానితనం” ఇది హైందవ జాతికి చెరపరాని కళంకమైనదని బాధపడ్డారు ఈ అంటరానివారిని ఈ సమాజ జీవనవాహినిలో అంతర్భాగంగా సముచితమైన గౌరవప్రతిపత్తి కల్పించడానికి విశేష కృషిచేశారు. ఈ అంటరానివారికి “హరిజనులు” అని పవిత్రమైన పేరు పెట్టాడు. వారిని తన సబర్మతి ఆశ్రమంలోనికి ప్రవేశపెట్టాడు కలకత్తా కాంగ్రెస్ సమావేశంలో హరిజనులను సవర్ణహిందువుల సరసన కూర్చోపెట్టాడు నాగపూర్ కాంగ్రేస్ సమావేశంలో అంటరానితనాన్ని నిర్మూలించడానికి ఒక తీర్మానాన్ని కూడా చేయించాడు వారిని తన ఆశ్రమానికి రప్పించడంగాక తాను వారివారి గుడిసెలకేపోయి పరామర్శించివారిలో ఆత్మవిశ్వాసాన్ని కల్గించడానికి ప్రయత్నంచేసి “హరిజన్” అనే పత్రిక కూడ నడిపాడు

స్వాతంత్ర్య భారతదేశంలో చదువులో వారికి సకల సౌకర్యాలు సమకూర్చబడ్డాయి ఉద్యోగనియామకాల్లో కొంతశాతం కేటాయించారు గృహాలు నిర్మించియిస్తున్నారు. ఇతర వర్ణాలవారితో వివాహాదులు సమకూరుస్తున్నారు సాంఘికంగా గౌరవ ప్రతిపత్తిచేకూర్చబడుతున్నది. అన్ని దేవాలయాల్లో ప్రవేశం కల్పించబడింది అయినా అక్కడక్కడ అనివార్యంగా కొన్నిసంఘర్షణలు జరుగుతునేఉన్నాయి. ఎంతకాలం నుండో ఉన్న ఈ విభేద సంఘర్షణ అచిరకాలంలోనే అంతమందగలదనే ఆశాభావాన్ని కవులుగానం చేయాలిగాని విభేదాలు రెచ్చగొట్టే ప్రయత్నం జాతి శ్రేయస్సుకు దోహదకారిగాదు.

హరిజనులకు దేవాలయ ప్రవేశాన్ని కల్పించే విషయంపై కాటూరి వేంకటేశ్వరరావుగారు 'గుడిగంటలు'నే పేరుతో అద్భుతమైన లఘుకావ్యం రచించారు.

హరిజన సమస్యలపై హరిజనులు, హరిజనేతరులు ఎంతో సాహిత్య సృష్టి కావించారు. జి. జోసప్ కవి 'కన్నీటి కబురు' అనే సందేశకావ్యం, ఎడ్లపల్లి జోసఫ్ 'ఇనసందేశం' అనే కావ్యం ప్రసిద్ధమైనవి. ఈ రచనలపై 'గబ్బిల' ప్రభావం బాగా గోచరిస్తుంది

శ్రీ జాషువ తన గబ్బిల సందేశ కావ్యాన్ని కేవలం హరిజన సమస్యలకే పరిమితం కావించలేదు. అనేక సాంఘిక సమస్యల ప్రస్తావన కావించారు. వివిధ రంగాలలో దేశం ఎలా పతనమౌతున్నదో గమనించి దానికై పరిపరి విధాల పరితపించారు

## గబ్బిలం - కావ్యగతవిశేషాలు

ఈ కావ్యం కరుణరసప్రధానమైనది. సమాజంచేత అంటరానివానిగా వెలి వేయబడ్డ కావ్యనాయకుడు భరతమాత కడగొట్టు బిడ్డ. ఈ నాయకుడు తన దయనీయమైన స్థితిని పరమేశ్వరునికి తెలియజేయటానికి అశ్రుసందేశంపంపాడు. ఈ అశ్రుసందేశాన్ని చెప్పుకోటానికమరినదూతి గబ్బిలం. సాధారణంగా సందేశాన్ని పంపేవారు తమదూతకార్య నైపుణ్యాన్ని, జన్మాదికాలను వర్ణించడంకద్దు. దూతకావ్యాలకాదర్శమైన మేఘదూతలో యక్షుడు మేఘుని "జాతంవంశే భువనవిదితే పుష్కలావర్తకానాం! జానామిత్వాం ప్రకృతి. పురుషం కామరూపం మఘోనః" అని పొగిడాడు. అదే విధంగా ఈకావ్యనాయకుడు గూడ తన దూతిగబ్బిలాన్ని

"ప్రవిమల దేవతాభవనవాసము చేయుచు మమ్మువంటి మా
నవులకు లేని గౌరమునందులతూగెడు గబ్బిలాలరాణివిగద"
"చుట్టాలేగద వాలఖిల్యు లినతేజుల్ యోగవిద్యానిధుల్
పుట్టుందాపసులార్ద్రచిత్తులు మహాత్ముల్ వైనతేయస్తుతిన్
బెట్టుంగొమ్మలబ్రతిత్య జించిన పరశ్రేయశ్శుభాకాంక్షతో
పిట్టా! నీకు ప్రమస్కరింతెచెదను నా విజ్ఞప్తి నాలింపవే.

అని అంటూ తన దూతగొప్పతనాన్ని గూర్చిశక్తి సామర్థ్యాలను గూర్చి వంశాదికాలను గూర్చి సముచితంగా ప్రశంసిస్తాడు.

## మార్గోపదేశం

సందేశకావ్యాలలో అతిముఖ్యమైనది మార్గోపదేశం. తనదూత ఏమార్గాన గమ్యస్థానం చేరాలో సందేశాన్ని పంపే వ్యక్తే వివరిస్తాడు దీనికి ప్రబలమైన కారణాలు కొన్ని ఉన్నాయి. తనసందేశహారి ప్రయాణంలో ఆలస్యంచేయకుండా ఉండటం మొదటిది. మార్గంలోని విశేషాలు తాను రంజకంగా చెప్పి దూతకు ప్రయాణంపై ఆసక్తి కల్గించడం రెండవది. ఈ మార్గనిర్దేశం ఆధారంగా కవి తన మనస్సులోని భావాలనెన్నింటినో పాఠకులకు తెలియజేస్తాడు. తన లోకజ్ఞతను నిరూపించుకొంటాడు. తన చారిత్రక భౌగోళిక పరిజ్ఞానాన్ని ప్రదర్శిస్తాడు కవికిగల యనేకాభిమానాల్ని నిర్దేశంలో నిగదిస్తాడు

జాషువకవి కూడా తంజాపురం నుంచి కైలాసానికి పోయే మార్గాన్ని వివరించాడు. ఇది చాలా సుదూరమైంది. ఇంతటి మార్గాన్నెంచుకోటంవల్ల ఆర్యావర్తాన్నంతా స్థూలంగానైనా అభివర్ణించే అవకాశం కవికి లభించింది.

మునిపక్షి ప్రయాణం తంజావూరు నుంచి ప్రారంభమై క్రమంగా నెల్లూరు, హంపీవిజయనగరం, గుంటూరు మండలం అందులోని కొండవీడు అటుపై రాజమహేంద్రవరం పోయి చుట్టు మార్గమైనా తప్పక దక్షారామాన్ని దర్శించి, అనంతరం బొబ్బిలికోట, నలంద, పాటలీపుత్రం, కపిలవస్తునగరం వారణాసి, ఆగ్రా ఆపై ఢిల్లీనగరం, కురుక్షేత్రం మీదుగా హిమగిరిచేరి అనంతరం వెండికొండ నధిరోహించి మానససరోవరంలో స్నానంచేసి కైలాసంలో శివ దర్శనం చేయాలి. ఆపై తన సందేశం వినిపించాలి. మార్గనిర్దేశంలో కొద్దిగా ఒడుదుడుకులున్నా అవి అంతగా పట్టించుకోపనిలేదు. కవి హృదయం గ్రహిస్తే చాలు.

ఈ మార్గోపదేశంలో ఎన్నో పుణ్యక్షేత్రాలు, నదీనదాలు, గిరిఝురులు వర్ణించబడ్డాయి. ప్రసిద్ధ పురుషుల వర్ణన, ప్రకృతివర్ణన అద్భుతంగా సాగింది. ఆయా సందర్భాలలో నిర్భీకంగా స్వకీయాభిప్రాయ వ్యక్తీకరణం జరిగింది.

# ప్రకృతి వర్ణనం

వర్ణననిపుణుడైన కవికి ప్రకృతిశోభలు తిలకించగానే మేను పులకిస్తుంది. గడ్డిపోచనుకూడ కడు రమ్యంగా వర్ణిస్తాడు. గబ్బిలం రాజమహేంద్రవరం చేరింది అక్కడి విశేషాలను కవి గబ్బిలానికి వివరిస్తూ —

జనవిభుండైన విష్ణువర్ధనుని నాటి
గౌతమీగంగ నీకు స్వాగతమొసంగు
పేర మాగాణముల నుద్భవిల్లునట్టి
గరికపోచయు నాకర్షకమకదమ్మ

అని గౌతమిని గూర్చి వర్ణించాడు. బొబ్బిలిచేరిన గబ్బిలానికి అక్కడి చిల్క సంద్రాన్నిగూర్చి —

తేటయైన దేజీనీటదిక్కులదాక
విస్తరించిరుమలు గుస్తరించి
చిల్కసంద్రమింపు సేయుచుగనుపట్టు
స్వచ్ఛమైన తెనుగుభాషవోలె

ఈ పల్కులవల్ల తెల్గుభాష తీయదనం అనుభవంలో ఉన్నవారికి, చిల్క సంద్రంసొగసు తెలుస్తుంది చిల్కసంద్రం తీపినీటిని త్రావువారికి తేటతెనుగు తీయదనం ఊహకు వస్తుంది అని చమత్కరిస్తాడు కవి.

సూర్యోదయాన్ని వర్ణించవలసివచ్చినప్పుడు కవి ఒక అద్భుతమైన కల్పన చేశాడు

నిద్దుర మేల్కాంచి యల్లన
ఖద్దరురాట్నంబు పౌరకాంతవహింపన్
ప్రొద్దుపసివాడు తూరుపు
ముద్దియ పొత్తిళ్లలోన ముద్దులు గుడిసెన్

ఈఉదయవర్ణన స్వాతంత్ర్యోదయశుభసూచకం రాట్నంద్వారా స్వరాజ్యం సాధిస్తామన్న జాతిపిత వక్కాణకు వక్కాని వ్యంగ్యాభివ్యక్తి.

గబ్బిలం తిరిగివచ్చిన తరువాత ప్రయాణవిశేషాలనరుంధతీసుతుడడుగుతున్న సందర్భంలో వెండికొండ ప్రస్తావన వచ్చింది ఆ కొండను కవి యిలా వర్ణిస్తాడు

ఆ కొండయేయిండియా విరోధుల దండు
గుండెగాలంబైన వెండికోట
ఆ కొండయేముత్తియపుదండ భారతో
ర్వీమాతృమణికిరీట భూష
ఆ కొండయే పర్వతాగ్రగణ్యమౌనైన
కులపర్వతములన్నిటికన్న అందమైనిక్క
ఆ కొండయేరాజతాచలస్వామికి
మణిమయకళ్యాణమంటపంబు

సింధుగంగా మహానదులీచిన్నవాడు
ప్రాకనేర్చిన యపరంజిప్రస్తరములు
పాదచిహ్నాలు పరికించివచ్చినావె
కలుషములువాయ కన్నుల కఱవుదీర

అతి పురాతన భారతీయ నాగరికతావైభవానికి సాక్షిభూతమైన వెండికొండను కడుంగడు రమ్యంగా రచయిత అభివర్ణించాడు పరితల్ని పులకింపజేసే వర్ణనలనేకం ఈ కావ్యమంతటా కనిపిస్తాయి

## ప్రాచీన వైభవవర్ణన

గబ్బిలం తనుపోయే మార్గంలో వెల్లూరుదాటిన తరువాత హంపీక్షేత్రాన్ని దర్శించిపొమ్మని అరుంధతీసుతుడన్నాడు ఆ సందర్భంలో ఆ హంపీక్షేత్రమిప్పుడేరీతిగా గబ్బిలాల కావాసమైందీ చెప్తు తన బంధువర్గాన్నక్కడ చూచి ఆనందింపవచ్చుననటంలోని వక్రోక్తిమాధురి చవిచూడండి.

హంపీక్షేత్రము జూచిపోవలయునమ్మా తెల్గురాజ్యంపునై
లింపశ్రీల కొకానొకప్పుడది కేళీరంగమేతద్రమా
శంపావల్లరు లారిపోయిన ప్రదేశంబరదు ని బంధుగుల్
కొంపల్గట్టి నివాసముండెదరు నీకుంగూర్తురానందమున్ i - 48

ఖరుచైపోయె తెలుంగు రక్తమతిలోక స్వచ్ఛశౌర్యంబుపో
దరి! వ్యర్థంబగు కోడి పందెపుతగాదాలందు బల్నాటిలో
నరుదారన్మివిలెన్ వినోదముగ గార్యంపూడి త్రిన్నాళ్ల త
త్కరవాలంబులు త్రుప్పుపట్టి యిపుడున్ గల్పించునారాటమున్ 1 - 56

అని పల్నాటిసీమలోని మరో కురుక్షేత్రమైన కారెంపూడి సంగ్రామాన్ని యెదకు హత్తుకొనే విధంగా వర్ణించారు

తెలుగు ప్రతాపశోభ ఒథ్రిదేశం వఱకు వ్యాపించిన విధాన్నాని తెలియజేస్తూ

కరవాలంబున గొల్చిరాయలు పరిష్కారంబుగావించుచున్
సరిహద్దుల్ నవరించినాదటులొరిస్సాదాక ఆ రాజ భా
స్కరుడెత్తించిన పోట్టునూరి విజయస్తంభంబుపై వేలుపుం
తెఱవల్ నిల్చి పరింతురాంధ్రుల విభూతిన్ ముక్త కంఠంబులన్ (1–71)

ఇది మన ఆంధ్రులప్రాచీనవైభవానికి పతాకస్థాయి అనదగిన వర్ణన

## కవులు - కవిత్వము

మార్గనిర్దేశములో ప్రస్తావించబడిన అనేక విషయాలలో ప్రతిభాన్వితులైన కవులు వారి కావ్యాలు కవితా విశేషాలెన్నో ఉన్నాయి

దిక్కులన్నీ కృష్ణరాయల ఎడబాటు చీకట్లు ముసిరియుండగా వాఙ్మయ లక్ష్మి తంజాపురం తరలిపోయింది అక్కడ చేమకూర వేంకట కవి తెలుగు పంకేరుహాక్షికి శ్లేషోక్తులలవాటు చేశాడట ముద్దుపళని ముద్దుల కవిత శృంగార రసం వర్షించిందట మువ్వగోపాలదేవుని పూజకోసం క్షేత్రయ్యకల పొందుకొన్న వేళ అవరరాయలు రఘునాథుడు సత్కీర్తికట్టిమంకట్టుకొన్నాడట' (i — 44)

తంజావూరు నుండి ఒక్క పర్యాయం నెల్లూరును నిర్దేశించే సందర్భంలో తిక్కయజ్వ ప్రసక్తి వస్తుంది "యతియుగ్రజాసయుతేని సంస్కృతకవితావరణ్య మందున్న భారత వేదానబరేను వత్త్వముల కాంధ్రత్వంబు నేర్పించి శాశ్వతుడై పోయిన తిక్కయజ్వ" (i – 46) అంటాడు కవి. ఇదేనా తిక్కన ఘనత? తతదినాటికీయవనుందరాంధ్రత్వాలోస్థితిని పశంసిస్తేసముచితంగా ఉండేదనిపిస్తుంది

గబ్బిలం మరల తిరిగి వచ్చిన తరువాత "కనుగొన్నావుగదమ్మ కృష్ణ విభుదక్కాలాన భాషావనంబున సాగించిన అష్టదిగ్గజరథంబున్ శారదా వాహమున్" అని గబ్బిలాన్ని అడిగాడు అంతేకాక

రామలింగని హాస్యకార్యముల దలచి
నాల్గుదిక్కులు కడుపుబ్బనవ్వునపుడు
నాట్యమాడిన ఆనందనవ్యలక్ష్మి
కానుపించెనె శిధిలదుర్గములయందు ii — 64

అని తెనాలి రామలింగకవిని గూర్చి ప్రశ్నించాడు కృష్ణరాయలకాలం లోని ముక్కుతిమ్మనకు, మిల్టన్, బైరన్‌వంటి ప్రాశ్చాత్యకవులెవ్వరూ సాటిరారని అన్నాడు

తెలుగుకవులలో వేమన అంటే ప్రత్యేకమైన అభిమానం జాషువకవికి ఉన్నది. అతడు కూడ సంఘసంస్కరణ పరమైన కవిత్వం చెప్పటం యిందుకు కారణం కావచ్చు

ఈ సమాజంలోని దురన్యాయాలపై విసిగి వేసారిన మునిమాన్యుడైన రెడ్డి రాజువేమన్న, ప్రతి శబ్దశ్రవణపేయంగా ఆశుధారగా కావ్యరచన చేశాడు. అట్టి వేమన్న జీవించియున్నకాలంలో ఒక్క పిడికెడన్నమైనా పెట్టక ఇపుడు గోరీలపై పూజచేస్తున్నారు ఇదేమి కార్యం? అంటూ మరణం వార్ధకం అనే ప్రమాదం అంటే ఏమిటోతెలియని కవిత్వాన్నిచెప్పిన వేమన్నను కవులచరిత్రలో వీరేశలింగం పంతులుగారు ప్రస్తావించకపోవడాన్ని సూటిగా ప్రశ్నించాడు [1]

---

1 "పిడికెండన్నము పెట్టలేదెపుడు మా వేమన్న జీవించిన
ప్పుడు! నేడు గోరీపయిన్ నడచుంబూజలు పుణ్యకార్యములు
వింతల్ మాదయా ధర్మముల్" (ii — 54)

మరణము వార్ధకంబను ప్రమాదమెఱుంగనికైతల్లున
బ్బురపుగవీంద్రు రెడ్డి కులముఖ్యుని వేమన చాకచక్యమున్
మరచిపురాణకావ్యరసమత్తుడు వీరుడు సంఘసంస్కృతి
స్థిరుడు రచించెనాంధ్రకవి జీవితముల్ బొరపాటుచేయుచున్ (ii — 58)

## కవిత్వం :

కవిత్వాన్ని గూర్చి దాని ప్రయోజనాన్నిగూర్చి ఆయా సందర్భములలో ఈ విధంగా ప్రస్తావన చేశారు

ఆడదిలేకపోతే కృతికి అందం లేదనే భావంతో ధనతృష్ణ వెంటాడగా మహీపతిబృహన్నల వర్గం సంతోషంకోసం ప్రబంధకవులు అనుత్తమ ప్రణయ బంధురగీతాలు వ్రాశారట.[1] ఈ ప్రబంధ వాఙ్మయం దేవతలకు కామధేనువు లాగా పండితులకేగాని పామరుల కర్థంకాకుండా పోయిందట.

కరుణాపరిణద్ధరస ప్రబంధాలు నేటి కవులు వ్రాస్తున్నారట

కవిత చచ్చుదైనా కథ ప్రసిద్ధమైనదైతే కవికి కొంతకీర్తి కలగవచ్చునట. అట్టి కవిత్వం నెలలు తక్కువైనా బలమైన తిండితో బ్రతికిన పాపలాంటిదట.[2]

సమాజశ్రేయస్సుకు కారణం కావలసిన కవితలెన్నివాలకాలు వేసిందో వివరించాడు "ప్రభువుల పెండ్లి పేరంటాలకు కొంతకాలం వ్యయంపడింది. ఆతరువాత రాణివాసాల్లోని విరహవేదనల్నిరచ్చకీడ్చింది. అనంతరం అంగాంగ వర్ణనలతో యువతకు ఉచ్చులు వేసింది పాడిన రామకథే మరలా పాడియు

---

1 ఆడుదిలేకయున్నగృతి కందములేదని నమ్మియెన్నడో
పాడిరనుత్తమప్రణయబంధురగీతములర్థతృష్ణ వె
న్నాడకవుల్ మహీపతి బృహన్నల వర్గము సంతసింపనీ
నాడు రచింతురిద్ధకరుణా పరిణద్ధ రసప్రబంధముల్ (ii – 78)

కవితచచ్చుదయ్యుగథపేరుగలదైన
కవికికొంతకీర్తిగలుగవచ్చు
నెలలు తక్కువైన బలమైనతిండిచే
నుక్కుతునిలొకొత్తపుష్టినుసుగువోలె (ii – 60)

లోకంలోని ఆర్తులను అనాదరిస్తూ భువనహితాన్ని కోరవలసిన కవితా కళాశక్తి స్వార్థజడధినూరవేయబడ్డదిట [1] ఇది విశ్వనాథవారి నెత్తిపొడుపు కావచ్చు

## వ్యాకరణాన్ని గూర్చి

వ్యాకరణశాస్త్రకారులు శాకుగకారం విరతికన్పడదని చికాకు పరుస్తారు గాని,పాకం, రసం, ఇంపుసొంపు పరికింపరు [2] కాని ఇది ఛందోవిషయం.

## విమర్శలు .

సత్కవి కళాద్రవ్యాన్నివ్యయించి... మలచిన శిల్పాలు విమర్శకులనేవారి చేతిలో బడి పొందవలసినంత ప్రసిద్ధిపొందడంలేదు, అసూయచేపలుకు నాల్కలు సత్యాన్ని చెప్పవేమో నన్న విధంగా నేటి విమర్శలున్నాయి [3]

ఈవిధంగా కవి తన మనోభావాలను నాయకుని ముఖాన అయాసందర్భాలలో వ్యక్తంచేశాడు

---

ప్రభువుల పెండ్లిపేరంటాలు వర్ణించి
కాలంబుపెక్కేండ్లు ఖర్చుపెట్టి
విరహవేదనమేను మరచి మూర్ఛలు వోవు
రాణివాసంబునురచ్చకీడ్చి
అంగాంగవర్ణనావ్యసనంబురెట్టింప
యువక జీవితకోటి కుచ్చులొడ్డి
పదియునెన్మిదిమార్లుబాడిన శ్రీరాము
చరితంబువగరెక్కతిరుగబాది (ii – 76)

2 వ్యాకరణ శాస్త్రకారులు
శాకుగకారము విరతి గనబడదని చి
కాకుపరతురంతేకాని
పాకమురసమింపుసొంపు బరికించెదరే? (ii – 61)

3 తనురక్తంబువ్యయించి సత్కవి కళాద్రవ్యంబు వెచ్చించి ని
ల్పిన శిల్పాలు విమర్శకప్రభువుల కల్తివాశ్రితలంఖ్యాతికె
క్కని వైపోయెనసూయచే బలుకు నాల్కల్ సత్యముల్ బల్కునే
అనుమానింతురు కొందరీశ్వరుని ధర్మాధర్మనిర్ణేతృతన్ (ii - 137)

ఈ విషయాలు ఆ కవి అనుభవాలైనా అవి వ్యర్థం కాని సత్యవచనాలుగా మనం భావించవచ్చు. కాని యింతటి విమర్శవాక్యాలాహరిజనుని నోట బలి కించటం అనుచిత మేమో!

## మతము-ధర్మము

భారతీయ సనాతన ధర్మం శాశ్వతమైన విలువలు కల్గినది. ధర్మాన్ననుసరించిన మతం కూడ సర్వమానవసౌభ్రాతృత్వాన్ని, కల్యాణాన్ని చేకూర్చేవిధంగా ఉండాలిగాని పాక్షికమైన న్యాయాన్ని ప్రబోధించకూడదు.

ఈ కావ్యరచనాకాలానికి మతం ధనవంతులచేతిలో కీలుబొమ్మగా మారిపోయింది. అందువల్ల ధనంతో ధర్మాలుకూడా మార్చగలమనే అభిప్రాయం లోకంలో వ్యాప్తమైయున్నది.

సనాతన ధర్మధేనువుల పాలు పేదలకుమాత్రం లభించవు. ధనవంతుని ఆజ్ఞలో బ్రహ్మాదిదేవతలెవ్వరు పెదవి కూడ కదల్చలేరు.

మతంలో చెప్పేమాటలెంతో ఉదాత్తంగా ఉంటాయి. సమతాసఖ్యాలు పెదవిపై మాటలే గాని హృదయంలోనుంచి వచ్చేవికావు. కట్టుబాటు సడలిన నూటారవ్వ దూముడి బంధనాలు ధర్మాలు. దయ మొసలికన్నీరు వంటిది.

ఈ పై మాటలన్నీ ఆర్షధర్మాన్ని హిందూమతాన్ని మనసులో ఉంచుకొని చెప్పినవే.

ఇక హిందూమతంతో పోటీపడి తక్కిన మతాలన్నీ మాదే గొప్పమతమని మరిమరీచాటుకొంటున్నాయి. "వసుధైక కుటుంబం" అన్న మాటలకు అర్థం లేకుండా పోతున్నది అంటాడు కవి.

మతంతనను ఎలా నిర్బంధిస్తుందో ఈ విధంగా వివరించాడు.

ఈ సమాజంలో సాహసుల్లు దొంగలు దోచుకొంటుంటే క్షమా సిద్ధాంతాన్ని నూరిపోస్తు పౌరుషవహ్నినార్పడానికి మతం ప్రయత్నిస్తోంది. దాని

బోధనలను అనుసరించడానికి నేను సంశయిస్తే ఆ మత రూప సింహం నా వైపు చూచి పళ్లునూరుతోంది నా పట్ల మతం చూపే యీ వివక్ష శల్యసారథ్యంగా ఉన్నది. కాలంతోపాటు మారుతున్న మతధర్మశాసననికాయం పక్షపాత బుద్ధి వహించి మా దరిద్రజాతిపై అధికారం చెలాయిస్తున్నది ఇలాపదిమందీ వ్యవహరిస్తుంటే అదే శాసనంగా మారుతోంది లోక శుభంకరం కావలసిన మత ధర్మాలు పైవిధంగా జాతిని అనైక్యపరచి దేశ పతనానికి హేతువవుతున్న విధానాన్ని విశ్లేషించాడు కవి స్వానుభవంతో

## కులాల కుమ్ములాట

మతం వేసిన విషబీజాలు కులాలరూపంలో మొలకలెత్తాయి పరిసితి మరీ నీచంగా మారింది గబ్బిలంలో నాయకుడు తనహీనస్థితిని గూర్చి యిలా అన్నాడు "అన్నపూర్ణ తాను స్వయంగా భర్తకు వడ్డిస్తూ ఉంటే సహపంక్తిని భోజనంచేసి తరించిన నీవు కులభేదబుద్ధిచే గర్భదరిద్రుడైన నీ ఈ సఖుని ఆతిథ్యాన్ని స్వీకరిస్తావా? అని వాపోయాడు కేవలం కులం కారణంగా దరిద్ర బాధననుభవిసున్న అరుంధతీసుతుడు

కవితలో విద్యాకళంకాన్ని వెదకినా పట్టుకొనలేకపోయి అది కులహీనుని కవిత్వమని నిరాదరించారట ఇది జాషువ స్వానుభవం ఈ కులజాడ్యం పండితుడుపామర్లుడనివివేకంగాని నిమ్నోన్నత జాతులని లేక సర్వత్ర వ్యాపించింది.

నా ఇంట్లో విందు భోజన మారగించమని నిన్నుకోరలేను అలా నేను కోరితే ఈ సంఘం సమ్మతించదు. ముప్పది మూర్లకులాలుకలిగి పందుల్ని నాగుల్ని పూజించినవ్వాలపాలయ్యే ఈ జాతి ఎంతభ్రష్టమైపోయిందో చూడమని అంటాడు గబ్బిలంతో

విమర్శకుడు పక్షపాత రహితుడుకావాలి జాషువ కవి విమర్శకునకా నియమం బాగా వర్తిస్తుంది గబ్బిలంలోని నాయకుడు ఇతర కులాల్ని గూర్చి నిందించినట్టుగానే తమలోని లోపాల్ని కూడా కప్పి పుచ్చకుండా ఇలా విమర్శిస్తాడు ఈ లోపాల్ని ఆసరాగావించుకోని అగ్రకులాలు వాళ్లనింకా నీచంగా చూడటం శోచనీయం.

"కలదమ్మా-శ్రవణమంటరానితనమాకర్ణింపుమీ యిండియా
పౌలమందుంగల మాలమాదిగలకున్ భూతేశుడేగాదు, కృ
ష్ణులు కృష్ణున్నిరసించు దైవములు క్రీస్తుల్ మస్తుగా బుట్టినన్
కలుపన్నేరరు రెండుజాతులను వక్కాణింపసిగ్గయ్యెడిన్" ii - 91

మతం, కులం ఈ విధంగా జాతిని నిర్వీర్యంచేస్తుంటే వాటికి మూలమైన ధర్మం సంగతి చెప్పవలసినదేమున్నది? ప్రాక్తనమైన ధర్మదేవతకుకూడ వీడున్నచోటికి రావాలంటే భయం కలుగుతుందని ఆవేదిస్తాడు కవి.

## నిమ్నజాతులు - అస్పృశ్యత

ప్రపంచంలో నలుపుతెలుపు భేదంతోనో, కులహీనులనే భేదంతోనో అంట రానితనం కొందర్ని సభ్యసమాజానికి దూరం చేయడం కొనసాగుతోంది.

ఈ అరుంధతీ సుతుడు ఔషధంలేని అస్పృశ్యతాజాడ్య పీడితుడు. అందు చేత వాడు గబ్బిలానికి వివరించిన సుదీర్ఘమైన మార్గవర్ణనలో నిమ్న జాతుల ప్రస్తావన-అస్పృశ్యతలు చోటు చేసికొన్నాయి గబ్బిలానికి త్రైవిష్టపాన్ని గూర్చి వివరించే సందర్భంలో దురాచార మూఢవిశ్వాసాలు ప్రబలంగా ఉన్న ఆ సమాజంలో కూడ అస్పృశ్యతాక్రూరవ్యాఘ్రాన్ని కట్టివేయగలరా? అనే సందేహాన్నిరీతిగా వెలిబుచ్చుతాడు కవే అరుంధతీసుతుని పేరిట,

"ఆ రాజ్యంబున గూబపట్టుకొని
ii బిట్టాడించుమండున్ దురా
చారంబుల్ వెదనమ్మకాలకది
వాసస్థాన మస్పృశ్యతా
క్రూర వ్యాఘ్రము సంచరించుటకు
ii సంకోచంబులేదైన" i - 100

నిమ్నజాతుల కన్నీటి నీరదాలు పిడుగులై దేశాన్ని కాల్చివేయగలవు ఇంద్రధనువును పట్టుకొని సాంద్రాబ్దవనవాటిలో తిరుగుతున్న వేటగాడు గొంతు నులిమి భూమిపై విసిరి వేసిన జంతువులే నిమ్నజాతులు [1]

భారతదేశంలో దైవంకాని పదార్థమేదీ కానరాదు వర్ణవ్యవస్థకంటే మరొక పిశాచం కన్పడదు అలాగే పంచమునికంటే నీచమైన జంతువు కనబడ లేదని నిమ్నజాతుల దైన్యస్థితిని బాధాతప్త హృదయంతో వ్యక్తంచేస్తాడు

## స్వాతంత్ర్యోద్యమప్రభావం

ఈ కావ్యం వ్రాస్తున్న సమయానికి స్వాతంత్ర్యోద్యమం మహోధృతంగా సాగుతోంది ఈ తెల్లదొరతనం మీదకి గాంధీ మహాత్ముడు నడుంబిగించి లేచాడు తెల్లవారి ప్రభుత్వం గజగజవణికిపోయింది నాటి ఆ స్థితిని చూచి కవి రాజాషవ అమితమైన ఆనందోత్సాహం పొందాడు. స్పందించిన హృదయంతో ఆనాటి సంఘటనలు తన కావ్యంలో పొందుపరచాడు.

క్షమకత్తినిమించిన ఆయుధమని, కదురురాట్నం చేతగాక స్వేచ్ఛా స్వర్గం లభించదని, రాట్నాన్ని, దుడ్డుకఱ్ఱను చేతపట్టుకొని గుజరాతుముసలి సెట్టి కదిలాడు ఆతని ఉద్యమంచేత సీమగుడ్డకు కన్నులు చెమ్మగిల్లిపోయాయి ముతకవస్త్రానికి మర్యాదపొటమరించింది ఊరి చివరనుండే అధమ జాతులవారు కూడా మనుషులేనని దేశం గుర్తించింది

---

1 నిమ్నజాతులకన్నీటి నీరదములు
పిడుగులై దేశమును గాల్చివేయుననుచు
రాట్నమును దుడ్డుకఱ్ఱకరానబూని
దెసలుదోచె గుజరాతు ముసలి సెట్టి ii – 4

ఇంద్రధనువుబట్టి సాంద్రాబ్దవన వాటి
మెలగుచున్నవాడు మృగయుడొకడు
వాడుగొంతుబిసికి వసుధపై విసరిన
జంతుతతులు నిమ్నజాతిజనులు ii – 17

వడుకునూలు చేత వగ్గాలు పేనించి వేటగాడు ఉచ్చులు వేశాడు. స్వరాజ్యమనే సింహరాజు అందులో చిక్కుకొంటాడో లేక తప్పించుకొంటాడో అని సాలో చోవగా అన్నాడు గుబ్బలుంతో ఆ పంచముడు.

స్వాతంత్ర్యోద్యమంలో ఎందరో మహానాయకులు పాల్గొంటున్నారు. ఉద్యమం తీవ్రతరమైంది. స్వరాజ్యం తప్పక వస్తుందనే అభిప్రాయం బలపడ్డది. స్వాతంత్ర్యం నేడుగాకపోతే మరొక రోజు రావచ్చు "నెలవాసిన తొయ్యలి తీర్థమాడదే" అనుకొన్నాడు.

## ఉద్యమనాయకులు

సువిశాలమై భిన్నభాషలలో విభిన్న సంస్కృతులతో కూడియున్నా ఈ దేశాన్ని ఒకే త్రాటిపై నడిపించి స్వాతంత్ర్యాన్ని ఉద్ధృతంచేసిన మహానాయకులను కవి బహుధా ప్రశంసించాడు.

ఆది దేవునితో సమానుడు, అహింసామూర్తి బుద్ధునియంతటివాడు, దరహాసచంద్రికలతో కూడిన హృదయనైర్మల్యం కల్గినవాడు. అధర్మాన్ని ఆవంతయినా సహించని పరమముని సబర్మతి నివాసి గాంధీ మహాత్ముడు.

ఇంచుమించు బాపూజీతో సమానుడు స్వరాజ్యంకోసం సర్వస్వార్పణం చేసిన త్యాగిగా వల్లభాయిపటేల్ కూడ కీర్తింపబడ్డాడు.

ధిక్కారించే రాచగుర్రాలెక్కిన ఉక్కు కళ్లెంగా జవహర్‌లాల్ నెహ్రూను సంభావించాడు కవి

## సమకాలిక సమాజం

కవి నిమ్నజాతి సముద్భవుడై తదుద్ధారణకు నడుంకట్టిన అంబేడ్కర్ మహాశయుని తీవ్రనిష్ఠలో అష్టకష్టాలు పడి సీమకు పోయి తిరిగి వచ్చిన మహావిద్వాంసునిగా, మైత్రాయి కొలువులోని దొడ్డవానిగా కానియాడాడు

సమాజం మంచి చెడుల సమ్మేళనం. ఎంత ఉత్తమ ధర్మంలోనైనా కాలక్రమంలో అవగుణంచోటు చేసికొంటుంది. మానవ స్వభావం కూడా యింతే.

కైలాసం నుండి తిరిగి వచ్చిన గబ్బిలాన్ని అడిగి విశేషాలు తెలిసి కొంటున్న సందర్భంలో అరుంధతీ సుతుడిలాగన్నాడు .

ఓ పతంగస్వామినీ! కైలాసంలో దేశభక్తితోగాక కేవలం చలికోసం ఖద్దరువస్త్రాలు ధరించిన మోసపుదేశభక్తుల్ని ఎవరినైనా చూచావా?

పరమపవిత్రమైన సన్యాసం కూడ హేళనపాత్రమయ్యే విధంగా ప్రవర్తిస్తున్న దొంగ సన్యాసులనుగూర్చి ప్రశ్నిస్తూ "గాలిలోతూలిపోయే శుష్క-దేహాలలో శూలాలు, సొరకాయబుఱ్ఱలు ధరించి జడలుగట్టిన జట్టుతో భ్రష్టులైన గంజాయి భాయీలు కాషాయ వస్త్రధారులెవ్వరైనా నీకెదురుపడ్డారా" అని అడిగాడు.

ఇక్కడ అట్టివారు జపాన్నోధ్యానాన్నో కొద్దిగా నేర్చియతివేషంతో పర ప్రవంచకులై మాయోపాయులై ప్రతి పల్లెటూళ్లోను ప్రత్యక్షమౌతున్నారు. పాలు, పండ్లే మాకాహారమని ఇతరమైన దేమీకోరమని వంచన చేసి వెండి బంగారాలు మూట గట్టుకొని పలాయానం చిత్తగించే దొంగ సన్యాసుల మోసాలు నిరాటంకంగా సాగుతున్నాయి

పదవులనధిరోహించేవారు లంచపుపాడి బఱ్ఱెల్ని పితికి విపరీతంగా ధనం సంపాదిస్తారు విచిత్రపుభక్తులు, కపటవేషధార్లు ప్రతిచోట ప్రత్యక్షమౌతారు. వారి నెప్పుడూ చేయిసాచకు

ఈ విధంగా సమాజంలోని దుష్ట స్వభావుల్ని బహిర్గతం చేశాడు, కవి. అన్యాయం, అధర్మం, వంచన ఎక్కడున్నా పసిగట్టి మొగమాటం లేకుండా ఖండించటం ఈకవి స్వభావం

ఇక మతం పేరుతో జరిగే దురన్యాయాలనీవిధంగా ఏకరువుపెట్టాడు

ఒకడు నేను సాక్షాత్తు శివమూర్తి నంటాడు మరొకడు దట్టంగా నామాలు పెట్టుకొని శివలింగాన్ని చీదరించుకొంటాడు. ఇంకొకడు శైవం వైష్ణవం కాని వికటవేషం వేసికొని వారిని సవాలు చేస్తాడు. మరొకడు గంజాయిదమ్ముకు దాసుడైపోయి బూడిద పాలవుతాడు పిల్లచర్యలెలా గుంటాయంటే మొక్కుబడులు ఖేదంతో ఎందరో పసిపాపల్ని గంగలో కలిపారు. సహగమనా

చార దేవతలు ఎందరో చిగురుకొమ్మల్ని బూడిదచేశారు. విద్యలు కొందరికే పరిమితం చేసేసరికి ఎందరిదో కళాభ్యసనచాతురి గొంతుపిసకబడ్డది.

గ్రామదేవతలకు నెత్తుటి కూళ్ళు రేపుమాపు మేపలేక శతసహస్ర క్రూర మతసింహాలు చేసే కుటిలమైన గర్జనకు తట్టుకోలేక పిచ్చిపూజలు మతాలు విడువలేక దేవతలచే పొగడబడిన మా దేశాభ్యుదయం ఉట్టికి స్వర్గానికి ఎక్కలేక ఊగిసలాడుతోందని అధిక్షేపిస్తాడు,బాధతో.

దేశం పరిస్థితి యిలాగుంటే ఒకరి తరువాత ఒకరువచ్చే ఏ ప్రవక్తా మా బ్రతుకులను బాగుచేయలేదని నిరాశా నిస్పృహలకు లోనవుతాడు

చదివిన కొద్ది వెఱ్ఱిఎక్కువౌతుంది వారి చర్యలు వికృతాలౌతున్నాయి.

"చదవనేర్చిన వెఱ్ఱిని జంపగలరె?
ఒక్కబుద్ధుడు। నొకక్రీస్తు। ఒక్కగాంధి?"

అని ఈబుద్ధుడు క్రీస్తు, రాముడు కృష్ణుడు వీరి అవతారాలు మరి అవసరంలేదంటాడు వీరుచేసే ధర్మసంస్థాపన శూన్యం

''ధర్మసంస్థాపనార్థంబు ధరణిమీద
నవతరించెదనసె నబ్జభవుని తండ్రి
మునుపుజన్మించినెత్తి కెత్తినదిలేదు
నేడు జన్మింపకున్న మున్గినదిలేదు 11 - 25

మా ఈ స్థితిని మార్చలేని అవతారాలు వ్యర్థమని నిరసించాడు.

## కవిభావించిన సమసమాజం

తన్ను బహిష్కరించిన ఈలోకాన్ని తిరస్కరించిన పంచముడు తనసుద్ధరించలేనిదేదీ తనకవసరంలేదని ఖండితంగా చెప్పిన పంచముడు తన సందేశం పరమేశ్వరునకు విన్నవించి తిరిగివచ్చిన గబ్బిలాన్ని తాను నివసించడానికి తగిన సమాజం దేశం ఎలాగుండాలో మనసులో నూహించి అట్టివి నీ ప్రయాణంలో నీకెక్కడైనా కన్పించాయా అని అమితమైన ఆసక్తిలో అడిగాడు.

"మాతృభాషలక ర్థమర్యాదలొనరించు
సర్వకళాశాలసాగుచోటు
ప్రజలనాహరించు బహుమత దేవతా
దైనందిన గ్లాని లేనిచోటు
నవనీత నిభమైన కవుల కమ్మనివాక్కు-
వెలపులేకావిర్భవించుచోటు
సంతానమునకు వైషమ్యంబునీర్పని
తల్లిదండ్రులు విరాజిల్లుచోట
విసపు నవ్వులలాహిరీ వేషగాండ్ర
పాద చిహ్నల మరకలేర్పడని చోటు
తోడు నీడయులేనట్టి దుర్బలులకు-
గబ్బిలపు చాన! వాసయోగ్యంబుగాదె?" ii – 119

తానూహించిన నివాస యోగ్యమైన ప్రదేశాన్ని గూర్చి తెలియజేసి –

భోగులాహరించు భుక్తికన్నుల జూచి
పరమపేదలు దుఃఖ పడనిచోటు
సాంఘికాచారపంచాస్యగర్జనమున
బెదరక జ్ఞానంబు పెరుగుచోటు
జాతివైషమ్యరాక్షసపదాహతి చేసి
కందక కళలు పెంపొందుచోటు
పరిపాలకక్రూరతర కరానికి లొంగి
పోక స్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు
అనదబిడ్డలు జూడ నెయ్యంపుసుతుల
ముద్దులాడనిగుణనిధుల్ బుట్టుచోటు
చెప్పగదవమ్మచూచి వచ్చితివెనీవు
నిశ్చయంబుగ వాసముండెదను నేను (ii – 11)

అటువంటి సమాజం నీకు కన్పడితే చెప్పు నేను వస్తాను, అని తన ఆసక్తిని తెలియపరచాడు అంటే ఈ సమాజం అలా మారాలని కవి వ్యంగ్యంగా చెప్తున్నాడు.

ఈ రెండు పద్యాల్లో విశ్వకవి రవీంద్రుని గీతాంజలిలో మకుటాయమానంగా పరిగణింపదగిన ఈ క్రింది గేయప్రభావం గోచరిస్తుంది.

"Where the mind is without fear
and the head is held high"

ఇది విశ్వకవి ఊహించుకొన్న స్వాతంత్ర్య స్వర్గం!

"ఎక్కడ మనస్సు భయరహితంబో!
ఎక్కడ శిరస్సు సమున్నతంబో!
ఎక్కడ జ్ఞానం ఉచితలబ్ధమో
ఎక్కడ జగత్తు స్వార్థసంకుచిత
భావకుడ్యముల వేర్పడకుండునో
ఎక్కడ వచస్సు సత్యపులోతుల
వినిర్గతంబై విరాజిల్లునో
ఎక్కడ అవిరళ కృషి హస్తద్వయి
పరిపూర్ణత నాశించుచుండునో
ఎక్కడ నిర్మల హేతుస్రవంతి
నిర్జీవపుటలవాట్లను నెడారి
ఇసుక దిబ్బలో ఇంకిపోవదో

ఎక్కడ మనీష నీనడిపించెడి ప్రగతిపథమ్మున
సంతత విస్తృత సమాలోచితము, క్రియాత్మకమ్మో!
ఆ స్వాతంత్ర్యపు స్వర్గధామమున
జనకా! నా ప్రజ జాగృతిగాంచుత"

(అనువాదం : ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం)

ఇంతటి హిమాలయోన్నత భావన, జాషువకవి లోకానరాకపోయినా ఆ జాడలు కొంతవరకు కనిపిస్తాయి

భారతజాతి అనేక విధాలుగా కుళ్లిపోయింది. ఆ విషయాన్ని యిలా వివరిస్తాడు కవి ఇవన్నీ అక్షరసత్యాలు.

జాతీయపౌరుషజ్వలన మాబాల్యంబు
సవరించుకావ్యరాజములు లేక
విక్రమక్రమశిక్షవెన్నతో నిడు జిజా
సతివంటి మాతృదేవతలు లేక
ఒక జుట్టు నొకబొట్టు నొకకట్టుబడి నేర్పి
పాలింపజాలుదేవతలు లేక
కులమెల్ల చెదరి తెంపులు తెంపులగుచుండ
వారించి కాపాడు ప్రభువులేక

బుద్బుదంబునకెనయైన మూడు నాళ్ల
పదవులకు ప్రతిష్ఠలకునై ప్రాకులాడి
నరులనమ్మించుకొన లేక నమ్మలేక
చిదికి యున్నవి మాజాతి జీవితములు ii - 120

ఈ జాతి ఏవిధమైన సదుపాయాలుంటే ప్రపంచంలో గొప్ప జాతిగా మనగల్గుతుందో తెలిపి అట్టివి లేకపోవడంచేత ఇప్పుడు చిదికిపోతున్నదని విచారం వ్యక్తం చేస్తాడు. ఇది ఈ జాతికి సందేశంగా స్వీకరించవచ్చు.

ఈ విధంగా జాషువ కవి తన సందేశకావ్యంద్వారా అనేకానేక సాంఘిక, చారిత్రక సాంస్కృతిక పరిస్థితిల్ని అభివర్ణిస్తాడు. ఈ సమాజం ఎలా పతన మైందో, సమాజం ఎలాగుంటే బాగుంటుందో మొదలైన విషయాలన్నీ నాయకుని ద్వారా కవి పలుకుతాడెంతో హృదయార్ద్రితతో.

## సందేశకావ్యాలలో గబ్బిలం స్థానం

కైలాసంనుండి గబ్బిలం తిరిగివచ్చిన తరువాత దాన్ని విశేషాలడుగుతూ -

కాళిదాసుని మేఘంబు గౌరవంబు
తెచ్చుకొన్నదె నీదు సందేశగాథ?
ఘనులుచేకొను భూభృదగ్రముల పూజ
అసమ చతురత్వమున్న బానిసకురాదు

అని అన్నాడు. ఈ మాటలో తన సందేశకావ్యం కాళిదాస మేఘ సందేశంతో సమానమైన గౌరవం పొందాలని ఈ కవీశ్వరుని ఆశయంగా మనమూహించవచ్చు. సామాజిక సందేశకావ్యాలో గబ్బిలం అంతటి ఖ్యాతి నార్జించుకొన్నది. ఇట ఘనులంటే మేఘాలనే అర్థాంతరస్ఫూర్తివల్ల వ్యంగ్యార్థం శోభిస్తుంది.

నవయుగ కవి చక్రవర్తి జాషువ సమకాలీన సంఘంలో దురాచారాల నన్నింటినీ కళ్లకు కట్టినట్లు వర్ణించాడు.

కులమతాలపేరిట హైందవసమాజంలో మానవుడు మానవుని అణగ దొక్కే నీచ స్థితిని గర్హించాడు.

మానవుల మనస్సులే కాక రాళ్లు కరిగేటట్లు మానవత్వాన్ని తన పచేళిమ కవితారీతిలో తాను విలపిస్తూమనల్ని విలపింపచేసాడు అయితే కవికాలానికున్న హీనపరిస్థితులిపుడు లేవు. అస్పృశ్యత అంతరించింది. అన్ని విధాల ప్రభుత్వం ఆదుకొంటున్నది. దేవాలయ ప్రవేశాదులు, ఉద్యోగావకాశాలు వారికిమిన్నగా ఉన్నాయి. ఇప్పటికే ఈ కావ్యం పాతపడిపోతున్నది, కన్యాశుల్కం నాటకం లాగా. అయితే చారిత్రక ప్రాధాన్యం కోసం చదువవచ్చు. కవి పద్యరచన అనర్గళమైంది. మీదిమీదికి చదివిస్తుంది. ప్రేమ సందేశకావ్యాలులాగా సామాజిక సందేశకావ్యాలకు శాశ్వత ధర్మముండదు. మేఘసందేశం అన్ని వర్గాల ప్రజలు చదువుకొని ఆనందిస్తారు. కాని సామాజికాలు తాత్కాలికాలు, ఒక వర్గం విమర్శకులోనవుతుంది పాక్షికరంజకాలు.

## తెనుగు సందేశం

ఈ తెనుగు సందేశం రచయిత పూత్తలపట్టు శ్రీరాములరెడ్డిగారు. వీరు తమిళ తెలుగు వాఙ్మయములలో విశేషపాండిత్యం కల్గినవారు.

తమిళవాఙ్మయంలోని ఉత్తమ గ్రంథాలైన తిరుక్కొఱళు, శిలప్పదిగారం, మణిమేకలై, కంబరామాయణాలను తెలుగు పద్యాలలోకి అనువదించారు. తెలుగు సందేశంలోని కథ అతి నవ్యమైనది. చమత్కారభాజకమైనది.

## కావ్యకథ

వసుచరిత్రాది దివ్యప్రబంధాలు వ్రాసిన రామరాజ భూషణునికి ఒక కూతురు ఉన్నది. ఆమెపేరు రామాంబ. ఈమె తండ్రివలె సంగీత సాహిత్యాలలో అపార పాండిత్యం గడించింది. ఆమెకు యుక్తవయస్సు వచ్చింది. తల్లిదండ్రులు వివాహం చేద్దామనుకొన్నారు కానీ ఆమె అంగీకరించలేదు. తన జీవితాన్ని సారస్వత సేవకు, సమాజసేవకు, అంకితం చేస్తానని తల్లిదండ్రులకు చెప్పి అంగీకరింపజేసింది. బ్రహ్మచారిణియై సారస్వతిసేవలో రామాంబకాలక్షేపం చేస్తోంది. కొన్నాళ్లకు తల్లిదండ్రులస్తమించారు. విజయనగర రాజ్యవైభమంత రించింది. వృద్ధత ప్రాప్తించింది. తను త్యాగం చేయాలనుకొన్నది. వచ్చే జన్మలో కూడా యిట్టి మహాపండితుని, కవిని తండ్రిగా పొందాలనుకొన్నది.

మరుజన్మలో రఘునాధుడు-రాజ్యపాలనం చేస్తున్న తంజాపురిలో రఘునాధుని ఆస్థాన కవియైన చేమకూర వేంకట కవి యింట్లో జన్మించింది. తన జన్మధన్యమైందనుకొన్నది. చేమకూర వేంకటకవి ఆమెకు సరస్వతి అనే పేరు పెట్టాడు.

ఆమె పెరిగి పెద్దదై పేరుకు తగినట్లుగా అపరసరస్వతి అయింది. రామభద్రాంబ, రంగాజమ్మ ముద్దుపళని మొదలైన వారీమెను అనుసరించారు. రఘునాధుడు ఈమె ప్రతిభను గమనించి అంతఃపురంలో పిల్లల్ని విద్యావంతులుగా తీర్చిదిద్దమనికోరి రాచనగరులో వసతిని ఏర్పాటుచేయడమేగాక ఆమె పేరుతో "సరస్వతీమహల్" అనే గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశాడు.

పిల్లలకు నీతి విద్యను బోధిస్తూ మధ్యాహ్న సమయాలలో రంగాజమ్మ మొదలైనవారు సహకరించగా మహిళల అభ్యుదయానికై ఉద్యమం సాగిస్తూ సాయం సమయంలో పురాణ కాలక్షేపం చేస్తూ సరస్వతి తనదైనందిన జీవితాన్ని గడుపుతోంది.

కొంతకాలానికి వనవాసం చేయాలనే కోరికకలిగింది. మేముబ్రతికున్నంత కాలం వెళ్ళవద్దని తల్లిదండ్రులు కోరారు కొంతకాలం వారితో ఉండి వారు విగత జీవులైన తరువాత వనవాసానికి ప్రయాణమైంది. ముద్దుపళని ఆమె ననుసరించింది. తొమ్మిది సంవత్సరాలు సరస్వతితో గడిపిన ముద్దుపళని ఆమెను వీడి స్వర్గానికిపోయింది.

మనసు రమావిభునిపై నిలిపి యోగినీవృత్తితో ధ్యాన నిమగ్నయై ఒక్క శతాబ్ది గడిపింది. మరల కనులు తెరిచింది. జగమంతా కృష్ణమయంగా కనిపించింది. మరల కన్నులు నిమీలించగా తెలుగుతల్లి కన్పించింది.

ఆమెను సరస్వతి ప్రార్థించి దేవదేవేశుడు, ఉత్ఫుల్లాంభోజ దళాక్షుడైన కృష్ణుని తీసుకొని రమ్మని ద్వారకకు పోయే మార్గాన్ని వివరించి పంపింది.

## కావ్యగత విశేషాలు

ఈ కావ్యం తెలుగు భాషామతల్లి వైభవ వర్ణనలతో ప్రారంభమైంది తరువాత విజయనగర సామ్రాజ్యంలోని సాహిత్యసాంస్కృతిక వైభవ వర్ణనం. అటు తరువాత అపరకృష్ణరాయలైన రఘునాధుని సామ్రాజ్యంలోని సాహిత్య సాంస్కృతిక వైభవ వర్ణనం. ఆపై మార్గనిర్దేశంలో సమాజంలోని గుణదోష వర్ణనం చేయబడ్డది.

## కథావైశిష్ట్యం

ఈ కావ్య కథలోని నాయిక తొలుత రామరాజభూషణుని కూతురై మరల మరుజన్మలో చేమకూర వేంకటకవి కూతురై రెండు జన్మలలోను మహా కవులను తండ్రులుగా పొంది తానుకూడ వారితో సమానమైన పాండిత్యప్రకర్ష కల్గినదై సమాజ సంక్షేమమునందు ఆసక్తి కల్గినదైనది.

అసలీసందేశకావ్య వాఙ్మయంలోనే యిటువంటి కథలేదు. ఇదొకచక్కని కల్పన. తెలుగుకవులలో రామరాజభూషణుడు చేమకూర వేంకటకవులపై కవికి గల ప్రత్యేకాభిమాన మిందులో వ్యక్తమౌతుంది.

# దూత్యము

కృతినాయిక తెనుగుతల్లిని దూతగా స్వీకరిస్తూ ఆమెనే ఎందుకు దూతగా స్వీకరించిందో తెల్పడానికి తాను నిరాదరించిన అన్యదూతల ప్రస్తావనచేసింది.

**చిలుక :—**

ఇది ఎదుటివారు పలికింది మరల అప్పగిస్తుంది కార్యాన్ని విస్మరించి అటూ ఇటూ పోయి కార్యభారాన్ని కల్గిస్తుంది అప్పగించిన పనిపూర్తి చేయగల సాహసం లేదు. అందుకై చిలకను దూతగా పంపదు.

**గోరువంక .**

ఎంతమాట నేర్పరియైనా, తన నాయకులైన కృష్ణుని చూచేసరికి సర్వం మరచిపోతుంది కార్యభంగమౌతుంది.

**కోకిల :**

పదుచులు కోయని అంటే కోయంటూకూర్చుంటుంది. కాకులచేత పెరిగి నది కావడంచేత అది తగినదికాదు

**తేనెటీగ :**

రొదలతో వరిస్తూ ఉంటుంది. తిండిపైననే ఎప్పుడూ దాని ఆలోచన. అందువల్ల అదికూడా తగదు

**నెమలి .**

మెయిలు కనిపించంగానే పురివిప్పి నాట్యమాడుకొంటూ కాలక్షేపం చేస్తుంది.

**జింక .**

కుక్కలకు బెదురుతుంది. గుండె దిటవులేదు. అది దూత్యానికి తగదు.

**మనసు .**

మహర్షి పాణిని మాటనమ్మి నపుంసకం గదా అని పంపించాను. అది అక్కడే ఉన్నది. పాణినిచేత మోసపోయాను.

ఈవిధంగా కొందరు దూతల అసామర్థ్యాలనుబట్టి తిరస్కరించి నాప్రియుడు ఆలోచనకు అందనివాడు వానితో తగిన విధంగా మాట్లాడగలిగిన సమర్థురాలవు కాబట్టి, తల్లివి గాబట్టి బిడ్డలహృదయం గమనింపదగినదానివి స్త్రీని కాబట్టి స్త్రీ హృదయం తెలిసి పల్కగలవని కళలన్నిటికి అధికారినని మాధుర్యమైన శరీరము కలిగినదానివని అఖిలదూత గుణములు నీయందున్నాయని తలంచి పౌరుషము, దైవము ఫలకారకములుగావున ఆ రెండును నీయందుండుటచేతను నీకు నాప్రియునికి సన్నిహిత సంబంధముండుటచేత నీవునిర్వహించిన దౌత్యంలో ఫలసిద్ధి కలుగుతుందనే నమ్మకం నాకుంది కాబట్టి నిన్ను దూతగా పంపాలను కొంటున్నాను.[1] అని కృతి నాయిక ఉద్ఘాటన.

సాధారణంగా దూతకావ్యాలలో ఒక దూతను నిర్ణయించుకోవటం దూతకు స్వాగతం చెప్పడం అతని వంశాదికాలను స్తుతించడం పరిపాటి కాని ఇందులో శుకపికాదులను దూతలుగా స్వీకరించకపోవడానికి గలకారణాలను వివరిస్తు దౌత్యం నిర్వహించడంలో తెలుగుతల్లి సామర్థ్యాన్ని అర్హతలను ప్రస్తుతించడం విశేషం. ఈ కావ్యారంభమే దూతయొక్క ప్రస్తుతితో అయింది

అక్షరము శబ్దమయమునైయమరురూపు
సర్వదేవతలకు మూల శక్తి వగుదు
శ్రేష్ఠ విజ్ఞాన గరిమకు జన్మభూమి
తేనె వీనులగురియించు తెనుగుతల్లి

---

1 అఖిలదూతగుణములు నీయందు గలవు
పౌరుషము దైవమును ఫలకారకమ్ము
లంద్రు పెద్దలారెండు నీయవియకాన
ఫలమునందు సందేహము పడయబోవ

2 నీకు నా ప్రియునకును సన్నిహితబాంధ
వమ్ముగలదా మహాత్ముజన్మమ్ము దొట్టి
బాలక్రీడలును భక్తపాలనమ్ము
లతని పెండ్లిండ్లు నీవ తెల్పితివికాదె?

అంటూ ప్రారంభించి కోమలపదాలతోను, గొప్పదైన వాక్చమత్కారంతో సురుచిరధ్వన్యలంకారవిలక్షణములచేత లక్షితమైన అవయవములు కలిగి వినుత గుణంబులు విమలవృత్తులు అమలరీతులుకలిగి ప్రాణికోటినుండి మనుష్యుల్ని వేరు చేసే ధీశక్తినిచ్చేదైవానివే నీవు. నీ దయ కలిగినట్లయితే మానవుడు పొందలేనిది లేదు. తమిళకన్నడాది తోబుట్టువులు కలిగి స్మృతులు,శ్రుతులు పురోహితులు కాగా కావ్యమిత్రవర్గంతో శాస్త్రాలు సైనికాధికారాలుకాగా దండకాలు, శతకాలు, దళములు మంత్రులై కొలువగా కవులు వందిమాగధులుకాగా విద్యానగరము నందు చిత్రసింహాసనముపై ఆ సీనురాలివై సరససంగీతసాహిత్యగోష్ఠులు నిర్వ హిస్తుంటావు, అని అనేకవిధాలుగా తెలుగుతల్లిని కొనియాడి దూతకార్యానికి ప్రార్థించింది నాయిక.

# విరహవేదన

కావ్యనాయిక తన హృదయాన్ని కృష్ణార్పణంచేసింది. ఆమె శరీరావయ ములన్నీ అనంగభూతసంకలిత దశానుభూతులయికాల్చివేస్తూ బాధకల్గిస్తున్నాయి. ఆ మన్మథావస్థలు బాధకు గురిచేస్తూ అన్నపానాదులు తీసుకోనీయకుండడం మాత్రమేగాక నిద్రకుకూడా వెలిచేసినాయి.

కేవలం దర్శనంచేతనే నాసర్వావయములు తృప్తిని పొందుతాయి, స్పర్శచేతనే హృదయసంతాపముపశమిస్తుంది. సంభాషణమాత్రంచేతనే సాలోక్య సామీప్యఫలములు పొందగలనని, సంశ్లేషణం చేతనేసారూప్యసాయుజ్యభావాలు పొందిన అనుభూతి పొందగలనని అతని కటాక్షవీక్షణం కోసం చాతకం వలె వేచియున్నానని ఆ శ్రీకృష్ణునికి తెల్పుమని తెలుగు తల్లిని కోరుతుంది కావ్య నాయిక.

అంతేకాక విరహాధిక్యంలో ప్రియుని దూషణకు కూడ వెనుకాడలేదు

పరమ భక్తుడైన బలిని పాతాళంలోకి త్రొక్కాడు. గొల్లయిండ్లలోపాలకై కల్లలాడాడు. వనితలవస్త్రాలు దొంగిలించి సిగ్గుచెట్టుకు కట్టేశాడు. మామను మేడపై నుండి త్రోశాడు. ఇది నమ్మినవారికి ద్రోహం చేయటం కాబట్టి అది ఆ కృష్ణునకు తగదని చెప్పమంది.

సంపదనిచ్చినట్లే యిచ్చి వివిధరూపాల్లో వచ్చి అరగింపవీలులేకుండా చేశాడు. అటువంటి పిసినిగొట్టు ఆ శ్రీహరి. గోపికామానసచోరుడు పుణ్యజన హంతకుడు. మట్టుమర్యాదలులేని అతణ్ణి దయగలవాడని పల్కుట దోషం.

పాలీయవచ్చిన పడతిని చంపినవాడు, తననుమోసేబండిని తన్నినవాడు. భక్తులు పడరానిపాట్లుపడుతుంటే చూస్తూ ఉండేవాడు. పేదయిండ్లను దోచేవాడు. సేవకుల ఇండ్లలో కుడిచేవాడు. ఆటువంటివాడిని నీవు గొప్పవాడని పొగడడం చేత ప్రేమించాను. ఇప్పుడు మోసపోయాను

సముద్రం ఆయన యిల్లు. పన్నగం శయనం అనంగుడు కొడుకు బొల్లి గద్ద వాహనం. అటువంటి వాని గృహాన్ని చేరడం తగునా?

పెద్ద భార్యకు చిన్న భార్యకు పడదు. అత్తకు కోడలికి అసలే సరిపడదు. కొడుకు తుంటరి భంగపాటు పీడని అల్లుడు, మూడు పెళ్లిళ్లు చేసికొన్నకూతురు. అటువంటివాడు ఇతరుల కష్టాలు గుర్తించగలడా?

రాక్షసులను చంపి దేవతలకు అధికారాన్ని కట్టబెడతాడు. వీరేమి త్రవ్వి తలకెత్తారు? రాక్షసులేమి ఇవ్వలేకపోయారు? కాకులను గొట్టి గద్దలకేయడ మంటే ఇదే. ఇటువంటి పక్షపాత బుద్ధి ఎందుకు?

గజేంద్రుడు ఆర్తితో పిలిస్తే పరుగున వచ్చాడు దనుజబాలుడు స్తంభం లో కన్పడమంటే కన్పిచాడు. కాని నేడు తమ కొంపల్ని దుండగులు కొల్ల గొట్టగా ప్రజలు పారిపోతుంటే, స్త్రీల మానరక్షణకష్టమై దుర్గాలు నిర్ధూమాలౌ తుంటేదేవమందిరాలు తీవ్రదుర్దశను చెందుతుంటే, దేశం బానిసతనంతో క్రుగ్గుతుంటే, దేశ సౌభాగ్యాన్ని పరులు దోచుకొంటుంటే, రక్షింపలేని వాడికి భక్తవత్సలుడన్న బిరుదమెందుకు? ఆర్తరక్షణం చేతకాదా? వినడానికి చెవుడా? నిలదీసి అడగమన్నది తెలుగుతల్లితో

ఆస్తికులను కష్టాలపాలుజేసి, నాస్తికులకు ఇంద్రభోగాలన్వీడంలోను, దేవుడున్నాడు లేడు అనే పదాలకు తావ్విడం, పలువిధాలైన మతాలు ప్రభ వించడానికి, జనులు తన్నుకు చావటానికి కారణమేంటి? పాపాన్ని పండన్వీడం దేనికి? మొలకలోనే త్రుంచి వేయకూడదా?

ఇట్టివానిపై నామది లగ్నమైంది. దీనికి కారణం నేనుగాదు. నా తండ్రి. నీవు, ఆ జీవితేశ్వరుడు. అని తండ్రి గుర్తుకురాగనే తన జన్మాదికాలు చెప్ప నిశ్చయించింది

ఈవిరహవర్ణనలో నాయిక శ్రీకృష్ణుని తూలనాడింది. ఆ మాటలలో తెలుగుభాషామతల్లిని కూడా నిందించింది నీవు విపరీతంగా అతణ్ణి వర్ణించడం చేత అతనిపై మనసు లగ్నమైందని నిష్ఠురాలు మాట్లాడింది.

అంతేగాక నా మనసు కృష్ణునిపై ఆకర్షితంకావడానికి నా తండ్రి నీవే కారణమని తెలుగుతల్లితో అన్నది చేమకూర వేంకటకవి విష్ణుభక్తుడు, ఆ కాలంలో వాఙ్మయమంతా వైష్ణవ మతపరంగానే రచితమైంది. కవి దీనిని ఈ రీతిగా చమత్కరించాడు

ఈమె శ్రీకృష్ణుని గూర్చి మాట్లాడిన మాటలలో పైకి నింద కన్పిస్తుంది. కాని నాయికనాయకునిపై నున్న విపరీతాభిమానాన్ని, అతడు తన్నుబాధించడం చేత నిందారూపంలో బహిర్గతం చేసింది ఇదీకావ్యానికి అలంకారమే. దూత కావ్యాలలో ఇది అపూర్వము కావ్యసౌందర్యభాజకము. ఈ నిందలో కూడా సామాజిక స్పృహ గోచరిస్తోంది. అది విశేషం.

## నాయిక పుట్టుపూర్వోత్తరాలు

సాధారణంగా సందేశకావ్యాలలో దూతవంశాదికాలు వర్ణించడం కద్దు కాని ఈ కావ్యంలో నాయిక యొక్క జన్మవిశేషాలు వర్ణితమైనాయి.

శ్రీకృష్ణుని గూర్చి తను పల్కిన మాటలు విన్న తెలుగుతల్లి ఈ నాయిక వైపు చూసింది. ఆచూపులనామె పసిగట్టింది.

నీదు చూపులనొక శంకనెఱయుదోచె
మరచితివోయేమొ? నా పూర్వచరితసుంత
వినగదలచిన విను మది విశదరీతి

అని తన విషయం చెప్పడం ప్రారంభించి తన రెండు జన్మలవృత్తాంతాన్ని సుదీర్ఘంగా వివరించింది.

చిరకీర్తనీయవిఖ్యాతుడు శ్రీకృష్ణరాయలు. అతని అల్లుడు రామరాయలు కూడ ప్రసిద్ధుడే. అతని మేనల్లుడు నరసభూమిపాలుడు కూడ లబ్ధప్రతిష్ఠుడు వారి అందను చేరిన మూర్తి అనీ, రామరాజభూషణుడని, ప్రచారం కల్గి మహా కావ్యరత్నాల్ని నీకు కాన్కగా అర్పించిన నీభక్తునకు కూతురను రామాంబ నా పేరు. ఈ విధంగా ప్రారంభించి విస్తృతంగా రామరాజభూషణుని జీవిత కవితా తత్త్వాలను పద్య రూపంలో వ్యాఖ్యానించింది.

సంస్కృతాంధ్రభాషాసాహిత్యమర్మాలను, సంగీతకళాతత్త్వాన్ని తనతండ్రి వద్దఅధ్యయనం చేశానని సగర్వంగా చెప్పుకొన్నది.

శ్రీరామపదారవింద భజనానందుడైన తండ్రివలన దైవభక్తి అలవడ్డది. తల్లితండ్రులు వివాహం చేస్తామంటే జనహితం ఈశ్వరసమ్మతమని నేను వివాహంచేసికోననిఅన్నది. మనకుల దైవం మారుతి, భీష్ముడు బ్రహ్మచర్యాన్ని వహించినట్లుగానే నేను వహిస్తానని పట్టుబట్టింది. తల్లితండ్రులు అంగీకరించారు. స్త్రీజనోద్ధరణం ధ్యేయంగావారికి విద్యనేర్పుతూ కాలం గడుపుతోంది. [1] సమాజ సేవ చేయడంలో తనకు ఎన్నివిధాల అవకాశమున్నదో అన్నివిధాల చేసింది.[2]

ఇలా గడుస్తుండగా తల్లిదండ్రులు గతించారు. విజయనగరంలో పరిస్థితి విషమించింది. అక్కడ ఉండబుద్ధికాలేదు. రాజ్యాన్నివీడి అరణ్యాలకుపోయి

---

[1] సతులహితమె నేను జన్మవ్రతంబుగా
నెఱపూచుంటి విద్యగరపుచుంటి

[2] అరసినిల్పితిన్ శిశువిహారములన్ మహిళాసమాజముల్
సారతరప్రభూతగుణసంతతి గూర్చెడు మేటి పుస్తకా
గారములున్, ప్రసిద్ధకవిగాయక గోష్ఠిపురాణ పారమున్
సారులచర్చలున్ గడక నాణెముతో జరపించుచుండితిన్

తను త్యాగం చేయదలచి కృష్ణపరమాత్మను వచ్చే జన్మలో కూడ ఈ తండ్రిని బోలిన తండ్రినే యివ్వమని ప్రార్థించింది. నీపై భక్తిపోకుండా చేయమన్నది [1]

కృష్ణరాయలకాలంలో ఒక స్త్రీ సమాజసేవ జేయబూనుకొన్నదని కవి చిత్రించడం అపూర్వంగా, ఆదర్శోపేతంగా ఉన్నది నేటి ఈ ప్రజాస్వామ్య సమాజంలోనేగాదు, రాజులకాలంలో కూడ వ్యక్తులు గ్రంథాలయాలు నెలకొల్ప డంలాంటి సమాజసేవ చేసేవారని కవి ఊహ ఒక స్త్రీని బ్రహ్మచారిణిగా చేసి ఆమె జీవితాన్ని సమాజకార్యానికి అంకితంచేయిండం సమాజానికి ఎంతో సందేశా త్మకంగా ఉన్నది ఒక జన్మకేగాదు జన్మజన్మలకు నాకిట్టి అదృష్టాన్ని ప్రసా దించమని పరమేశ్వరుని వేడుకోవడంలో ఈ సమాజం బాగుపడాలంటే ఇట్టి వారి త్యాగ గరిమ ఆవశ్యకత నేడు ఎంత ఉన్నదో కవి ఊహలో వ్యక్త మౌతుంది.

ఇక్కడ ఈ కవి కావ్యనాయిక తండ్రి రామరాజభూషణుని తనివి తీర వర్ణించి పాఠకులకు ఆనందాన్ని ప్రసాదించాడు.

## కావ్యనాయిక మలి జన్మ

కళావినోది, సుకవి వ్యాపారసంతోషియైన రఘునాథ భూపాలుని ఆశ్రయం తో జగత్ప్రఖ్యాతిని గాచినవాడు, నిత్యఘనగ్రంథవిధాతయై విబుధవంద్యుడైన చేమకూర వేంకటకవికి పుత్రికారత్నమై జన్మించింధి రామాంబ. తల్లిదండ్రు లామెకు 'సరస్వతి' అనే పేరు పెట్టారు

ఈమెకు పూర్వజన్మసంస్కారం తోడురాగా చేమకూర వేంకట కవి పెంపకంలో పూర్వలక్షణాలను ఇనుమడింపచేసికొన్నది

---

[1] మెయివిడుచో మనంబున రమాపతి నిర్మలపాదపంకజ
ద్వయి నెలకొల్పితిన్ బతితపావన జన్మములెన్ని యిచ్చినన్
బయిపయితండ్రిబోలు గుణవంతుడు నక్కవితండ్రిగాగ
పయినిడుపాఠభక్తిగలబాముననొసంగుమయంచు వేడితిన్

తెలుగుతల్లితో తన తండ్రి పాండితీ ప్రకర్షను, కవనచాతురిని, అతనికి ఆశ్రయమిచ్చిన రఘునాథుని సహృదయాన్ని, సాహిత్యసంస్కారాన్ని కొనియాడుతూ వివరించింది [1]

ఈ తంజాపురంలో కూడ విజయనగరంలో లాగా సమాజసేవకురాల్యక్తురాలైంది. రఘునాథుడు దానికి సంతోషించాడు. ఆమె పేర గ్రంథాలయాన్నే స్థాపించాడు [2]

కృష్ణునిపై భక్తిని వీడక దానితోపాటు వీడనిపట్టుదలతో విద్యార్థులకు విద్యను నేర్పడంతోపాటు మహిళా సమాజోద్ధరణకై నిరంతరం శ్రమించింది. ఈ విషయంలో ఈమెకు రంగాజమ్మ మొదలైన కవయిత్రులు సహకరించారు.[3] ఈ సమయంలో ప్రత్యేకించి పేర్కొనదగిన విధంగా సహకరించింది ముద్దుపళని.[4]

---

1 అచ్చతెనుగు సొమ్ములకాన్కలమరబెట్టి
పలుకు జలువనధిక మోదపరచెననుచు
తండ్రిగుణములనగ్గించు ధరణిసురులె
రాజు రఘునాథ భూపుడా రాణవాడె

2 నేడె భవనమొకటి నీపేర గట్టింతు
వలయు గ్రంథ సమితి విలసితముగ
సేకరించియుంతు స్త్రీలసేమంబుకై
పాటుపడగదమ్మ భవ్యచరిత!

3 మహితమతులు రంగాజమ్మ మధురవాణి
రామభద్రమ్మ మున్నగు రాజ ముఖులు
తోడుపడిరి నిండిన ప్రేమతోణకులాడ
పెద్దతెల్లరునెలమి దీవించినారు.

4 ఆకాలంబున నాకు మిక్కిలిగ సాహాయ్యంబుగావించుచున్
మై కష్టంబులకోర్చి సంతసిలురామల్ పెక్కురందెక్కుడై
యేకాత్మన్ బనిసేయుముద్దుపళనిన్ హేలావతిన్ భారతిన్
శ్రీకంజాక్షుడు ప్రోచునంచు సళముంజింతింతు సద్భక్తిమై

వీరి ప్రయత్నంలో తంజాపురంస్వర్గధామమైంది. స్త్రీ సమాజంలో ఎన్నో మార్పులు వచ్చాయి.[1] ఇలా కాలంగడుస్తుండగా తన జన్మధన్యతను గూర్చి యిలా అనుకొన్నది.

తొలుతనాజనకుడు మొలపించు బీజంబు
లివలి భవమునందు నితడు పెంచ
ప్రభువు సాయపడగ వర్ధిల్లిపండెనా
భవము జగతి ధన్యభవముగాగ

ఇక తాను శేషజీవితాన్ని కానలలో గడుపనిశ్చయించింది. ఇది తల్లి దండ్రులకు రాజుకు విన్నవించింది. ఒక అయిదు సంవత్సరాలుండి మమ్మల్ని కడతేర్చిపొమ్మన్నారు. ఈవిధంగా తల్లిదండ్రుల కోరిక నెరవేర్చింది. ప్రభువు కూడ అస్తమించాడు.

వనవాసానికి నిశ్చయించుకొన్నది. రాముడు ఆరణ్యవాసానికి పోతుంటే ప్రజలెలా విలపించారో అదే విధంగా తంజావూరు ప్రజలు రోదించారు.[2] ముద్దుపళనిగూడ ఆమెననుసరించింది. అరణ్యంలో తొమ్మిదేండ్లు గడిచాయి. పళని గతించింది. ఒంటరియైంది సరస్వతి. వంద సంవత్సరాలు శ్వాసబిగించి ధ్యానంలో కాలక్షేపం చేసిన తరువాత కళ్లు తెరిచి చూచి మరల కళ్లు మూసి కొన్నది. తెలుగుతల్లి కన్పించింది. ఆమెతో తన సర్వస్వమైన కృష్ణ పరమాత్మకు సందేశం పంపుతూ మార్గోపదేశం చేసింది.

---

1 ఏ పొలతిగన్న పతిభక్తియాడుదేర
నెల్లపనులుల్లసిల్లి నిర్వహించుచుండు
నే గృహముగన్న శ్రీలక్ష్మియిల్లుగాగ
గళలలో గలకలలాడగానవచ్చు

2 మార్గాయాసముదోపదు
దుర్గపురారామవిమలతోయనదనదీ
భర్గహరిమందిరములప
వర్గప్రదపుణ్యశైలవనములుగనుచో

# మార్గనిర్దేశం

ఆదిలోనే మార్గాయాసరాహిత్యాన్ని గూర్చి వివరించింది. నీవుపోయే మార్గంలో దుర్గాలు, పురాలు, ఆరామాలు, సరస్సులు, నదీనదసమూహం, హరిహర మందిరాలు, పుణ్యశైలాలు చూస్తుంటే నీకు మార్గాయాసమేలాగుంటుంది? అన్నది.

మారుతికంటె, వాయుదేవునికంటె, గరుత్మంతునికంటె, నలుని అశ్వాల కంటె దేవవిమానంకంటె నీ మనోవేగం అధికమైనదని ప్రశంసించింది.

చోరులకు దొరకని అర్థ సంపదనీవద్దనుండగా, నీకు దారిబత్తెమొందుకని చమత్కారంగా అన్నది. ఎందరో ప్రభువులు నీకు అక్షరలక్షల కనకాభిషేకాలతో గౌరవించారు. నీ శిష్యులు, నిన్ను సేవించే జనం జగమంతా నిండియున్నారు. అని తెల్పి తెలుగు తల్లిచొరరాని ప్రదేశాలను వివరించి, ఆ తరువాత తెలుగు క్షేత్రాలు, తెలుగుతల్లి వర్థిల్లిన నగరాలు, వర్ణించింది. ప్రసిద్ధులైన ఆధునికకవులను అగ్గడించింది మూడుమూడు భాగాలుగా వర్ణించుట చేత పాఠకులకు మూడుసార్లు ప్రయాణం చేయవలసివచ్చినట్లుంటుంది. దానికి వివరణను తెలియజేస్తూ కవి సంస్పష్టత కోసం ఈ విధంగా వర్ణించానని సమర్థించారు [1]

సందేశకావ్యాలలో మార్గనిర్దేశం చేసేటపుడు చూడదగిన ప్రదేశాలు వివరించడం పరిపాటి కాని ఈ కవి ముందుగా తెలుగుతల్లి చొరరాని ప్రదేశాలనుగూర్చి చెప్పాడు. అంటే ఈ విధంగా సమాజంలోని చెడును నిరసించాడన్నమాట

---

1 ఈ పద్యమునుండి తెనుగు దేశమున గల క్షేత్రాలు అపై తెలుగువర్ధిల్లిన నగరాలు ఆవల తెలుగును వర్ధిల్లజేసిన వేయుచున్న ఆధునిక కవులు వర్ణింపబడుచున్నారు. చదువరులకు మూడుసార్లు ప్రయాణముచేయ వలసినట్లేర్పడును ఒకే ప్రయాణముతో సమస్తము వర్ణింపబూనిన చోనంత సుస్పష్టముకాదని యీ రీతిని విభజింపబడినది.

రసవత్తరమైన ప్రబంధాన్ని వినటానికి యిష్టపడని దుర్జనుని వద్దకు, విద్వాంసులను చూస్తే వెఱ్ఱియెత్తిన విధంగా బుసగొట్టే భోగివద్దకు, పుస్తకాలు దాచుకొని చదవడానికైన ఎవ్వరినికి ఈయని వానివద్దకు, మూర్ఖులకు విద్యనేర్పే మూర్ఖునివద్దకు పోవద్దు.

హీనులను నమ్మి విజ్ఞులతో చెలిమి విడిచినవారు, ఇతరుల కృతులు తమ పేరుతో ప్రకటించి మోసగించువారు, పండితుల యింట్లో భుజించి చదువుకొని చివరికి ద్రోహంచేసేవారు తామే సర్వజ్ఞులమని విఱ్ఱవీగువారి వద్దకుపోవద్దు

తమ్ముతాము పొగడుకొను ధన్యమతులు
చెప్పిపొగడించుకొనునట్టి శిష్టమతులు
కలరుకలికాలమందు పెక్కండ్రువారి
గాంచినంత నీకేమిలాభించునమ్మ?
ఖదనికల బోలు విప్రులు భవనములకు
నిసుపలంబోలు క్షత్రియనిలయములకు
జలగలంబోలు వైశ్యుల సదనములకు
దారితప్పియు పోవంగ తగదు తల్లి

**నిమ్నజాతుల ప్రస్తావన .**

శూద్రులనుమాత్రం జాలిదలచి ఆశీర్వదించమన్నది అచ్చతెలుగుయాసతో మాట్లాడేయేనాది, చెంచు, కోయలను దీవించి పొమ్మన్నది

చివరిగా ఈ దేశసౌభాగ్యాన్ని నాశనంచేసి జాతిని నిర్వీర్యంచేసే లోక విద్రోహుల్ని ఏమాత్రం చేరవద్దు అని విన్నవించుకొన్నది

ఈ మాటలలో ఈ దేశం, ఈ జాతిలోని అట్టడుగు వర్గాలపై కవికిగల అభిమానం వ్యక్తంకావడమేగాక విద్రోహులు, కుటిలురపై నైచ్యభావం, వారి ముఖాలుకూడ చూడగూడదనే తీవ్రత వ్యక్తమౌతుంది

## మార్గవర్ణన

కంచి, చోళలింగపురం, శేషశైలం, శ్రీకాళహస్తి (నెల్లూరు) మంగళగిరి విజయవాడ, భద్రాద్రి, దాక్షారామం ఇత్యాదిగా దేవాలయలు ప్రసిద్ధాలైన

నగరాలు దర్శించిన తరువాత తెనుగుభాషను, సంస్కృతిని పోషించిన తంజాపురం, మధురాపురం, విక్రమపురం, కొండవీడు, ఏకశిలానగరం, రాజమహేంద్రవరాలను, విద్యలకు నిలయమైన విద్యానగరాన్ని పిఠాపురాన్ని చూచిపొమ్మని చెప్పింది

అటుతరువాత కాశీపట్టణాన్ని జేరి అయోధ్యమాయాపురిని దర్శించి, బృందావనంలో విశ్రమించి ఆ శ్రీకృష్ణుడు తిరిగిన ప్రదేశాలన్నీ చూచి శ్రీకృష్ణదర్శనం చేసికొమ్మన్నది.

ఈ ప్రయాణంలో ఆయా క్షేత్రాలలోని దైవాలు పుణ్యస్థలాలు మాత్రమే గాక అక్కడి ప్రసిద్ధులైన కవులను పండితులనుకూడ ప్రస్థావించింది.

ఆ కోవలో చిన్నయసూరి, వీరేశలింగం పంతులుగారు, రాయదుర్గపు నరసయ్య, తం.తె. పెరుమాళ్లయ్య, విమర్శకులు పూండ్ల రామకృష్ణయ్య, వేదం వేంకటరాయశాస్త్రి, ప్రముఖకవులు పద్దాది సుబ్బారాయకవి, చిలకమూర్తి లక్ష్మినరసింహంగారు, మధిర సుబ్బన్న దీక్షితులు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, తిరుపతి వేంకట కవులు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, విశ్వనాధ, జనమంచి శేషాద్రిశర్మ, మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, త్రిపురనేని రామస్వామి చౌదరి, దుగ్గిరాల బలరామకృష్ణయ, తుమ్మల సీతారామమూర్తి, దువ్వూరి రామిరెడ్డి, కొప్పరపు సోదరకవులు, కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, కట్టమంచి రామలింగారెడ్డి, ఉమరాలీషా, జాషువ, జోసెఫ్, తిక్కవరపు రామిరెడ్డి, గిడుగు వెంకట రామమూర్తి పంతులు మొదలైన ఎందరో ప్రముఖులు సముచితంగా ప్రస్తావింపబడ్డారు.

## సమకాలిక సమాజం

స్వాతంత్రోద్యమంలో కారాగారవాసం చేసినవారిని గూర్చి ఈ విధంగా ప్రశంసించారు.

దేశ దాస్య విముక్తికై తివిరి స్వసుఖ
సంపదల వీడి శ్రీకృష్ణ జన్మగృహము
చొచ్చి పెక్కుకష్టములొంది వచ్చినట్టి
త్యాగులను కాంచు మమ్మదయార్ద్రదృష్టి

## స్త్రీలశక్తి సామర్థ్యాలు

ఏలికలై రాజ్యమేలిరియువతులు
మంత్రులై వెలసిరి మహితమతులు
పడవాలులై సేన నడిపిరి ధీరలు
పోరులొనర్చిరి ధీరసతులు
కవయిత్రులై పుస్తకములు వ్రాసిరి చెలుల్
సంఘసంస్కరణముల్ జరిపినారు
బోధికలై నీతి బోధించినారలు
ఇంద్రియములు నిగ్రహించినారు
భక్తురాండ్రయి మోక్షంబు బడసినారు
మగువలెందుదక్కువగారు మగలకంటె
మనవరోపదేశికులకు ఘనతచెందు
వారిపై నిందజల్లుట వాడుకయ్యె

స్త్రీలు పురుషులకేమాత్రం తక్కువ కారని అన్నిరంగాలలోను అడుగిడి అగ్రగాములైన విధానాన్ని ఈ కవి చక్కగా వర్ణించడమేగాక స్త్రీలపై తొందరగా నిందలువేసే దుష్టులను నిందించాడు

చివరకు కావ్యనాయిక శ్రీకృష్ణునికి సందేశంపంపుతూ తన్మయురాలై అతన్ని అద్భుతంగా పొగడింది ఇంతకు పూర్వం వ్యాజనిందగావించింది. అది ప్రియురాలు తన ప్రియునికొఱకై తహతహలాడుడూ స్త్రీ సహజమైన ఈర్ష్యతో కినుకవహించి చేసిన నిందకాని ఇక్కడ నిష్కల్మషభావతో హృదయార్పణం చేసిన వనిత హృదయం వ్యక్తమౌతుంది.

ఇరువురు మువ్వురు నల్వురు నేవురారుగు
రేడుగురెనమండ్రు తోడివారు
తొమ్మండ్రు పద్గురుపదనొకండ్రు పండ్రెండు
గురు మఱి పదునలుగురు భజింప
మువ్పది ముక్కోటి యొప్పినవేలుపుల్
చిత్తంబనుచు సేవజేయుచుండ
సాలోక్యసామీప్య సారూప్యసాయుజ్య
ములవారు నిత్యసూరులు నుతింప

రత విరక్త ముక్తాలంకృతంబు మండ
పమున జిత్రసువర్ణపీఠమున బద్మ
రాగలత మేన వెలయగ బ్రథితభక్త
కల్పకమునాగ సము శ్రీకరుని గనుము

పై పద్యంలోని సంఖ్యలకు క్రమంగా అర్థాలివి.

జయవిజయులు, బ్రహ్మ-ఈశ్వరులు, శ్రీభూనీళలు, సనకసనంద సనత్కుమారసనత్సుజాతులు, సుధన్వుడు శంఖపాలుడు, హిరణ్యరోముడు, కేతుమంతుడు, పంచభూతములు, షడ్విధముక్తులు, సప్తర్షులు, అష్టవసువులు, అష్ట దిక్పాలకులు, నవవిధగణదేవతలు, విశ్వ దేవతలు ఏకాదశరుద్రులు ద్వాదశా దిత్యులు, అష్టాదశమనువులు, వీరంతా సేవిస్తుండగా వివిధరక్తముక్తాలంకృత మైన మండపంలో చిత్రసువర్ణపీఠంపై భక్తకల్పకమై ఆశీనుడైయుంటాడట.ఈ విధంగా ఆ పరమాత్మనుపాదాది కేశాంతం వర్ణించింది. కావ్యనాయిక.

సమకాలిక సమాజంలోని స్త్రీజనాభ్యుదయ సందేశత్మకంగా ఈ కావ్యం వెలుగొందుతోంది. స్త్రీలు తాత్కాలి సుకఖాలకు బానిసలుకాకూడదని, నాయిక పాత్రద్వారా కవి సందేశం. కాగా ముద్దుపళని, రంగాజమ్మ మొదలైన వారి ప్రాస్థావనచేత సమాజంలో స్త్రీలు ఎంతగా ముందడుగు వేశారో సోదహరణంగా వివరించారు.

తెలుగుభాషను, తెలుగుకవులను తన్మయులై వర్ణిస్తాడుకవి.

**తెలుగుతల్లివైభవం:-**

తాళవనస్థ కేదారంబునందున
గంటంపుమడకనుగట్టి యాహ
మనుకొండ్రలలో జల్లి యక్షర బీజములు
ఛందంపు గనిదులు చక్కదీర్చి
గ్రామమన్ వికృతంపు గలుపూడ్చి ద్రాక్షాది
పాకంబుల నమృతభాగ్యమొదవ
సుకవుల వ్యవసాయసుకృతిబండిన తృప్తి
లభియించుముక్తి ఫలంబ నీవు

నిన్ను సేవించి ధన్యులై నిఖిలజగము
మరచుచుండ్రు కవులులోకమాన్యచరిత
ఈవులభియించుపిమ్మటనేదివలయు
తెలువులకు నెలవగు తేట తెలుగుతల్లి

ఇందు తెలుగు భాషపై కవికునన్న మక్కువ వ్యక్తంకావడమేగాక సాహిత్యవ్యవసాయానికి చక్కని దృశ్యంగా రూపకల్పనచేశారు.

**తెలుగుకవులు:-**

దక్షిణాపథమును దైవాలయమ్మున
విశదభారత హేమపీఠమందు
నన్నెచోడాదులునయి హారతుల నెత్త
వేమనసద్విధుల్ విస్తరింప
కృష్ణరాయాదులు కెలననిల్చి భజింప
రామభూషణుడునీరాజ చెప్ప
ముద్దుపళని పదములుపాడినటియింప
గ్రామ్యులు కరదీపికలు ధరింప

బాలకవులుసేవలు సేయబరిఢవిల్లి
కామితజ్ఞాన మొసగుచు గన్నతల్లి
తీరుగా నన్నుగావుము తెలుగుతల్లి
సరసగుణకల్పవల్లి భాషామతల్లి

ఈ విధంగా ఆయాసందర్భాలలో తెలుగుకవులను సముచితంగా ప్రశంసి చడమే గాక మరికొందరు కవులను వారి కవిత్వాన్ని, ప్రస్తావనపూర్వకంగా నిరసించారు.

ఈ విధంగా తెనుగు సందేశం తెలుగుజాతిజీవనవైభవానికి దర్పణంగా భాసిస్తుంది స్త్రీ జనాభ్యున్నతికి మహిళలే ముందడుగు వేయాలని బోధిస్తూ విద్యాసముపార్జనాకి పాటుపడాలని హెచ్చరించారు విజ్ఞాననిలయాలైన గ్రంథాలయస్థాపనతో ధార్మిక జీవనాన్ని ప్రతివ్యక్తి గడపాలన్న సందేశాన్ని బోధించే సామాజిక స్పృహగలిగిన ఈకావ్యం తెలుగుసందేశకావ్యాల్లో విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించింది.

ఇందులో పూతలపట్టువారి పూతవ్యక్తిత్వం గోచరిస్తుంది. ముతక కద్దరు గుడ్డలు కట్టుకొని, రైతుకుటుంబంలో జన్మించి, తమిళ కర్ణాటాది భాషాపండితులై నిరంతరం కావ్యవ్యవసాయంసాగించిన శ్రీ శ్రీరాములురెడ్డిగారు అపారదేశభక్తులు కవులు భాషారాధకులు వారి ఈ సందేశకావ్యంలో స్త్రీజనానికి విశిష్టసందేశ మందించారు స్త్రీలు బిడ్డల్నికనే యంత్రాలుకారాదని, వేదకాలంనాటి మహిళల వలె బ్రహ్మచారిణులైసమాజానికి,భాషకు, సాహిత్యానికి ఎనలేని సేవ చేయాలని శ్రీరాములురెడ్డిగారి సందేశం సకల మహిళాలోకం సమాదరింపదగింది.



# మేఘదూతము

మేఘదూత రచయత శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచేత, అనేక విశ్వవిద్యాలయలచేత, ఎన్నో సాహిత్య సంస్థలచేత ప్రజలచేత సత్కారింపబడినవీరికి పండితులచే సమర్పింబడిన సరస్వతీ పుత్ర బిరుదం సార్ధకమైంది

భారతదేశంలోని పలుభాషలలో అపారపాండిత్యాన్ని గడించిన వీరు నిత్యసాహిత్య సత్యవ్రతులై తగ పరిశ్రమించారు. సరస్వతీస్వరూపిణియైన వారి పత్ని సరస్వతి సహకరించగా పెనుగొండ లక్ష్మి, శివతాండవం, గాంధీమహా ప్రస్థానం, పండరీ భాగవతం, జనప్రియరామాయణం మొదలైన ఎన్నో కృతులు కావించారు. అట్టి ప్రతిభగల్గిన సరస్వతీపుత్రుల రచనలలో ఒకటి ఈ మేఘ దూతం. ఎన్నో ముద్రణలు పొందిన గేయసందేశకావ్యమిది.

మేఘదూతమనగానే మనకు గుర్తుకు వచ్చేది కాళిదాసమేఘదూతం. ఇది ఆ మేఘదూతకు అనువాదంకాదు. దానికి అనుకరణప్రాయంగా వ్రాయ బడ్డది. దీనికి మేఘదూతమని పేరుపెట్టడానికి, దూతకావ్యరచన చేయడానికి వీరిని మక్కిలిగా ప్రభావితుని చేసింది కాళిదాసమహాకవి మేఘదూతం.

ఈ కావ్యరచనాకాలానికి దేశంలో ఒక సిద్ధాంతం ప్రచారంలోకి వచ్చింది. అది సమసమాజాన్ని కోరేసామ్యవాద సిద్ధాంతం. ఆనాటి భూస్వామ్య వ్యవస్థ మొదలైన పరిస్థిలు కారణంగా యువతరం తిరుగుబాటుచేసింది భూస్వాములు, వారితోకలసిన ప్రభుత్వం ఈ యువజనులను తీవ్రంగా అణచి వేయడానికి ప్రయత్నించటం జరిగింది. ఎందరో హతులయ్యారు. కొందరు చెఱసాలలపాలయ్యారు. ఈస్థితి కవిహృదయాన్ని ఆకర్షించిది. ధనవంతులు ధనహీనులకు మధ్య జరిగిన ఘర్షణ మేఘదూత కధకు బీజమైంది. [2]

---

1 "మహాకవి కాళిదాసుని గ్రంధనామకరణమునకు వలచి దా కవితను గూడ నా పోరనే బిలచితిని. అక్కడక్కడగొన్ని మహాకవిభావములు అతనిపై నున్నయాదరముతో దొరలేనేమో ఈ గ్రంధము కాళిదాసు మేఘదూత కనుకరణమేగాని అనువాదము గాదు"

ముందు మాటలు—పుట్టపర్తి నారాయణాచార్యులు. పుట-1.

2. గ్రంధరచయితతో ముఖాముఖి.



చెఱసాలనుండి యువజనుడు మేఘంతో

'నీ మగని జూచితిని
నిలచి యున్నాఁడ'నుము
'వచ్చున' నువేగమే తిరిగి — దానిమరు
హెచ్చరింపగ మనసు కరిగి — తనమీది
తలఁపెనాకి చోఁటఁ జెలికత్తెయనుము — నా
దినములిక దాపురించినవి — తడవేలేదనుము

— మేఘదూతము

# కావ్యకథ

తనతోటి మానవుల దైన్యమే సుఖశయ్యగా, వారి వేడినిట్టూర్పులే వింజా మరలుగా, భోగాలనుభవిస్తున్న ధనికులను చూచి పీళ్లు రాక్షసులన్నాడొక యువకుడు.

ఆ యువకునికి కూడ శరీరంలో రక్తమే ప్రవహిస్తోందిగాబట్టి ఎక్కడైనా అన్యాయాన్ని చూస్తే తీవ్రమైన ఆవేశంతో బాధపడతాడు. బ్రతుకుపై ఆశ, చావంటే భయం వాడికి కూడ ఉన్నాయి కానీ ఈ అరజాతిమనుషుల అధి కారన్ని చూచి వారి చుట్టూ తిరిగే ఈ స్వార్ధపూరితమైన లోకాన్ని చూచి, ధనిక రావణుల చేతలు చూచి ఇది అన్యాయమని ఎలుగెత్తి అరిచాడు.

అన్యాయమని పల్కడమే వాడి పాలిటి అన్యాయమైపోయింది. ధనికుల పక్షాన్ని వహించే యెదలేని శాసనం గద్దించి బెదిరించింది. వాడినిబందీని చేయ డానికి అధికారులు వచ్చారు. అతనికి ప్రాణప్రదమై అతనినే తన ప్రాణసమానం గా భావించే భార్య అధికారులకు అడ్డువచ్చింది. వాడి కన్నుల ఎదుటే వాడి ప్రియురాల్ని అధికారి తనడాకాలితో తన్నాడు. అది కుప్పగా కూలిపోయి రక్తం కక్కింది.

ఆ దృశ్యం మాచిన వాడి హృదయం భేద్యమైపోయింది మాట పెదవి దాటలేదు. వెనుదిరిగి ఒకసారి తన ప్రియురాలిని చూడనైన చూడక అధికారుల ననుసరించాడు. కారాగారంలో అంధకారంలో ఉండిపోయాడు

శాసనాలు ఆ దిక్కులేనివాణ్ణి అపరాధి అని, ఈ సమాజపు పీడకల అని, చీకటి దినదినం కొంత తినివేయగా ఈ కారాగారంలోనే చావాలని అన్నారు.

వాడు చేసిన అపరాధమేమిటని చీకట్లు ప్రశ్నించాయి చిరుచుక్కలడి గాయి. పవళ్లు ఆశ్చర్యాన్ని పొంది వెలవెలపోయి కొండకోనలతో గుసగుస లాడినాయి. ఈ ప్రశ్నకెవరిస్తారు సమాధానం

వాడు తినే సంకటిలో పురుగులు జలజలమని కదులుతున్నాయి. నరక యాతనలతో గూడిన జీవితంతో మూల్గుషంటి ఆకారంలో జీవచ్ఛవంలా జైలు జీవితాన్ని గడుపుతున్నాడు జోరీగ తంబూర సారిస్తోంది చీకటీగ రక్తం పీల్చివేస్తోంది. తలలోపేలు రామదండు అయినాయి. తనువుపై ధూళి దట్టగా

పట్టింది. వాడి శరీరం పాలకులు తిని చీకిపారేసిన ముట్టెలా తయారైంది పగలు అకలి బాధిస్తోంది రాత్రి ప్రియురాలి విరహం ఆంతకంటే బాధిస్తోంది.

పగటిపూట ఆ ఆకలికి తాళలేక రాత్రి ఎప్పుడొస్తుందనుకొంటాడు. రాత్రితాళలేక పవలెప్పుడొస్తుందనుకొంటాడు. మరణానికి నామీద జాలిలేదను కొంటూ ఏడుస్తాడు.

తనప్రియురాలు గుర్తుకు రాగానే ఆమె అందచందాలూహించి వేడి నిట్టూర్పు విడుస్తాడు తన్నుగూర్చి ఎంతగా బాధపడుతున్నదో బ్రతికుందోలేదో! పాపంశమించుగాక. నిండు బాష్పాలతో నా ప్రేమనే తలచుకొంటూఉంటుం దేమో! నన్ను మరచిపోయిందేమో అనుకొన్నాడు. విశ్వాన్ని మఱచిపోవచ్చు నేమోగాని నాప్రియురాలను మరచిపోదను కొన్నాడు నా పుట్టుకే ధనికులకు ఆహారమై కటకు రక్కసులునను కనుమూయనీలేదు. ఒక్కపండక్కి చీరతేలేదు. మురిపంతో ఒక్కరోజుకూడా ముద్దు లాడలేదు అర్ధాకలితో ఉన్నా కఱకురాళ్ల మీద శయనించినా ఒక్కనాడు కూడా బాధపడలేదు వెన్నవంటిమనసుగల వెట్టిబాగులచానను గుర్తుచేసుకుంటూ ప్రతిరోజు అన్నిరాగ్యుడుబాధపడుతుంటాడు. వాడియాతనను అంధకారపత్రంపై శోకమేశ్లోకంగాజోరీగ వ్రాసింది.

జైలు తలుపులపై ఇనుప కమ్మలపై తలవాల్చి కనుమలపి ఆకాశం వైపు చూచాడు. చంద్రుడు కనిపించాడు మనసుజలదరించింది శరీరం వణికి పోయింది. ప్రియురాల్ని తలపోసియేడ్చాడు తనవు దప్పిపోలేదు కుసుమ ఖరవాసనలతోడి గాలి పిల్చింది. హృదయం స్పందించింది. ఆవెంట కనులలో రతనాలకాంతులెగజిమ్ముతూన్న వేయిపడగల సర్పరాజులా మింటనొక మేఘం కన్పించింది

తన తనువులోని ప్రత్యణువు ఒక కుసుమంగా పూజచేసి స్వాగతం చెప్పాడు. వంశాదికాలను ప్రస్తుతించాడు. నాదొకకోరిక ఉన్నది తీర్చమన్నాడు.

మనుజులను సహాయాన్ని అర్థించనన్నాడు ఈసులేని జీసనురక్తాన్ని బలికోరింది ఈ నరజాతి. సోక్రటీసు, బుద్ధుడు. ఫిరదౌసి ఈ నరజాతి కౌర్యానికి అహంకారానిని బలైపోయారు అంటుండగా మేఘం కదిలింది. ఊరమ్మకొని వచ్చావా? ఒక్క నిమిషంమాగలేవా అని తన ప్రియురాల్ని గూర్చి యిప్పటి

తన స్థితిని వివరించాడు. మేఘం అంగీకారసూచనగా గర్జించింది ఆ యువకుడు సంతోషించాడు తన ప్రియురాలివద్దకు పోమే మార్గాన్ని వివరించాడు

చివరకు నీవు తొందరగాపోయి నీ మగని చూచాను, బ్రతికే ఉన్నాడు. వెంటనే వస్తాడనిచెప్పు. వెంటనే వచ్చి ఏమైందో తెల్పమన్నాడు. మేఘం కదిలింది. ప్రణయకుసుమాలవలె జలము వర్షించింది మేఘం గర్జించగా విన్న చిరవిరహిదౌత్యానికి అంగీకరించిందని భావించాడు చివరకు మేఘం ముందుకు సాగింది

## కావ్యగత విశేషాలు

### ఛందస్సు .

పుట్టపర్తి వారు తన కావ్యాన్ని మాత్రా ఛందస్సులో రచించారు ఆ ఛందస్సుచేత వీరి కావ్యానికొక వినూత్న శోభ చేకూరింది. వీరి మాత్రా ఛందస్సుకు ఆధారం కన్నడ భాషలోనున్న వార్ధకీషట్పది ఇది కన్నడ భాషలో మిక్కిలి ప్రాముఖ్యాన్ని వహించింది

కన్నడ దేశంలో మిక్కిలి ప్రాచుర్యంలో నున్న ఈ షట్పది దేశి సంప్రదాయానికి చెందినది. అందులో వార్ధకి షట్పది అన్నిటికంటె ముందు ప్రాచుర్యంలోకి వచ్చింది. 13వ శతాబ్దిలో రాఘువాంకుడనే కవి హరిశ్చంద్ర కావ్యాన్ని వ్రాశాడు. అప్పటినుండి ఎందరో కవులు వార్ధకీషట్పదిలో తమ రచనలుగావించారు. దాని గమనాన్ని, మార్దవాన్ని గమనించిన పుట్టపర్తివారు తెలుగులో దాని ఛాయలో మాత్రాఛందోరచనగా మేఘదూతాన్ని సృష్టించారు

## కావ్యవస్తు విశేషం

ఈ కావ్యకథా వస్తువు సామాజిక స్పృహతో కూడినది ధనికవాదాన్ని నిరసిస్తూ సాగిన సామ్యవాదోద్యమానికి ప్రతిబింబంగా కథావస్తువు నూహించవచ్చు.

ధనిక రావణులనెదిరించి నందుకు చెరసాలపాలైన యువకుడు తాను పంపబోయే దౌత్యానికై మేఘుణ్ణి ప్రార్థిస్తాడు. నరజాతిపైన తనకు నమ్మకం

లేదని, కాబట్టి నా దౌత్యాన్ని నీవు నిర్వహించమని వేడుకొన్నాడు. నరజాతిపై నమ్మకం పోవడానికి కారణం వివరిస్తూ –

మనుజులను నే గోరలేనూ శిలలైన
మనసులకు నే పాడలేనూ
ఈ సెఱుగనట్టి 'జీసస్సు' రక్తము గ్రోల
పాశవమ్ముగ మార్చె భూమినే యీ జాతి

ఈ విధంగానే సోక్రటీసును, బుద్ధుని, ఫిరదౌసి మొదలైన ప్రముఖులను ఈ నరజాతి హింసించింది. అని తెలిపి తనపై ధనస్వాములు చూపిన దౌర్జన్యానికి బాధపడ్డ యువకుడు అన్ని సమాజాలలోను అన్ని కాలాలలోను యిట్టి స్థితియే చరిత్రలో కన్పడుతోందన్నాడు. బాధాతప్తుడికి నరజాతి చరిత్ర అంతాకూడా పరపీడనపరాయణంగా భాసిస్తుంది ధనిక వాదాన్నికాదన్నందుకు చీకట్లలోకి తన్ని త్రోశారు. కడుపుకాలిన ఈ బీదవాడి కన్నీటితో సముద్రాలు పొంగి ఈ జగతులు మునిగి పోగలవని మేఘునితో అన్నాడు. కాబట్టి వీడి జీవితంలో ప్రియావిరహం ఒక భాగం మాత్రమే ఈ కావ్యంలో విరహబాధ కంటే ఎక్కువగా ధనహీనతకుకల్గే బాధలను వర్ణించాడు ఆ యువకుడు.

## మార్గనిర్దేశం

పుట్టపర్తి నారాయణాచార్యులుగారు కాళిదాస మేఘసందేశాన్ని అనుసరించి తన కావ్యాన్ని వ్రాశానన్నారు కాళిదాస కావ్యంలో మార్గనిర్దేశాని కత్యంత ప్రాధాన్యమీయబడ్డది ఈ విధంగానే ఆ కావ్యంలో కూడా మార్గనిర్దేశానికి అంతటి ప్రాధాన్యమీయబడ్డది

మేఘం పయనించే మార్గం
జజలదమా! వినవోయి!
పలికేను నీ తెరువు.

అని ప్రారంభించి ప్రయాణమార్గాన్ని వివరింప సాగాడు.

మేఘం కన్నడ దేశంలోని హంపి విజయనగరం సమీపంలోని బళ్ళారి నుండి ప్రయాణమారంభించి ఓఢ్రదేశ సమీపప్రాంతమైన విజయనగర

సమీపంలోని శ్రీకాకుళం చేరాలి. మార్గమధ్యంలో పెనుకొండ, శేషాచలం, కళసాపురం, రేనాడు, శ్రీశైలం, మార్కాపురం, కోటప్పకొండ, కొండవీడు, విజయవాడ, శ్రీకాకుళం, నాగార్జునసాగరం, ఓరుగల్లు, భువనగిరి, గోల్కొండ, నెల్లూరు, ఉదయగిరి, తెనాలి, గుంటూరు, కూచిపూడి, అద్దంకి, వేగిపట్టణం, ఏలూరు, రాజమండ్రి, భద్రాద్రి, దాక్షారామం, కోరుకొండ, అన్నవరం, సామర్ల కోట, కాకినాడ, ఏలేరు,తుని, అనకాపల్లి, సింహాచలం మీదుగా విజయనగరంచేరి సమీపంలోని శ్రీకాకుళం చేరుకోని ప్రియురాలికి సందేశమందివ్వాలి

ఈ మార్గంలో అనేక నదీనదాలు గిరిఝురులు వర్ణింపబడ్డాయి. పుణ్య క్షేత్రాలు, కవులు, పండితులు, పల్లీయులు, నాగరిక జీవనులు ప్రస్తావింప బడ్డారు. అన్యాయాలు, మోసాలు, అక్రమాలు ఎత్తిచూపబడ్డాయి. కేవలం వర్ణనయందే మనసుంచిన కవి ప్రయాణాని కనుకూలమైన మార్గాన్ని వివరించ డంలో శ్రద్ధ చూపలేదు. కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం తరువాత నాగార్జునసాగ రాన్ని తరువాత వరంగల్లును చూడమన్నాడు, తరువాత గుంటూరు వచ్చి మరలా కృష్ణాజిల్లాలోని కూచిపూడికి పొమ్మన్నాడు ఇలా ప్రయాణం చుట్టయింది.

## వర్ణనావైభవం

### కవులు కావ్యాలు:

నన్నయ, శ్రీనాధుడు, భట్టుమూర్తి, వేమన్న, మల్లంపల్లి సోమశేఖరశర్మ తిక్కన, విద్యానాధుడు, నారాయణతీర్థులు, ఎఱ్ఱన, భవభూతి, భీమకవి, ఎలేశ్వర చార్యులు ఈ కావ్యంలో ప్రస్తావించబడ్డారు.

### నన్నయ:

రాజమహేంద్రవరం పోయినపుడు గోదావరిని నన్నయను గూర్చి అడగ మంటూ –

నన్నయ్య తన కవిత
కెన్ని తపములు జేసి

తెన్గువేదము వ్రాసినాడో! తననీర
మెన్ని దినములు ద్రాగినాఁడో! మరచేవు
పృచ్ఛసేయగ; నెంగరెంతయత్నించినా
నన్నభట్టులత్రోవ నందుకొననే లేదు.

అని నన్నయభట్టుపై ఆయువకుడు అంత గౌవరవాన్ని ప్రదర్శించాడు. నన్నయమార్గం అనితరసాధ్యమని కవి భావం.

**తిక్కన:**

మనుమసిద్ధి నృపాలు
మామయగు తిక్కన
యజ్ఞవేదిక గట్టినాడు— పెన్నగ
ట్టున జన్నము హవించినాడు ఆ సోమ
యాజియజ్ఞముఫలించియాంధ్ర కవితలయందు
ఈనాడు గూడభాసించు బో రసమయము

ఈ ఆరుపాదాలున్న గేయంలో తిక్కన వ్యక్తిత్వాన్ని కవితాతత్వాన్ని కొండకు అద్దం పట్టినట్లు వివరించారు.

**భీమకవి :**

భీమకవిని గూర్చి లోకంలో ఎన్నో కథలు ప్రచారంలో ఉన్నాయి. అతని వశ్యవాక్కును గూర్చి ఇలా అన్నాడు.

తిట్లలోతిమ్మియ్య
దీవెనల బ్రహ్మయ్య
భీమకవి పోరాడినాడు రాజునే
బిచ్చగానిగ జేసినాడు యొకనాడు
కవులవాక్యమ్ములే కామధేనువు పొదుగు
కవుల వాక్యమ్ములే గవిసికొను ప్రళయాగ్ని

భీమకవిలోనున్న శాపానుగ్రహశక్తిని కవులకందరకు ఆపాదించి కవుల కొాక ఉన్నతస్థాయిని కల్పించారు

# క్షేత్రాలు - దేవతలు

## రాముడు :

తెలుగుదేశంతో రామునకు అవినాభావసంబంధముంది రామ మందిరం లేని పల్లె ఉండదు తెలుగువారి అదర్శమూర్తి రాముడు ఈ కవి రామచంద్రుని ప్రస్తావన చేసి ఇలా అన్నాడు

మఱువైన తలపైని
ముత్యాలముడితోడ
తెన్గుదేవుడు నిల్చినాడూ — రామయ్య
వాని మదివింతలకు పీడూ ఆ మూర్తి
సేవించితే చాలు చెప్పనేటికి సుఖము
నీవె చూచెదవు ఔమ్మ నెనరు మెఱపును మరచి

రామునకు తెలుగుదేశంలో ఉన్న ప్రచారాన్ని ఒక్క తెల్గుదేవుడు అన్న మాటలో ధ్వనింపజేశారు.

## వరాహనృసింహుడు .

ఆ వరాహనృసింహు
నడుగులకు మొక్కి కొ
మ్మతడు చందన దిగ్ధమూర్తీ యాటవిక
సుందరీనిభృత విరహార్తీ యెన్నిరా
జ్యమ్ములో యెలసినవి సొలసినవికాలాన
సింహాచల స్వామిచెక్కుచెదర నెలేదు

వరహనారసింహస్వామియొక్క మూర్తిని కొద్దిమాటల్లో ఒద్దికగా వర్ణించారు అంత్యప్రాస సొగసును చేకూర్చుతుంది.

## పట్టణ వర్ణన

ఓరుగల్లు ఒకప్పటి ఆంధ్ర రాజధాని అత్యంత వైభవానికి ధామంగా కాకతీయ సామ్రాజ్యంలో విలసిల్లింది దానిని వర్ణిస్తూ ఈ కవి ఇలా అన్నారు.

నాగార్జునసాగరం చూచిన తరువాత ఓరుగల్లుపోవాలి మేఘం. కొంచెం చుట్టు అయినా సంకోచింపక వెళ్లి తప్పకుండా ఓరుగల్లును దర్శించమన్నాడు. దాని విశేష మేమంటే –

చుట్టనుచుజడి సేవు
జేరంగమరచేవు
కాకతీయుల యోరుగల్లు    ఆంధ్ర చా
రిత్ర కన్యక పుట్టినిల్లూ    రుద్రమ్మ
చండీశ్వరీ దేవి జలజలా బారించె
శాత్రవుల రక్తమ్ము చెడని సేలయేరుగా

ఓరుగంటిని ఆంధ్రచరిత్ర కన్యకు పుట్టినిల్లుగా కవి భావించారు. ఆపట్టణం పేరుచెప్పగానే గుర్తుకువచ్చేది రుద్రమ్మ. ఆమెనుఅపర చండీశ్వరిగాతలపోసారు. కాళిదాస మహాకవి కూడ వక్రగమార్గమైన నా ఉజ్జయిని పొమ్మని మార్గాన్ని నిర్దేసించాడు మేఘునకు ఈ పుటపర్తి వారిమాటలు కాళిదాసును తలపిస్తున్నాయి. ఇది కాళిదాసుపై వీరికిగల భక్తిని వీరిపై కాళిదాస ప్రభావాన్ని తెలియజేస్తోంది.

## వేగిపట్టణం :

ఓరుగల్లువలె వేగీపట్టణం కూడ పూర్వం రాజధానిగా విలసిల్లింది. దాని వర్ణనమిలాగున్నది

వేగి చూడకయున్న
వెకిలివందురు నిన్ను
చాళుక్యపూర్వ నగరమ్ము    యొకనాడు
సంపదలకాలవాలమ్ము!    నేడచట
నేగుఱుతు లేకున్న నేమాయె? నా మంటి
గాలిసోకిన యెదద గదలాడు నొక పొగరె.

వేగిని చూడకపోతే వెకిలివంటారట. ఒకనాడు గొప్ప సంపదలకు అలవాలం. నేడు ఆ గాలి సోకితేచాలు పౌరుషముప్పొంగి హృదయం స్పందిస్తుంది. ఈ గేయం చదువుతుంటే విశ్వనాథవారి వేగిక్షేత్రం పద్యాలు

స్ఫురణకు వస్తాయి. 'ఈ నాదృగావృతమైన భూములలోన, ఏ శౌర్యధనులు శిక్షింపబడిరో!' అంటారు శ్రీవిశ్వనాధ [1]

## ప్రకృతి వర్ణన

### గోదావరీనది ·

నదీనదాలు గిరులు వనాలు మొదలైనవి ప్రకృతి సౌందర్యంలో భాగాలు. కవియైనవాడు ప్రకృతివర్ణన అంటే పరవశించిపోతాడు. ఈ కవి –

కోయకన్నెలవలపు
కూతలో! కోయిలల
మ్రోతలో! దమలోనగలిసి పారగా
ముత్యాలెనీళులై వెలసీ గోదారి
నీ కెదురు వచ్చేని నాకలోకమునుండి

కోయిలల మ్రోతల్ని, కోయ కన్నెల కూతల్ని తనలో నిమిడ్చుకొని ముత్యాలే నీళ్లుగా ప్రవహిస్తుందట గోదావరి అది దివినుండి దిగివచ్చిన గంగానది వలెనున్నదట. గంగ పావిత్ర్యాన్ని గోదావరి కాపాడించటం కవిగల స్వదేశాభిమానాన్ని సూచిస్తుంది.

### కిన్నెరసాని

విశ్వనాధవారు దీనిని తెనుగింటి ఆడపడుచుగా భావించారు ఈ కవి దీనిని గూర్చి యిలా వర్ణించాడు.

హృదయమందొక ముదము
పదములందొకమదము
వింతజిల్లులబాగులాడి యెవ్వారి
కంతుజిక్కని చదురులాడీ స్వర్గంబు
నందుండి దిగివచ్చె నవనిభాగ్యముబండి
వలపునాగవసాని తెలుగు కిన్నెరసాని.

---

1 ఆంధ్రప్రశస్తి - వేగిక్షేత్రం – 4 పద్యం

ఈ గేయంలో కిన్నెరసాని వాగు వర్ణనంతోపాటు విశ్వనాథవారి కిన్నెరసాని గేయకావ్య ప్రశంసధ్వనిస్తుంది "పదములందొకమదము" "వింత జిల్లుల బాగులాడి" "యెవ్వారికంతు జిక్కని చదురుబాడి" అనే ఈ మాటల్లోని ధ్వని ఆనందజనకం.

## సమకాలిక సమాజం

భారతదేశంలోని సమస్యలన్నిటిలో బాధాకరమైనది హరిజన సమస్య. ఆ సమస్యకు ఈ కవి యిలా స్పందింస్తారు।

నిండుటాకలిదూయ
మండుటెండలుగాయ
నడపీనుగలవోలె నిలచీ శిరసుపై
గడు ధూళియును దుమ్ము బెరసీ కనబడెడు
హరిజనులపై సుంతయాదరము నీవైన
వరపరా వారినోదార్చ వారేలేరు

సమాజంలో హరిజనులైన వారిపైనున్న నిర్దయను ఈ విధంగా వ్యక్తం చేశారు నిర్ధనులకు సమాజంలో నున్న స్థితిని కూడ ఈ విధంగా తెలియజేశారు కమ్మరివాడి దౌర్భాగ్యజీవితాన్ని వివరిస్తూయిలా అన్నారు

వాడే గమ్మరివాడు
దౌర్భాగ్యములగూడు
కొలిమినూదుచున్నవాడూ తనపొట్ట
కోసమైనవయుచున్నాడూ అల్లంత
దూరాన నదెవానితొయ్యలిని గనుగొమ్ము
జీరాడు చనులతో చీరనో చనిచాన
తెలినవ్వులందముల
జిలికింప ముగముపై
పాలకై ఏడ్చుచున్నాడు బుడుతండు
పట్టుదలకెత్తికొన్నాడూ ఆ తల్లి
చనుబాలనిచ్చునో! దనయురము జీల్చిర
క్తంబులే ద్రావునో! ధనికులే మెఋగుదురు

...విదారకమైన నిర్భాగ్యతను అంతటి తీవ్రమైన మాటల్లోనే చెప్పాడు కవి. "జీరాడుచనులతో" తన యురముజీల్చి రక్తంబులే ద్రాపునో" అన్న మాటల్లో కవి తీవ్రవేదన, "ధనికులే మెఱుగుదురు" అన్న ప్రశ్నలో ధనికులపై నిరసన వ్యక్తమౌతోంది.

**పల్లియజీవ**...

పల్లెపట్టులలోని జీవనం నిర్మలం అక్కడి వ్యక్తులు కులాలతో సంబంధంలేకుండా వరుసలు కల్పుకొని పలకరించుకొంటూటారు.

'మామ'యని 'బావ'యని
మనసులోతులదడవు
వావివరుసల నెన్నికొనుమా బురుషులును
జవరాండ్రునున్గూడికొనుచూ పల్లె ప
ట్టులను బ్రదికెడు జనుల దలంచేవురా! వెఱు
పల్లెపట్టులలోని బ్రతుకు తీరేవేరు.

ఆ "మామ" "బావ" అనే మాటలలోని ఆత్మీయత ఉట్టిపడుతుంది. అట్టి పలకరింపులు, పులకరింపులు నేడు పల్లెల్లో సన్నగిలిపోతున్నాయి పూర్వం మీ కులం వేఱు, మా కులం వేఱు అని అంతరంగంలో మమతలు పంచుకొనే వారు. ఇప్పుడు కులంలేదు, మతంలేదు అందరమొకటేనని వేదికలపై ఉద్ఘాటిస్తు లోలోన కులమత ద్వేషాల్ని పెంచుకొంటు పరస్పరాపకారులౌతున్నారు. ఇది రాజకీయాలు తెచ్చిపెట్టిన విద్వేషం ఇప్పుడు పల్లెపట్టుల్లో నివాసమే చాల దుర్భరం.

## స్త్రీల వర్ణన

పల్లెలలోని స్త్రీలను వర్ణించే సమయంలో ప్రత్యేకోత్సాహాన్ని చూపిస్తాడీ కవి. పల్లెపడతులు సహజసౌందర్యానికి ప్రతిరూపాలు —

మదుడనేడు రారాజు
దురుసులేనుగు కుంభ
ములకు సైదోడులైనట్టి కుచయుగము
దుసికిళ్లుగా సొబగుగట్టి పొలమందు
సంచరించెడువాని సంగటిని గొనిపోవు
సకియలను సరకు సేయక నీవు పోయేవు

ఇందలి కల్పన అద్భుతం ఇదే విధంగా కమ్మవనితలు, కాపువడతులు, చాకితలు, మాలెతలు, గొల్లభామలు, చెంచితలు, రెడ్డివనితలు, కోయకన్నెల్ని మొదలైన వివిధ కులాల స్త్రీలను వారి స్వభావాలకు అద్దం పట్టే విధంగా వర్ణించారు. కవిలోకజ్ఞత నీ వర్ణనలు పట్టిచూపుతాయి. ఆటవికులైన లంబాడీలను, గొల్లల్ని అభివర్ణించారు వీరిపై నాగరకులు జరిపే అత్యాచారాల్ని హెచ్చరించారు.

## బ్రాహ్మణులు

కోన సీమను నీవు
గుస్తరించెడువేళ
నడుగడుగునందు గన్పించూ ఋతురాజు
నరిగొపులై వనములించూ బ్రాహ్మతే
జన్నులో-వల్లకీ స్వరముతో జట సెప్పు
విప్రులున్నారచట వేలాదిగానేడు
పచ్చపచ్చగజెలగి
ముచ్చటల మూటలగ
తీరభూముల దిరుగుచుంద్రూ వేదముల
ప్రోవులనగావెలయుచుంద్రూ బ్రాహ్మణులు
నొసటమూడవకన్ను లసదైనహాలాహల
మును బ్రమింగరో!యష్టతనువులను దిరుగరో!

బ్రహ్మ తేజోమయులైన బ్రాహ్మణుల్ని శివస్వరూపులుగా నొసటనున్న కుంకుమ మూడవకన్నుగా వర్ణించారీ కవి. ఈ విధంగా సమకాలిక సమాజ చిత్రణలో అనేక సందేశ కావ్యకర్తలకంటె చాలా ముందుకు పోయారు.

ఈ విధంగానే, స్త్రీల చదువులు, ఆంగ్లవిద్య నిరసనం మొదలైన వానిని ప్రస్తావించడమేగాక తన నాటి పరిస్థితులను గూడ వ్యక్తంచేశారు

## మతం

"మతమమృతమైనదే
దురభిమానావిష్టమునగాక
అదియె హాలాహలంబావేశ కలుషితము"

మతం అమృతతుందిలమైనది ఆ మతమే దురభిమానావిష్టమైనదైతే హాలాహలం లాంటిది. ఆనాడు శైవులు జైనమతాన్ని నాశనం చేసిన విధానాన్ని ఈ విధంగా వర్ణిస్తారు.

జైనరచనలగాల్చి
సంతోషపడిరట
శాక్తులును శైవులును నాడూ విజ్ఞాన
నాశమైపోయినది చూడూ వారి కడు
పులనురేగిన చిచ్చు కలచినది రాజ్యమ్ము
కలగినది భావమ్ము తలగినది జీవకళ

మతదురహంకారం దేశానికింతకీడు తెచ్చి పెట్టింది అంతేగాక ఈ దేశ చరిత్రలో 'మతపిచ్చి' రక్తదాహం తీర్చుకొన్నది

'మతమంట' మతమొక్క
మారియై బట్టినది
మతిలేని రాజవర్గంబూ వారిస
మ్మతికి జచ్చినది సైన్యంబూ హృదయాన
గరుణకరవైయున్న నరులకెక్కడి మతము?
పరపీడనమె దేశచరితలకు మూలంబు

కుడిచి కూర్చొనలేక
కడుదుర్మదించెనని
యాబోతులై నిల్చినారు గ్రుమ్మికొన
నా ప్రక్క నీ ప్రక్కటారూ 'మతపిచ్చి'
ఈ దేశచరితలో నెంతపనిజేసెరా!
ప్రతిపదంబున మెయిబారె రక్తనరాలు

మతమౌఢ్యంవల్ల యుద్ధాలు సంభవించాయి. కరుణలేని మనుషుల బుద్ధి కెక్కిన మతం పరపీడనయే వ్రతంగా దావానలంలా వ్యాపించి రాజ్యాలనాశ నానికి కారణమైంది. పరపీడనమే దేశచరితకు మూలమనే స్థితికి తెచ్చింది.

ఇక ఈ కవి వర్ణనల్లో తాడిచెట్లు మొదలైన వృక్షసంపద వృషభాలు లేళ్లు మొదలైన జంతువులు తగురీతిని చోటుచేసికొన్నాయి.

చరిత్రను విశ్లేషించడంలో ఈ కవి తనప్రత్యేక నైపుణ్యాన్ని ప్రదర్శిం చారు ఈ కవి మార్గవర్ణన సమగ్రమై ఆంధ్రావని సమ్యక్ స్వరూప సౌంద ర్యాన్ని సందర్శింపజేస్తుంది

## కాళిదాస ప్రభావం

కథా స్వీకారంలో గాని పేరు పెట్టడంలోగాని, వర్ణనావిధానంలోగాని, కథా కథనంలోగాని అంతటా కాళిదాసు ప్రభావమే కావ్యంలో కన్పిస్తుంది. ఆ ప్రభావాన్నుంచి తప్పించుకోలేని ఈకవి తన ప్రియురాల్ని గూర్చి ఆనవాలు చెబుతూ ఆమె ఉండే గుడిసె వాకిట్లో రెండు మందారపు మొక్కలున్నా యన్నాడు

సుందరమ్ములు చెలగు
మందారములు రెండు
మా పూరి గుడిసె మున్ముందూ అదియొకటే
మారిపోవని గురుతందూ తానగుచు
జలములను బోయు నాసరసాంగివానికై
ప్రణయసాక్షులని మనసులో చెలినెంచి[1]

---

[1] హస్తప్రాప్య స్తబక నమతో బాలమందారవృక్షః 2 – 14

కాళిదాసు ఒక మందారం ఉన్నదంటే ఈ కవి దాన్ని రెట్టింపు చేశాడు. అంతేగాక మేఘుని పొగడ్తలోను కాళిదాస ప్రభావమే[1]

"హనుమంతుడొక్క నాడార్ద్రి హృదయుడు మాత
నీవొకడ వీనేడు నెనరుగల్గిన దూత"

ఈ విధంగా కాళిదాస మహాకవి గూడ హనుమంతుని ప్రస్తావన చేశాడు. వీర, కరుణ, శృంగార రసాల సరస సమ్మేళనంగా సామాజిక ప్రయోజనాభి లాషతో పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, సంపూర్ణ సందేశ కావ్యలక్షణాలకు సరియైన ఉదాహరణంగా మేఘదూతాన్ని స్వతంత్ర కావ్యంగా సృష్టించారు

ఇందులో సరస్వతీ పుత్రుల బహుదేశాటనం, బహుశ్రుతులతో నిరంతర సాంగత్యం సరసంగా గోచరిస్తుంది వారికిగల అపారచరిత్ర పరిజ్ఞానాన్ని ఈ కావ్యం పట్టి చూపుతుంది ఆంధ్రుల చరిత్రను, సంస్కృతిని రంగరించి రసాత్మకంగా ఈ కావ్యాన్ని తీర్చిదిద్దారు శ్రీమాన్ ఆచార్యులవారు ఆంధ్రజాతి ఆబాలగోపాలం ఆనందాతిరేకంగా చదువుకోని దాచుకోవలసిన కావ్యమిది. దీన్ని ఆయాచోట్ల తగిన చిత్రాలతో అధోజ్ఞాపికల్లోనేపథ్యాన్ని తగినరీతిని ప్రపంచించి సుందరంగా ముద్రించి, డిగ్రీతరగగతి విద్యార్థులకు అవశ్య పఠనీయ కావ్యాంకావిస్తే, ఆంధ్రజాతి జీవం జరాలను రసమార్గంలో అందించి నట్లౌతుంది. అటువంటి బాధ్యతను తెలుగువిశ్వవిద్యాలయం స్వీకరించాలి

మేఘసందేశకావ్యాన్ని బాగా అవగాహనచేసుకొన్న మనీషతో ఈ మేఘ దూతకావ్యం విరచించబడింది అయితే అందులోని ధ్వనివైభవమిందులో కనిపిం చదు వాచ్యార్థమే అధికం అంతా ఆశుధోరణిలా చెప్పినట్లనిపిస్తుంది. ప్రేమాను రాగాల ఆర్ద్రతకన్న, మార్గవర్ణనమే యిందులో అధికప్రాముఖ్యం వహించింది.

—o—

1 ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీవోన్ముఖీ సా 2 – 39

# శుకసందేశము

ఈశుక సందేశకావ్య రచయత కందుకూరి వీరబసవరాజుగారు ఉభయ భాషా ప్రవీణులు కొవ్వూరులోని ఓరియంటల్ కళాశాలలో బహుకాలం అధ్యాపకులుగా పనిచేశారు

తన కావ్యం భారతీయ సంస్కృతికి మూలకందమై జగజ్జేగీయమానమై వర్ధిల్లిన బ్రాహ్మణ ధర్మమునకు పునరుజ్జీవనోద్దిష్టమైన ప్రబోధం కాగలదని ఈ రచయత భావించాడు.

## కావ్యకథ

ఈ సమాజంలో ప్రాచీన వైభవం ప్రియమై అనుకరణ భావంతో పతనావస్థను పొందుతున్న దీనికి మిక్కిలి విచారాన్ని పొందిన ఒక వ్యక్తి ఈ స్థితిని సృష్టికారుడైన బ్రహ్మకు నివేదించాలనుకొన్నాడు.

సమీపవర్తియైన శుకాన్ని చూచి కుశల ప్రశ్నలు వేసి దూరంగా మామిడి చెట్ల గుబురుల్లో దాక్కొని మాకు అందరాని విధంగా సంచరించడానికి కారణ మేమిటి? అని అడిగాడు తరువాత చిలుకయొక్క సౌందర్య, కంఠమాధుర్యం మొదలైన విషయాలను గూర్చి పొగడి ద్విజత్వము కలిగి అపురూపమైన రూపు కలిగి రసమొలికే ముద్దుపల్కులుగల నీకు ఈకోటరంపుచాటు మాటులెందుకు? అని ప్రశ్నించి వానివంశాదికాలను పొగడి తన సందేశాన్ని గూర్చి ఈ విధంగా తెలియజేశాడు

"దైవవశంచే నీవు నాకు తారసపడ్డావు ఎన్నాళ్లనుండో నా మనసులోని భావాలు బ్రహ్మదేవునితో చెప్పుకోవాలనేకోరిక ఉన్నది. శుకముఖాన పంపిస్తే బాగుంటుందని నాకనిపిస్తున్నది. నేను చెప్పే మాటలు విను.

నా మాటలు లోక సంగ్రహకారకాలైనవి నీవు నిర్వహించే సందేశం వల్ల నీవు తరిస్తావు. లోకాన్ని ధార్మికతనుండి పతనం కాకుండా చేయగలవు. నీవు వెంటనే పోయి బ్రహ్మవరాన్ని పొందిరావాలి నావనికి నడుంకట్టు నా మాటలు విను అని తన సందేశాన్ని వినిపించి అనంతరం మార్గాన్ని తెలియజేశాడు.



"విప్రశేఖరిష్ఠుడు శుకముతో"

దైవవశమున నీతోడ దారసిలితి
నెన్నినాళ్ళుగ నాలోననున్నచింత
శుకముఖంబున సందేశ సుకరమనుచు
జెప్పుచుంటిని వినుము నీ జిత్తమలర
నా హితోక్తులు లోక సంగ్రాహకములు
నీవు దరియింతు లోకంబు నిలుపగలవు
బ్రహ్మవరసిద్ధి బొందిరా వలయువేగ
నడుము కట్టుము వినుచిల్క నాదుబోధ

ప్రజలకు బ్రహ్మధర్మ పరివర్తన గల్గిననాడె భూమిపై
యజనము యాజనమ్ము పురుషార్థములున్ సమకూరు దేవతా
వ్రజము ప్రసన్నమై జగమువర్ధిలజేయు శుకాధినాధ యా
యజుని యనుగ్రహైక వశ మవ్వర మెట్లది గల్గ జూచెదో

– శుకసందేశము

ఈ మార్గనిర్దేశంలో భూలోకం నుండి బ్రహ్మలోకం వరకు మధ్యలో గల స్వరాది లోకాలను ఆలోకాలలోని విశేషాలను వివరించి బ్రహ్మలోకంలో ముందు శ్రీశుకమహర్షిని కలిసి తానువచ్చినవనిని, సవిస్తరంగా వినిపించి అతని సహాయంతో చతుర్ముఖుని దర్శనంచేసుకొని జన్మధన్యతను పొందు" అన్నాడు.

అనిర్వచనీయమైన ఆ బ్రహ్మదర్శనానందాన్ని పొందుతున్నంతలో కనులు మూసి తెరిచేసరికి మరల ఈ గున్నమావి కొమ్మపై నిలచియుండగలవు నీ యెదుట నీకొఱకై వేచియున్న నేస్తమై నన్ను చూచి నీయాత్రావిశేషాలను వివరింపగలవు

ఆనాటి నుండి నీకు దివ్యత్వం సిద్ధిస్తుంది ప్రజలంతా నిన్ను విహంగ రాజ్యపదనేతగాను దుష్కలి దోష దూషితాపన్న శరణ్యునిగాను భావించి బ్రహ్మరథం పడతారు.

నీవు తిరిగి వచ్చేంత వరకు ఇక్కడే పూల దండలు మంగళ హారతులు మేళతాళాలు కాహళులు కాగడాలు మాగధులు, కవులు మొదలైన వారిని తెచ్చి ఇక్కడే ఉంటాను

ఇక్కడి తీర్థం శుకతీర్థమనే పేర ప్రసిద్ధమౌతుంది. బ్రహ్మర్షులంతా నైమిశాదులవలె పుణ్యమైన ఆశ్రమంగా భావించి ఇక్కడికి వస్తారు నిత్యబ్రహ్మోపదేశక్షేత్రంగా మారుతుంది ఈ క్షేత్రం నీవు ఈ క్షేత్రానికి ఆది దేవత వౌతావు.

నాయీ చిన్ని గ్రంథాన్ని క్షేత్ర మహాత్మ్యమంటారు నాకు అభినవ వ్యాసుడనే కీర్తి ప్రాప్తిస్తుంది" అని రచయిత తన సందేశాన్ని లోకోపకారమైన దానిని చిల్కచే పంపించాడు.

## కావ్యగత విశేషాలు

ఈ కావ్యం సంపూర్ణ సందేశకావ్య లక్షణాలు కల్గినది శుకాన్ని దూతగా గ్రహించడం. దానిని సుగుణరాసిగా ఉత్తమచరిత్రగలదిగా పొగడడం, తన ఆవేదనను వ్యక్తం చేసి తన సందేశంగా బ్రహ్మకు పంపడం, బ్రహ్మలోకానికి పోయే మార్గాన్ని వివరించడం, ఇవి ఈ సందేశ కావ్యలోని లక్షణాలు.

ఈ కవి తన ప్రజ్ఞచేత ఈ కావ్యాన్ని ఉత్తమ కావ్యంగా తీర్చిదిద్దాడు

**దూత :**

శుకాన్ని దూతగా నిర్ణయించి సందేశాన్ని పంపడానికుద్యమించిన కవి దానికి దూతకార్యంపై ఆసక్తి కల్గించడానికా అన్న విధంగా కుఱ్ఱతనపు వెఱ్ఱితో మట్టితొఱ్ఱయేస్వర్గంగా భావించి బొఱ్ఱనింపుకొంటూ కాలక్షేపం చేయడం తగదు. మానసిక పరిపక్వస్థితిని పొంది మోక్షపరంపై బుద్ధినిల్పాలి అని హితాన్ని పల్కుతూ ఈ విధంగా అన్నాడు.

**దూత్యం—**

కావ్యరచనకువలె సుమ్ము కార్యరచన
నరయనుపక్రమోపసంహార కలన
మాట తేటయు సరస సంభాషణంబు
నౌచితియెఱుంగుచో కృతి యాచనెగడు

దూత్య నిర్వహణంలో దూత కుండవలసిన నేర్పును గూర్చి వివరిస్తూ దూత కార్యరచన కావ్యరచనతో పోల్చి దూత స్వభావాన్ని సంగ్రహంగా వివరించాడు.

అజునిన్ గన్గొని విప్రవర్ధకుడ వై హంసానురూపస్థితిన్
ద్విజతాసిద్ధిగ భూత దేవతను వృత్తిన్ బొంది పూజ్యుండవై
ప్రజకున్ బ్రహ్మపద ప్రదర్శకుడవై భాసింపగారాదె యీ
కుజమే స్వర్గము గూడు బ్రహ్మపదమెక్కొ మూఢనీ రోద్భవా?

ఈ కవి మాటలు కేవలం చిల్కను గూర్చియేగాదు సంసార పంజరంలో స్వార్ధచింతనతో కూడిన ప్రతివ్యక్తికి దాన్ని వీడి సమాజ చింతనతో పరోప కారమనే పుణ్యాన్ని పొంది తద్వారా స్వర్గసుఖాలనుభవించమని ఉపదేశం.

## మార్గనిర్దేశం

కావ్యాలలో సందేశాలింతవఱకు కైలాసం వఱకు పంపడం జరిగింది కాని ఈ కావ్యంలో చిలుకపోవలసిన గమ్యం బ్రహ్మలోకం. ఈ మధ్యలో

ఎన్నోలోకాలున్నాయి. అవి క్రమంగా ఈ కవిచే వర్ణించబడినాయి. వాటి క్రమమిది, భూలోకం, భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జనోలోకం, తపోలోకం, సత్యలోకం

**భూలోకం:**

భూమి.లొలిమెట్టు సుమ్మూర్ధ్వ భువనములకు
ఇంటగెల్చిరచ్చగెల్చు నిరవుదోప
ముందుగా నిండుపున్నెంబు మూటగట్టి
కొనిన వానికి శ్రేయముల్ కొంగుముడులు

భూలోకంలో అక్రమ జీవనులైనవారికి ఊర్ధ్వలోకాలు అలభ్యాలు. కాబట్టి తొలి మెట్టయిన భూలోకంలో జాగరూకత వహించి మోక్షయత్నం చేయాలి అంటాడు కవి.

**భువర్లోకం:**

భువనమనగ నీవు విహరించు పుంతపొంత
గలదులోకంబు నంతరిక్షంబునదియె
చంద్రసూర్యగ్రహసంచార పథము
దేవగంధర్వమిథున భోగావసథము

భువర్లోకంభోగభూమి. చంద్ర సూర్యగ్రహసంచార పథం. దేవగంధర్వ మిథున నివాసస్థానం.

**స్వర్లోకం:**

ఆపై స్వర్గ జగత్తు కర్మఫలితాయుత్తంబులౌ సౌఖ్యముల్
చేపట్టన్ జనువారు పుణ్యఫలముల్ సెల్లందిగంజారువా
రెప్పట్టొందునొ ఎట్టిపాట్లుగలవొయింకంచు జింతించువా
రైపోకారెడి జీవికోటిగని జిల్కామానుమీ కామ్యముల్

పుణ్యకర్మలవల్ల స్వర్గసౌఖ్యాలు లభిస్తాయి పుణ్యఫలమెంతవరకో అంత అనుభవించి జారిపోతారు వాళ్లనుచూచి కామ్యాలు మానుకో పితరులు భువర్లోకానికి అంచున స్వర్గంలో సంచరిస్తూ తమ పుత్రులిచ్చే తర్పణాల కోసం క్రిందికి చూస్తుంటారు వారికి మ్రొక్కి ముందుకుపో అక్కడ కన్పించే నీ పితరుల ఆశీస్సులను పొంది లోక కార్యార్థివై ముందుకు పోతున్నాడు

ఇంకా స్వర్గానికి సంబంధించిన విశేషాలను వ్యక్తంచేస్తూ స్వర్గసుఖాలను అనుభవిస్తున్నా భూలోకంలోని తన సంసారాన్ని తలచుకొని అసంపూర్తిగా వదలిన గృహభారాన్ని తలచుకొంటూ భారంగాని నిట్టూర్చే సోమయాజుల స్వభావాన్ని వర్ణించాడు. అల్పమైన పుణ్యఫలానికే స్వర్గసుఖం ప్రాప్తమై అను అనుభవిస్తూ త్వరలో ముగియగల అసుఖాన్ని తలుచుకొని జీవితమంతా పుణ్య కార్యాలకై వ్యయం చేయకపోవడాన్ని గూర్చి బాధపడే వారిని గూర్చి కూడా వర్ణించాడు.

**మహర్లోకం:**

ఆ పయినిన్ మహర్భువన మత్రివశిష్టమరీచి ముఖ్యులౌ
తాపసులేడ్గురున్నిలుచు తావు ప్రజాపతులాదికారిక
వ్యాపృతిమాని కల్పకమితాయువులై యటునుంద్రువారు మీ
మీవైపును జాడలైన నభివాదమొనర్పుము చిల్కమేలగున్

మహర్లోకం అత్రి మొదలైన ఋషులకు నిలయం దాన్ని చక్కగా వివరించారీ పద్యంలో

**జనోలోకం .**

జనలోకంబును గాంతువా పయినిటన్ స్వాయంభువుండాదిగా
మునువుల్ బుట్టిరిగాననద్దిజన నా మంబందెనెందుందు రా
మను వస్వాది జగత్ప్రివర్తకులు ధర్మస్థాపనాచార్యులున్
మునుమున్ మ్రొక్కి జగంబు వర్ధిలు వరంబున్ గోరుమూకీరమా

స్మృతికర్త మనువు మొదలైన వారు జనోలోకవాసులు వారి ధార్మికోపదేశాలకు నేడు ముప్పువాటిల్లింది ఈ లోకంలో మరలావారునుడివిన ధర్మం వర్ధిల్లే విధంగా ఆశీర్వచనాన్ని పొందమని కవిభావం

**తపోలోకం :**

చెంతన్‌గాననగున్‌దపోజగతినిశ్శ్రేయో ముఖద్వారమై
దంతోలూఖలులశ్మకుంటుకులు సిద్ధర్షిబ్రహ్మచర్యోంఛనా
శ్రాలాభ్యాసకులెల్ల నిష్టనిలపై సాధించి మోక్షేచ్ఛ గ
ల్పాంతంబందువసింతురిదీవనల జిల్కాపొందుమవ్వారిచేన్

నిరంతర తపశ్చర్యామగ్నులైనవారికి నివాసం తపోలోకం ఆ తాపసుల నుండి దీవనలంది ముందుకు నడవమంటాడు చిల్కాను.

**సత్యలోకం :**

ఆవల సత్యలోక మదియన్నది కవ్యలిభూమిప్రాకృతున్
జీవులుపొందరా నిదటుచేరిన జీవిపునర్భవాపదన్
బోవడు బ్రహ్మకల్పమును ముక్తుల గూడి విరించి గొల్చి తా
నావల నిర్వికల్ప పరమాత్మ పదంబును బొందుకీరమా
అచ్చటనేవసింత్రు చతురాస్యుడు వాణియు తెల్లదమ్మి పూ
రచ్చను దమ్మిగద్దెను సురర్షిగణంబులు ముక్త జీవుల
త్యుచ్చరవంబులన్ శ్రుతిగతోపనిషద్వినుతుల్ పఠింపగా
మెచ్చుచు సృష్టికార్యముల మెల్పుల దెల్పుచునుంద్రువారటన్

శాశ్వత ముక్తి సంధాయకమైనలోకం సత్యలోకం అటునుండి నిర్వికల్ప సమాధే ప్రాప్తిస్తుంది. అని సరస్వతి చతుర్ముఖులను, అక్కడి దేవతాగణాలను ముక్తికొఱకు బ్రహ్మలోకం చేరిన సిద్ధులను గూర్చి అద్భుతంగా వర్ణించాడు ఈ కవి.

## సందేశం

బ్రహ్మసర్వజ్ఞుడు శుకంపోయి బ్రహ్మకు ప్రత్యేకంగా వివరించవలసినది లేదు ఈ ఔచిత్యాన్ని గుర్తించిన కవి శుకాన్ని తాను చెప్పవలసిన విషయాలన్నీ బ్రహ్మలోక నివాసియైన శుక మహర్షిని దర్శించి అతనికి వివరించమన్నాడు. ఆ చెప్పే విషయాల్లో సందేశాన్ని పంపేవాని ఆవేదనవేగాక విబుక తన సమస్యలను కూడ చెప్పుకోవాలి.

పొరుగువాడను గడు దూరభూమియందు
నగుపడిన గల్గుగడు వింతయాదరంబు
బహుయుగంబులనాటి మీ ప్రాతచుట్ట
ఱిక మెఱింగిన బొంగడే శుకవరుండు

దేశాంతరంలో మన పొరుగువాడు కన్పడితే ఎంతో ఆనందం కల్గుతుంది. అదే విధంగా ఎన్నోయుగాలనాటి మీ ప్రాతచుట్టరికాన్ని తెలుసుకొన్న శుకుడు ఎంతగానో పొంగిపోతాడు ఆ ఆనందంలో నీక్షేమ సమాచారాలను గూర్చి ప్రశ్నిస్తాడు అపుడు ప్రసక్తంగా నీ సందేశాన్ని వినిపించమన్నాడు కవి.

ఒక శుకయోగికైవల్యం పొందడం చేత అతని పేరు చెప్పుకొని మేము గొప్పవారమని బ్రతకడంగా ఉన్నది నేడు. భూలోకంలో మా బాధలు చెప్ప నలవి కానివి మామిడికాయలు పక్వానికి రాగానే మా నోటి కందకుండారాలి పోతున్నాయి ఫలవంతమైన తోటలను కాపులు ఒక్క రోజుకూడ ఉండనీయడం లేదు రైతులు మంచెపై నొడిసెలతో కూర్చుని మమ్మల్ని వాలనీయక పొలాల్ని కాచుకొంటున్నారు డేగల బాధలు పడలేకున్నాము మా పిల్లలు గూళ్లలో ఉంటే వేటగాడు మూట గట్టుకొనిపోతున్నాడు. ఈ విధంగా ఉన్నాయి మా బ్రతుకులు కాయోపండో నోటి కందించి పంజరంలో పెట్టి మాపల్కులతో వినోదిస్తున్నారు కొందరు.

అణిమయేగాని మా శక్తినణిగె మహిమ
లఘిమయేగాని గరిమగల్గదుకులాన
వట్టి ప్రాకామ్యమేగాని ప్రాప్తి లేదు
వశతయేగాని ఈశత్వ దశయెఱుగము

ఈ విధంగా తనగోడు చెప్పిన తరువాత నేటి బ్రాహ్మణజాతి స్థితిని గూర్చి కొంత వివరించమన్నాడు.

ఓ శుకవర! విరక్తుడవై యిక్కడనున్న నీ వద్దకువచ్చి మనవారి దుర్గతిని వివరించడానికి యింతదూరం వచ్చానని కోపగించవద్దు. నే చెప్పిన విషయాలన్నీ వాణీ చతుర్ముఖులకు విన్నవించి మమ్ముల్ని సద్గతికి చేర్చేవరాన్ని అతనిచేత ప్రసాదింపచేయి.

మీ కాలంలో ఆశ్రమాలు విద్యాదానానికి నిలయాలు కావడమేగాక విహంగతతికి వ్యాసంగాన్ని చేకూర్చేవి. కానీ ఈనాడు వ్యాపార కేంద్రాలైనాయి. మేధావులు విద్యావ్యాపారాన్ని చేస్తున్నారు.

విద్యాదానం చేయవలసిన బ్రాహ్మణుల స్థితి ఇంత నైచ్యంగా తయారైంది. మందుగుండులేని తుపాకులవలె యోగహీనులై బ్రతుకుతున్నారు. ఆర్యులు బ్రాహ్మణధర్మాన్ని బోధించి అనుసరించి జంతుతతిలోని సహజవైరాన్ని కూడ దూరంచేసి భూమిపై శాంతిసౌఖ్యాలను నెలకొల్పారు అట్టి బ్రహ్మధర్మం నేడు పతనమైపోయింది

వేదములు నేర్వబోవ నిర్వేదమయ్యె
యజ్ఞములు సేయబోవ నవజ్ఞ గలిగె
యోగసాధనకు నవయోగమబ్బె
దూసుతుడు రామచిల్కయు బూతులైరి

అఖిలజగతికి ఆధారభూతులైన దేవతలు మంత్రవశులు. ఆ మంత్రాలు బ్రహ్మణాధీనాలు. కాబట్టి బ్రాహ్మణుడు దైవసమానుడన్నటి నిన్నటిమాట. మరి నేడు బ్రాహ్మణులు దైవదూషణలు సామాన్యాలైపోయినాయి. బ్రాహ్మణుడే ఈ విధంగా పతనమైతే క్షత్రియ వైశ్యశూద్రుల సంగతి చెప్పవలసినదేమున్నది?

పురాణాలను పుక్కిటి పురాణాలని ఛాందసాలనీ అవి ఏమీ చేతకాని దుర్నీతిని బోధిస్తాయని, ఇవి పైపై పూతలవంటివని ఈ బ్రాహ్మధర్మాన్ని ప్రజలు తూలనాడుతున్నారని చిలుకను శుకమహర్షికి తెలియజేయమన్నాడు.

## బ్రహ్మకర్తవ్యం

స్థిరమై వర్ధిల బ్రాహ్మధర్మము సముజ్జీవంబుగా జేయుచో
నరులన్యోన్యవినీల వర్తనము పుణ్యప్రాపణ్యంబన
శ్వరమౌ బ్రహ్మమయత్వభావనయు సర్వప్రాణి సంరక్షయున్
జరుపన్ జూతురు ఆర్యగాదులకు సుస్వాస్థ్యంబు చేకూరెడిన్

బ్రహ్మధర్మం వర్థిలజేయడం బ్రహ్మకు అవశ్యకర్తవ్యం. దానివెంట యజయాగాది క్రతువులు నిర్విఘ్నంగా కొనసాగుతాయి పురుషార్థాలు సమ

ఉపార్జితాయి. ఇవి అన్నీ కూడా బ్రహ్మ అనుగ్రహం చేత లభ్యమయ్యేవని వివరించాడు.

ఈ సందేశంలో ఈ సమాజం నిర్వీర్యమై పతనావస్థలో కూడి ఉండటానికి మూలకారణాన్ని వివరించడం జరిగింది. బ్రాహ్మధర్మ పునరుజ్జీవనమైతే సమాజం ప్రాచీన వైభవాన్ని సంతరించుకొంటుంది. స్వార్థచింతనాపూరితమైంది గాక సమాజ సంక్షేమం ఈతని భావనయందున్నది.

## వర్ణనా వైభవం

సోమయాగం చేస్తే స్వర్గం లభిస్తుంది. ఆ విధంగా సోమయాగం చేసి స్వర్గాన్ని పొందిన ఒక మహానుభావుడు తన పూర్వ స్థితిని మరువలేక వగచిన విధానాన్ని ఇలా వర్ణించారు

సామిధేనిపరాంతు క్షణమంటకుమునున్న
వాలులేఖ్యామనీసరస్సమునుచు
కస్తూరి జవ్వాదిగంపు గొప్పేగాని
కమ్మనిహోమపుపొడికదవె యిచట
శషభిషలెరుగని సాధువూ వానినే
చిక్కుపెట్టెనొ దర్భచేను రైతు
ఈపాటికేడీతవనును గరియావు
ఇష్టికింటను కుంభ వృష్టిపాలు
సోమిదమ్మ గతించెనో శోకమొంది
బిడ్డలేమైరోయని కాంక్షవీడలేక
యజ్ఞఫలభుక్తికై స్వర్గమధిగమించి
చింతలొందును సోమయాజియనుజిలుక..

ఇంతలో యజ్ఞయాగాదిక్రతువులు నిర్వహించే నైష్ఠికుని గృహాన్ని చక్కగా వర్ణించారు.

## సత్యలోకంలోని ప్రకృతి :

మందయానముగాదు మానసానంచైక
యానంబులనలవర్చు నచటి యంచ
ముద్దుమాటలుగావు ముక్తి కాంతారహ
స్యాప్తవాక్యములాడునచటిచిలుక
చిలుక కొట్టులుగావు శిష్టయాగహవిష్య
భోక్తృభోగ్యములట బుట్టుఫలము
లెగిరిపాటులుగాలప్రగతి నిశ్శ్రేణికా
భ్యస్త నిశ్శ్రేయసం బచటియునికి

కాకిమూకలుగా వీట కలసిమెలగ
బ్రహ్మచర్యాభరతులైన పరమహంస
లచటి జీవులు కడుపె కైలాసమనరు
ఉభయలోకసిద్ధులకిది యునికి పట్టు

ఈ సత్యలోకవర్ణనలో అందలి అణుఅణువునాగల పావిత్ర్యాన్ని కన్నులకు కట్టునట్లుగా వర్ణించారు కవి.

## శుకమహర్షివర్ణన:

కావ్యాతురుండవైకలయర్థమత్యుక్తి
నాడకు మతడఖిలార్థవేది
ఆత్మలోద్ధరణార్థమన్యుల నెంత
నలుపకు మాతడుసత్వసముడు
చుట్టరికపు బేర్మి నూపిలోగొనుచింత
వదులుమాతడు సంగవర్జితుండు
బ్రహ్మసేవాపరత్వము వేళ బల్కకు
నియమంబుదొలగ నిష్ఠపరుడు

దేమ మర్యాదలందారితేరె నతడు
మూఢలౌకిక గుణబద్ధబుద్ధినీవు
దేశకాలపాత్రౌచితిదెలిసి మెలిగి
చిలుకశుకనాధుకారుణ్యఫలముగొనుము

ఈపద్యంలో భంగ్యంతరంగా శుకమహర్షియొక్క అఖిలార్ధనేతృత్వాన్ని, సర్వసమత్వాన్ని, సంగవర్జిత గుణాన్ని నైష్ఠికతను మర్యాదబుద్ధిని, చక్కగా వివరించాడు, ఒక వ్యక్తి గొప్పదనాన్ని వివరించడంలో ఈ పద్ధతి సముచితంగా ఉన్నది.

**అర్షధర్మపతనవర్ణనన :**

షడ్దర్శనములు జడదర్శనములయ్యె
నూహాప్యహోహలేయుక్తులయ్యె
మృతభాషయయ్యెసంస్కృతవాఙ్మయ మ్మెల్ల
తుదకచ్చెప్రజకిప్డుతురకభాష
యజ్ఞంబు జీవహింసాత్మకంబయ్యె
గసాయియంగడి సౌఖ్యదాయియయ్యె
జపతపోయోగముల్ స్వార్థకర్మలయ్యె
పొట్టపోసికొనుట పుణ్యమయ్యె

ఆర్యధర్మమువిపరీతచర్యనొంది
బ్రహ్మపదవత్తులిటు కఫలమునందె
బ్రహ్మపదవర్తులటులధఃపతనమంద
యూర్ధ్వగతియ భ్యుదయముల నొందగలవె

ఇది ఆర్యధర్మపతన వర్ణనాదర్పణం. కవిపరిశీలనాదృష్టికి నిదర్శనం.

ఈ శుక సందేశం దూత స్వీకారం, సందేశం, మార్గవర్ణన మొదలైన విషయాలలో నూత్నత్వంగల కావ్యం. ఇది క్షేత్ర మాహాత్మ్యంగాకూడా తీర్చి దిద్దబడిన సామాజిక సందేశ కావ్యం.

—o—

# వృషభరాజసందేశం

వృషభరాయసందేశకావ్యకర్త గిద్దలూరి చెంచు బసవరాజుగారు. వీరు గుంటూరు జిల్లా రేపల్లెలో తెలుగు అధ్యాపకులుగా పనిచేస్తున్నారు. వీరశైవ మతానుయాయులు. ఈశ్వరభక్తిప్రపన్నులు. భక్తవశంకరుడైన పరమేశ్వరుని వైభవాన్ని వర్ణిస్తూ ఈ వృషభరాజ సందేశాన్ని వ్రాశారు[1] ఇందు కవియే నాయకుడు.

## కావ్యకథ

నిరంతర మహేశ్వరధ్యానతత్పరుడైన కవికి ఒక వృషభం లీలగా గోచరించింది. అది ధర్మదేవత నాల్గుపాదాలు తనపాదాలుగా గల్గిన ఆది దేవుని వాహనంవలె భాసించింది

ఆ వృషభాన్ని చూచినకవి నా ప్రార్ధనను ఆలకించి మహేశ్వరునకు వినిపించి సహాయము చేయగల్గినది ఈ వృషభరాజే నని భావించింది అతనికితన ప్రార్థనను విన్పించింది శ్రీగిరిక్షేత్రసీమలో వేంచేసియున్న మల్లికార్జునస్వామికి[2] సందేశాన్ని ఆ వృభంద్వారాపంపించినాడు సందేశహారికి రేపల్లెనుండి శ్రీశైలం వఱకుగల మార్గాన్ని అందలి విశేషాలను సలలితరీతిలో వర్ణించి చెప్పాడు.

## కావ్యగతవిశేషాలు

సందేశ కావ్యాలన్నిటిలోను ఈ వృషభరాజ సందేశానిదొక విశిష్ట మార్గం. కొందరు కవులు విరహవేదనాత్మకమైన ప్రణయసందేశకావ్యాలు

---

1 ఈ వృషభరాజ సందేశము అముద్రితము

2 ఇయ్యది నాదు ప్రార్థన మహేశునకున్ వినిపించి నాకు సా
హాయ్యము సేయజాలినదటంచు వచించితినిట్లు భక్తిమై
అయ్య! వృషాధినాథ! ప్రమథాధిపవాహనరాజమూర్తి! నా
కుయ్యిని విన్మమా శివులకుందగువాడవు నీ వొకండవే

ప్రాయగా మరికొందరు సామాజిక సమస్యను గ్రహించి సందేశకావ్యరచన చేశారు. కాని ఈ కవి తన భక్తిని మెచ్చి తనకు శుభములను సమకూర్చమని వేడుకొంటూ భక్తిభావ ప్రకటితమైన సందేశకావ్యాన్ని వ్రాశారు. అందువలన ఇది కేవలం ఆత్మాశ్రయమైన భక్తిసందేశకావ్యం భక్తి పరమార్థంకూడా సమాజ ప్రయోజనమే కాబట్టి ఇది కూడ భంగ్యంతరంగా సామాజిక సందేశకావ్యశ్రేణికే చెందుతుంది.

## నిర్దేశించినమార్గం

దూత అయిన వృషభరాజు రేపల్లెనుండి బయలుదేరి ఇంటూరువచ్చి మూలస్థాన శివుని దర్శించి అనంతరం చరిత్ర ప్రసిద్ధమైన చందోలుచేరి అక్కడ విష్ణుసరోజగర్భనుతడైన లింగోద్భవస్వామిని దర్శించి తరువాత పొన్నూరులో మనోజ్ఞ శిల్పాభిరామాలైన దేవాలయాలను దర్శించి తరువాత బ్రహ్మక్షేత్రమైన చేబ్రోలు మీదుగా కవులకు కళాకారులకు విద్యాలయాలకు నిలయమైన గుంటూరు చేరి అనంతరం మరొక శైవక్షేత్రం కాకాని చూచి నంబూరుమీదుగా సాంస్కృతిక రాజధాని విజయవాడచేరి చుట్టుమార్గమైన సంకోచింపక అమరావతిలోని అమరేశ్వరదర్శనం చేసికొని కొండవీడు చేజర్ల కోటప్పకొండ సత్రశాల, వినుకొండ, మాచర్ల, గురజాల, నాగార్జునకొండ, త్రిపురాంతకం, శివపురం తోకపల్లి, దోరణాల, నాగులూరు మీదుగా కొండలుగుట్టలు, వాగులు అడవులు దాటి శ్రీశైలంచేరి స్వామిని భ్రమరాంబాదేవిని దర్శించి సందేశం వినిపించ మన్నాడు కవి

## సందేశం

ఓ ఈశ్వరా! నీవు శిలాదముని తపస్సుకు ఫలితాన్నిచ్చిన భవ్యమూర్తివి. నందీశ్వరుని వాహనంగా స్వీకరించి ఆ వృషభరాజుమదిని ఆనందమగ్నం చేశావు పరతత్త్వతను రూపభాసుర జ్యోతివై గీలగా వెలుగొందిన లింగ మూర్తివి. మల్లికార్జున పుష్పసమర్చితార్జున రోచిదనర వెలుగొందిన ధవళ మూర్తివి సకలయోగిహృదయగోచరుడవు. అట్టి మల్లికార్జున స్వామి! గిద్దలూరు వంశంలో జన్మించిన చెంచుబసవరాజు పేరుగల నన్ను నీ కృపాకలననూల్కొన బోవుమని ప్రార్థిస్తూ వృషభంతో కవి సందేశాన్ని పంపాడు.

# మార్గనిర్దేశంలోని విశేషాలు

ఈ కవి వీరశైవుడు కావడంచేత కావ్యం శివమయంగా భాసిస్తుంది. దాని ప్రభావం మార్గవర్ణనలో ప్రత్యక్షమౌతుంది. కాని ఒక్క మంగళగిరి నృసింహస్వామిని మాత్రం ప్రస్తావనచేశారు[1]

ఆయా పుణ్యక్షేత్రాలలోని చారిత్రకగాధలు వర్ణించారు.

శ్రీపతి పండితుడు మహిమాన్వితుడైన శివభక్తుడు. అతడు శివభక్తి మహిమను లోకానికి చాటటానికి అగ్నికీలలను కొంగున ముడివేశాడు.

రాజ్యపాలనలో అధర్మానికి ఏమాత్రం తావియ్యకుండి మహనీయుడు మాధవ వర్మమహారాజు. ధర్మరక్షణకోసం తనకు ప్రాణప్రదుడైన కొడుకుకే మరణశిక్ష విధించాడు. దానికి మెచ్చిన దుర్గాదేవి కనకవర్షం కురిపించింది. ఆనాటినుండి ఆమెకు 'కనకదుర్గ' అనే నామం కలిగింది. ఈ రెండు చారిత్రక సంఘటనలు విజయవాడలో జరిగినవి. వృషభరాజుకు విజయవాడ ప్రాచీన వైభవాన్ని తెల్పుతూ వాటిని ప్రస్తావించాడు కవి.

నాగులూరు అనే గ్రామంలో నివసిస్తున్న గౌరమంచి బసవయ్య అనే దంపతులు ఒక శివయోగిప్రేరణచేత మల్లికార్జునసేవకై పుత్రులను పంపాడు మార్గమధ్యంలో ఆటవికులువారిని అడ్డగించారు. ప్రాణాపాయస్థితిలో నందీశ్వరుడు రక్షించాడు. ఈశివభక్తులయొక్క చారిత్రకగాధనుకూడ వర్ణించారు కవికావ్యంలో.

కేవలం పూర్వకథలనేగాక వర్తమాన సమాజాన్ని గూడ వర్ణించారు.

---

1 వరదుడు పానకేశ్వరుడు భవ్యనృసింహుడు
మంగళాద్రిపై
దిరముగ నిల్చినాడు సముదీర్ణమహాద్భుత లీల
గ్రోలువా
డురవుగ దానకంబు మధురోజ్వల దివ్య
సుధామరంద వి
స్ఫురణము తదన్మహా మహిమముం దలపోసి
భజింపు భక్తిమై

మండల ప్రధానకేంద్రమైన గుంటూరు నగరాన్ని వర్ణిస్తూ ధూమపత్ర వ్యాపారాన్ని, విద్యావైద్యాలయాల్ని నాగార్జున విశ్వవిద్యాలయాన్ని మనోహరంగా విజ్ఞానాత్మకంగా నిరూపించారు.[1] శ్రీశైలానికి ప్రభుత్వం రోడ్డువేసిన ఉదంతాన్ని కొనియాడారు[2] నేటి విజయవాడ స్వరూపాన్ని ప్రశంసించారు.[3]

గుంటూరు, కొండవీడు, వినుకొండ మొదలైన ప్రాంతాలు వర్ణించే సందర్భంలో తిక్కన, శ్రీనాథుడు, వల్లభరాయుడు యథావాక్కుల అన్నమయ్య మొదలైన కవి పండితులు ప్రస్తుతింపబడ్డారు

---

1 అచట గల ధూమపత్రయంత్రాలయములు
దేశదేశాలబేరుప్రతిష్ఠతెనసె
సందుగార్మికుల్ వేనవేలుందురెపుడు
స్త్రీపురుషులనియనక కప్పించుచుంద్రు
ఆట బెక్కు కళాశాలలు
పటుతరవిద్యాప్రదానభాసురములువి
స్ఫుట విశ్రుతి గన్నవియు
త్కటముగా నీవిమండలప్రధానంబులగున్

2 దోరణాలనుండి "తారురోడ్డు"ను వేసి
నారు తెలుగుదొరతనమ్మువారు
బండలెన్నొకొట్టి కొండలుకోనలు
కలిపిరాచబాట మలచినారు

3 విజయవాడ నేడు విలసిల్లుచున్నది
తెలుగుజాతి సంస్కృతినిలయమయి
వరలబత్రికల ప్రబల శక్తి యీనాడు
తెలుగుబాసరుచులు వెల్లయునచట

మాచర్లదాటిన తరువాత బౌద్ధాచార్య సుక్షేత్రాన్ని అందలి శిల్ప సంపదను, ప్రపంచంలోని అతి పెద్దదైన నాగార్జునసాగరాన్ని అద్భుతంగా వర్ణించారు.[1]

## యాత్రికుల వర్ణనం

శ్రీశైలం కొండలు కోనలుదాటి కాలినడకను పోవాలి. గుంపులు గుంపులుగా కదిలే యాత్రికులను ఈ విధంగా వర్ణించారు.

"మార్గమధ్యంలో చిన్నచిన్న కొలనుల్లో నీరు త్రావి శ్రమను పోగొట్టు కొనేవారు కొందరు, మధ్యలో ఆగుతూ నడుంవంచి నిలబడుతూ మరల పదండి పదండి అని కదిలేవారు కొందరు, ఈసారి మజిలీ ఇంకెంతదూరమున్నదో అనుకొని ఆయాసపడేవారు కొందరు ఈ చెట్టు పేరేమిటి? ఈ కొండ ఎంత ఎత్తునవున్నదో చూచావా? ఈ పూలచెట్లను చూడమనేవారు, చేదుకో మల్లయ్య చేదుకొమ్మని గొంతెత్తి అరుస్తూ ఆ ఉత్సాహంతో మల్లికార్జునస్వామిని చేరడానికి

---

1 అటుపై వెళ్లిన వాయువీయదిశ బౌద్ధాచార్య సుక్షేత్రము
ద్భుట నాగార్జున పర్వతంబుదనరున్ ప్రాగాంధ్రశిల్పోజ్జ్వల
స్ఫుట జీవత్కళలొప్పనేడచట రసస్ఫూర్తిన్ మహావిద్యుదు
త్కటరోచిర్నవసాగరం బెసగు నాంధ్రక్షోణి సౌభాగ్యమై
అవకాశంబును జూచు కొంచరుగు మయ్యాంధ్రావనీభాగ్యలై
భవనాగార్జునసాగరంబుగన దివ్యద్యవ్యయాత్రాస్థలం
బవునేడద్ది సమస్తదేశజన నేత్రానందసంధాయియై
నవకావ్యోద్భవ హేతువై వెలయు విజ్ఞాన ప్రదంబైరహిన్

ఇట నవకావ్యం అంటే కవికి ఆత్మీయులైన కీ.శే. బోడెపూడి వేంకట్రావు గారు రచించించిన 'క్షేత్రప్రశస్తి' స్మరణకు వస్తుంది. శ్రీ వేంకట్రావు గారు 'రామరాయలు' 'తృష్ణావర్తము' వంటి లఘుకావ్యాలు రచించారు. వీరు శ్రీ జాషువ కవీంద్రులకేకాక, ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారికి కూడా గురువులు.

ముందుకు కదులుతూ ఉంటారట.[1] ఈ వర్ణన అత్యంత స్వాభావికంగా సాగింది. ఇదే విధంగా ఆయా ప్రాంతాలలోని ప్రకృతిని కడురమ్యంగా వర్ణించాడు కవి

గమ్యస్థానమైన శ్రీశైలాన్ని అక్కడి భ్రమరాంబా మల్లికార్జునస్వాములను. అక్కడి సత్రాల్ని, మఠాల్ని భక్త గణాల్ని అతి మనోహరంగా వర్ణించారు కవి.

"కోవెలకు నాల్గుపక్కలు ఉత్తుంగగోపురాలు, బహులతాకోమలతర శిల్ప రమణీయాలైన కుడ్యాలు విరాజిల్లుతున్నాయి ఆ శిల్పాలలో బహుపురాణకధలు నిక్షిప్తాలై ఉన్నాయి. ప్రాకారంతరసీమల్లో ఏకాస్త్రత్వినాగంగ అస్తోకధారగా పై కుబికి వస్తుంది. హరిహరకృష్ణరాయాది ప్రభువులు ఎన్నోమండపాదులను నిర్మించారు.

ఎన్నితరాలు గతించాయోగాని త్రిఫలాఖ్యవృక్షం అత్యున్నతశాఖలతో సమధికోజ్వల వర్ణవికీర్ణమై శోభిస్తూ ఉన్నది

రామచంద్రుడు మల్లిఖార్జుని ప్రక్క విమలభక్తితో సహస్రలింగరూపశివుని ప్రతిష్టించాడు సీతామహాదేవి కూడ ఒక్క లింగాన్ని ప్రతిష్ఠించింది. ధర్మరాజు

---

1 చిన్నచిన్నకొలకుల గనితజ్జలమ్ముల
 గ్రోలిమార్గశ్రమగోరువారు
నడుమువంచి నడచినడుమనడుమనాగి
 పదడు పదండనుచు గదలువారు
ఇంకెంతదూరంబొ! యీసారి "మజిలీ" య
 టంచునాయాసంబునండువారు
మల్లయ్యమ్రొక్కు మాటేమొ! ముందు చెం
 చల 'మెట్ల' కిందని పలుకువారు

ఈ మహీజము పేరేమి! ఈమహోన్న
తగిరి గాంచుమా! యీ పుష్పతరుగలగనుమ
యంచు "జేదుకోమల్లయ్యా" యంచనరుగు
వారుగాన్పింత్రుమున్ దారినడువ

సద్యోజాతలింగాన్ని భీముడు వామదేవలింగాన్ని అర్జునుడు అఘోరలింగాన్ని, నకుల, సహదేవులు తత్పురుష ఈశానలింగాలను మల్లేశ్వరసామి వామ పార్శ్వంలో ప్రతిష్ఠించారు.

భ్రమరాంబకోవెల నుండి వెలువడే భ్రమర ఝంకారం ప్రణవనాదం వలె భాసిస్తూ వీనులకు ఆనందాన్ని కల్గిస్తుంది. మల్లిఖార్జునదేవునికి వెనుక భ్రమరాంబా దేవి కోవెల ప్రాంగణంలో పండితారాధ్యపరమగురుసూర్య సింహాసనమఠం ప్రకాశిస్తోంది తపస్సిద్ధికాస్పదాలై యాత్రికులకు మనశ్శుద్ధిని గూర్చేకేదారపీఠం, సాగరమఠం, రుద్రాక్షమఠం, నందిమఠం, విభూతిమఠం గిరీశుని ఉపాంతసీమలో ప్రకాశిస్తున్నాయి.

అత్తమామలు పెట్టే కష్టాలను సహించి మల్లికార్జునస్వామి పదాబ్జసేవచేసి కొంటూ అతడే శరణమని నమ్మిన మల్లమదేవి ఆలయంకూడ అక్కడ ఉన్నది. పరమనిష్ఠాగరిష్ఠుడైన సిద్ధరాముని కన్నీటిధారలతో ఒక సరస్సు ఏర్పడి అతని పేరుతో చలామణిఔతున్నది

తూర్పుగా కృష్ణవేణి ప్రవహిస్తోంది

పాతాళాన్ని చూచే పాతాళగంగ ప్రవహిస్తోంది ఆంధ్రదేశానికి వెలుగులను ప్రసాదించే విద్యుత్కేంద్రం అక్కడ ఉన్నది

మల్లిఖార్జునస్వామికి వీరమాహేశ్వరాచార్యులైన జంగస్వాములు మహాన్యాసాన్ని నమకచమకాదులను వల్లిస్తూ అభిషేకం చేస్తుంటారు ప్రణవరవము హ్రీంకారము, వేదఘోషదిక్కులు పిక్కటిల్లెలా విన్పింపచేస్తూ విప్రవర్యులు భక్తితో పూజలు చేస్తుంటూరు ' ఇలా ఉంటుందని శ్రీశైలవైభవాన్ని ఈ కవి. విసారంగా

---

[1] ఆ మహానంది దర్శ నానంతరంబె
శ్రీగిరిక్షేత్రయాత్ర సంసిద్ధినందు
నందిశృంగసందర్శన మందినపుడె
పరమశివుదర్శనము సత్ఫలము గనును

తన్మయుడై వర్ణించాడు. ఇదే విధంగా వివశుడై సముచితంగా తక్కిన శైవ క్షేత్రాలను కూడ వర్ణించాడు కవి.

మరల తిరుగు ప్రయాణంలో మార్గాన్ని మార్చి మహానందికి పొమ్మన్నాడు వృషభాన్ని. అతి ప్రశాంతమైన సస్యశ్యామలమైన వాతావరణం కల్గినపుణ్య క్షేత్రం మహానంగి అది దర్శిస్తేనే శ్రీశైలయాత్ర సఫలమౌతుంది

అక్కడి విశేషాలన్నిటిలో విశేషం అక్కడి కొలను. అందులో ఎన్ని వేల ప్రజలు స్నానంచేసినా అతి నిర్మలంగా ఉంటుంది జలం ఒక పైస జారిపడినా తీసికోవచ్చు ఇటువంటి విశేషాలెన్నో ఉన్నాయి మహానందిలో. వాటినన్నింటిని కనులకు కట్టినట్లుగా వర్ణించారు బసవరాజుగారు

## రచనావైదగ్ధ్యం

పద్యగమనాన్నిబట్టి కవియొక్క రచనా పాటవం వ్యక్తమౌతుంది. వృషభరాజు శ్రీశైలంపోయే మార్గంలో శ్రీశైలసమీపాటవులనుదాటే సందర్భంలో ఆ ప్రదేశసౌందర్యాన్ని కవి యిలా వ్యక్తంచేశాడు.

కానన రామణీయకముగాంచుచు భూమిధరాగ్రసీమలన్
గానగవచ్చు భూమిరుహకాండవిలో కనసేదదీరి కృ
ష్ణానది దీర్ఘమాడి జవసత్వములంది పవిత్రగాం గధా
రానయనంబునన్ మఱలి యర్చనసేయము మల్లికార్జునున్

ఈ పద్యంలో ఛందస్సుకోసం ప్రయోగించిన వ్యర్థపదమొక్కటిలేదు. అన్వయికాఠిన్యం లేదు లలితమైన పదాలతో ప్రసాదభాసురంగా ఉన్నది.

ఈ కొండచూడుమా! యెంతయెత్తోయిది
యీ వంకగాంచు మా యెంతలోయ
ఇదియేమి? శకటమిట్లేదూకుచున్నది!
ఔర! యిదెంతపై కరిగె జూడు
ఆ కొండపై మాత్రికులాకాశముందాకు
నీలోయలతలు పాతాళమంటు
అదుగో! యాగిరి మన హస్తముందగిలె, నీ
మలుపులోనేయదిమాటు కరిగె

ననుచు శకటములను నధిరోధణము సేసి
యరుగువారు మాటలాడునుడులు
వినగవినగనీకు విశదమౌనిదియెల్ల
మల్లికార్జునుఘనమహిమమనుచు

శ్రీశైలం చేరడానికై బస్సులో పయనిస్తున్న యాత్రికుల మాటలు ఆ మాటలుగానే మనం చదువుతున్నట్లున్నదిగాని ఒక సీస పద్యం చదువు తున్నట్లుగా లేదు ఇది పరిణతప్రజ్ఞుడైన కవి, ఛందస్సును వశం చేసికొని తన మాటలలో నొదిగించుకొన్న విధంగా సాగింది.

పద్యరచనావిధానంలోను భావప్రకటనాపద్ధతిలోను చెంచు బసవరాజు గారు మిక్కిలి నైపుణ్యాన్ని ప్రదర్శించడమేగాక దూత, దూత్యము, మార్గ వర్ణన మొదలైన విషయాలలో ఈ కావ్యాన్ని సంపూర్ణ సందేశకావ్యలక్షణాలు కలదానినిగా తీర్చిదిద్దారు.

శివభక్తి పారమ్యాన్ని ప్రబోధించే ఉత్తమ సందేశకావ్యం ఈ వృషభరాజ సందేశం



# అనిల సందేశము

ఈ అనిల సందేశ రచయిత కడపజిల్లాలోని ఒదలూరు గ్రామవాసి పేరు పి వేంకటసుబ్బయ్యగారు వీరు ప్రసిద్ధ పండితులు వేదము వేంకట కృష్ణశర్మగారి శిష్యులు.

ఈ అనిల సందేశము భూమాతనుండి మేఘునాధునకు అనిలుడు గొంపోయినది.

ఒకప్పటి రతనాలసీమ అయిన రాయలసీమ వర్షాలులేక, క్షామానికి గురి కాగా ఆ క్షామస్థితిని చూచి స్పందించి వ్రాసిన కావ్యమే ఈ అనిల సందేశం భూదేవి మేఘనాధులు నాయికా నాయకులుగా అనిలుడు దూతగా నిర్ణయించు కోవటానికి కారణాన్ని ఈ కవియే వివరించాడు.[1] వారి భావాన్ననుసరించి ఈ దూత్యమెంత సమంజసమైనదో ద్యోతకమౌతుంది.

ఈ కావ్యాన్ని నవయుగ కవిచక్రవర్తి జాషువ సముచితంగా ప్రశంసించారు [2]

---

1 మోఘాచ్ఛాదితముగాని భూమి పంటపలంతికి దూరమై కాటకమున కిమ్మగును వర్షము లేకున్న భూతలమున అల్పజీవుల గతియేమి? కనుక భూమాతకు మేఘునాధుడవసరము మేఘుడు వాయుదేవుని సహాయము లేనిది వర్షింపడు. శాస్త్రరీత్యా వాయు ప్రసారమున తేలికయగు మేఘములు జలరూపమును ధరించును. పై ప్రకృతి ధర్మమే ఈ చిన్న కావ్యమునకు వస్తువైనది

భూమిక – అనిల సందేశం పి వేంకట సుబ్బయ్య

2 ఆర్యా అభివాదం! మధురభావభరితమైన మీ అనిల సందేశం అందుకొని సంతసించాను అనిలసందేశం మందానిలంవలె మనసుకింపుగూరుస్తూ యున్నది భావికాలాన మీ కలం ఇతోధిక కావ్యఫలాలనాంధ్రులకందించి ప్రశస్తికెక్కగలదని తలుస్తాను. అభిప్రాయం – జి జాషువ.

# కావ్యకథ

భూదేవి మేఘనాధుని వియోగం సహించలేకపోయింది. తాను కోరక పోయినా యింతకుపూర్వం తనను తనియజేసిన సంఘటనలను గుర్తుచేస్తూ విచారిస్తోంది ఆ సమయంలో మేఘునిప్రాణసఖుడైన అనిలుడు భూదేవి వద్దకు వచ్చి ఓర్పుకు పుట్టినిల్లైన నీవు విచారించడందేనికి? కాపురంలో కడగండ్లు సహజం అవి కలకాలం కాపురం చేయవు నీ నుండి మేఘునికి రాయబారం నడుపుతాను, ఆవేశాన వ్రతాన్ని పూనవద్దు" అని అనిలుడనగా ఆమె తృప్తిపడి కొంత తెప్పరిల్లి అతనితో ఇలా అన్నది.

"ఓ అనిలా! కోటానుకోట్ల కొమరులు కూడులేక కూలిపోయారని తెలుపు, లక్షోపలక్షల లక్షాధికారులు భిక్షాధికారులయ్యారని తెలియజేయి. వేలాది మంది వస్త్రవిహీనులై చింకిపాతలు కట్టుకుంటున్నారు. నిత్యం పచ్చనివల్వలతోఉండే నీ దయిత మాలిన్యధామమైనదని చెప్పు. నీవు సత్వరంగా గనుక రాకపోతే సర్వసృష్టి కాలసర్ప విషజ్వాలలగ్రాగునని తెలియ జేయమ"ని ఇంకా ఎన్నో చెప్పింది.

ఆమె సందేశాన్ని తీసుకొన్న అనిలుడు దూత్యంలో విజయసిద్ధికి సకల దిక్పాలకులకు సాగి మ్రొక్కి బయలుదేరాడు. మేఘుని సమీపించి తన రాకను తెలియజేసికొన్నాడు అపుడు మేఘుడు నీవు వచ్చినపని ఏమిటో తెల్ప మన్నాడు. అనిలుడు తనవచ్చినపని తెలియజేశాడు. మేఘదర్శనం లేక భూదేవి ఎంత తపించిపోతోందో ప్రజలు అంతే తపించి పోతున్నారని వివరిం చాడు. "కరుణగాంచుము మిత్రమా కన్ను తెరచి" అని ఉపదేశించాడు. అపుడు మేఘుడు దేశంలో తనకు బాధగల్గించిన కొన్ని సంఘటనలు జరుగుతున్నా కడుపు కక్కుర్తికోసం హింసాప్రవృత్తి అధికమౌతోందని, ధర్మమడుగంటి పోతోదిం ఇక నన్నెలా రమ్మంటావ"ని అన్నాడు

అపద్ధర్మంగా కొన్ని చెడుపనులు చేసి యుండవచ్చు. అంతదానికే వాళ్లని అలమటింపజేయడం భావ్యంకాదన్నాడు పవనుడు.

మేఘుడు మరల హరిజనుల దైన్యస్థితిని గూర్చి వివరించి దీనివలన దేశానికి ప్రపంచంలో ఎంతో గౌరవహీనంగా ఉన్నది. అందువల్ల వీళ్లకు మేలు చేయకూడదనిపిస్తోందని అనగా అనిలుడు చిరుహాసంతో మిత్రమా హరిజనుల స్థితి నీవన్నట్లుగా నేడు లేదు. దేవాలయ ప్రవేశం లభించింది, హోటళ్లలో అందరూ కలిసి భోజనం చేస్తున్నారు. ప్రభుత్వం హరిజనులను ప్రత్యేక ప్రతిపత్తితో గౌరవిస్తోంది. గాంధీజీ, జవ్వార్‌లాల్‌నెహూౄ, రాజాజీ మొదలైన ప్రముఖనాయకులంతా హరిజనులపై ప్రత్యేక శ్రద్ధచూపి సమాజంలో వారికి సమమైన గౌరవం కోసం ప్రయత్నించారు.

కొందరు హరిజనులు మంత్రిపదవులు పొందారు. కొందరు కవీశ్వరులై లోకంలో కీర్తిని పొందుతున్నారు. ఎంతోమంది ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలు నిర్వహిస్తున్నారు

ఈమాటలు విన్న మేఘుడు "మిత్రమా! నేనొక్కక్షణం యిక్కడ ఉండ లేను. నన్ను నీ సహాయంతో వేగంగా తీసుకుపొమ్మని బరువెక్కిన గుండెతో అన్నాడు.

ఎడతెరిపి లేకుండా వర్షధారలచేత పృథ్విని ఉక్కిరి బిక్కిరిచేశాడు మేఘుడు. రాళ్లసీమ సస్యశ్యామమైంది.

## కావ్యగత విశేషాలు

సాధారణంగా అన్ని దూతకావ్యాల్లో లాగా కాక దీనిలో దూత తనకు తానుగా దూతకార్యనిర్వహణ కుద్యుక్తుడౌతాడు. ఎవరివద్దకైతే సందేశం తీసుకు పోయాడో ఆ మేఘునితో స్నేహితుని వలె ప్రవర్తించాడు. సందేశకావ్యాల్లో సందేశంచేరవేయడమేగాని సందేశహార్నికి సందేశానందుకునే వానితో సంభాషణ ముండదు. ఈ కావ్యంలో ఆ సంభాషణమే ప్రధానం మేఘుని, భూదేవిని ప్రియాప్రియులుగా ఊహించడం పరిమిత ప్రయోజనాన్నే ఇస్తుంది.

ఇక ఈ కావ్యంలో వర్ణితమైన ప్రధాన విషయాలు రెండు 1. వర్షహీన మైన దేశం విలవిలలాడిపోవడం. 2. హరిజనులు అంటరానివారుగావిక్లిష్టమైన జీవితాన్ని గడపడం.

క్షామదేవత కరాళ కౌగిలిలో చిక్కుకొన్న ప్రజల దయనీయస్థితిని కవి యిలా వర్ణించాడు.

కుడువగగూడు లేదు పడుకో బరుపా యసలే సుళక్కినె
క్కడదలదాచుకోగలము గల్గదొకించుకకట్టు బట్టచే
బడదు శరీరమెల్ల జెడిపాడయిపోయెగటా కొమాళ్లకున్
డొడరునె బుద్ధి ధర్మముల దుర్భర దుఃఖ మహాబ్ధి మున్గగాన్
బియ్యము బియ్యమంచు బహువేదన మ్రగ్గుచు మానవావళుల్
కుయ్యిడశక్తిలేకయటు గుంపులు దీరి బజారు వెంబడిన్
కయ్యములాడు వైఖరిని గాంచిన హా భగవంతుడామమున్
చయ్యన జంపరాదయని శాంతము కోల్పడి యేడ్వకుందురే

కడుపురంపపుకోత గాగోయ దీనుల
యార్తనినాదంబు నాలకింప
కనుల ప్రవాహమ్ముగా గారు కన్నీరు
శల్యాకృతిని గొన్న జనులగాంచ
ఘడియలో మది నీరు గామారు కన్నీరు
మున్నీరుగా మార్చు బుధుల జూడ
కాళ్లు ప్రమాన్పడి నడ్వగారాని రోగపీ
డితులై తపించు హాలికులనెంచ

బుద్ధి పనిసేయగాబోదు భోజనమ్ము
లేక జఠరాగ్నిమాడెడు లేకి జనుల
జూచినంతనె కటకటా జూచ చూడ
నట్టులేగుట ధర్మమా? అరయుమయ్య

ఈ పై పద్యాలలో వర్ణితమైన క్షామస్థితి ఒక మేఘునికే కాక ప్రతి పాఠకుని హృదయం అర్థం కాకమానదు ఇటువంటి బాధలకు కారణం ప్రజల ప్రవర్తనయే అని ఈ కవి మేఘునిచేత చెప్పించాడు.

జ్ఞానమొకింతలేమిని సనాతన ధర్మము మానిపొట్టకూ
డూనగలేక పాపముల నొత్తిగిలంబడి లేవలేనిసం
తానమదేల దగ్ధమయి దారుణిపీడిన మేలుగాదెయ
జ్ఞాన సమాశ్రితంబగు జనంబు జనింపగ నేలమిత్రమా!

ఒక ప్రాణినొక ప్రాణిసోగిరమ్మగగాని
జీవింపబూనెనే శివముగల్గు?
ఒకనిపైనొక డీర్ష్య ప్రకటించుకొని ప్రాణ
ములు బాపు కొనుదురే పుణ్యముండు
ఒకజాతినొకజాతి నుక్కడగింపగా
నున్నదిమేలేమి యొదవబోవు
ఒకనాడునొకనాడు వికలమ్మ సేయగా

బూనుకొన్నదియేమిప్రోది గల్గు
హింసమయమైన పృధ్వి సహించుటెట్లు?
ధర్మమడుగంటె జనుదేర దలచుటెట్టు?
ప్రాణసతియిట్లు నుతులిట్లు వరలిరేని
భగ్నమై పోవకుండునే భాగ్యవితతి

ఈ మాటలలో కవి పరోక్షంగా సమాజానికొక సందేశాన్నిచ్చాడు. ఏ సమాజమైనా ధర్మకర్మచ్యుతమై హింసా ప్రవృత్తితో మనలినట్లైతే ఇట్టి కూడూ గూడూ లేనిజీవనం గడుపవంసియుంటుందని కవిభావం.

**హరిజన సమస్య :**

అనిలునితో మేఘుడిలా అన్నాడుః
హరిజనులంచుకొందరిని యాకులపాటున ద్రోసియక్కటా
పరిసరమందునెక్కడ నివాసము సేయగనీక పౌరులి
ద్దరనొక కట్టుబాటిడిరి దగ్గముగాదె శరీరమీవిరు
ద్ధరచనకున్ పచింపుము వితాకును బొందకయుండుటెట్టులో!
మన కుటుంబముఘటియించు తనువునందు
బ్రహ్మనివసించుచున్నాడు బయిలుపడక
దీనిదెలియకమాలలు హీనులనుచు
భావనము సేయదుఃఖంబు పాలుపడ్డదె,

సమాజంలోని ఒక వర్గాన్ని హీనంగా చూడడం ఎంతో హృదయవిదారకమైన విషయం అర్ద్రమైన హృదయం కలిగి సమాజంలోని దుర్గుణాలకు స్పందించిన కవి నిర్భీకమైన మనః ప్రవృత్తితో వాటిని వ్యక్తంచేస్తాడు. కొందరు అంటరానితనం పేరుతో మానసిక క్షోభ ననుభవిస్తువింటే ఇకసమాజానికి సౌఖ్యమేది? ఇట్టికష్టాలు పడవలసిందే అని కవిభాకవనమేఘునిద్వారా వ్యక్తం చేశాడు

దీనికి సమాధానంగా హరిజనులస్థితి మునుపటి వలెలేదని వివరిస్తూ

"సోదరా వినవో అంటరాని తనంబు నాశమై. . ... .
మునుపటియట్లుగాక తన మూలము గోల్పడె మానవాళికిన్
గౌనములు గల్గె నేటికిని గూళ విధానముబోయె మిత్రమా

గుళ్లలో దేవుళ్లగొలిచి ప్రసాదమ్ము
గైకొన్న ప్రతిబంధకములు బోయె
రాచబావులయందు రాజిలు జలముల
ద్రావనాక్షేపమేదరలిపోయె
బళ్లలోజదువులు. బాహాటముగ నేర్చ
ననుకూలములు పెక్కులనువు బడియె

హరిజనులకు ప్రభుత్వంబు కరము ప్రీతి
పనులనొసగుచు మున్ముందు ఘనత నిచ్చు
రీతులన్నియు సమకూర్చి కృతకధర్మ
సంచయంబును దెగగొట్టె ఘనుడనేడు

"మంత్రిపదవుల కొందఱుమాలవారు
గొనుచు బరిపాలనము సేయు గౌనబు చూచి"

కవియైనవాడు పాక్షిక దృష్టిని వహించియుండ కూడదు. కేవలం సమన్యలనే వ్యక్తంచేస్తూ సమాజంలోని కొన్ని వర్గాలను రెచ్చగొట్టక మంచిచెడులను రెంటిని సమంగా సమాజం ముందుంచాలి. కేవలం అంటరానివారి సమస్యలనే ప్రజలముందుంచక వారిపట్ల ప్రభుత్వానికిగల సానుభూతితో హరిజనులు పొందుతున్న సౌకర్యాలను చక్కగ వివరించాడు కవి

ఈ పొత్తుకు కారణమైన నాయకులకు కృతజ్ఞతలు అర్పించాడు

గాంధిమనీషి మానవుల గల్గదు భేదమటంచు జాటి మీ
బంధువులైన పంచములు బంధము లూడిచె భారతీయ జా
త్యంధతవీడె వారలు మహాసుగుణాత్ములు రాజకీయ స
ర్సింధువులున్ గవీశ్వరులు శిష్టులునైభువి కీర్తి కెక్కరే

జహ్వరులాలు విశారదుండు హరిజ
నాళికి మేల్సేయనాశ బెంచు
రాజాజియెప్పుడు ప్రాలుమాలకమాల
మాదిగలకు మేలు మదినిదలచు
వల్లభాయిపటేలు బామరులయికుందు
పంచములకు శుభమెంచుచుండు
రాజనుబాబు నిరతమెద నిమ్నజా
తుల శుభమును గోరి మొలగుచుండు

వర్ణభేదము నశియించె ప్రజలయందు
నాయకులు తన్నివారణోపాయమునకు
కంకణంబునుగట్టిరి శంకమాని
భార్యనేలగరావయ్య భద్రముగను

దేశనాయకులుగా సమగ్రాభివృద్ధికోసం అహర్నిశలు కష్టించిన మహాత్ముడు మొదలైన మహానాయకుల ప్రస్థావన ఈకావ్యంలో సముచితంగాఉన్నది. వారిపట్ల వాస్తవాన్ని వ్యక్తంచేసి కావ్యాన్నికి నిండుదనాన్ని కూర్చారు కవి.

దూతకావ్యాలలో ప్రధానమైన ఘట్టం మార్గోపదేశం. అది యిందులో లేదు. అనిలుడు మేఘుని వద్దకుపోవడానికి మార్గం ఏవిధంగా చెప్పించాలి. ఒక వేళ కవి ప్రత్యేక ప్రయత్నంతో చెప్పించినా అది కృతకమే అవుతుంది. ఔచిత్య భంగకారియౌతుంది. కాబట్టి ఆ మార్గోపదేశం లేకపోవడిమే గుణంగా భాసిస్తోంది ఈకావ్యానికి.

కవి తాను చెప్పదలచుకొన్న విషయాలు నాలుగు సూటిగా వాడిగా అతి తక్కువ పద్యాలతో అత్యంత శక్తిమంతగా చెప్పి అల్పాక్షరాలలో అనల్పార్థ రచనగావించారు.

ఒక విషయాన్ని వ్యక్తంచేసేటపుడు కవి వృత్తౌచిత్యాన్ని పాటించడం కూడ అవసరం కరుణ రసప్రధానమైన కావ్యరచనకుద్యమించినపుడు తగినపద సౌకుమార్యంతోపాటు సముచితమైన ఛందస్సునుపయోగించడం రససిద్ధుడైన కవిచేసేపని.

అనావృష్టివలన గల్గిన క్షామాన్ని, హరిజనుల ఆజన్మాంతబాధను కొన్ని పట్టుల సీసపద్యాలతో వర్ణించడం చేత పాఠకుడు సులభంగారసోన్ముఖుడుకావ డానికి కారణమైనది. ఈ విధంగా కావ్యప్రయోజనాన్ని గుర్తించి శ్రీ వేంకట సుబ్బయ్యగారు సమాజానికెంతో సందేశాన్ని చేకూర్చే సందేశకావ్యన్ని వ్రాశారు.



# ఇన సందేశం

ఇన సందేశ కావ్యరచయిత ఎడ్లపల్లి జోసెఫ్ కవి. ఈకవి "ఉద్దండకవి" బిరుదాంకితుడు, కవితావతంసుడైన శామ్యూల్ కవిపుత్రుడు. వీరిది కవి సంప్రదాయ కుటుంబం.

సామాజిక సమస్యలను కావ్యవస్తువుగా గ్రహించి ఇన సందేశం పేర సందేశకావ్య రచన చేశారు.

## కావ్యకథ

భానూదయమైంది అతనితోపాటుగా నిద్రిస్తున్న ప్రపంచ మేల్కాంచింది. ఒక సగటు మానవుడుకూడా ప్రపంచంతోపాటె కళ్లు తెరిచాడు. నిద్రలో తెలియని ఆకలిమంటలు కళ్లుతెరిచేసరికి బాధింపమొదలిడినాయి ఆ ఆకలితో పాటు అనేకరకాలనైన ఆలోచనలు వాడి మెదడును తొలిచేశాయి మనసు చిందరవందరైంది సూర్యభగవానునికి చేతులెత్తి నమస్కరించాడు

వాడి మనస్సులో సుళ్లుతిరిగే ఆలోచనలకు ప్రశ్నలకు ఎవరినైనసమాధానం కోరాలనుకొన్నాడు ఎవరో ఎందుకు సర్వేశ్వరునే కోరితే బాగుంటుందనుకొన్నాడు. దూతగా ఎవరిని పంపాలనే ఆలోచన వచ్చింది. ఈ రోజుపోతే మరలా రేపు ఉదయం తప్పకరాగల్గిన సూర్యునే సందేశ హారిగా పంపాలనుకొన్నాడు

సర్వప్రాణరక్షకుడవైన భాస్కరా! మా పక్షాన ఆసకలేశ్వరుని వద్దకు పోయి మాయీ కడగండ్లను గూర్చి వివరించి చెప్పు. ఆ విరాణ్మూర్తివద్ద నిలువగలశక్తి నీకు మాత్రమే ఉన్నది.

మామాట లా ఈశ్వరుడు వింటడావినడా అనే సందేహం నీకు కల్గవచ్చు. విన్నా సమాధానం చెప్పడని అనుమానిస్తావేమో? అటువంటి సందేహాలేమీ పెట్టుకోవద్దు చిన్నపిల్లల మాటలుకూడ వినే శాంతగుణముంది ఆ జగన్నాధునకు.

జగతిలో నీకు సాధ్యంకానిదేం లేదు. నీ శక్తి చాలగొప్పది. చీకటిని ధ్వంసం చేయగలవు మహాధన్వంతరీశుడవైలోకంలోని రుగ్మతలు పోగొట్టగలవు.

ఇంతటి మహాశక్తి సంపన్నుడివి నాయీ కార్యం తప్పక నెరవేర్చగలవు అని దూతను ప్రార్థనా ప్రశంసలు చేసి సందేశాన్ని వినిపించాడు.

ఈ సృష్టి అతివిచిత్రమైంది. ఆలుమగలను కూర్చి అతి మధురరాగ యుక్తమైన జీవనవీణలో మరణమనే అపశ్రుతిని కల్పించడమేంటి? కొందరికి సర్వసుఖాలు కట్టబెట్టి కొందరికి కటికదారిద్ర్యాన్ని కూర్చడంలో ఆ పరమేశ్వరుని ఆంతర్యం బోధపడడంలేదు. ఎందరో మహాకవులను సృష్టించాడు. మళ్లీ మరలవారిని అంతంచేయడంలోని ఆంతర్యమేమిటి! సస్యశ్యామలమైన భూమిలో కరువుకాటకాలు కల్పించడమేంటి? మా బ్రతుకుల రాతల్లో మహాదుఃఖాలు ఏరులుగా ప్రవహించడానికి కారణం వివరించమని తన సందేశాన్ని వివరించి సూర్యుని పరమేశ్వరుని వద్దకు పంపాడు.

అప్రస్తుతమైనా కవి తన వంశాన్ని గూర్చి తాతతండ్రులనుగూర్చి తన కావ్యరచనా విధానాన్ని గూర్చి వివరించాడు.

చివరిగా సూర్యునితో ఇలా అన్నాడు. "మా రక్షణభారాన్ని అంగీకరిస్తూ నీవు తల ఊపితే కృతజ్ఞతలు తెలుపు. లేకుంటే ఆ పరమాత్ముని కాళ్లపైబడి మా శిలలకోసం ప్రతిమలాడమని మహేశుని వద్దకు పంపాడు

## కావ్యగత విశేషాలు

సందేశకావ్యానికికుండవలసిన లక్షణాలలో సందేశహరుని ఎంచుకోవడం అతని ప్రస్తుతించడం, సందేశాన్ని వివరించి పంపడం మాత్రం ఈ ఇన సందేశంలో ఉన్నాయి ప్రధానమైన మార్గనిర్దేశం ఇందులోలేదు. సందేశం దూతకు వివరించడం మాత్రం విస్తారంగా మూడు ఆశ్వాసాలలో సాగింది.

కావ్యానికి అప్రస్తుతమైన కవిజీవితాయులు వర్ణింపబడ్డాయి.

## కావ్యనాయకుడు

ఈ కావ్యనాయకుడు సగటు మానవునకు ప్రతీక. వాణ్ణి ఆకలి బాధ వేధిస్తోంది వాడి కుటుంబాన్ని దారిద్ర్య బాధ పీడిస్తున్నది. వాడి సమాజాన్ని కులరక్కసి కర్కశంగా గ్రసిస్తున్నది. కరువుకాటకాలు అతివృష్టి అనావృష్టులు జీవితాన్ని దుర్భరం చేస్తున్నాయి. ఇదంతా పరమేశ్వరుని సృష్టి విలాసంగా భావించాడు. ఆ భావననే సందేశరూపంలో సూర్యుని చేత పంపించాడు.

## దూత

ఒకపని సానుకూలం కావాలంటే తగిన దూతను నిర్ణయించుకోవాలి. ఈ కావ్యంలో దూత సూర్యుడు. లోకాన్ని చైతన్యవంతం చేయగల్గినసామర్థ్యం ఈతనికున్నది. తన దూత సామర్థ్యాన్ని ఈ కావ్యనాయకుడిలా ప్రస్తుతించాడు.

నినుదర్శించెడి భాగ్యమబ్బెను కళా నిర్మాత లోకంబు నం
దు నిరాకారివిగావు నీవు నిశివిధ్వంసంబుగా జేయు సా
ధనముల్ గల్గిన భీకరుండవు మహాధన్వంతరీశుండవై
అనిశంబా ర్తినిగూలు మానవులకారోగ్యంబునందితువే

దర్శనంచేతనే జగదానందసంధాయకుడైన ఇనుడు తమ బ్రతుకులను పండించగలడనే ఆశ నరునిలో కలిగి ఆతని దూతగా గ్రహించాడు.

## సందేశం - ప్రసక్తమైనవిషయాలు
## సృష్టివిధానం

పరమేశ్వరసృష్టి అతివిచిత్రమైంది. ద్వంద్వ సమాకీర్ణమైనది. కష్ట సుఖాలను సమకూర్చివాడు మేమెలా మసలుకోవాలో చెప్పమంటాడు

నవ మన్మధాకారా నందంబు సృష్టించి
శవపేటికాకృతి జేర్చుటెవరు

పచ్చనిపైరులో బంగారు సృష్టించి
గాడ్పుగుండాలలోగాల్చుటెవరు
చల్లని వెన్నెల సౌరభ్యమరచించి
చీకటితెరలకు జేర్చుటెవరు
బహుముఖమేధావి ప్రజ్ఞలు బుట్టించి
తల్లికడుపును మాడ్చుధర్మమెవరో

అన్ని యెఱిగిన నీవె మాకన్నివిధుల
మేలుకీడులు దెల్పిన విలువెఱింగి
మసలుకొందుములోకానమంచిగాను
జెప్పవయ్యదైవమతృప్తిజెందునటుల

ఇందులో తనఅద్భుత సృష్టిని తానే నాశనం చేస్తున్న పరమేశ్వరుని చిద్విలాసాన్ని వివరించి మా జీవన విధానం తీర్చి దిద్దుకోటానికి ఉపాయం తెల్ప మన్నాడు.

**ఆకలిబాధః-**

అన్నము లేకపోయినను హాయిలభింపదు జీవయాత్రలో
కన్నము వేసి దోచినను కర్మకరోరపుదీక్షయెట్లు నీ
కున్నవి మావెయంచు గుణకోవిదరాజులమాటనెట్టుని
మ్మోన్నతతావులందు విరబూయుకతంబునకీ యనర్ధముల్

ఈ ఆకలిబాధ అందరికీ సమానమే కానీ కొందరినే అది అధికంగా ఫెంటాడుతోంది. నిమోన్నతాలు కల్గిన ఈ సమాజలో పుట్టడం అనర్ధదాయక మంటాడు

**తారతమ్యాలు -**

ఇదేవిధంగా గుడిసెల మేడల సరసాలు మాన్పమని దుర్భరమైన అస్పృశ్యతాజాడ్యాన్ని రూపుమావమని వేడుకొన్నాడు. ఎందరో గొప్ప కవులను సృష్టించి మరలవారిని మృత్యుదంష్ట్రిలలో నిరికించడం న్యాయమా ప్రభూ అని

దయనీయమైన హృదయభారంతో అర్థించాడు. చివరికి ఈవిధంగా అడగ మన్నాడు సూర్యుని

చంద్రుని సృష్టించియందు నిల్పెను మచ్చ
కవిచంద్రులకిడెను కటికలేమి
రారాజుసృష్టించి రాజ్యాకాంక్షలజేసె
కలిమిసృష్టించి చంచలత ఆపై
నెచ్చెలుల సృష్టించి నిలిపెనీచరుధిర
సౌఖ్యమందున దుఃఖస్థానమునిచె
మనుజకోటిని జరామరణంబునంద్రోసి
పూలకుబెట్టెవాడు నల్పరేపగుణము

మంచివస్తువులెన్నియో మనిపివాని
వాకిటం గూర్చెనవగుణచేటుతతులు
ఇట్టులేక జేసెనోనతననెట్టెనతడుగు
మాట మాత్రము భానుజామంచిమిగులు

అని పరమేశ్వర సృష్టి రహస్యాలను తెలునుకొనిరమ్మని పంపాడు.

## కవి స్వవిషయం.

ఎడ్లపల్లివంశంలో వెంకయ్య అనే పేరు గల్గిన వ్యక్తి ఉన్నాడు. అతనికి సాహిత్యభిమానమున్నది. ఎట్టిన అంటే అభిమానం. ఒకనాడు ఎట్టిన కల్లో కన్పడి కవిత్వం వ్రాయమని కోరాడు. పెద్దలనాశ్రయించి కవిత్యం చెప్పేస్థితిని సంపాదించి చక్కని కావ్యాలు వ్రాశాడు.

అతని మనుమడు శామ్యుయేలు అనువాడు కూడ తాతకు వారసుడుగా కవిత్వం వ్రాయనారంభించాడు. పురాణకథలు వదలిగాంధీ ఉద్యమ ప్రభావితుడై గాందికవిత్వం వ్రాయనారంభించాడు. తనకవిత్వాన్ని సహృదయులకు విని పించి పెద్దలమెప్పును పొందుదామనుకొన్నాడు. తాత ఆశీర్వచనం లభించింది. [illegible] ప్రముఖకవి గుర్రం జాషువనివసిస్తున్న గోనకొండ చేరాడు తన కవిత్వాన్ని ఆ మహనీయునకు వినిపించాడు. జాషువకవి మహానందాన్ని పొందాడు. శామ్యుయేల్ కవిని వెంటపెట్టుకొని సహృదయశిఖామణులైన

కట్టమంచి రామలింగారెడ్డి వద్దకు తీసుకుపోయాడు. అక్కడి నుండి బ్రాహ్మీమయమూర్తి విశ్వనాథను సందర్శించి ఆశీర్వచనాలు పొందారు. విశ్వనాథ వారి సలహానను సరించి కడియంలోని చెళ్లపిళ్లవంశస్వామినిదర్శించి ధనులైనారు. తమ కవిత్వాన్ని ఆ మహానుభావునకు విన్పించాడు అతడు సంతసించి, సహృదయుడు సంస్థానాధీశ్వరుడైన కాకూరి కిషన్‌రావు వద్దకుపంపాడు.

కిషన్‌రావుగారు వీరిద్దరిని మర్యాదపూర్వకంగా స్వాగతించి తన సంస్థానంలోని పెద్దింటి అప్పయ్యను పిలిపించి అతని కూతురు సత్యవతిని శామ్యుయేల్ కు యిచ్చి వైభవంగా వివాహంచేయించాడు

ఆవివాహంలో గద్దల జోసఫ్ కవి ఆశువుగాపద్యకుసుమాలు సమర్పించాడు. అందరు సంతపించారు. తల్లిదండ్రులు దీవెనలతో సత్యవతిని శామ్యుయేల్ కవితో పంపారు.

ఇది కావ్యానికి అప్రస్తుతమే అయినా శామ్యుయేల్, జోసఫ్ కవుల సంచార సమయంలో నాటి ప్రముఖులైన, కట్టమంచి, విశ్వనాధ, చెళ్లపిళ్లవారు మొదలైన వారిని అద్భుతంగా వర్ణించారు.

తెలుగు వాఙ్మయానికి రెడ్డిరాజులు చేసిన సేవను. కృష్ణరాయలకాలము నాటి తెలుగు భాషామతల్లి వైభవాన్ని కడురమ్యంగా వర్ణించారు శామ్యుయేల్ కవితో ప్రయాణంచేసిన కవి గద్దల జోసఫ్‌గారు కన్నీటి కబురు అనే కథా కావ్యాన్ని వ్రాశారు. ఆ కావ్యం కూడా హరిజన సమస్యను లోకానికి తెలియజేసేదే.

కట్టమంచి రామలింగారెడ్డిగారి వ్యక్తిత్వవైభవాన్ని ఈ కవి ఈ విధంగా వర్ణించారు

అతని ధృగ్గోళమందలరినీడేరె
బ్రహ్మాండభావోద్రేకవాఙ్మయంబు
అతని వాల్చాపులందలరి పరవశమందె
తీపిజారని తేట తెలుగురాణి

అతని కులమునందునె విప్పారెను
తెల్గుపోటరినిస్తులతేజచరిత
అతని సభాధ్యక్షతతవిలి పులకించె
రసవాహినీతతుల్ హాసలవము

సరససాహిత్యచంద్రికసాంద్రరుచులు
పండిపోయినదీ తెల్గుగుండెతోన
దేశ కళ్యాణ భాగ్యంపు దీప్తి మెఱయు
కవులపాలిటి బంగారు కలిమికొండ.

ఈ పద్యం ఎందరో కవిపండితులకు ప్రాపై తాను స్వయంగా ప్రముఖ విమర్శకాగ్రేసరుడై ఒక విశ్వవిదాలయాన్ని బహుకాలం పండితలోకం ప్రశంసించే విధంగా దీర్చి దిద్దిన కట్టమంచివారి మహోన్నతమైన వ్యక్తిత్వానికి దర్పణం గా భాసిస్తోంది.

ఈ విధంగా సాగింది వీరి రచన

ఈ దేశంలోని నగటు మానవుడు నాయకుడుగాగల్గింది, అనేక సాంఘిక సమస్యలకు దర్పణమైనది, అద్భుతమైన వర్ణనలకు నిలయమైనదియునై, సామాజిక సందేశకావ్యాలల్లో సముచిత స్థానాన్ని పొందిందీ ఇన సందేశం

రచనా విధానంలోను, వర్ణనా శిల్పంలోను, మరింత శ్రద్ధవహించి నేర్పు ప్రదర్శించి నట్లైతే జోసఫ్‌కవి జాషువ మహాకవిలాంటి వారి సరసన నిలచే వాడనడంలో సందేహంలేదు.

జాషువ మహాకవి తనజాతిలో ఎందరోకవులుద్భవించాలని గబ్బిలంతో ఆవేదనా మయహృదయంతోకోరుకున్న విధంగా గద్దలజోసఫ్‌కవి, ఎడ్లపల్లి జోసఫ్‌కవులు, వారి సమస్యలను ప్రతిబింబిచే విధంగా కన్నీటి కబురు, ఇన సందేశం రచించి తమజాతి జనులకడగండ్లను లోకానికి అర్థ్రిగా తెలియజేసివారి జీవనవిధానాన్ని మార్చడానికి ప్రయత్నించి కొంతవరకు కృతకృత్యులైనారు. జాషువ కవివాంఛ సఫలత గాంచింది.

# తుమ్మెద సందేశం

తుమ్మెద సందేశ రచయిత్రి సుంకరమణి రామచంద్రరావుగారు. ఆమె సాంఘిక సంస్కరణ ధ్యేయంగా ఆంధ్రదేశాభ్యున్నతి కాంక్షించి ఈ సందేశ కావ్యరచన చేశారు.[1]

పుష్పకాంతపై వ్రాలి తనలోని మకరందాన్నిగ్రోల నిశ్చయించిన తుమ్మెద మనసుమార్చి తన వక్షాన భారతదేశప్రధాని జవహర్‌లాల్ నెహ్రూకు నిర్వీర్యమైన ఈ సమాజాన్ని పునరుద్ధరించమని వేడుకొంటూ పంపింది. ఈ తుమ్మెద సందేశం.

## కావ్యకథ

ఒక తుమ్మెదరాయుడు స్వేచ్ఛావిహారియై తనకు అందముగా కన్పడిన ప్రతి కుసుమం పై వ్రాలి అందలి మకరందాన్ని తనివితీరగ్రోలి ఆనందాన్ని అనుభవిస్తున్నాడు ఒకరోజు ఆ మత్తుతో త్రోవదప్పి ఎంతోదూరంపోయి ఒక ఘోరాటవినిచేరుకొన్నాడు పూలవనాల్లో తిరుగుతూ పూబోణులలోని మక రందాన్ని తనివితీర త్రాగే సమయంలో ఈ ఘోరాటవిలో చిక్కుకొన్నానే మిటని బాధచెందుతుండగా సుమవాసనతోచింది ఆ అడవిలో ఆవాసన వచ్చి నందుకు తుమ్మెదరాయడు ఆనందాన్ని పొంది ఆవాసనవచ్చిన చోటికిపోయి కుసుమకాంతను చూచాడు.

ఆమె చిక్కిపోయి జ్ఞానతేజంలో వెలుగొందుతూ కనులమూసి ధ్యాననిష్ఠలో ఉన్నది. ఆ పడతిని పల్కరించి తనకు దారి చూపమని ప్రశ్నించాడు

ఆ పడతి కనులు తెరచి ఈ అడవికి నీవెందుకు వచ్చావని ప్రశ్నించింది. తన స్వభావాల్ని చెప్పి ఆమెపై తన మోహాన్ని వ్యక్తం చేసి నీవంగికరిస్తే మరుని సామ్రాజ్యాన్ని పరిపాలిద్దామని ఆ తుమ్మెదరాయడన్నాడు.

అపుడు ఉగ్రురాలైన ఆ సుమకాంత నీవంటి నీచులకు కన్పడకుండా యిట్టి అడవికివచ్చి నివసిస్తుంటే ఇక్కడికి వచ్చి ఇంత ఘోరంగా పల్కుతున్నావేంటి

అని ఎఱ్ఱబడ్డ కళ్లనుండి అగ్నికణాలు రాల్చింది. కన్నుమిన్నుగానక వ్యవహరించే నిన్ను శపిస్తే భస్మమై పోతావని ఆడు సింహంలా గర్జించింది

అపుడా తుమ్మెదరాయడు భయపడి నీవు నన్ను కోపగించకు లోకంలో ఎందరో స్త్రీలను చూచాను. ఎవర్నిచూచినా పురుషుల్ని మోహపరిచే వారేగాని నీలాంటి సుశీలయైన వనితనెక్కడా చూడలేదు నీవెవరో నాకు తెలుపమని కోరాడు

వెంటనే కోపోపశమనం కలిగిన ఆ కుసుమకాంతనేనెవరని చెప్పేది? నా చెరలు విడిపించి నన్ను పూజించే సరియైన మానవులు ఈ జగత్తులోనే లేరు. కామాంధులకు, పుత్రవాంఛాపరులకు కనపడకుండా ఈ అడవిలో ఎంతో కాలాన్నుంచీ నివసిస్తున్నానని కంటనీరు పెట్టింది

అపుడు తుమ్మెదరాయడు నీవెందుకు చింతిస్తావు మన ముఖ్యమంత్రి రాజాజీ ఉన్నాడు, ప్రెసిడెంట్ రాజేంద్రప్రసాద్, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులంతటివాళ్లుంటే విచారపడడమెందుకన్నాడు?

ఇందర్ని చెప్పావుగాని నెహ్రూ మహాశయుని గూర్చి చెప్పలేదేమి? వారు సమాజశ్రేయస్సుకై చట్టాలుచేసినా నేను లేకపోతే రాచరికానికి రాణింపు లేదు అన్నది కుసుమకాంత.

నీవెవరో చెప్పు నేనిపుడే ఢిల్లీ పోయి నెహ్రూకు నీ సంగతి విన్నవిస్తానన్నాడు తుమ్మెదరాయడు.

కుసుమకాంత కొంతసేపు ఆలోచించి మోతీలాలు ముద్దుల తనయుడైన భారతవీరుడు నెహ్రూ మహాశయునికి నేటి సమాజంలో ఎన్నో రుగ్మతలన వేలెత్తి చూపుతూ వీటికి పరిష్కారం కనుక్కోమని తుమ్మెదరాయనిచేత సందేశం పంపింది.

## కావ్యగత విశేషాలు

సమాజంలోని కాముకతకు చిహ్నం తుమ్మెద. స్త్రీలయొక్క పవిత్రతకు ప్రేమకు చిహ్నం కుసుమకాంత వారిద్దరి మధ్య జరిగిన సంభాషణమే ఈ

తుమ్మెద సందేశం "యధారాజా తధాప్రజా" అన్న విధంగా ముందు ప్రభుత్వం సంస్కరింపబడితే తరువాత ప్రజలు సన్మార్గులౌతారని రచయిత్రి భావన ఈ అభిప్రాయాన్నే ముందు విన్నపంలో వ్యక్తం చేశారామె.[1]

దేశంలో పవిత్రత, ప్రేమ అడుగంటిపోయి పశుకామవాంఛ విచ్చల విడిగా వ్యాపిస్తోంది స్త్రీలలో గూడ అలసత్వం వ్యాపించింది తుమ్మెద కుసుమంతో ఈ మాటలే అంటుంది నినుకోరుకొంటున్నానన్న తుమ్మెదపై కుసుమం ఉగ్రరూపాన్ని దాల్చింది. అపుడు తుమ్మెద గడగడవణికి

కొమ్మరో నీ విపుడు కోపింపకమ్మ
ఎంతెంతమందినో స్త్రీల చూచితిని
నీ వంటి నాతినే చూడలేదమ్మా
తలయెత్తి పిలిచెడు తరుణిలేగాని
మోమెత్తి మురిపించు మహిళలేగాని
కండ్లెత్తికాంచెడు కాంతలేగాని
నినుబోలునాతినే చూడలేదమ్మా

అని సమాజంలోని స్త్రీల స్వభావం ఎంతగా మారుతోందో వివరించింది ఇట్టి కొందరు స్త్రీలవల్ల సౌశీల్యవతులైన స్త్రీలకు కూడ రక్షణలేకపోయింది.

---

ఆంధ్రదేశము వృద్ధిలోకి రావాలంటే ఆంధ్రులయొక్క నడవడికయే ముఖ్యము పురుషులంతా తుమ్మెద మనసులో వుండే స్త్రీలంతా పూల వనంలో ఉండే పుష్పాలు మాత్రమే అన్నుకొన్నంత కాలము మధుపాన దోషము మాయమవ్వదు. వ్యభిచారదోషముండకపోదు స్త్రీ పురుషులలో ముఖ్యమైనది స్త్రీ కాబట్టి తగినంత మనోబలము, సహనము, శాంతము, దయ, కలుగజేసే విద్య స్త్రీలకు కావాలి, పవిత్రప్రేమ స్వరూపము పుష్పానికి పోల్చబడి తుమ్మెదకు ఆమెకు జరిగిన సంభాషణ

"యధారాజా తధాప్రజా" అన్నట్లు ముందు నాయకులు ప్రేమ పవిత్రతలకోసం ప్రయత్నిస్తే ప్రజలుకొన్నాళ్లకైనా బాగుపడగలరేమో

1. విన్నపం: తుమ్మెదసందేశం — సుంకేరమణి రామచంద్రరావు పుట—1.

అందుకే ఈ కుసుమకాంత కానలకు పోయిందని అంతకంటె గత్యంతరలేదని ఈ రచయిత్రి కల్పనచేశారు. అక్కడ కూడ పీరిబాధ తప్పలేదు. ఈ తుమ్మెదే దాని కుదాహరణం

నా చెరలు విడిపించే నాధుడులేదని, వలసపోయిన పతివ్రత సుమస్త్రీ తుమ్మెదతో చెప్పుకొని వాపోయింది.

నా చెరలు విడిపించినన్ను పూజించు
సరియైన మానవులు జగతిలో లేరు
మోహాంధులా కండ్లకగుపడకుండ
పురుషవాంఛావరులకు పట్టువడకుండ
ఈ కానలోపలా ఏకాంతముగను
వేచియుంటీనయ్యకాలంబుకొఅకు
ఎంతకాలంబైన వేచియుండీనా
నన్ను విడిపించేటి నాయకుడులేడు.

అని వాపోతుంటే తుమ్మెద కొందరు దేశనాయకులను ప్రస్తావించి వారు నీ గురించి ఆలోచిస్తున్నారని అంటే వారితోపాటు నెహూృని కూడ గుర్తుచేసి కొని ఆయన ఎన్నో శాసనాలు చేస్తున్నాడు. వాటిలో పవిత్రత గన్క లేక పోయినటైతే నిష్ప్రయోజనమన్నది పుష్పకాంత. అపుడు తుమ్మెద నీవేం చెప్పదలచినావో చెప్పు నేను ప్రధానికి తెలియజేస్తానన్నది.

అపుడు పుష్పకాంత సందేశాన్ని చెప్పనారంభించి —

భారతదేశపు వీరప్రధాని నెహూృ
వినవయ్యసందేశం విశదంబుగాను
భరతమాతకు నేను ప్రథమపుత్రికను
ప్రేమతొడుగులతోడ జన్మించినట్టి
ప్రేమ, పవిత్రతయె నానామధేయంబు
అని తనను పరిచయం చేసికొని

భారతమాతకు చెరలు విడిపించి
స్వర్గస్థుడయ్యెనే మహాత్మగాంధి
ఆంధ్రరాష్ట్రము కోస మసువులర్పించి
పొట్టి శ్రీరాములే అమరజీవయ్యె

అని అంటూ ఇప్పుడైనా నా బాధ తీరుతుంది, నా చెర విడిపింపబడు తుంది, నా అజ్ఞాతవాసం తొలగిపోతుందనుకొన్నాను నా పుట్టిల్లు భారతదేశ మేనని ఈ దేశపు స్త్రీలు నన్ను మరచిపోరనుకున్నాను. సజ్జన పురుషులు మనస్సుల్లో నన్ను మరచిపోరని ఎంతో ఆశపడ్డాను. నా ఆశలన్నీ నిరాశలై పోయినాయి. నా కంటనీరు వరదలై గోదావరి కృష్ణలుగా ప్రవహిస్తోంది. నా కంటి మంటలే ఎన్నెన్నో ఊళ్లను కాల్చి వేస్తున్నాయి అంటూ మరల —

గృహస్థధర్మంబె గంగలో గలిసె
జారస్త్రీలా చేత జగమంత నిండా
ఇల్లాళ్ళ బ్రతుకులే ఇంటిలో క్రుంగే
కోటేశ్వరులైన కొద్దివారైనా
లక్షాధికారైనా భిక్షకులైనా
విద్యలెన్నియు నున్న బిరుదులెన్నున్నా
నేను లేనట్టి ఈ నరజీవితములు
నరపశువులని నేను నొక్కి చెప్పెదను
కులకాంతలాచేత కళకళలాడే
విలువైన గృహములే వెలవెలబోయె
పరికించుచుంటివా పండిత నెహ్రూ
భరతదేశములోని పవిత్రతేది
అని వెదుకుచెరుగరా? వెలదులా మీరు

అని ఎంతో ఆవేదనతో ప్రశ్నించింది పుష్పకాంత అపుడు తుమ్మెద నెహ్రూ చేయువలసిన పని ఏమిటో వివరించమని అడిగింది ఆ మాటలక కుసుమకాంత

స్త్రీలందు దుర్బలత తొలగిననాడు
పురుషులలో అబలత్వమంతరించునుగా

అని అంటూ సహనంలో భూమాతకు ప్రతిరూపమైన స్త్రీ మోహాంధకారం లో చిక్కుకోకుండా పాతివ్రత్యాన్ని పెంపొందించుకొంటూ నన్ను తలచుకొని పవిత్ర హృదయలైతే పురుషుడేం చేయగలడు అంటూ పురుషస్వభావాన్నిలా వివరించింది.

నేటి పురుషుల జాడ నిజముగా జూడా
కామినుల కండ్లకూ కండ్ల జోడులుగా
మోహవనితలతోడు మురుగులూకారా
రూపవనితలచేతి రుమాళ్లు కారా
ఈ నాటి యువకులా జాడ చూడగను
తుమ్మెదల మనసుల తుంటరులు కారా

అని అంటూ నా మాటలుగా నెహ్రూతో ఇలా చెప్పమంది.

ఇంకకొద్దివాళ్లు ఇట్టులేయున్నా
భారతదేశపు ప్రజల లెక్కలలో
స్త్రీపురుషుల సంఖ్య విడదీయకుండా
స్త్రీలనివేయుటే క్షేమమని చెప్పు
నూరేండ్ల నిండినా ముదుసలులైనా
కామంబుచావదే కాలంబులోను
యౌవ్వనంలో నున్న స్త్రీ పురుషులకును
యుక్తాయుక్తాములు ఎట్టులుండునుగా

అని సూటిగా నెహ్రూను ప్రశ్నిస్తూ పురుష స్వభావాన్ని తూర్పారపట్టింది. కేవలం సమస్యలను ఏకరువు పెట్టి అంతటితో చేతులు దులుపుకోలేదు నెహ్రూ చేయవలసిన పనులను వివరించింది

భారతదేశపు ప్రధాని నెహ్రూ
వినవయ్య చెప్పెద విశదంబుగాను
యువతీయువకులకెల్ల విద్యలు చెప్ప
పాఠశాలలనెల్ల వేరుగా జేసి
స్త్రీవిద్యమృదువుగా సహనంబుతోను
మనసుకు బలమిచ్చు మంచివిద్యలతో
భారత దేశపు బాలికలనెల్లా
ఇకముందునుండైన ఇంటింటవారు
హద్దుపద్దులతోను హెచ్చరికతోను
అర్భకతలొలగెడు బోధలతోను

ఏనాడు అతివలకు అలవరచగలరో
ఆనాడే అవునయ్య అమర రాజ్యంబు

ఈ దేశం బాగుపడడానికి మూలకారణం చక్కగా వివరించింది కేవలం డిగ్రీల చదువులు సంస్కారాన్నియ్యవు. డంబాల వేషాల డాంబులేగాని నేటి యువతలో ఆత్మబలమేది? హృదయనైర్మల్య మేది నేటి యువతకు వీటిని అలవరచడానికి ప్రయత్నించు

భారతదేశము బాగుపడునాడు
ప్రతిమనిషివ్యక్తినని చాటించువాడు
మానుషత్వముతోను మరి నిల్చువాడు
ఆ కీర్తినీదేను అగ్రనాయకుడ

అని చెప్పి ఎన్ని డిగ్రీలున్నా ఎంతటి నాయకులు మహానాయకులైనా ప్రేమ, పవిత్రతఅనబడే నేను లేకపోయినట్లైతే నీ రాచరికానికి రాణింపులేదు అనిచెప్పి

కంటి వావాకంటినీటి కాల్వలను
వింటివా నా మనసు వింతఘోషలను
అని కుసుమకాంత పలుకుతుండగా తుమ్మెద
నేనీ సందేశాన్ని నెహ్రూ కందిస్తానని ఢిల్లికి పయనం సాగించింది

ఈ సందేశంలో రచయిత్రి చెప్పదలచినవి రెండే విషయాలు స్త్రీపురుషులు కాముకులైతే జాతి దుర్బలమౌతుంది
దేశ సౌభాగ్యం అడుగంటి పోతుంది

యువత సౌశీల్యవంతం కావాలంటే డిగ్రీల చదువులేగాక సంస్కారాన్ని అలవరచుకోవాలి.

ఈ రెండు విషయాలలో ప్రభుత్వంలో బాధ్యత ఎంతో ఉన్నది "యధా రాజా తధాప్రజా" అన్న విధంగా ప్రభుత్వంలో మార్పువస్తేగాని ప్రజల స్వభావాల్లో మార్పుండదు అందుకే ఈ రచయిత్రి ప్రధాని నెహ్రూను

భారతదేశములోని పవిత్ర తేదీ
అని వెతుకు తెరుగరా? వెలదులా మీరు?

అని సూటిగా ప్రశ్నించింది. ఇట్టి ఉదాత్త సామాజిక స్పృహతో కూడిన సందేశ కావ్యం ఈ తుమ్మెద సందేశం

ఇందులో ఒక అబల ఆర్తి ఉన్నది సమాజ సంస్కరణ ధ్యేయమున్నది

సాధారణంగా సందేశకావ్యాలలో ఉండే మార్గవర్ణన దీనిలో లేదు. సందేశాన్ని తీసుకొని పోడానికి తుమ్మెద తనకు తాను దూతకార్యానికంగీకరించింది

ఈ తుమ్మెద సందేశం అల్పమైన కథావస్తువు కలదైనా సమాజానికి అనల్పమైన ప్రయోజనాన్ని చేకూర్చుతుంది ఈ విషయంలో రచయిత్రి కృతకృత్యురాలైంది.



# సందేశ కావ్యసందేశసారం

# పంచమాధ్యాయము



**ఇందులో**

సందేశకావ్యాల్లోని వస్తువైవిధ్యం ప్రాచీన వైభవవర్ణన వివిధ సంస్కృతాంధ్ర కవుల ప్రశస్తి వివిధ సామాజిక స్థితిగతులు నాయక శిరోమణి ప్రశంస క్షేత్రవర్ణనాదులనుగూర్చిన విశేష విషయాలు వీక్షించవచ్చు

39]

# సందేశకావ్య సందేశం

కావ్యవాఙ్మయంలో ఒక విశిష్ట ప్రక్రియ సందేశకావ్యం ఇతరకావ్యాల వలెనేయిది కూడ సహృదయ పాఠకలోకానికి తద్వారా సమాజానికి విజ్ఞానాత్మకమైన సందేశాన్నందిస్తుంది.

తొలి సందేశకావ్యకర్తయైన కాళిదాసమహాకవి కావ్య వాఙ్మయంలోనే విప్లవాత్మకమైన మార్పుతెచ్చాడు కావ్యంలోని నాయకలక్షణాలైన ధీరోదాత్తాది గుణాలను సరకుజేయక పుష్పనటుకుడైన సామాన్యోద్యోగిని కావ్యనాయకుణ్ణి చేశాడు.

ఆ మహాకవి కావ్యం ఆదర్శంగా గ్రహించిన ఒక కవి సమాజంచేత అంటరాని వాడుగా చూడబడుతున్న చెప్పులుకుట్టుకొని బ్రతికే హరిజనుడిని కధానాయకుని కావించాడు

సందేశకావ్యకర్తలు కావ్య నిర్మాణ స్వరూపంలో కాళిదాస మేఘదూతాన్ని ఆదర్శంగా గ్రహించినా కధాకల్పనలో ఎన్నోమార్పులు చేసి తమ స్వాతంత్ర్యాన్ని వెల్లడించుకొన్నారు.

## వస్తు వైవిధ్యం

సాధారణంగా ప్రియునికిగాని, ప్రియురాలికిగాని సందేశం పంపించడం ఉన్నది దానికి భిన్నంగా పరమేశ్వరుడికి సందేశం పంపడం జరిగింది గబ్బిలంలోను, ఇనసందేశంలోను.

తన ప్రియుడు రామగిరిలో ఉండవచ్చునని తెలిసినా యక్షకాంత ఉన్మత్తురాలైన తన ప్రియుడు ఎక్కడైనా పోయి ఉండవచ్చునని మేఘంతో అన్న యక్షకాంత భారతదేశమంతా వెదకిఎక్కడున్నా తనప్రియునకు వార్తచేరవేయమన్నది. కధలో మార్పుకోసం, మార్గవర్ణనను విస్తృతంచేయడానికి తన ఆంధ్రమేఘప్రతి సందేశంలో ధావాడవారు ఈ కల్పనచేకూర్చారు.

ఇదే విధంగా మధ్యప్రదేశంలోగూఢ విహారయాత్రామధ్యంలో తప్పిపోయిన తన ప్రియురాలికి సందేశం పంపించడానికుద్యుక్తుడైన యువజనుడు పవనుని దూతగా గ్రహించి గమ్యస్థానం తెలియకపోవడం చేత పవనుని భారతదేశమంతా ప్రదక్షిణచేయించాడు. అంతేగాక పవనునకొక సుదీర్ఘమైన వీరగాధ విని పించాడు చైనాతో భారతదేశానికి సంభవించిన యుద్ధంలో టి ఎ. రాయలు అనే సైనికుని వీరమరణాన్ని తెలిపే అద్భుతగాధ వర్ణితమైనది.

తెలుగు సందేశమనే కావ్యంలో నాయిక రెండు జన్మలు కలదిగ కధా కల్పన జరిగింది. తొలిజన్మలో సాహిత్యానికి స్వర్ణయుగమైన ప్రబంధయుగంలో ఉత్తమ ప్రబంధమైన వసుచరిత్రకావ్యనిర్మాత రామరాజ భూషణునితనయగాను, తరువాత జన్మలో అతని అనుసరించి ప్రతిపద్యచమత్కృతిలో ప్రబంధరచన చేసిన చేమకూర వేంకట కవి తనయగాను జన్మించింది.

వంద సంవత్సరాలు యోగసాధనలో గడిపింది. ఈ విధంగా రెండు వందల సంవత్సరాల తెలుగు వాఙ్మయవైభవానికి దర్పణంగా కావ్యనాయిక రెండు జన్మల జీవితాన్ని చిత్రించాడు కవి ఈ కావ్యంలో తెలుగుతల్లిదూతగా వ్యవహరించింది. దూతయైన ఆమెను నాయిక ప్రశంసించే సందర్భంలో వేయి వసంతాల తెలుగు వాఙ్మయ వైభవం విపులంగా వర్ణితం.

అనిల సందేశంలో భూదేవి నుండి వార్తను మేఘుని వద్దకు తీసుకొని పోయిన అనిలుడు కేవలం వార్తను చెప్పడంగాక మేఘునితో విస్తృతంగా సంభాషించాడు. ఈ కావ్యంలో మార్పు అది అంతేగాక అనిలుడు తనకు తాను గా భూదేవి వద్ద దూతకార్యానికంగీకరించాడు.

తనను బలాత్కరింపవచ్చిన తుమ్మెదరాయని మనసు మార్చిన సుమ కాంత అతని చేతనే భారతదేశప్రధాని జవహర్‌లాల్ నెహ్రూకు సందేశం పంపింది. ఇక్కడ స్వీకారంలో చక్కని మార్పు ఉన్నది.

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి కీర సందేశంలో దూత ఎక్కడికి పోవాలో అక్కడికి వెళ్ళిన తరువాతనుండి కధప్రారంభమౌతుంది. కేవలం దూతే ఇందులో ప్రముఖ పాత్రవహించింది. దూత శాప విమోచనం కూడ ఈకావ్యంతో కల్పింప బడ్డది.

ముందు ఒక దూతను పంపి తరువాత అంతకంటే వేగంగా పోగల శుకాన్ని రుక్మిణి కృష్ణుని వద్దకు దూతగా పంపింది. ఇదికూడ దూత కావ్య కథా వైవిధ్యమే.

ఏకశయ్యాగతులైన దంపతులలో ప్రణయకుపితయైన తనపత్నికి తనకు దౌత్యాన్ని నిర్వహించమని పతి చంద్రుని అర్థించడం చమత్కారోపేతమైన చక్కని కల్పన ఇది విశ్వనాథవారి శశిదూతం

కేవలం మేఘదూత ఆధారంగావచ్చిన కావ్యాలైనా కవులు తమప్రతిభను ప్రదర్శించి వస్తువైవిధ్యాన్ని సాధించి ఉత్తరోత్తర కవుల కాదర్శులైనారు లేకపోతే సందేశకావ్యాలు మూసలోపోసినట్లు నీరసమైపోయేవి

## ప్రాచీనవైభవవర్ణన

జాతికి గతచరిత్ర అనుభవాల ఆస్తి. గతచరిత్రలో ఉత్తేజాత్మక సంఘటన లనేకముంటాయి వర్తమాన సమాజం వాటిని తెలిసికొని భావితరాల్ని తీర్చిదిద్దు కొనవలసిన అవసరమెంతో ఉన్నది. యువతరం గత వైభవంనుంచి స్ఫూర్తిని పొందాలి అందుకు కవుల బాధ్యత ఎంతో ఉన్నది. సందేశకావ్యకర్తలు తమ కావ్యాలలో ప్రాచీనవైభవాన్ని అద్భుతంగా వర్ణించి కవులుగా తమ బాధ్యతల్ని నెరవేర్చుకొన్నారు. నిర్వీర్యమౌతున్న ఈ జాతిని పునరుజ్జీవింప ప్రయత్నించారు. దీనికి ప్రధానంగా తనదూతకు మార్గనిర్దేశం చేసే సమయంలో వివిధ వర్ణనలు చేస్తూ అందులో ఈ ప్రాచీనవైభవాన్ని శక్తికొలది వర్ణించారు

బౌద్ధమతం ఒకప్పుడు భారతీయ జన జీవితాన్ని ఎంతో ప్రవిభాతం చేసింది. సామ్రాట్ అశోకుని వంటి ప్రభువులు అహింసామూర్తి బుద్ధదేవుని ప్రబోధానికి దాసోహమన్నారు. మహామేధావి ఆచార్య నాగార్జుని వంటి మహనీయులు ఆ మతవ్యాప్తికోసం ఎంతోపాటుబడ్డారు. అట్టి బౌద్ధం యొక్క పూర్వ వైభవాన్ని జాషువ మహాకవి గబ్బిలంలో ఈ విధంగా వర్ణించారు

ఈ విధంగా అభివర్ణించటానికి అంతరహేతువు కవి అర్షధర్మంలో పొడగట్టేకొన్ని అసమానతలే

దర్శింపగలవు గౌతమ బుద్ధదేవుని
ప్రాచీన భారతశిల్పంబునందు
సాధింపగలవహింసామంత్ర రాజమ్ము
శాక్యసింహుని కాలిజాడలందు
తెలిసికోగలవు బౌద్ధుల సాహితీసేవ
అమరసింహుని కవిత్వమునయందు
వీక్షింపగలవు కపిలవస్తునగరంబు
నాశన దేవ్యధీనంబునందు

రెండువేలేండ్లక్రింద నిద్రించుచున్న
మౌర్యరాజుల విపుల సామ్రాజ్యచరిత
ఏకరువుపెట్టుప్రకృతియందాకళించి
వెచ్చవెచ్చని కన్నీరు విడువగలవు

ఈ పద్యం చదువుకొన్న తరువాత పాఠకునికి ఈ గతచరిత్ర తెలిసికోవాలనే కుతూహలం కల్గుతుంది ఇదే విధంగా మరుత్ సందేశంలో రాజపుత్రుల సాహసౌదార్యాల్ని గూర్చి రచయిత యిలావ్యక్తం చేశారు.

శాంతశమదమాదిషడ్గుణాన్వితులయ్యు
రాజపుత్రవరులు రణమునందు
నరిమదేభములకు హరులు నూసిగ్గున
మ్రగ్గపతుల రతుల ప్రబలినట్లు

తెలుగుదేశం దయావీరపుత్రులకు యుద్ధవీరులకు సాహసగాథలకు ధామం. అవి చదువుతుంటే పాఠకుడు ఉత్తేజితుడౌతాడు. ఇటువంటి ప్రాచీనవైభవాన్ని తెలుగుజాతికి చెందిన సందేశకావ్యకర్తలు సముచితంగా తమకావ్యాల్లో వర్ణించారు. జాషువ మహాకవి తన గబ్బిలంలో ఇలా అన్నారు

"కలవెన్నో విషయంబు లాంధ్రుల కళాకౌశల్యముల్ సాటు
లావులు..... . .. .....
కలవిప్డున్ బలనాటి పౌరుషపు రేఖల్ మా శరీరంబులన్"

ప్రాచీన రాజ్యవైభవాన్ని ఎడ్లపల్లి జోసెఫ్ కవి తమ ఇనసందేశంలో ఇలా వ్యక్తం చేశాడు.

కీర్తితో మత్తిలు రెడ్డి భూపతులు
　　కిరీటమందేకొండవీడుప్పురంబు
వాడమారిన కత్తిపాపరాయునచేత
　　పొగరెక్కనల్లదే బొబ్బిలందు
మడమదిప్పక కాలు ఖడ్గ తిక్కన తోడు
　　పోరుచుండెనట నెల్లూరినందు
మోడువారనిగుండె కీడుచోడౌరాయ
　　లంబారు నల్లదే హంపియందు

రాజ్యగర్వంబులచ్చోటరానిపోని
కదనరంగంబు కవనరంగంబు జేయు
మహిమగలయట్టి కవిచక్రవర్తులేరి?
యేలి నరసరాజు చరిత్ర వెలుగుమోయి[1]

తెలుగుదేశంలో వీరపూజచేయడం ఆచారం. యువత అత్యంతోత్సాహంతోపోల్గొనేది. పుట్టపర్తివారు తమ మేఘదూతంలో ఆ ఉత్తమ సంప్రదాయాన్ని వ్యాఖ్యానించారు.

కనిపించురా! వీర
గల్లులచ్చట నీకు
వర్షింపుమొక్క తడి నిలచీ - భూతనా
యవకుని బలగములందు దలచీ - తెల్గులకు
వీరపూజలసేతవెన్నతో బెట్టినది
వీరులెవ్వరు నేడు వీర పూజలు సేయ

హంపీ విజయనగరం పేరు వినగానే సాహిత్య సమరాంగణ సార్వభౌముడైన మూరు రాయరగండని రాజ్యవైభవం గుర్తుకు వస్తుంది ఆ వైభవాన్ని రాఘవ కవి ఇలా తెలియజేశారు.

---

1 ఇందులోని ఛందోదోషాలు మూలంలోవే. నేను యథాతథంగా ఉద్ధరించాను

తెల్గుతేజం బెల్ల దిక్కుల కెగ్రబ్రాకి
పగవాని బెదిరించివచ్చునపుడు
తెల్గుశిల్పుల సుత్తి దెబ్బ ఖంగున మ్రోగి
చీనాకుపయనంబు సేయునపుడు
తెల్గుకవిత్వంబు దిగ్దంతుల ముఖాన
బృంహితధ్వనులుగావించునపుడు
తెలుగుజెండాశక్తి నలుదెసల్ ప్రసరించి
విద్యానగరవీధి వెలుగునపుడు
రామలింగని హాస్యకార్యములు దలచి
నాల్గు దిక్కులు కడుపుబ్బనవ్వునపుడు
నాట్యమాడిన యా నంద నవ్యలక్ష్మి
కాను పించెనె? శిధిల దుర్గములయందు

గబ్బిలం తిరిగి వచ్చిన తరువాత ఆనంద నవ్యలక్ష్మి ఆ శిధిల దుర్గాలలో కన్పడిందా? అని అడిగాడు అతని ప్రశ్నకు గబ్బిలం సమాధానం చెప్పకపోయినా పాఠకుని హృదయం ఊహల్లో విజయనగర రాజవీధులను తిరిగి ఆనందాన్ని పొందుతుంది

పుట్టపర్తివారు రెడ్డిరాజుల తెగువను తన మేఘదూతంలో ఇలా వ్యక్తం చేశారు.

రెడ్డిరాజుల తెగువ
గట్టిపోయినదొడ్డ
సోపానపంక్తి గమనించీ – కాలమున
ఒరిగిపోయినకీర్తినెంచీ – యాటవిక
రతిపరిమళకవితతశిలావేశ్మముల
జాగుచేయక ముందు సాగవోయీ జలద

ఒకప్పుడు తెలుగువారిని శైవమతం ఎంతగానో ప్రభావితం చేసింది. శైవ వాఙ్మయ సృష్టి ఎంతగానో జరిగింది. ఆ వాఙ్మయానికాధారమైన

మరాలు తెలుగుదేశం నాల్గువెరగులా ఒకప్పుడు వ్యాపించి ఉన్నాయి. వాటీ వైభవాన్ని నేటి స్థితిని పుట్టపర్తివారు తాము వైష్ణవులైనా ఈ విధంగా తెలియ జేస్తున్నారు.

ఆనాడు శ్రీశైల
మందుకోసగియందు
కోటిపలిపుష్పగిరులందూ - శివమూర్తు
లుంద్రు గురువుల మఠములందూ - నెడచర
పాడుగోడలు — తీరుబాటు గాలయగీతి
పాడుచుండెడినట్టి బ్రహ్మరాక్షసి గణము

ఇలా సందేశకావ్యరచయితలు జాతిగత వైభవాన్ని వర్ణించి నేటితరానికి స్ఫూర్తిదాయకమైన సందేశాన్ని అందించారు

**భారతీయకవిపండిత ప్రాభవం :** ఒక దేశంలోని సంస్కృత వికాసానికి ఆ దేశంలోని వాఙ్మయమే పునాది. అందునాకాంతాసమ్మి[illegible][1] ఉపదేశాన్నిచ్చే సాహిత్యం సంస్కృతీ వికాసంతోపాటు మానవునికి మానసిక వికాసాన్నికూడా కల్గిస్తుంది. సమాజానికి యింతటి మహోన్నతమైన మేలు కూర్చే సాహిత్యాన్ని సృష్టించిన కవిపండితులను కనీసం మనసారా ప్రస్తుతించుకోవడం ఆ జాతి జనులకర్తవ్యం.

సందేశకావ్యరచయితలు దూతకు మార్గోపదేశం చేసే సందర్భంలో కవి పండితులను సముచితంగా ప్రశంసించారు

ఈ జాతి సంస్కృతీసౌధనిర్మాణానికి పునాదులు చేసినవారు వ్యాస వాల్మీకులు వారేలేకపోతే ఈ జగతి జగద్గురుత్వాన్ని వహించేదికాదేమో! వారు మనకు ప్రాతఃస్మరణీయులు. జాషువ మహాకవి తన గబ్బిలంలో వారినిలా ప్రస్తుతించాడు.

---

1 "కావ్యం యశసేర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయా ఉపదేశయు జే" ప్రథమోల్లాసః
కావ్యప్రకాశః అచార్యమమ్మట భట్టు.

వ్యాస వాల్మీకి ముని మదేభములు రెండు
దిరుగుచుండెనె? కైలాస గిరులమీద
వారి వార్ధక్యమునసీకు స్పష్టమగును
భరతరామాయణంబులపడుచుదనము
ఆ వాల్మీకి నిసర్గజంతుకరుణావ్యాసక్తియేసత్కవిన్
గావించెన్ వెడలించెరాముని కథా గాంగేయముం గానిచో
త్రోవల్ గొట్టెడుబోయకే గురువు నేర్పుం దివ్య గిర్వాణమున్
ఆవేశించి కళాధిదేవి వరమీయన్ విద్యలే మాత్రముల్

**కవికులగురువు కాళిదాస మహాకవి .**

వ్యాస వాల్మీకుల తరువాత వారిసరసనే వారిలో సమస్థాయిని నిల్పదగిన కాళిదాసు వాల్మీకి హృదయసంపద, వ్యాసుని సమన్వయాత్మక నిశితమేధ శక్తుల సమ్మేళనంగా ఆవిర్భవించాడు.

సందేశకావ్య ప్రక్రియకు మార్గదర్శకుడు కాళిదాసు. కాబట్టి ప్రతి సందేశకావ్యకర్త ఆయన్ను సంస్మరించక తప్పదు. అందుచే జాషువ కవి మేఘదూతాన్నిలా సంభావిస్తారు.

"ఎదురై వచ్చెనె కాళిదాసుని లసచ్ఛృంగార సందేశ మం
బుదమార్గంబునఁద్రసంబులు ధ్వనుల్ ముత్యాలు వర్షించెడిన్
పది నూరేండ్ల పురాణ మేఘమనుచున్ భావింతువో, నిత్యముం
బదియారేండ్ల వయస్సు కూర్పదె సుకావ్యస్పర్శజేజెమ్మకున్"

జేజమ్మకుకూడా నూత్నయౌవనోత్సాహాన్ని చేకూర్చే కావ్యంగా మేఘదూతం అద్భుతంగా పేర్కొనబడింది. కావ్యరామణీయకమంటే అదే 'క్షణే క్షణే యన్నవతాముపైతి, తదేవరూపం రమణీయతాయాః' అన్న మాఘకవి వాక్యం మేఘదూతానికి బాగా చెల్లుతుంది.

**విద్యానాథుడు:**

సంస్కృతాలంకారికులలో ప్రముఖుడు, ఆంధ్ర చక్రవర్తి ప్రతాపరుద్రుని ఆస్థానకవి ఇతడు ప్రతాపరుద్రయశోభూషణమనే అలంకార శాస్త్రగ్రంథం విర

చించాడు ఇం౯ లో రూపక ప్రకరణంకూడా ఉంది. యావద్భారతంలోని పఠన పాఠనాలోఉన్న శాస్త్రగ్రంథమిది అట్టి విద్యానాధుని పుట్టపర్తివారు తమ మేఘ దూతంలో ఈ విధంగా ప్రస్తావించారు.

అవట విద్యానాథు
డమరకవి గన్పించు
చీకిపోయిన గుండియలలో నేత్రముల
నాకట్టు బాష్పసంతతితో నడుధేల
ఆ మహాత్మునిమించుటడుగు దమ్ముల బాద్య
మర్పించికదరా! యతడు శంభుని మూర్తి

## రవీంద్రకవీంద్రుడు .

బెంగాల్ రాష్ట్రానికే గాక యావద్భారత దేశానికి జాతీయకవిగా విశ్వానికే విశ్వకవిగా కొనియాడబడుతున్నవాడు, తన కవితకు నోబెల్ బహుమతిని పొందినవాడు ప్రాచీన ఋషుల అడుగు జాడలలో శాంతినికేతనమనే విద్యాలయాన్ని స్థాపించిన ఋషితుల్యుడు రవీంద్రకవీంద్రుని మరుత్సందేశంలో ఆ కావ్యరచయిత ఈ విధంగా కొనియాడారు.

ఈవు బోల్పురికరిగి రవీంద్రువెండి
గడ్డమునకు వేయుమిక బంగారుపూత
తన్ని కేతన తరులంతాంతాలు చిమ్మ
పుష్పోడులతోడ నది కవి మునికి నధిక
తృప్తినిడును నోబెలు బహుకృతులమించి

## కవి త్రయం

తెలుగువారికి ప్రాతస్స్మరణీయులు కవిత్రయం నన్నయ, తిక్కన, ఎఱ్ఱన లు, ఆ త్రిమూర్తుల్ని సందేశకావ్యకర్తలీ విధంగా సంస్మరించారు

**నన్నయః**

గబ్బిలంలో—జాషువా మహాకవి ప్రసంస:-
రెండున్నరపర్వంబుల
పిండినరసమొలుకునట్టి వెనుజెలుకుగడన్
బాండవుల చరితనన్నయ
బండించెందెలుగులోన బ్రజ్ఞాన్వితుడై

పుట్టపర్తివారిలా భావించారు

నన్నయ్య తన కవిత కెన్నితపములుచేసి
తెన్గు వేదము వ్రాసినాడో! తనవీర
మెన్నిదినములు ద్రాగినాడో! మరచేల
వృచ్ఛసేయగ—నెందరెంత యత్నించినా
నన్నభట్టుల త్రోవనందుకొననేలేదు

ఇలా ఎంత చెప్పినా ఇంకా ఎంతో చెప్పలేదనిపిస్తుంది అందుకే ఇలా అంజలిస్తే కొంత తృప్తి.

వాచాం ఆంధ్రమయీనాంయః
ప్రవక్తాప్రధమోభవత్
ఆచార్యం తం కవీంద్రాణామ్
వందేవాగను శాసనం

**తిక్కన :**

మేఘదూతంలో పుట్టపర్తివారి ప్రశంస
మనుమసిద్ధి నృపాలు
మామయగు తిక్కన
యజ్ఞవేదిక గట్టినాడూ పెన్నగ
ట్టున జన్నము హవించినాడూ ఆ సోమ
యాజియజ్ఞఫలంబె యాంధ్రకవితల యందు
ఈనాడు గూడ భాసించుబోరసమయము

**ఎఱ్ఱన :**

మేఘదూతంలో పుట్టపర్తి వారి ప్రశంస :

ముగురుమూర్తులకెక్కి
తెగువతో భారతము
కలముతో దాటించినాడు - శంభు దా
సుడు హృదయమున గడలిరేణ - స్ఫురదరుణ
రాగరుచిగల్గు శారదకాలమాకవియు
దారచనలు రెడ్లద్యాగ సంసూచికలు

**భీమకవి :**

తెలుగు వాఙ్మయంలో భీమకవి విశిష్టస్థానం నిగ్రహానుగ్రహసమర్థుడుగా భీమేశ్వరాను గ్రహపాత్రుడుగా లోకంలో ప్రచారాన్ని పొందాడు ఆ మహా కవిని పుట్టపర్తివారు ఈ విధంగా కొనియాడారు

తిట్లలో తిమ్మయ్య
దీవెనల బ్రహ్మయ్య
భీమకవిబారాడినాడూ - రాజునే
బిచ్చగానిగజేసినాడూ - యొకనాడు
కవుల వాక్యమ్ములే కామధేనువుపొదుగు
కవుల వాక్యమ్ములేగవిసికొను ప్రళయాగ్ని

ఈ విధంగా ఎందరో ప్రాచీనకవుల్ని సందేశకావ్యకర్తలు కొనియాడారు ఆధునిక కవులను గూడ ప్రస్తుతించారు ఆధునిక కవులలో ఎక్కువమంది కవులచేత కీర్తింపబడినవారు సాహితీవిరాణ్మూర్తి విశ్వనాథ సత్యనారాయణగారు మరుత్సందేశంలో తత్కావ్యకర్త విశ్వనాథ నీ విధంగా ప్రస్తుతించినారు.

**విశ్వనాథ' :**

కవిసమ్రాట్టుకళాప్రపూర్ణుడును డాక్టరు పట్టభద్రుండు
త్కవితావాఙ్మయ విశ్వనాదుడడుగోధన్యుండు వేపద్గలన్
ధవళచ్ఛత్రముబట్టుశేషఫణిమీదన్ సద్యశః క్షీర వా
ర్థివసించుంగను మల్లదేసుగుణశార్ధిన్ సత్యనారాయణున్

**శాస్త్రి కృష్ణమాచార్య :**

సంస్కృత భాషావ్యాప్తి జీవన వ్రతంగా గలిగి లబ్ధప్రతిష్ఠులై ఆంధ్ర ప్రదేశ్ ఆస్థానకవియైన కృష్ణమాచార్యను మరుత్సందేశంలో ఈ విధంగా ప్రశంసించారు

'మనయాస్థాన కవీశ్వరుండు బుధసమ్మాన్యుండు డాక్టర్ ప్రసి
ద్ధిని సాహిత్య 'కళాప్రపూర్ణ' బిరుదాప్తిన్ గన్నయాతండు
పేరున గృష్ణుండు ముఖాకృతిన్ శివుడు వాగ్రూఢిన్ విధాతృండు కా
శినిరూఢాన్వయుడార్యవంద్యుడు యశశ్శ్రీమూర్తి గన్గొంటివె

**క్షేత్రయ్య :**

ఆంధ్రదేశంలో జన్మించి దక్షిణాపథంలో నిరంతర సంచారం చేస్తూ తెనుగుజాతి కీర్తి జగద్వ్యాప్తికావడానికి దోహదం చేసినవాడు. ఆ మహనీయుని పుట్టపర్తివారీ విధంగా కొనియాడారు.

క్షేత్రయ్యలేనిదే
తెన్గునకు రుచియేది?
తేనియలుపారించినాడూ - కృష్ణుచే
నట్టువలు ద్రొక్కించినాడూ - నాయకీ
భావమూనిన సుకవి పదము మరగిన స్వామి
నారదాదులపాటపై రక్తి గొలుపదే

**చిన్నయసూరి :**

పద్యవిద్యకు నన్నయవలె గద్యానికి చిన్నయ ఆద్యుడు తెలుగు వాఙ్మయాన్ని నూత్నమైన ద్రోవను త్రొక్కించినాడు చిన్నయసూరి అతిణ్ణి పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు తమ తెనుగు సందేశంలో ఈ విధంగా ప్రస్తావించారు

ముద్దుముద్దుగ మాటలమూటగట్టి
గద్యమునకు దొహదమిచ్చుఘనునినూరి
శాసనంబుల నాంధ్రదేశజుల శిరము
పైన తాల్పఁ నగ్రహీఁపం గదమ్మ

ఈ విధంగా నన్నయనుండి నేటి వఱకుగల ప్రశస్త కవి పండితుల్ని ఆయా సందేశకావ్యాలలో సందేశరీతిలో కవులు ప్రశంసించారు. ఈ కవులు జాతీయాభిమానాన్ని కవులపై ఆదాధన భావాన్ని పరితలలో ప్రేరేచి తమ కర్తవ్యాన్ని తాము బాగా నిర్వహించారు

## పుణ్యక్షేత్రవర్ణనం

సువిశాలమైన ఈ భరతభూమిలో రూపనామభేదాలలో ఒకే భగవంతుడు బహుధా ఆరాధింపడుతున్నాడు "ఏకంసత్ విప్రాః బాహుధావదన్తి" అని వేదమే దీనికి అవకాశాన్ని కల్పించింది త్రిమూర్తులు మొదలైన దేవతల ప్రస్తావన వేదాలలోనే ఉన్నది. ఈ భావన ఆధారంగా ఈ దేశంలో భగవదారాధనాకేంద్రాలుగా ఎన్నో పుణ్యక్షేత్రాలు వెలిశాయి. కాలక్రమంలో ఈ పుణ్యక్షేత్రాలు మనకేగాక ప్రపంచానికే శ్రద్ధాకేంద్రాలుగా విరాజిల్లు తున్నాయి

ఆ పుణ్యక్షేత్రాలలో అతి ముఖ్యమైనవి (విశ్వేశ్వర క్షేత్రం) వారణాసి, కంచి, తిరుపతి, కాళహస్తి, విజయవాడ, శ్రీశైలం మొదలైనవి

ఈ పుణ్యక్షేత్రాలను సందేశకావ్యకర్తలు తమ కావ్యాలలో అతి మనోహరంగా వర్ణించారు

తెలుగుసందేశంలో దూతగా పంపబడుతున్న తెలుగుతల్లి గంతవ్య మార్గాన్ని వివరించే సందర్భంలో ఒకే పద్యంలో అనేక పుణ్యక్షేత్రాలను వర్ణించారు కవి పూతలపట్టు శ్రీరాములరెడ్డిగారు

కాంచుము తొలుదొల్తకంచికామాక్షిని
హస్తిరాడ్వరదునేకామ్రనాథు
లీలజూడుము చోళలింగపురింగల
యో గన్నహరిభవరోగహారి
కలికల్మషంబులదలచుమాత్రానడంచు
శేషశైలేశునీక్షింపుమవల
స్వర్ణముఖింగ్రుంకిశర్వుని శ్రీకాళ
హస్తివరదుగన్నులారగనుము

మొనసి నెల్లూరి రంగనాధునకు మ్రొక్కి
కృష్ణవేణిని మంగళగిరి నృసింహు
మల్లికార్జును సేవించి మహితగౌత
మిని స్పృశించి భద్రాద్రిరాముని భజించు

ఇందులో వర్ణింపబడిన పుణ్యక్షేత్రాలన్నీ సుప్రసిద్ధాలైన దక్షిణదేశీయ క్షేత్రాలే.

**వారణాసి :**

"కాశ్యాంతు మరణాన్ముక్తిః" అన్నది ఆర్షోక్తి. దేశంలోని అతిప్రాచీన పుణ్యక్షేత్రాలలో ఒకటి వారణాసి. ఆ క్షేత్రాన్ని జాషువ కవి తన గబ్బిలంలో ఈ విధంగా వర్ణించారు.

ముక్తిదంబులైన పుణ్యస్థలములందు
ప్రధమగణ్యమమ్మ వారణాసి
అన్నపూర్ణ సేయు నాహారదీక్షతో
ముక్తిభిక్షనీకు ముట్టగలదు

**శ్రీశైలం :**

శ్రీశైలశిఖరదర్శనం పునర్జన్మ లేకుండాచేస్తుంది. శత్రు సంహారానికి లోకజనని భ్రమరాంబ మహారాష్ట్రవీరుడు, భరతజాతి గౌరవాన్ని కాపాడిన మహామనీషి అయిన శివాజీమహారాజ్‌కు ఖడ్గప్రధానం చేసింది. అట్టి మహత్తర క్షేత్రాన్ని పుట్టపర్తివారిలా వర్ణించారు.

మల్లికార్జునదేవ
మల్లికానిభకటా
క్షాంచలంబులజలదరించీ - భ్రమరాంబ
ఇంచు నవ్వులపలకరించి - శ్రీశైల
మెదటగన్పడునీకుమదరతీమ్మృదితకి
న్నరులతో హరులతో దరులతోసొబగారి

## త్రిపురాంతకం :

త్రిపురాంతకం ఆంధ్రదేశంలోని అతిపురాతనమైనది చరిత్రప్రసిద్ధమైనది. మహిమాన్వితమైన పుణ్యక్షేత్రం ఆ క్షేత్రాన్ని గిద్దలూరు చెంచుబసవరాజుగారు తమ వృషభరాజ సందేశంలో ఈ విధంగా వర్ణించారు.

పాల్కురికిసోమన్న బసవపురాణంపు
శ్రీకారముంజుట్టిచెలగుచోటు
అనుభవసారకావ్యశ్రోత శ్రీత్రిపు
రారి వాసగ్రామమైనతావు
ధృడవీరశైవభక్తిస్ఫూర్తిగన్నులు
వడసినదోచమాంబకును నెలవు
వేదశాస్త్రాగమవేత్తజంగమమూర్తి
మల్లినాధుండుల్లసిల్లినపురి

బహుపురాతనమైన భక్తసీమ
నైకరాజన్య సేవితశ్రీకభూమి
శ్రీగిరి క్షేత్రయాత్రికసిద్ధిదమ్ము
ప్రాజ్యమహిమోన్నతము త్రిపురాంతకంబ

## విజయవాటిక :

ప్రకృతిసిద్ధమైన సౌందర్యంచేత విరాజిల్లే ఆంధ్ర సాంస్కృతిక రాజధాని విజయవాటిక. భక్తకల్పవల్లి దుర్గామహాదేవి ఇంద్రకీలపర్వతంపై వెలసిన పుణ్య క్షేత్రం ఎన్నో చారిత్రక గాధలకు సాక్షిభూతమైన నగరం దాన్ని గిద్దలూరు చెంచు బసవరాజుగారు తమ వృషభరాజ సందేశంలో ఇలా వర్ణించారు.

సహజదుర్గంబులై సానుమంతంబులై
పట్టణరాజంబు జుట్టియుండు
గృష్ణవేణీ తరంగిణి శీతపవనాంకు
రములసౌరభ్యంబు ప్రబలునెందు

దెబ్బపియింతయులేక పరుగెత్తు పొగబండ్లు
ధణధణధ్వని కెద్దితావలంబు
దూరశ్రవణయంత్రవార కేంద్రంబయి
దర్శనీయంబుగాదనరు నెద్ది

కనకదుర్గాంబ వెలసినకారణమున
బొలుపుగానే నగరి తీర్థ భూమియయ్యె
ఆపురంబు విజయవాటికాపురంబు
యాత్రికుల కెల్లదర్శనీయంబు సుమ్మి!

**అమరావతి :**

ఒకప్పటి ప్రపంచ విఖ్యాతమైన బౌద్ధారామ క్షేత్రం నేటి శైవక్షేత్రం అమరావతి ఇక్కడ కృష్ణ ఉత్తరవాహినిగా ప్రవహిస్తోంది పంచారామతీర్థాలలో ప్రముఖమైనదిగా కొనియాడబడుతోంది అని కృష్ణరాజ సందేశంలో యిలా వర్ణింపబడ్డది.

ఎచ్చట బౌద్ధాచార్యులిద్ధతేజులు విశ్వ
విద్యాలయముస్థాపించినారు
ఎందుశంకరుడమరేశ్వరుండన్న నా
మమున భక్తుల వాంఛితములుదీర్చు
నెచ్చోట బావన కృష్ణవేణీప్రవా
హమమరేశ్వరుపాదమానివడులు
నేదినేటికి నానాదిశాయాతయా
త్రికకోటికి వినోద తీర్థభూమి

దివ్యమహిత పంచారామతీర్థములను
నెన్న దగినయారామమైయెసగునెద్ది?
యల్లయమరావతీ క్షేత్రమరయుమయ్య
జ్ఞానవిజ్ఞానములు రెండుగాంచగలవు

**దక్షారామం :**

శ్రీనాథమహాకవి ఈ క్షేత్రస్వామి నాయకుడుగా భీమఖండమనే రస వత్కావ్యాన్ని వ్రాశారు. ఆ దక్షారామాన్ని పుట్టపర్తి నారాయణాచార్యులుగారు మేఘదూతంలో ఇలా వర్ణించారు.

అచ్చమగు మోక్షమ్ము
హెచ్చయిన భోగమ్ము
నిచ్చునట ఈ దక్షవాటి - అందులో
దపియింప గానసీవాటి - దిచ్చరిగ
బ్రదికినను నీరెండు బ్రాప్తించితీరునట
కాశికెక్కుడగలదు వీసమీగారవము

భోగమోక్షాలురెండింటికీసమమైన ప్రాధాన్యంగల క్షేత్రం దక్షారామం. దక్షిణ కాశిగా ప్రసిద్ధి. కాశినుండి వెడలగొట్టబడిన వ్యాసముని కాశ్రయమిచ్చాడీ భీమనాయకుడు.

**రామేశ్వరం :**

కాశినుండి గంగను తెచ్చి రామేశ్వరంలోని సముద్రంలో కలిపి రామేశ్వరంనుండి ఇసుకను తీసుకుపోయి గంగలో కలిపితే సంపూర్ణతీర్థయాత్ర అవుతుందని భారతీయుల భావన. ఆ విధంగా ఉత్తరదక్షిణభారతదేశాలను సంపూర్ణంగా దర్శించవచ్చు. అంతటి ప్రాధాన్యంగల రామేశ్వర పుణ్య క్షేత్రాన్ని ఆంధ్ర మేఘప్రతిసందేశ రచయిత రావాడ వేంకటరామశాస్త్రిగారు ఈ విధంగా వర్ణించారు.

విశ్వమహోగ్రపాపములపేర్మిచెడన్ మునురామబద్ధయై
శాశ్వతపుణ్యదంబయియెసెంగెడు సేతువుగాంచి యంతరా
మేశ్వరుపేరిదీవిజొరుమేనుగు శైలము జొచ్చి మాట్కి బ్రా
ణేశ్వరురోయుమచ్చట మహీశ్వరుగేహ సమీపసీమలన్

**సింహాచలం :**

వరాహనృసింహస్వామి ఎందరో సార్వభౌములునతమస్తకులై సేవించిన స్వామి, అంతేగాక ఎందరో కవిపుంగవులచే కీర్తింపబడినస్వామి మరెందరో సాధుపురుషులకు మోక్షాన్ని ప్రసాదించినస్వామి అట్టి వరాహనృసింహునకు ధామం సింహాచల క్షేత్రం ఆ పుణ్యక్షేత్రాన్ని పుట్టపర్తి నారాయణాచార్యులు గారు తమమేఘదూతంలో పూర్వగాధను ప్రశంసిస్తూవర్ణించారిలా

ఆ వరాహనృసింహు
లవతరించినచోటు
గనుగొందుసింహాచలమ్మూ— తెన్నుదే
శమునకు వెలలేని సొమ్ము— అందుకొ
న్మట్లుండు భూదేవి కందంపుజీరగా
నచ్చోటసాగరము— సగరపుత్రులకీర్తి

**కురుక్షేత్రం :**

ధర్మాధర్మాలమధ్యజరిగిన పోరాటంలో ధర్మానికి విజయంచేకూర్చిన ధర్మక్షేత్రం కురుక్షేత్రం గీతాచార్యుడు అర్జునునికి వేదాంతసారమైన గీతోపదేశంచేసిన ప్రదేశం కురుక్షేత్రం దాన్ని జాషువ కవి గబ్బిలంలో ఈ విధంగా కీర్తించారు.

కుహనాగోపుండాగమ
రహస్యమగుగీత బాహిరముచేసిన శ్రీ
మహిత కురుక్షేత్రంబున
విహారమొనరించిపొమ్ము విహగవధూటీ!

**ప్రయాగక్షేత్రం :**

త్రివేణీసంగమపుణ్యస్థలంప్రయాగ. ఆ సంగమస్నానంచేతనే ముక్తి లభిస్తుండట. సమీరనందేశంలో సోమంచి వాసుదేవరావుగారు ప్రయాగనీవిధంగ వర్ణించారు.

శ్రీలదనర్చ్యకాశికవిశేషములన్ గసుగొంచునీవు మం
దాలసలీలమై బయనమై చనిపశ్చిమదిక్కుగా జనం
గాలసమానసంపదతిగాఢతరూఢికి నెక్కి వైభవో
ద్వేలతనాప్రయాగకడుబెంపువహించెడుదాని జూడుమా
నురుచిరతత్పుణ్యస్థల
పరిసేవాధీనహృదయపంకేజుడవై
వరలుము గంగాయమునా
సరస్వతీసంగమంబచట గననగుగా

ఈ విధంగా సందేశకావ్యకర్తలు భారతదేశంలోని ఎన్నోముఖ్యపుణ్య క్షేత్రాలను యథాశక్తిని వర్ణించారు.

## దేవతావర్ణనం

ధర్మానికి ఎప్పుడుగ్లాని కల్గుతుందో అపుడు నేసవతరిస్తానని పరమాత్మ చెప్పాడు ఆ విధంగా అనేక -పాలలో ఈ భూమిపై ఎందరోదేవతలు అవతరించారు.

మోటూరి వేంకటరావుగారు తమ చకోర సందేశలో ఈ అవతారాల వైశిష్ట్యాన్నిలా వర్ణించారు

యుగయుగమ్మువిశిష్టధర్మమునుద్ధరించెడు పూన్కిమై
జగతిమానవరూపముగొని సంభవించుబరాత్పరుం
డగణితప్రతిభావిశేషగుణాఢ్యుడై కలుషాత్ములన్
దెగడిశిష్టుల రక్షణంబొగి నిర్వహింపగడంగుచున్

ఈ విధంగా దశావతారాలు శిష్టరక్షకు, దుష్టశిక్షకు పరమేశ్వరుడు దాల్చాడు తమస్థానాలువీడి ఈ పుణ్యభూమిలో నివాసస్థానమేర్పరుచుకొన్న దేవతలున్నారు.

**కాశీవిశ్వేశ్వరుడు :**

భక్తజనావనార్థం వెండికొండను వీడి కాశీక్షేత్రంలో నివాసమేర్పరుచు

కొన్నాడని విశ్వేశ్వరుని గూర్చి సోమంచివారు తమ సమీరసందేశంలో వర్ణించారు.

భాసురరాజతాచలనివాసముమానియుమాసనాథుడై
శ్రీసముపేతగాశికవసించుజుమీ పరమేశ్వరుండునా
నాసుజనావనార్థమయి రాజనకప్రియుడమ్మహాత్ముడ
వ్యాసవవందితున్ శివునవశ్యము గొల్వగదేసదా గతీ

## కనకదుర్గాదేవి.

ఒక మహారాజు నిష్పాక్షికబుద్ధికి మెచ్చి కనకవర్షాన్ని గురిపించిన కల్పవల్లి భక్తులపాలిటి కొంగుబంగారమైన కనకదుర్గను వృషభరాజసందేశంలో కవి ఈ విధంగా వర్ణించారు.

కనుగొమ్మా! జననీమణిన్ కనకదుర్గాదేవి భక్తావన
ప్రణుతన్ ఘోరనిశాటపాటనకళాప్రావీణ్యహ్రీంకారవా
చ్యనుదారోజ్వలభూషణాఢ్యగరుణావ్యాపారపారీక్షది
వ్యసితాంతస్ఫురకోటి భానురుచిభాస్వద్గాత్రభవ్యంబుగన్

## యాదగిరినృసింహస్వామి

ఆంధ్రమేఘప్రతి సందేశంలో యాదగిరినృసింహస్వామిని, శ్రీరంగంలోని రంగినాథుని రావాడ వేంకట రామశాస్త్రిగారిలా వర్ణించారు.

## నృసింహస్వామి:

వరతులసీస్రగన్వితము భాసితభాసుర ముఖ్యదీపికాం
కురముత్రయీనుతంబయి యరుంరవినీల మనోజ్ఞమూర్తియై
నిరతము భక్తహృత్కుహరనిష్ఠితమై కమాలాశ్రితంబునై
కరములరారు తేజమును గాంచు తదాలయమంధు వారిధా

**శ్రీరంగం_రంగనాథుడు:**

పాదకీలంబులుత్తరపు పైపున బాటలకాంతులీనదా
నౌదలదాల్చు రత్నమకటాభముచే వలచక్కిరాజిలన్
మేదినియున్ రమాసతియు మెల్లన బాదములొత్త జేతులన్
బాదుగబండు రంగపతిపామున ద్రోణకృతోపధానుడై

**నెల్లూరు రంగనాయకస్వామి:**

నెల్లూరులోని రంగనాథుని పుట్టపర్తివారు తమ మేఘదూతంలో వర్ణించిన విధానమిలా ఉన్నది.

పెన్నదాటిన గదా
పెరుమాళ్ల సేవయును
సామెతకు నెలవైనదేరూ — శ్రీరంగ
నాథుడచ్చోటనున్నాడు — వైష్ణవం
గనలనవ్వులబోకి కమ్మతావులువచ్చు
తోమాలియలుదాల్చితొంగలించెడుస్వామి

దుష్టశిక్షణ శిష్టరక్షణధ్యేయంగా వెలసిన దేవతలను సందేశకావ్యకర్తలీ విధంగా వర్ణించి తరించి పాఠకులను తరింపజేశారు

## వర్ణనా వైవిధ్యం

ఒకే వస్తువును అనేకులు తమ కావ్యాలలో వర్ణించే సందర్భంలో వారివారి నైపుణ్యం ప్రతిభ అనేక విధాలుగా ఈ సందేశకావ్యాలలో ప్రస్ఫుటమౌతుంది.
హిమాలయం అనేక సందేశకావ్యాలలో వర్ణితమైంది. ఆ వర్ణన వైవిధ్యమిలా ఉన్నది.

## హిమాలయపర్వత వర్ణన

సమీరసందేశంలో సోమంచి వాసుదేవరావుగారు హిమనగాన్ని యిలా వర్ణించారు.

ధైర్యసంపదకునుదావృతుండగువాడు
ప్రబలవాహినులచేబరగువాడు
పారనీహారయశస్స్ఫూర్తిగలవాడు
నౌన్నత్యగరిమమిన్నందువాడు
నెంతేనియునుదారహృదయంబుగలవాడు
ఘనులనాదరతగైకొనెడువాడు
రాజహంసవ్రజాశ్రయమానసమువాడు
శ్రీవిలాసముల రాజిల్లువాడు

మానికములబొలుచుసానులుగలవాడు
రసికశేఖరుండురమ్యచరిత
బొలుచువాడ తండు భూభృద్వతంసుండు
నించువేడనాదరించునిన్ను

జాషువ మహాకవి తన గబ్బిలంలో ఇలా వర్ణించారు

ఆ కొండయే యిండియా విరోధులదండలు
గుండెగాలంబైన వెండికోట
ఆ కొండయే ముత్తియపుదండ భారతో
ర్వీ మాతృమణికి గిరీట భూష
ఆ కొండయేపర్వతాగ్రగణ్యములైన
కులపర్వతముల నిక్కులకు నిక్కు
ఆ కొండయేరాజతాచలస్వామికి
మణిమయకళ్యాణమంటపంబు

సింధుగంగా మహానదుల్ చిన్ననాడు
ప్రాకనేర్చినయపరంజిప్రస్తరములు
పాదచిహ్నాలుపరికించి వచ్చినావె
కలుషములు వాయ కన్నుల కఱవుదీర

హిమశైలముపైనున్న శ్వేతకాంతులను గూర్చి మరుత్సందేశ కావ్యకర్త భావన.

ఆ హిమమ్ములు వృద్ధుడైనట్టిధనదు
నెఱసిన శిరోజపంక్తులా? హరశరీర
కాంతులా? రజతాచలకాంతులా? హ
రమకుటార్ధశశాంక నిర్యత్సుధా స్రి
వంతులా? నటరాజాంగభస్మరాసు
లా? యటంచుదోచునీకు వాయుదేవ!
ధరణి జనయిత్రిజీవసంతానములకు
బోషణమొనర్చబర్వతమ్ములను చనుల
గారు తెల్లని పాలుగబారునదులు
పుట్టుతావులపాలనుర్వులె హిమాలు

సోమంచివారు హిమపర్వతాన్ని భోగభాగ్యాలతో తులతూగే మహాప్రభువుగా వర్ణించారు. ఆ వర్ణనలో ప్రతిపదం రెండర్థాలతో కూడినపై పర్వతానికి, రాజుకు ఉన్వయిస్తున్నాయి.

జాషువకవి భావనలో పరమేశ్వరుడు ఈ దేశానికి ప్రకృతి ప్రసాదించిన వరంగా వర్ణితమైంది.

మరుత్సందేశకర్త ఆ కొండపైని తెల్లనికాంటులను అనేక విధాలుగా ఉత్ప్రేక్షించారు.

హిమాలయంపట్ల ముగ్గురి ఊహాలు మనోరంగా ఉన్నా సోమంచివారిలోని అర్థాంతరస్ఫూర్తి అధికగుణమనాలి.

**నగరవర్ణన :**

భారతదేశ రాజధాని ఢిల్లీనగరం కూడ ఈ కావ్యాలలో వర్ణితమైంది.

**ఢిల్లీ నగరం ; ఆంధ్ర మేఘప్రతిసందేశం :**

సిరులకుబుట్టినిల్లయి ప్రసిద్ధ సుధీరవిహారభూమియై
యురుతర చక్రవర్తి తనునొప్పగురాజ్యరమాధివాసమై
సురుచిరహర్మ్యదృశ్యమయిశోభిలు హస్తిపురంబుప్రాగ్దిశన్
,బరగెడుదాని నీవచట వారిద! మింటనెయుండికాంచుమా!

గబ్బిలం :

ఆ ఢిల్లీపురిహ స్తినాపురి సమాఖ్యన్ ద్వాపరంబిందు గొం
డాడంబడ్డది ధర్మజుండచట రాజ్యంబేలిచేయించినా
డీడుంజోడును లేని జన్నములనెన్నే గన్పులున్నందుకున్
జూడందగ్గపురంబు సుమ్మచటపీఠన్ భోగసౌరభ్యముల్

ముడిచె నిచ్చట కుంతి కొడుకు ద్రోవది కొప్పు
పగవాని రుధిరంబు పరిమళింప
మెరసె నిచ్చోట నాదరుషాకురారంబు
నిఖిల భారతము కన్నీరు నింప
వెలసె నిచ్చోట పచ్చల బర్హిపీఠంబు
షాజానురాజు నాస్థానవాటి
పెండ్లాడె నిచ్చోట పృథ్వీరాజొకరోజు
జయచంద్రు సుతనుదోస్సారగరిమ

యుగయుగాలకథలనుదరానజీర్ణించి
రాజరక్తనిర్ఝరములదేలి
నవ్వుచున్న ఢిల్లీనగరంబునందంబు
తరగలేదు శిరము నెరియలేదు

## మరుత్సందేశం

మణిమయ స్వర్గమకుట నిర్మల శిరోగ్ర
సీములగు సార్వభౌములు చెన్నుదొరిగి
విధివశంబున రాజ్యముల్ పీడిచనిరి
పూర్వమెద్ది ఇంద్రప్రస్థపురముగనుము
లీలసౌందర్యవల్లి ఢిల్లీకి బొమ్మ
జననిభారతి శ్వాసకోశమ్ములంద్రు
లోకసభరాజ్యసభ వానిలోనిగుండె
కాయయూనియన్ మంత్రినికాయముండు

ఆంధ్రమేఘప్రతిసందేశంలో ఢిల్లీనగరం యొక్క వైభవాన్ని స్వభావ సిద్ధంగా వర్ణించడం జరిగింది.

యుగయుగాల చారిత్రక కథలకు నిలయమైన ఢిల్లీనగరం ద్వాపరంలో ధర్మరాజు యజ్ఞయాగాదులచే పునీతమైనదిగాను అనంతరం రాజరక్త నిర్ఝరాలలో తేలియాడే రాజకీయ నగరంగాను గబ్బిలంలో వర్ణితమైంది. ఇది హృదయాన్ని ఉత్తేజితం చేసేది.

మరుత్సందేశంలో ఆధునిక ప్రజాస్వామ్య వ్యవస్థకు శ్వాసకోశాలైన లోక్‌సభ, రాజ్యసభలు గుండెలాంటి మంత్రిమండలికలదిగా ఉన్నది.

ఈ వర్ణనలన్నింటి పరమప్రయోజనం ఈ భారతదేశం యొక్క సమగ్రతను, ప్రాచీనవైభవం, ప్రకృతిరామణీయకమును, తెలియజేసి దేశభక్తిని ప్రబోధించడం.

మరుత్సందేశ కావ్యకర్త భారతమాత స్వరూపాన్ని అద్భుతంగా వర్ణించారు.

**భారతమాతివర్ణన :**

శ్రీనగర్ తిలకంబు శీతాద్రి మకుటంబు
కాశ్మీరుఫాలభాగంబుగాగ
శరదభ్రశకలాలు సురుచిరచికురాలు
హృదయంబు విశ్వేశుగృహముగాగ
కలుషాపహారిణి గంగాతరంగిణి
రమణీయకంఠహారంబుగాగ
మధ్యప్రదేశంబు మధ్యమ్ముగను వింధ్య
శైలాటవియె మొలనూలుగాగ

కాలియందెలుకోలారుగనులుగాగ
మొలకనవ్వులవెలదివెన్నెలలుగాగ
శాంత్యహింసలతో సుప్రసన్నయగుచు
బ్రత్యహముదోచు గాక మా భరతమాత

ఐకమత్యమ్ముగూర్చనకూంశ రేఖాంశ
వృత్తపాశమ్ములు పెనచికొనగ
సౌందర్యలక్ష్మిముఖేందు బింబద్యుతుల్
కరుణార్ద్రదృక్ప్రభాకలనదేర
గాంధీమహాత్మ్యమార్గమ్మున నభ్యుద
యశ్రీమహౌన్నత్యమలవరిలప
అన్నవస్త్రగృహాదికావశ్యకోత్పత్తి
సాధకబహుపరిశ్రమలు వెలయ

ధర్మచక్రప్రవర్తకోద్యత్కరమయి
శత్రుమస్తక విన్యస్తచరణయగుచు
విశ్వకల్యాణగుణకర్మవితతితోడ
భవ్యజాగృతివెలయుత భరతమాత

ఈ వర్ణనలో శ్రీనగర్ పట్టణం, శీతపర్వతం కాశ్మీరుప్రదేశం, వారణాసి గంగానది, మధ్యప్రదేశ్ శైలాటవి, కోలార్గనులు ప్రస్తావింపబడినాయి అక్షాంశరేఖలు ఊహామాత్రాలే. వాటివల్లకల్గే ఐకమత్యం శూన్యం.

ఈదేశాన్ని తల్లిగా వర్ణిస్తూ ముఖ్యమైన దేశంలోని నగరాలు, నదులు, పర్వతాలు మొదలైనవి ఆమెకు అలంకారాలుగా వర్ణించారు. అందువల్ల పూర్వ వర్ణనలన్నీ మాతృమూర్తి భావనలో దేశమాతకు గొప్ప అలంకారాలుగా మనం కూడా ఊహించవచ్చు.

ఇది పరోక్షంగా దేశభక్తి ప్రబోధమే.

ఇలాగే ఈ సందేశకావ్యాలలో పుణ్యనదీనదాలు, గిరిఝరులు, మహా నగరాలు వర్ణింపబడినాయి. ఈ ప్రకృతివర్ణనలతోపాటు ఆయాప్రాంతాలలోని స్త్రీల సహజసౌందర్యాన్ని, వారి ప్రవర్తనను స్వభావాన్ని ఆయాదేశీయాద్భుత చారిత్రాత్మక సంఘటనలను, వింతలను విశేషాలను మహోత్సవాలుగా విజ్ఞానాత్మకంగా వర్ణించారు సందేశకావ్యకర్తలు.

# ఆధ్యాత్మిక నాయకులు–జాతీయ నాయకులు

కవి పండితులొకవిధంగా జాతికి మార్గదర్శకులైతే ఆచార్యశంకరులవంటి మహనీయులు ఆధ్యాత్మిక రంగంలోను, గాంధీమహాత్మునివంటి మహనీయులు రాజకీయంగా జాతీయదృష్టితో మనజాతిని సమైక్యం చేయ ప్రయత్నించారు వారినిగూడ సందేశకావ్యకర్తలు సముచితంగా ప్రశంసాపూర్వకంగా వర్ణించారు.

**శంకరాచార్యులు .**

"శంకరః శంకరస్సాక్షాత్" అని విజ్ఞానులచే కీర్తింపబడుతున్న శంకరాచార్యునిరావాడ వేంకట రామశాస్త్రిగారు తమ ఆంధ్రమేఘ ప్రతిసందేశంలో ఈ విధంగా కీర్తించారు.

ఆది విహీనతన్ త్రిభువనాంక గురుత్వముగాంచు శంకరుం
డాదృతిస్వీయ సంజ్ఞనట సార్థ జగద్గురుడై జనించు మా
యాది విషావనీజతటినంతయు వేరులతో జెకల్చి స
మ్మోదమెలర్ప నిచ్చెనగు మోక్షగృహంబునకుంచె భాష్యమున్

అల్పకాలంలోనే యావద్భారతాన్ని ఆధ్యాతిక తేజస్సుతో చైతన్యచకచ్చకితంచేసిన ఆది శంకరులు "గురునానక్, రామకృష్ణ, వివేకానందుడు మొదలగు వారికి ఆధ్యాత్మికంగా మార్గదర్శకులైనారు. వీరి అద్వైత సిద్ధాంతం శాస్త్రీయమైనదిగా ఆధునికులంగీకరించారు.

**రామానుజుడు :**

మతసంస్కారంలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చి అందరూ ముక్తికి అర్హులే అన్న భావాన్ని విస్తృతమైన ప్రచారంచేసిన రామానుజుని పుట్టపర్తి వారు ఈవిధంగా ప్రస్తావించారు.

వైష్ణవామ్నాయ
సిద్ధాంతశుభమూర్తి
లక్ష్మణానుజులిటకు వచ్చి –ఈస్వామి
దరిసించి మరులలోనెచ్చి –పాడెనట
వేదసూక్తులు, ఎన్నివేలయుగములనుండి
ఛెంచుకత్తెలకు నాశించి నిల్చెనో—స్వామి

**రామదాసు :-**

రామదాసు తన సర్వస్వం రామార్పణం చేసిన మహాభక్తుడు ఆ మహనీయుడు తాను నమ్మిన రాముని సేవలో ఎన్ని కష్టాలు పొందింది పుట్టపర్తివారు వ్యక్తంజేశారు.

ప్రతిరక్త కణము శ్రీ
రామునకు వెచ్చించి
కన్నీరుగాలువైపారీ—చెరసాల
తనువుత్యజియించివేసారి—ఈ రామ
దాసుబొందినదేవి ధన్యుడని యొకనాడు
ఈ సృష్టిరహస్యమెవ్వరికి తెలియదే

అతి నిర్మలమైన రామదాసభక్తి భావం ఈ మాటల్లో వ్యక్తమౌతోంది ఈ రామదాసు ప్రభావం చేతనే నేడు పల్లెపల్లెలో రామమందిరం వెలిసింది భక్తి భావం ప్రబలింది ఈ విధంగా భక్తరామదాసు తెలుగువారికి ఆదర్శప్రాయుడయ్యాడు.

**రామకృష్ణపరమహంస--వివేకానందులు .**

ఆర్షవిజ్ఞాన కాంతులను విశ్వవ్యాప్తంచేసిన మహనీయుడు వివేకానందుడు. అతనిలో ఆధ్యాత్మికజ్యోతిని వెలిగించిన ఉత్తమగురువు రామకృష్ణ పరమహంస. ఆదర్శగురుశిష్యులైన వారిద్దరినీ మరుత్సందేశకావ్యరచయితతన కావ్యంలో ఈ విధంగా ప్రస్తుతించారు.

తత్త్వగగన విహారసత్వగుణభాసి
బ్రహ్మభావాద్రిశృంగాగ్రరమ్యవాసి
బహువిధోపనిషత్సూక్ష్మ భావమూర్తి
కాళికామహాతేజస్విఘనుడు రామ
కృష్ణుడాత్మబోధామృతవృష్టిసృష్టి

నెఱపెనభినవమందాకినీ స్రవంతి
అమృతమదిక్రోలుకోర్కిలి విద్యాటవులను
స్వేచ్ఛదిరుగువక్త్రునరేంద్రసింహుడతడు
ధర్మగర్జప్రాక్పశ్చిమతత్వవిదుల
సముఖమున సల్పెయుగయుగాల్ సంస్మరింప

**రాధాకృష్ణపండితుడు :**

తన ముఖవర్చస్సుచేత కరుడుగట్టిన కమ్యూనిస్టు నాయకులను కూడ ఆకర్షించిన తాత్వికమూర్తి తన తాత్వికోపన్యాసభాగీరథీ ప్రవాహంచేత ప్రపంచాన్నంతటిని పూతమొనర్చిన మనీషి రాధాకృష్ణపండితుని మరుత్సందేశ కావ్యకర్త ఈవిధంగా కొనియాడాడు

మనత్రివర్ణపతాకలాగునవెలింగి
జ్ఞానయోగంబు భక్తియోగంబుకర్మ
యోగముసమంబుగాగ సంయోగమంది
అతని వ్యక్తిత్వము మహనీయమొనర్చె
చంద్రుగాంచి సంతోషించినసంద్రమటులె
సంద్రమునుగాంచిగర్వించు చంద్రుడటులె
దేశముంగాంచి గర్వించు ధీరుడితడు
ఇతనిగనిదేశమాత గర్వించి మించు

**శ్రీపతిపండితుడు :**

వీరశైవాచార సంప్రదాయాన్ననుసరించి శివునికంటె శివునిభక్తులే ప్రధానంగా పూజనీయులు.

విజయవాడ కేంద్రంగా యావదాంధ్రలోను శైవమతాన్ని ప్రచారంచేసిన పండితుడు శ్రీపతిపంతుడు. ఆ మహనీయుని గిద్దలూరు చెంచు బసవరాజుగారు తమ వృషభరాజ సందేశంలో ఈవిధంగా కొనియాడారు.

శివభక్తి మహిమము బ్రతిష్ఠించుటకొనికి
ఎవడగ్నికీలల జీరయందుముడిచె
వేదవేదాంగాదివిద్యలెవ్వాని
జిహ్వాచలసీమన ర్తించుచుండు
నద్వైతమోహమాయాంధకార జ్యోత్స్న
వెదజల్లునెవ్వానివిమలవాక్కు
భక్తిభావస్ఫూర్తి పరిఢవిల్లును వేని
జ్ఞానమార్గక్రియానూనపదము

వీరశైవాద్వైతవిమలదివ్య
వాణియెవ్వాన్శ్రీకరభాష్యవాణి
భవ్యమహితుడా శ్రీపతి పండితుండు
వాసమున్నవాడు విజయవాటిక దొల్లి

నిర్వీర్యమై విధర్మీయులదండయాత్రలతో కొట్టుమిట్టాడుతున్న ఈ జాతి భావదాస్యాన్ని స్వేచ్ఛాదారిద్ర్యాన్ని అనుభవిస్తుంటే ఈ జాతిలో ఆధ్యాత్మిక జ్యోతిని వెలిగించిన మహనీయులనీసందేశకావ్యకర్తలు కృతజ్ఞులై కీర్తించడం ముదావహం. భావితరాలకు సందేశదాయకం

## జాతీయనాయకులు

### గాంధీమహాత్ముడు

పరదాస్యశృంఖలాబద్ధమై విదేశనాగరికతా వ్యామోహంతో కొట్టుమిట్టాడు తున్న ఈ జాతికి తన జీవితమే ఆదర్శంగా క్రియారహితమైన ఉపదేశాలకంటే క్రియాత్మకమైన మౌనమే మనిషిని మనీషిని చేయగలదని ఆచరణాత్మకంగా చాటిచెప్పిన మహనీయుడు గాంధి మహాత్ముడు. ఆ మహాత్ముని అడుగుజాడలలో పయనించి ఈ జాతి స్వాతంత్ర్యాన్ని పొందింది. ఆ మహనీయుని కొనియాడని కవిలేడు.

జాషువ మహాకవి తనగబ్బిలంలో గాంధి మహాత్ముని ఈ విధంగా స్తుతించాడు.

మరచితినాదిదేవుని సమానుడు బుద్ధుని యంతవాడు భా
సురదరహాస చంద్రికల శుభ్రతలోన గలట్టివాడు, య
ద్ధారలకుగాదు వారి చెవిదూరిన వారిని లక్ష్యపెట్టడ
ప్పరమమునిన్ సబర్మతినివాసిని జూచితివే తపస్వినీ

మరుత్సందేశకావ్యకర్త ఆమహనీయుని కొలదిని శక్తికొలది ఇలా కొని యాడారు

కొలది పల్లెఇల్లుకొలదిపాత్రెనగలు
కొలదికొలదిపాన్పు కొలది గుడ్డ
కొలదికాలమందె బలమైన దాస్య శృం
ఖలలదుత్తునియులుగా నొనర్చె
కర్మకాండలమలినమ్ముగానిభక్తి
సభకుబరిమితినొందనిసత్యశక్తి
స్వార్ధరహితసేవాసక్తి యతని హృత్ప్ర
యాగలో త్రివేణీ సంగమమ్ముతోచు

**వినోబాజీ.**

గాంధీమహాత్ముడు తన సత్యాగ్రహోద్యమానికి తొలి సత్యాగ్రహిగాంచు కొన్న కార్యకర్త వినోబా. ఆ కార్యకర్తయే మహాత్ముని అడుగుజాడల్లో భూదాన యజ్ఞం గోరక్షోద్యమం మొదలైన మహత్కార్యాలెన్నో సాధించాడు. ఆ వినోబాజీ మరుత్సందేశంలో ఈ విధంగా కీర్తింపబడ్డాడు.

బ్రహ్మచర్యవ్రతస్థుండు బ్రహ్మవేత్త
అపరశివుడు వినోబామహర్షి కనుమ
ఉపచరింపుము అమ్మౌనినుచిత సరణి
అతడే సర్వోదయశ్రీమహావిధాత
ప్రథితభూదాన యజ్ఞ కర్మరుచు సామ్య
యోగినవ్యసమాజ సంయోజకుండు

రాజాజీ .

తనమేధాశక్తిచేత, రాజనీతి చాతుర్యంచేత స్వాతంత్రోద్యమంలో ఎన్నో మహాకార్యాలు సాధించి మహాత్ముడు ప్రవచించినసూత్రాలకు కట్టుబడి ఆ మహనీయునితోనే వియ్యమందిన ప్రజ్ఞానిధి చక్రవర్తుల రాజగోపాలాచారి తుషోద్దయుడు. ఆ మహనీయుడు మరుత్సందేశంలో ఈ విధంగా ప్రశంసింప బడ్డాడు.

రాజాజీశతవృద్ధుడయ్యును స్వతంత్రవ్యక్తికౌరవ్యఘో
రాజిన్ నిల్చిన భీష్ముడోయనగధైర్యస్థైర్యగాంభీర్యవి
భ్రాజత్స్వీయముఖాఖ్యకార్ముకమునన్ ప్రశ్నాశుగౌఘంబుసం
యోజించెన్ జ సౌఖ్యమెట్లని ప్రభుత్వోద్యోగులల్లాడగన్

రాజాజీని భారతంలోని భీష్మునితో పోల్చిచెప్పడం సముచితంగా ఉంది.

జవహర్ లాల్ నెహ్రూ

స్వాతంత్రోద్యమ సమయంలోను అనంతరం భారతదేశప్రధానిగాను సుదీర్ఘమైన రాజ్యపాలనలో, వైజ్ఞానిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలపై గాఢమైన తన ఆలోచనాముద్రనువేసిన పండితుడు జవహర్ లాల్ నెహ్రూను సందేశకావ్యకర్తలు కొనియాటానికెట్లా ఉత్సహించాలో చూడండి!

గబ్బిలం .

ధిక్కారించెడు రాచగుబ్బములు స్వాధీనంబుగావింపగా
యుక్కుంగళ్లెముజహ్వరుండతని విద్యుచ్చారదామూర్తిన
ద్దిక్కుల్ నిండి నటించుచున్నదనుచున్ దేశంబులగ్గించుమా
చిక్కుల్ దీర్చుట విస్మరింపదుగాదా స్వేచ్ఛాజయాంతఃమునన్॥

మరుత్సందేశం :

విశ్వగగనవిహారప్రవీణమైన
శాంతిపారావతముసముచ్చరితదివ్య
విశ్వకళ్యాణమంత్రమ్ము విశ్రుతమ్ము
శాఖికాపత్రనికరసంఛాదితమ్ము
జహ్వరుప్రధానిరూపమాశ్చర్యకరము

జవహరుపండితుని విశాలదృక్పథం అంతర్జాతీయదృష్టి, విశ్వశాంతి ప్రియత్వం ఇందులోనిగదితము.

**వల్లభాయిపటేల్ :**

ఉక్కుమనిషిగా ప్రసిద్ధుడు. గాంధీమహాత్మునికిదీటైన అచరణశీలి—ఆ మనీషిని జాషువమహాకవి గబ్బిలంలో ఈ విధంగా ప్రస్తుతించారు

ముల్లోక్కించుకవాలిపోయినను బాపూజీకిదీటైన శ్రీ
వల్లాభాయిపటేలు దర్శనము సంప్రాప్తించె నే నీకు నే
డల్లంతన్ గనుపట్టుచుండెను స్వరాజ్యార్థంబుసర్వస్వమున్
గొల్లంబెట్టిన త్యాగశాలతడెఱుంగున్ నామనఃక్లేశమున్

**అంబేత్కర్ :**

దళితజనులకు ఆపద్బాంధవుడు. అసాధారణప్రజ్ఞానిధి. ఆ జాతీయ నాయకుని జాషువ మహాకవి కొనియాడిన విధానమిది.

కలడంబేత్కరు నా సహోదరుడు మాకైయష్టకష్టాలకుం
బలియై సీమకువోయ్యి క్రమ్మరిన విద్వాంసుడున్నైన్సాయి మే
ల్కొలువందుంగల దొడ్డవాడతడు నీకున్ స్వాగతంబిచ్చి పు
వుల పూజల్ పొనరించెనే యతని మెచ్చున్ శ్రీ జయారంభముల్

నా సహోదరుడు అన్నమాటల్లో ఆత్మీయత తన జాతి ప్రతినిధి అనే భావం ద్యోతకమౌతున్నాయి

**జాకీర్ హుస్సేన్**

జాతీయభావాలుగల్గిన ముస్లిమ్‌నాయకుడు. భారతదేశానికి కొంతకాలం రాష్ట్రపతి అతి పిన్నవయసులో ఒక విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్సలర్‌గ బాధ్యతలు నిర్వహించిన విద్వాంసుడు. ఆ ముస్లిమ్‌నాయకుని మరుత్సందేశకావ కర్త ప్రశంస ఈ విధంగా ఉన్నది.

స్తవరాజమ్మిదియాలకించికడుశ్రద్ధన్ జామియామిల్లియా
ఖ్యవిరాజిల్లెడి సంస్థ దొలిప్రధానాధ్యాపకోద్యోగియై
యవలన్ గాంధి వధానువర్తియయి.రాజ్యశ్రీసభాధ్యక్షుడై
యువవిద్వత్కవి బంధు విశ్రుత జాకిర్‌హుస్సేన్ దర్శింపుమా.

**పొట్టిశ్రీరాములు :**

తెలుగుజాతి వెలుగుకోసం తెగువచేసి ప్రాణత్యాగంచేసిన ఆంధ్రనాయక రత్నం పొట్టిశ్రీరాములు ఆ కీర్తిశేషుని మరుత్సందేశకావ్యమిలా కీర్తించింది.

గాంధేయాజ్ఞలనేలు రాముని మనఃకంజంబునన్ గొల్వుగాం
ధీధర్మజ్ఞుడు పొట్టిరాముడు మహాదీక్షన్ స్వరాజ్యోదయా
స్థాధీశుండయి ఆత్మయజ్ఞమున ప్రాణాజ్యాహుతుల్ వ్రేల్చి ఆ
గాధల్‌గన్నజగమ్ముసర్వము నిమగ్నంబాయె అశ్రుంబునన్

ఈజాతికి ఆదర్శప్రాయులైన శంకరులు వివేకానందుని వంటి మహనీయులైన ఆధ్యాత్మికనాయకులను, గాంధీజీ, వినోబాజీవంటి జాతీయనాయకులను అద్భుతంగా వారి జీవనవిధానానికి దర్పణంగా వర్ణించిన సందేశకావ్యకర్తలు జాతిమనుగడకు ఆదర్శాన్ని మనముందుంచడంలో చాలవరకు కృతకృత్యులైనారు అయినా ఏ కవి "ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వంటి స్వాతంత్రభావోపేతుని, నిశితమేధావిని, గుర్తుచేయకపోవటంలోపంగా అనిపిస్తుంది. ఆయన గాంధీగారి కంటే ముందుగానే 'రామదండు'ను నెలకొల్పి చీరాల పేరాల గ్రామ ప్రజలచే ఇళ్లువాకిళ్లు ఖాళీచేయించి ఊరివెలుపల కాపురాలు పెట్టించి నడిపించిన ఉద్యమం ఉదాత్తమైంది. అదే రీతిగా అల్లూరి సీతారామరాజును సంస్మరించినట్లు కనిపించదు, ఇట్లాగే పట్టాభి, టంగుటూరి క్షౌండ, ఉన్నవవారిని గూర్చిన పరిచయాలు మృగ్యం కవులతోపాటు పేరెన్నికగన్న చిత్రకారుల్ని, శిల్పుల్ని స్మరించాలిగదా!

## సాంఘిక రాజకీయస్థితిగతులు

కవికూడ సంఘజీవిగావడంచేత సమకాలిక రాజకీయ,సామాజికాలైన విప్లవాలకు స్పందిస్తాడు మంచిచెడులను విశ్లేషించి భగవద్దత్తమైన కవితాశక్తిని సమాజోద్ధరణకు ఉపయోగింప ప్రయత్నంచేసాడు.

ఒకప్పటిసమాజంలో కమ్మరము కుమ్మరము మొదలైన వృత్తులుండేవి. ప్రతిచోట కుటీరపరిశ్రమలుగా వాటిని చేసుకొంటూ కుటుంబంలోని ప్రతిఒక్కరు లందుభాగస్వాములై కాలంగడుపుతుండేవారు' ఆంగ్లవిద్యావిధానంచేత వృత్తి విద్యలు క్రమంగా సన్నగిల్లినాయి నేటి విద్యావిధానంలో యువత నిర్వీర్యమౌతుంది. ఉద్యోగంకోసం ప్రభుత్వపై ఆధారపడుతోంది. ప్రభుత్వం అందరికీ ఉద్యోగమీయలేనిస్థితిలో ఉన్నది. ఈ విషయాన్ని జాషువ మహాకవి గబ్బిలంలో ఈ విధంగా వ్యక్తంచేశాడు

వృత్తుల్ సర్వము తుప్పుపట్టినగా భిక్షాటనంబుల్ జగా
వత్తుల్ గాపలుజాతులై నిలువ దుర్భిక్షంబు రాకుండునే?
యుత్తుంగాశయులెందరో కలరు దేశోద్ధారకుల్ పూనరీ
చిత్రం బేర్చుకళంకమున్ దుడిచి సుశ్రీనేలకుం గూర్పగన్
ఎన్ని సుక్షేత్రములసారమిగిరిపోయి
ముండ్లతుప్పలు బంజరభూములయ్యె
ధృఢతరంబైన యెంతెంతదేహశక్తి
భిక్షకులమేన జీర్ణించి పృధివి గలసె

వృత్తులు నశించినాయి. అనాయాసంగా అడుక్కుని బ్రతికేవారి సంఖ్య అధికమైంది. సుక్షేత్రాలు బీడుబడిపోయినాయి. శ్రమశక్తి తగ్గిపోవడంచేత ఆర్థిక వ్యవస్థపతనమైంది

సమాజాన్ని సంస్కరిస్తామన్ననాయకులు కీలకమైన ఈ విషయాన్ని గూర్చి ఆలోచించరెందుకో అని కవి తన ఆవేదనను వ్యక్తంచేశారు.

**విద్యాలయాలు :**

వృత్తులు నాశనాన్ని పొందిన సమాజంలో విద్యాలయాలుకూడ వింత స్వరూపాన్ని పొందినాయి యువతను చైతన్యవంతంచేయవలసిన విద్యాలయాలు వ్యాపారకేంద్రాలుగా మారిపోయినాయి. ఆ స్థితిని శుకసందేశంలో గిద్దలూరి చెంచురాజుగారు ఇలా తెలియజేస్తున్నారు

ఆనాటాశ్రమవాసులాఘునులు విద్యాదానముల్ సేయ శి
ష్యానీకంబులతో విహంగతతికిన్ వ్యాసంగముల్ సేకురెన్
ఈనాడాశ్రమపాటు లంగడులు ధీమంతుండు బేహారి వి
జ్ఞానంబమ్ముడుసోమ్ముగా నడచె బ్రజ్ఞల్ దక్కునే పక్కికిన్

ఆశ్రమంబులర్థాఖిలాషాశ్రయంబు
లర్థసంగ్రహసంసిద్ధులష్టసిద్ధు
లాధులెసమాధులిహభుక్తియదిముక్తి
బావనయ్యల కన బక్షిబ్రతుకికేల

పూర్వం ఆశ్రమాల్లో విద్యాదానం జరిగేది. శిష్యులతోపాటు శుకపిక విహంగాలు కూడ ఆ విద్యలు సాధించేవి. కానినేడు పండితులు వ్యాపారులయ్యారు. విద్యాలయాలు దుకాణాలైనాయి డబ్బుగలవాడిదే విద్య. ఇక పక్షుల గతి చెప్పవలసిందేమున్నది

**యువజనస్థితి :**

ఈ స్థితిలో యువజనులు నిష్క్రియులైకాముకతకు లోనౌతున్నారు. వృత్తులులేవు చదువుకు ఉద్యోగాలురావు, నిష్క్రియులుకాకఏమౌతారు? ఆ విధంగా యువత పెడత్రోవను పడిన విధానాన్ని మరుత్సందేశకర్త యిలా వ్యక్తంచేస్తున్నాడు.

నీవీబంధనమోక్షణక్రియయెతస్వీమోక్షమేవేళనో
దేవీ! నీయధరమ్మెపోయమృతసిద్ధి క్షేత్రమౌలేమ!నీ
హౌవాల్గన్నులచూపులే యగును బ్రహ్మానందమంచున్ సదా
ఆ వాత్స్యాయను సంస్మరింతురు యువల్ న్యగ్రోధకచ్ఛాయలన్

లేమల వాల్గనుల చూపులే యువతకు బ్రహ్మానందంగా తోచాయి. నిత్యం వాత్స్యాయనునిస్మరిస్తూ కాలక్షేపం చేస్తున్నారు.

**వ్యభిచారిణులు :**

ఆర్థికంగా పతనమైపోయిన దేశం నైతికంగా కొంతదిగజారుతున్నది. ఎన్నోసమస్యలనెదుర్కొంటున్న సమాజాన్ని వ్యభిచారంకూడ ఒక జాడ్యంగా

బాధిస్తోంది. కవిదృష్టి నుండి ఆ సమస్యకూడ తప్పించుకోలేదు. పుట్టపర్తి నారా యణాచార్యులుగారు వ్యభిచారిణుల దయనీయస్థితిని గూర్చి ఈ విధంగా వ్యక్తంచేశారు

వారు పణ్యాంగనలు
వచ్చేరునీకెదురు
నీవునున్మాతి ముడిచేవూ కోపాన
గర్జించి చెదరగొట్టేవూ కూటికై
తనువమ్మికొన్నారుతినతిండియేయున్న
వారుపాతివ్రత్యభావముబలికేరు
వ్యభిచారదోషంబు
నాకట్టవలెనంచు
నీతులను బలికేరుగానీ నాయకులు
వారికొఱకివ్వరేగానీ శుష్కధ
ర్మార్థములతో దేశముదుఃఖబట్టినదోయి
అర్ధమేసర్వమైస్వార్థమ్ముపెరిగినిది

## ప్రభుత్వ కార్యాలయాలు

ప్రభుత్వ అసమర్థత యిలా ఉంటే ప్రభుత్వకార్యాలయాలు అసమర్థతకు అవినీతికి నిలయాలుగా మారిపోయినాయి మరుత్సందే కావ్యకర్త ఆ కార్యాలయాలను గూర్చి ఇలా వివరించారు-

అటుప్రభుత్వకార్యాలయంపుఫైళ్లు
పైనసాలీళ్లు లోపలను గుంభ
కర్ణనిద్రబోపుచుగానుపించు
అంతరాయముగలిగింపకయ్యవాని
వ్రతవిధానమ్ములకు, సమిరాయెఱుంగు
మచటియధికారులకు వచ్చునాగ్రహమ్ము

ఈ ప్రభుత్వకార్యాలయాల అసామర్థ్యంవల్లంప్రభుత్వవిధానల అమలులో జాప్యం చోటుజేసుకొంది

**రేషన్ దుకాణాలక్యూలు :**

ఎక్కడచూచినా క్యూలే మానవుని జీవితం సగం క్యూలలోనే గడిచి పోతుందాఅనిపిస్తోంది ప్రతినగరంలోను ఎటుచూచిన కనపడే ఈ క్యూలను గూర్చి మరుత్సందేశంలోయిలా వివరించబడ్డది.

భారతదేశమందు బహుపత్తనవీధులనీకుమారుడై
మారుతమొప్పవీరహనుమానునితోక విధానసాగుచున్
'క్యూ' రహియింపరేషనులకున్ తలయొగ్గిదుకాణదార్లుపల్
ద్వారములందు నిల్చుప్రజదైన్యముతోనిది క్షేమరాజ్యమా

కవి చెప్పేది పవనునితో, నీకుమారుని "తోక" లాగా ఉన్నాయి "క్యూ"లు అనడం చమత్కారం దీనికి క్షేమరాజ్యమని పేరు. కానీ ప్రజలవదనా లెప్పుడుదైన్యావస్థలో ఉంటాయి ఇది ఏ రచయితనైనా కలచివేస్తుంది

ఈ సంక్షేమరాజ్యంలో ఎంతోదయనీయస్థితి ఆవరించియున్నది అగ్ర వర్గాలు, అంటరానివాళ్లు, ధనవంతులు, బీదవారు అనే అంతరాలు ఈ సమాజాన్ని శల్యాల్లా బాధిస్తున్నాయి.

**అంటరానితనము :**

దీన్నిగూర్చి ఇతఃపూర్వంమెంతో చెప్పబడింది.

పాముకుపాల్పు, చీమకు పంచదారపోసి పెంచుకొనే ఈకర్మభూమిలో ప్రాక్తన మైన ధర్మదేవతకూడ పంచముని చూచి ఉలికిపడుతుంది.

ఆయభాగ్యునిరక్తంబునాహరించి
యినపగజ్జెలతల్లి జీవనముసేయు
గసరిబుసగొట్టునాతని గాలిసోక
నాల్గుపడగల హైందవనాగరాజు

అస్పృశ్యుడైన అభాగ్యుని కథను జాషువ గబ్బిలంలో యిలావివరించారు.

**ధనవంతుడు - ధనహీనుడు :**

ఇది సమాజంలో ఎప్పుడూ ఉండే సమస్యే. కాని ఒక్కొక్కకాలంలో వటవృక్షంలా పెరిగిపోయి విషఫలాలనిస్తుంది. ఈనాటి సమాజంలో అదికూడ

ముఖ్యమైన సమస్యగా రూపుదిద్దుకొన్నది. పుట్టపర్తివారు ఈ సమస్యను హృదయానికి హత్తుకునేవిధంగా వ్యక్తంచేశారు.

ధనికవాదముగాదటనగా – చీకటుల
దన్నిద్రోసిరి - బత్రుకుజనగా
కడుపుగాలిన బీదకన్నీటితోనేడు
జలధులేపొంగెత్తి జగతులింకకపోవు

ధనమదాంధులకు పదునైన మాటలతో కఠినమైన హెచ్చరిక చేశారు కవి. ఈ సమాజంలో ఒకవ్యక్తిని మరొకవ్యక్తి దోపిడిచేయడంతో ఆగక దేవుని కూడ నయవంచనతోదోపిడిచేసే స్థితికి వచ్చాడు మానవుడు. అది ఏవిధంగానో పుట్టపర్తివారు తన మేఘదూతంలో ఇలా తెలియజేస్తున్నారు.

అచట గనుపించు
నభ్రంకషమ్ములగు
గోపురమ్ములు గుడులునీకూ - నేడచట
గాపురము గబ్బిలమ్ములకూ - మాన్యములు
ధర్మకర్తలయిండ్లధాన్యంబులనుగొల్చి
యలసినవి - దేవునకు బలుకు బలమేలేదు

దేవుని మోసగించే మహాపురుషులుగల ఈదేశం అన్నివిధాలుగా పతనమై చివరకు నిన్నమొన్నశరవేగంతో అభివృద్ధిచెందిన అగ్రరాజ్యాలపంచన ఆర్తమై దీనంగా ఆడుక్కోవలసిన స్థితికల్గింది.

ఆ స్థితి మరుత్సందేశంలో ఇలా చెప్పబడ్డది
మీసలపై జారిరోసాలు భారత
పుత్రులుండభరతభూసవిత్రి
ఆయుధాన్న భిక్షకన్యదేశద్వార
ములనునిలిచెనశ్రులొలుకుచుండ
ఇది నేటి మనదేశస్థితి.

ఇలా సమాజంలోని పరిస్థితులను ఏకరువు పెట్టడంతోనే సందేశకావ్య కర్తలు సరిపెట్టుకోలేదు రాజకీయంగా ప్రభుత్వంచేసిన మంచిపనులను తెలియ జెప్పడంతోపాటు ప్రభుత్వమేమిచేయాలోకూడ ఉపదేశాత్మకంగా తెలియజేశారు.

ప్రభుత్వమెన్నో కొత్త పథకాలను ప్రవేశపెట్టింది. వాటిని మరుత్సందేశంలో ఈ విధంగా కొనియాడారు కవి

గ్రామమునకు పంచాయతీరాజ్యశాఖ
గిరిజనహరిజనులకు సంక్షేమశాఖ
ఇట్టి శాఖలనెన్నొకల్పించి ప్రగతి
పంచవర్షప్రణాళికాద్వారమునను
గాంధిరాజ్యంబుస్థాపింపగాయత్నించు
మా ప్రభుత్వంబు విశ్వసమ్మాన్యమగును

హరిజనులకడగండ్లను సమాజానికి తెలియజెప్పడంతో సరిపెట్టక ఆ సమస్యను ప్రభుత్వం రాజకీయంగా ఎలా పరిష్కరిస్తున్నదోకూడ వివరించారు పి. వెంకటసుబ్బయ్యగారు తమ అనిల సందేశంలో

మంత్రిపదవులుగొందరు మాలవారు
గొనుచు బరిపాలనముజేయుగొనబుజూచి
విచ్చపోకుందువే! వచ్చి మెచ్చుకొనుము
మచ్చమందులులేవిందుమాననీయ
హరిజనులకు బ్రభుత్వంబుగరముప్రీతి
పనులనొసగుచుమున్ముందు ఘనతనిచ్చు
రీతులన్నియు సమకూర్చికృతకధర్మ
సంచయంబును దెగగొట్టెనసఖుడనేడు

కేవలం ప్రణాళికలను ప్రవేశపెట్టినందుకు ప్రభుత్వాన్ని పొగడడమేగాక ప్రభుత్వం చేయవలసినపనులుకూడ చెప్పారు. శ్రీమతి సుంకనమణి రామచంద్ర రావుగారు తమ తుమ్మెద సందేశంలో

యువతీయువకులకు విద్యలేచెప్ప
పాఠశాలలెల్లవేరుగా జేసి
స్త్రీవిద్యమృదువుగా సహనంబుతోను
మనసుకుబలమిచ్చుమంచివిద్యలతో

ఇకముందునుండైన ఇంటింటివారు
హద్దుపద్దులతోను హెచ్చరికతోను
ఏనాడు అతివలు అలవరచగలరో
ఆనాడె అవునయ్య అమరరాజ్యంబు

ఈ రాజ్యం ఎప్పుడు ఏ విధంగా అమరరాజ్యమౌతుందో భారతప్రధాని నెహ్రూకు రచయిత్రి సందేశాత్మకంగా తెలియజేసింది.

ఈ విధంగా సందేశకావ్యకర్తలు తమకావ్యాలలో సమకాలీన సమాజం లోని గుణదోషాలను ఉపదేశాత్మకంగా తెలియజేస్తూ తమ కాలంనాటి సామాజిక రాజకీయ పరిస్థితులకు ప్రతిస్పందించారు.

**విజ్ఞానిగా మనిషి వ్యవహరించవలసిన తీరు :**

పశువులనుండి మానవుని వేరుచేసింది విజ్ఞానం. ఆ విజ్ఞానహీనుడు పశువుతో సమానం. ఆ విధంగా భగవద్దత్తమైన విజ్ఞానాన్ని మానవుడెలా సద్వి నియోగంచేసికోవాలో తద్వారా సమాజానికి ఆతడేవిధంగా ప్రయోజనకారికా గలడో, సందేశకావ్యకర్తలు తమ కావ్యాలలో తెలియజేశారు.

గబ్బిలంలో జాషువ మహాకవి మనిషిలో తానుకోరినమార్పు వివరిస్తూ –

ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వ
విశ్వసత్యమునేలపెంచగలదొ
ఏనాడు మాజాతి దృష్టిమాంద్యమువాసి
చుట్టుప్రక్కలదేరి చూడగలదొ
ఏనాడు మాబుద్ధిలీజాట్టుతలలేని
పుక్కిటకథలలోజిక్కువడవొ
ఏనాడు మా విద్యలినుపసంపుంబునందు
చిలుమువట్టక ప్రకాశింపగలవొ

తనువుదాచకసోమరితనముమాని
యెన్ని డీఘరంబులు బిచ్చమెత్తుకొనవొ
అట్టి శుభవేళకై కొంగుబట్టినిలచి
నలిగిపోవుచున్నది నా మనస్సు

విజ్ఞానం వెఱ్ఱితలలు వేయగా మనిషిచేసే మోసపూరితమైన చర్యలే పైన కవి పేర్కొన్నవన్నీ జగమంతా ఒకే కుటుంబమని వేదాలు చెబుతున్నాయి. కానీ మనకావ్యకర్తలు మాత్రం విశ్వసత్యాన్ని ఆలపించకపరిమితమైన గిరిగీసు కొని వ్యవహరిస్తున్నారు. విశాలదృక్పథం లోపించడమేగాక దేశానికి విజ్ఞానాన్ని పంచవలసిన మఠాలు విచ్ఛిన్నమెత్తుకొనేస్థాయికి దిగజారినాయి. ఈ విధానంలో మార్పురావాలని కవి వేదనాపూరితమైన హృదయంతో వేడు కొన్నాడు.

ఈ సమాజం ఉన్నతినిపొందడంలో యాంత్రింగా తానుకూడ భాగస్వామి యైన హరిజనుని అంటరానివానిగా. హీనునిగా చూడడం సభ్యసమాజంలోని జ్ఞానసేత్రం కలిగినవానికి తగదు. దాన్నే పరోక్షంగా పుట్టపర్తివారు తమ మేఘదూతంలో ప్రస్తావించారు.

నిండుటాకలిదూయ
మండుటెండలగాయ
నడపీనుగులవోలె నిలచీ శిరసుపై
గడుధూళియునుదుమ్ము బెరసీ కనపడెడు
హరిజనులపై నుంత ఆదరము నీవైన
పరపరా! వారినోదార్చువారేలేరు

ప్రకృతితన్ను ఊరడిస్తోంధిగాని తన సోదరులకంటినుండి సానుభూతితో ఒక్కొక్క కన్నీటి చుక్కగూడ రాలడంలేదని ఒక హరిజనుడీ విధంగా తన బాధను వ్యక్తంచేశాడు గబ్బిలంలో చూడండి

గిరుల గుండెలుగరిగి నిర్ఝరములట్లు
లుబుకుచున్నవిదిశలనన్నూరడింప
బక్షికళ్యాణి సోదర ప్రజలకంట
నిర్గమించెనె? యొక్కకన్నీటిచుక్క

సానుభూతి కనపర్చడం కనీసధర్మం అది ఆ తాడితుడే గుర్తుచెయడం ఈ సమాజానికి మాయనిమచ్చలాంటింది.

సాంఘికంగా అంటరానివారు హరిజనులైతే ఆర్థికంగా అస్పృశ్యులు నిరు పేదలు ఆ నిరుపేలనలా ఉంచివారికర్మకువారిని వదలేయక వారిపేరుచెప్పుకొని దనాన్ని సంపాదించడానికి ధనవంతులు ప్రయత్నం చేయ్యడం మరీఘోరమైన విషయం. ధనవంతులచర్య మరుత్సందేశంలో ఇలా వ్యక్తంచేయబడ్డది.

పేదలపేరుచెప్పుకొనిపేదలనోళులనొక్కివేసి సం
పాదనచేసి లక్షలు కృపారహితాత్ములుమేడమిద్దెలన్
మోసమునన్ విలాసముల బుత్తురుకాలముజాలిగుండెయే
లేదొక బాష్పబిందువిడలేరు బుభుక్షదపించువారికై

వృక్షాలు, నదులు పరోపకారం అప్రయత్నంగాచేస్తుంటే విజ్ఞానిగామానవుడు పరులకు అపకారంచేయబూనడంకంటే వినాశహేతువు మరొకటుండదని వీరిభావన.

ఎదుటివారిలో దుర్గుణాలుంటేవాటిని ఖండించడం ఎంత అవసరమో సద్గుణాలను మెచ్చుకోవడంకూడ అంతే అవసరం. లేకపోతే కనీసధర్మం. కాని ఏదోస్వార్థంచేతపరులగుణగణాలను మెచ్చుకపోవడం పండితుల లక్షణంగా మారిపోయింది. పండితులలోని ఈ స్వభావాన్ని గబ్బిలకావ్యంలో ఇలా విమర్శించడం జరిగింది.

అచ్చోటి తబిసిరాజులు
సచ్చలుదపమాచరించునీకాతిధ్యం
బిచ్చెదరుపరులవిద్యలు
మెచ్చెదరీగుణమునేడు మృగ్యంబుగదా.

ఏదేశానికి సంబంధించిన విజ్ఞానమైనా అది విశవివ్యాప్తంకావలసి ఉన్నది. అది కొందరికే పరిమితంకాకూడదు. అలా దాచుకొంటే ప్రపంచం హేళన జేస్తుంది. ఈ విషయాన్ని గబ్బిలంలో జాషువ మహాకవి హెచ్చరికగా తెలియజేశారు.

"కళలందాచెడు చప్పనాతితనమింకన్ దేశమందున్నచో
కలదేముక్తి ప్రపంచసభ్యతకు మార్గంబుండునే జాతికిన్"

అని చివరకు చదువుకొన్నమూర్ఖుని ఎవ్వరూ మార్చలేరని నిశ్చయించుకొని ఆ మాటలనే యిలా వ్యక్తంచేశారు.

"చదువునేర్చినవెఱ్ఱిని జంపగలరె?"
ఒక్కబుద్ధుడునొక క్రీస్తు ఒక్కగాంధి"

సభ్యసమాజంలో మనుగడ సాగిస్తున్న విజ్ఞాని సమాజవినాశానికికాక వికాసానికి అహరహం ప్రయత్నంచేయాలన్నదే సందేశకావ్యకర్తల సందేశం

**నాగరిక గ్రామ్య జీవనం :**

ప్రకృతి సహజంగా ప్రసాదించినవనరులతోసాగే జీవనం గ్రామీణజీవనం.

మానవుడు తన మేధాశక్తిచేత కృత్రిమంగా కల్పించుకొన్నవసరులతో సాగేది నాగరక జీవనం. వారికైనందిన కార్యకలాపాలలో అడుగడుగునా ఈ విధానమే ప్రతిబింబిస్తూ ఉంటుంది

ఈ నాగరక గ్రామ్యజీవన విధానాలను గూడ సందేశకావ్యకర్తల తమ కావ్యాలలో పరిశీలనాదృష్టితో వర్ణించారు

శ్రీకృష్ణుడు కార్యార్థియై మధురకుపోయాడు రాధ కృష్ణవిరహాన్ని సహింపలేక పోయింది ఆమె మనసులో ఈర్ష్యచోటు చేసికొన్నది మధురా నగరంలోని కాంతలు శ్రీకృష్ణుని బందీచేసి ఉండవచ్చునని ఊహించింది. "పట్టణవాసుల నేర్పులెట్టులు మాకబ్బు" అనుకొని మరల యిలా అన్నది.

"పల్లెసీమలబుట్టినవార మేము
కల్లకపటంబులేదు మాయుల్లమందు
నిశ్చలప్రేమహృదయాన నిండియుండు"

ఈ మాటలలో పవనసందేశరచయిత్రి గంటి కృష్ణవేణమ్మగారు గ్రామీణ నాగరక స్త్రీల స్వభావాన్ని చక్కగా వ్యాఖ్యానించారు పల్లెలలో కరుణగాని, క్రౌర్యంగాని వంచనారహితంగా ఉంటాయి పట్టణాలలో దానికివిరుద్ధంగా ఉంటుంది వాతావరణం. నాగరక గ్రామీణ జీవనవిధానాలలో ఎంతో అంతర మున్నది పొరుగింటి వారితో కూడా మాట్లాడడానికి మనసొప్పని, తీరిక ఉండని యాంత్రిక జీవనం నగరాలలో సాగుతుంటుంది ఆధునిక యంత్రాలతో పాటు వారుగూడ పరుగిడుతుంటారు.

ఆంధ్రమేఘప్రతిసందేశంలో బెంగుళూరు నగరాన్ని రావాడ వేంకటరామ శాస్త్రిగారు వర్ణిస్తూ ఆ యాంత్రికజీవనాన్ని యిలా వివరించారు.

అచ్చటి యెల్లవీథులను నాంగ్లశకటుల్ హరియింతురాఢ్యులై
బచ్చులు లక్షలక్షలుగ వర్తకమున్ బచరింతురాయెడన్
హెచ్చుగగార్యశాలల జరించుచునుందురు కర్మకారులున్
నిచ్చలుయంత్రశకక్రముల నిస్వనముల్ మినుముట్టుచుండెడిన్

వారిద! వీధులన్నిటనపార జనంబులబొల్చునాపురిన్
బౌరులరాపుచే నొదిగి బాటజనుల్ చరియింతురైన మో
టారు సమాఖ్యగాంచు శకటంబులు నల్గడలందు వచ్చుటన్
భీరుత దిగ్భ్రమన్ గనుచు వేగమెపర్విడుచుందురాజనుల్

పొగగొట్టపు ఘూంకార ధ్వనులతో యంత్రాలతో మనిషి, మనషితో యంత్రాలు, పరుగెత్తడం పట్టణాలలో నిత్యం కన్పడే దృశ్యం

నగరవాసులైన స్త్రీలను గూర్చి గూడా రావాడవారే ఈ విధంగా వర్ణించారు.

నగరము వీధీవీధి భవనంబులవైద్యుతదీపరాజితా
బగళులొనర్చిరాత్రులను భాసిలుచుండ జనోపయుక్తమై
మగువలు ప్రక్కనేచనెడు మానిసిగుర్తికకుండదిట్టలై
మగయుడుపుల్ ధరించి ప్రియు మందిరముల్ చనుచుందురయ్యెడన్
అరుదుగ రాణిపేర దనరారుచునుండెడు పారశాలయం
దురుతరవేతనంబులనునొందుచు ప్రౌఢతగాంచి విద్యలన్
సురుచిరవస్త్రభూషలయిశోభితలైవినయోక్తిచాతురిన్
దరుణులు వీణపాటనట దాన్పుదురింటనునింట స్త్రీయలన్.

విద్యుద్దీపాలతోనగరాలు రాత్రిని పగటివలెయందు బాసిస్తుంటాయి స్త్రీలు మగయుడుపులుధరిస్తుంటారు ఉద్యోగాలుకూడ నిర్వహిసుంటారు ఈ విధంగా పురుషులతోపాటు స్త్రీలు కూడ నాగరక జీవనవిధానానికి తగినవి ధంగా ఉద్యోగాదులుచేస్తూ వారికి కుటుంబపోషణంతో సహకరిస్తుంటారు

నగరాలలో కళాశాలలో చదువుకొనే స్త్రీలు నిర్భయులై వ్యవహరిస్తూ యధేచ్ఛగా సంచరిస్తుంటారు ఢిల్లీనగరంలో విద్యార్థినులను వర్ణిస్తూ మరుత్సం దేశకావ్యకర్త ఈ విధంగా అన్నారు

అచట జదివెడివాల్గంటులదరులేక
అలరుదోటలవిహరింత్రుజిలుగవలువ
తొలగుజేయకుకొంగెబైతుంట విలుతు
బంటవై కంటబడనిట్టిదంటవగుచు

ఇది నాగరక జీవనం. నగరాలలో అన్న విక్రయశాలలు ఎక్కువగా దర్శనమిస్తుంటాయి. అవికూడ వీరిదృష్టినుండి తప్పించుకోలేదు. మరుత్సం దేశంలో .

అన్నముబ్రహ్మమన్న నిగమాంతవచస్సు జపించి పాక ప
క్వాన్నముదృప్తిగా గొనెడివాడును బ్రహ్మమెయన్న సూక్తమున్
మన్ననసేయుచున్ గ్రయధనమ్మునుగొంచుననన్నదాతవై

చెన్నగుభూరి హర్షమును జెందగజేసెదరున్నవారలన్
"అన్న' విక్రయశాలలయందు గలవు
"రసగులా" "బర్ఫి" "బాద్షా"ది రమ్యభక్ష్య
పంక్తి "డాల్డా" ప్రపక్వముల్ పలురకాలు"

ఉద్యోగాలు చేస్తున్న భార్యభర్తలు ఇరువురు అన్న విక్రయశాలల్లో భోజనం చేయడంకద్దు. వారి ఇండ్లకు వచ్చిన బంధువులు కూడ అక్కడే భోంచేసి చూచిపోవడానికి వస్తుంటారు అందుకనే ఇవి నగరాలలో ప్రత్యేక స్థానాన్ని ఆక్రమిస్తాయి. ప్రత్యేకాకర్షణలుగా భాసిస్తాయి.

**గ్రామీణజీవనం :**

గ్రామాలలో ఒక విధమైన ఆత్మీయత గోచరిస్తుంది. ఎన్ని కులాల వారున్నా వారంతా ఒకే కుటుంబంగా జీవిస్తుంటారు. తమ పలకరింపులలో బంధుత్వాన్ని కలుపుకుంటారు.

'మామ'యని 'బావ'యని
మనసులోతులదడవు
వావివరసలనెన్నికొనుచూ - బురుషులను
జవరాండ్రునున్ గూడికొనుచూ - పల్లెప
ట్టులను బ్రదికెడు జనులదలచేవురా
పల్లెపట్టులలోని బ్రదుకు తీరువేఱు

కృత్రిమమైన పలకరింపులు తప్ప నగరాలలో మనసులను తడివే సంబోధనలేయుండవు పుట్టపర్తివారు తమ మేఘదూతంలో పల్లెవాతావరణాన్ని చక్కగా తెలియజేశారు.

పల్లెలలోనూ స్వార్థం రాజ్యం చేస్తుంటుంది. అక్కడ పశువులను పాలేళ్లను నిర్దయగా చూచి శ్రమశక్తిని దోపిడిచేసే కామందులు లేకపోలేదు.

పల్లెపట్టులలోను
బయనించుసమయాల
పాలేరువాడు గన్పించూ - మిడియెండ
బ్రద్దలుగగొట్టి పండించూ - వాడెంత
గష్టించినా మిరపకారమే సంగటికి
కలదోయి కామందు కలిమివాడికి జెందు

ఈ పాలేరుతోపాటు కష్టపడే వృషభాలుకూడ కన్పిస్తాయి. వాటి స్థితి ఇలావున్నది.

కనులలో గన్నీరు
గాల్వగట్టగ గడియ
తీరికయెలేకున్న జీవీ - నాగేటి
చారలేబ్రతుకైనవానీ - వృషభరా
జవ్వానిభాషనీకర్థమౌనోయే మొ
నెవ్వగలనుడుపరా నీనీదగొడుగులై

ఒకప్పుడు వైభవం కల్గిన గ్రామాలలోని దేవాలయాలు నేడు గబ్బిలాలకు నివాసస్థానాలు. ఈవిషయాన్ని పుట్టపర్తివారు తమ మేఘదూతంలో ఇలా తెలియ జేస్తున్నారు.

అచటగనుపించు
నభ్రంకషమ్ములగు
గోపురమ్ములగుడులు నీకూ - నేడచట
గాపురము గబ్బిలమ్ములకూ - మాన్యములు

ధర్మకర్తల్లుండ్ల ధ్రాన్యంబులను గొలిచి
ధ్యమలతిరవిదేవునకు బలుకుబలమేలేదు

దేవుని స్థితి యిలా ఉంటే ప్రతిపల్లెలోను దొంగసన్యాసులు ప్రబలి అమాయకపల్లీయులను దోచుకొంటున్నారు. అలా దోచుకుదేవారిని గూర్చి గబ్బిలంలో జాషువ కవీశ్వరుడు ఈ విధంగా అన్నాడు.

జపమోధ్యానమొ! యభ్యసించి యతివేషంబూని క్రీడించుమో
సపుబార్థుల్ ప్రతిపల్లెటూరగలరీ సన్యాసి వర్గంబు నీ
కుపదేశింపదొ! యిష్టసిద్ధికనియేమాయోపాయ మంత్రంబు భ
క్తిపరత్వం బొక సాధనంబిహపరశ్రీ వంచక శ్రేణికిన్

మంచీచెడులకు దర్పణాలై నాగరకగ్రామీణ జీవనవిధానాలను సందేశ కావ్యకర్తలు తమ కావ్యాలలో పరిశీలనాదక్షతతో వర్ణించారు. తమ సామాజిక స్పృహను తగిన పట్టులతో తగిన విధంగా వ్యక్తం చేశారు.

ఇప్పటివఱకు వివరించిన వస్తువైవిధ్యం వర్ణనలు సామాజిక స్పృహాది వివిధ విషయాలనుబట్టి సందేశకావ్యాలలోని సందేశసారాన్ని రెండు భాగాలుగా విభజింపవచ్చు

1. కథాగతము
2. వర్ణనాగతము

**కథాగతం :**

సందేశకావ్యాలలోని విభిన్నమైన కథలు విభిన్నాలైన సందేశాలను సమాజానికందిస్తున్నాయి. వాటిని రెండుగా ప్రణయాత్మకము, సామాజిక స్పృహాత్మకము అనవచ్చు.

**ప్రణయాత్మకము :**

కాళిదాస మేఘదూతం ఆదర్శంగా రచింపబడిన ప్రణయసందేశ కావ్యాలు ఆ కావ్యంయిచ్చే సందేశాన్నే అనుసరించాయి. ప్రేమైక జీవులు ఎలా ఉంటారో

కాళిదాసమహాకవి తన మేఘసందేశంద్వారాలోకానికి చాటిచెప్పాడు. ఆదర్శ ప్రణయస్వరూపాన్ని వారి వియోగవ్యథల ద్వారా బహిర్గతం కావించాడు ఇటు వంటి సందేశమే తెలుగు ప్రణయసందేశకావ్యాలైన చకోరసందేశం, శశీదూతం మొదలైనవి ప్రబోధిస్తున్నాయి

**సామాజికస్ఫూర్త్యాత్మకము :**

గబ్బిలం, అనిలసందేశం మొదలైన సామాజిక సందేశకావ్యాలు నాటి సమాజంలోని మంచిచెడులకు దర్పణాలుగా భాసించాయి. అందువల్ల నాటి సమాజంలోని అవ్యవస్థలకు నేటి పర్యవసానాన్ని గమనించి వాటిని తొలగించు కొని సమరససాంఘికజీవనాన్ని అలవర్చుకోవాలనేదే ఆ కావ్యకథా సందేశసార మౌతుంది.

అంతేకాక నేడు సమాజంలోని అవగుణాలనుసైతం ఎత్తిచూపి వాటినుండి ప్రజల్ని విముక్తులు కమ్మని ఈ కవులు ధ్వనిగర్భితంగా ప్రబోధించడంకూడ ఈ కావ్యాలలో కన్పడుతుంది.

**వర్ణనాగతం :**

సందేశకావ్యాలు సహజంగా విస్తారమైన వర్ణనలతో కూడి ఉంటాయి. ఆవర్ణనల్లో కొంత ప్రబోధం కన్పిస్తుంది.

పుణ్యపురుషులను, పుణ్యక్షేత్రాలను పవిత్ర నదీనదాలను, దేవతలను, కవి పండితులను, ప్రాచీనవైభవాన్ని వర్తమానసమజాన్ని వర్ణించడం ద్వారా భారతీయపురాతనౌన్నత్యం, ఆర్షధర్మప్రాభవం, భక్తివైశిష్ట్యం వివరిస్తూ వర్తమాన జనవాళికి అవి నిరంతర సాధనైక లక్ష్యాలని, ఆదర్శప్రాయాలని ప్రత్యక్షం గాను, పరోక్షంగాను నిరూపించడమే ఈ సందేశకావ్యాలలోని వర్ణనాత్మకమైన సందేశసారం.

కాళిదాస మహాకవి మేఘసందేశంలోనే భౌగోళికంగా భారతదేశవర్ణన అతి మనోహరంగాసాగింది. మహాకవి పరవశుడై స్వర్గంకంటె గొప్పదైనదిగా తన జన్మభూమిని వర్ణించాడు. తరువాతి సందేశకావ్యకర్తలుకూడ అణువణువున

పవిత్రమైన తన ఈ పుణ్యభూమిని వర్ణించి తమ దేశభక్తిని చాటుకొన్నారు. మరుత్సందేశకావ్యకర్త భారతదేశాన్ని మాతృమూర్తిగా భావించి "ప్రత్యహము వరలుగాక మా భరతమాత" అని ప్రస్తుతించాడు. ఇందుచేత ఈ జాతి అనన్యమైన దేశభక్తియుతం కావాలన్నది. ఈ దేశం అణువణువునాపవిత్రమైనదని ఈ జాతి భావించాలని సందేశకావ్యకర్తల సందేశంగా మనమూహించవచ్చు.

లక్ష్యశుద్ధితో ప్రయోజనాత్మకంగా తెలుగులో ఈ విధమైన సందేశకావ్య రచనసాగింది.



# ఆంధ్రేతరభాషా సందేశకావ్య

విహంగ వీక్షణం

## షష్ఠాధ్యాయము



ఇందులో

అపభ్రంశ సాహిత్యం
హిందీ సాహిత్యం
బెంగాలీ సాహిత్యం
తమిళ సాహిత్యం
మళయాళ సాహిత్యాలలోని
సందేశకావ్య ప్రక్రియ
స్థాలీపులాకంగా పరిశీలితం

# అన్యసాహిత్య సందేశకావ్యాలు

సందేశకావ్యాలు సంస్కృత వాఙ్మయంనుండి తెలుగులోకి అనువదింప బడిన విధంగానే ఇతర దేశీయభాషలలోకిగూడ అనువదింపబడ్డాయి. ప్రధానంగా కాళిదాస మహాకవి మేఘసందేశం అనేక ప్రాంతీయభాషల్లోకి అనూదితమైంది. అంతేగాక తెలుగులో వచ్చినవిధంగానే ఇతర దేశీయభాషల్లోకూడా స్వతంత్ర సందేశకావ్యరచన సాగింది.

లభ్యమైనంతవరకు ప్రాంతీయభాషలలోని సందేశకావ్యాలను గూర్చి సంక్షిప్తంగ వివరించాలనుకుంటున్నాను.

## అపభ్రంశ సాహిత్యం

శిష్టసమ్మతమైన సంస్కృత భాషనుండి వికృతము, భ్రష్టము అయిన శబ్దాలయొక్క సమూహం 'అపభ్రంశ' భాష అని భాషాభిజ్ఞులన్నారు.

శాస్త్రాల్లో సంస్కృతంకంటె భిన్నమైంది, కావ్యాల్లోని అభీరాదుల భాష అపభ్రంశమని ప్రసిద్ధ ఆలంకారికుడైనదండి తన కావ్యాదర్శంలో వివరించాడు.[1]

వాగ్భటుడనే ఆలంకారికుడు ఈ అపభ్రంశ భాషను దేశభాషా విశేషంగా పేర్కొన్నాడు. క్రీ॥శ॥ 6వ శతాబ్దకాలానికి అలంకార శాస్త్ర గ్రంథాలల్లో ప్రస్తావితపబడిన ఈ భాష క్రీ॥శ॥ తొమ్మిదవ శతాబ్ది నాటికి సామాన్య జనంలో వ్యవహరితపబడుతున్న భాషగా రూపుదాల్చింది. క్రీ॥శ॥ పదునొకొండవ శతాబ్దికి దేశభాషా భేదంగా రూపుదిద్దుకున్నది.

---

1 అభీరాదిగిరః కావ్యేష్వపభ్రంశ ఇతి స్మృతాః।
శాస్త్రేషు సంస్కృతాదన్యదపభ్రంశ తయోదితమ్ ॥

కావ్యాదర్శః ఆచార్య దండి
ప్రథమపరిచ్ఛేదః శ్లో 36. పుట - 19
వ్యాఖ్యారచయిత శ్రీరామచంద్రుడు పుల్లెల
ప్రచురణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

ఈ అపభ్రంశభాషలో క్రీ॥శ॥ 12వ శతాబ్ది ఉత్తరార్థంలో అబ్దుల్ రహమాన్ (అద్దహమాణ) అన్న పేరుగల ప్రసిద్ధకవి 'సందేశరాసక్' అన్న పేరుతో ఒక కావ్యాన్ని రచించాడు. ఆ కావ్యం అపభ్రంశ సాహిత్యభాండాగారానికి అమూల్యరత్నంగా భాసిల్లింది

## సందేశరాసక్

ఈ కావ్యం కాళిదాస మహాకవికృత మేఘసందేశాన్ని పోలింది.

వియోగిని అయిన ఒక నాయిక ఒక పథికునిద్వారా తన ప్రియునకు వలపుకబురు తెలియజేయడం ఇందులోని ఇతి వృత్తం.

ఇది మూడు ప్రక్రమాల గ్రంథం. ప్రక్రమమంటే సర్గ అని భావించవచ్చు.

ప్రథమ ప్రక్రమంలో కవి స్వీయపరిచయమున్నది. రెండవప్రక్రమంలో విరహిణియైన నాయిక తన విచారవృత్తాన్ని కొందరు పథికులకు తెలియజేస్తుంది. ఆ బాటసారులలో ఒకడు దయనీయమైన ఆమెగాథను శ్రద్ధతో ఆలకిస్తాడు మూడవప్రక్రమంలో తన దీనగాథ శ్రద్ధతో విన్న ఆ పథికునకు తన ప్రియునికై ఒక సందేశాన్ని విన్నవిస్తుంది. ఆ సందేశాన్ని స్వీకరించిన పథికుడు తన ప్రయాణాన్ని కొనసాగిస్తాడు. వెంటనే ఆమెకు తన ప్రియునితో సమాగమ సౌఖ్యం లభిస్తుంది.

ఈ విధంగా మూడు ప్రక్రమాలలో రచించబడిన సందేశరాసక్ అన్న సందేశకావ్యం అపభ్రంశ సాహిత్యానికే తలమానికం.

---

1 విజ్ఞాన సర్వస్వం 6వ సంపుటం పుట - 291.
తెలుగుభాషా సమితి ప్రచురణము 1961
సంపాదకులు . ఆచార్య దివాకర వేంకటావధాని.

## హిందీసాహిత్యం

హిందీ వాఙ్మయంలో ఒక సందేశఘట్టం లభ్యమౌతోంది. ప్రియప్రవాస్ అనే మహాకావ్యంలోని షష్ఠసర్గంలో సందేశఘట్టం ఉన్నది. కేవలం ఆ ఒక్క సర్గనే వింగడించిచూచినట్లైతే అది ఒక సందేశకావ్యంగా భాసిస్తుంది ఆ ఒక్కసర్గలోనే సందేశకావ్యలక్షణాలన్నీ ఉన్నాయి.

ఆధునిక హిందీభాషయైన ఖడీబోలీలో "సాహిత్యవాచస్పతి" "సాహిత్యరత్న" "కవిసమ్రాట్" అయోధ్యాసింహ ఉపాధ్యాయ పండితుడు ఈ ప్రియప్రవాస్ మహాకావ్యాన్ని వ్రాశాడు.

శ్రీకృష్ణుడు రాచకార్యసంపాదనార్థం వ్రజభూమిని, రాధను, గోసమూహాన్ని వదలి మధురానగరానికి వెళ్ళాడు. నిత్యచైతన్యంతో భాసిల్లే వ్రజభూమి నిర్జీవమైంది. కృష్ణవిరహంతో భరింపరానివేదననుభవిస్తున్న రాధకు ఉత్సాహరహితమై ఉన్న ప్రకృతిని చూచేసరికి వేదన అధికమైంది. ఆ చైతన్యరహితమైన ప్రకృతిని కదలించడానికా అన్న విధంగా పవనుడు ఆ ప్రదేశానికిరాగా, రాధ ఆ పవనునిచేత మాధవునకు సందేశం పంపింది. ఈ సందేశం మందాక్రాంత వృత్తంలోనే ఉన్నది. మార్గవర్ణన, శ్రీకృష్ణవర్ణన మనోహరంగా సాగాయి.[1]

## బెంగాలీసాహిత్యం

వంగదేశంలో చైతన్యమహాప్రభుల భక్తి ఉద్యమం ఎంతో చైతన్యాన్ని కల్గించింది. రాధామాధవుల మధురప్రేమకధ ఆధారంగా ఎన్నోకావ్యాలు వెలిశాయి.

సందేశకావ్యాలుకూడ కొందరుకవులు వ్రాశారు. అవి సంస్కృత వాఙ్మయానికి పరిమితమైనాయి. శ్రీలరూపగోస్వామి వ్రాసిన హంసదూతం సంస్కృతభాషలోనిదే. కానీ వీరి అనుయాయులు ఆ వియోగకధ ఆధారంగా బెంగాలీభాషలో ఎన్నోకీర్తనలు వ్రాశారు.

---

1 ప్రియప్రవాస్ - షష్ఠ సర్గ; ప్రచురణ - హిందీసాహిత్య కుటీర్ బనారస్, విక్రమశకం – 2023.

మురారిగుప్తుడనే కవి రాధామాధవుల వియోగాన్ని కావ్యంగా వ్రాశారు. సంపూర్ణసందేశకావ్యలక్షణాలు లేకపోయినా తత్తుల్యమైందిగా ఊహించవచ్చు.

శ్రీకృష్ణుడు బృందనువీడి మధురకు వెళ్లాడు ఆ సమయంలో కృష్ణ వియోగాన్ని క్షణమైనా సహించలేని రాధ వేదననభవిస్తుంది ఆమెస్థితిని చూడలేని ఒకదూతిక మధురకు వచ్చి కృష్ణునకు రాధ బాధామయగాధను నివేదిస్తుంది.

నీవు రాధను ప్రేమించినట్లు నటించడం ఎంతనీచం. ఆమె యిపుడు చనిపోయిన దానితో సమానం. ఆమెస్థితి చాలా విషమంగా ఉన్నది. చిన్నచేప ఎంతకాలం నీటిబయట ఉండగలదు? మాధవా! నామాట విను. యుగాంతందాకా వెలిగేశక్తిమంతమైనదీపాన్ని వెలిగించి అందులో ఒక్క బిందువు ఘృతాన్నే పోశావు. అది అలా వెలుగుతూ ఎలా ఉండగలదు. అల్పమైనవాయుపీడనానికే అది ఆరిపోతుంది వెంటనే వచ్చి ఆమె ప్రాణదీపాన్ని కాపాడమని వేడు కొన్నది.

ఇది దూతకృత్యం కల్గిన లఘుకావ్యం ఇదేవిధంగా వైష్ణవభక్తికీర్తనలలో చాలావరకు విరహవేదనం దూతకృత్యాలు సహజమైనాయి

## తమిళసాహిత్యం

తమిళంలో అనువాద సందేశకావ్యాలేగాక కొన్ని స్వతంత్రకావ్యాలు కూడ వెలిసాయి.

అతిప్రాచీనమైన దూతకావ్యం ఇటీవల వెలుగులోకివచ్చింది

కావ్యంపేరు తమిల్ విడ్ తూద్' (తమిళదూతం). రచయితపేరు మాత్రం తెలియదు.

---

1 వంగసాహిత్యచరిత్ర — సుకుమార్ సేన్ - పుట 103. సాహిత్యఅకాడమీ,

తమిళులకు ఆరాధ్యదైవమైన చొక్కనాధుని ప్రేమించిన ఒక వనిత తమిళభాషనే దూతగా ఎన్నుకొని తన ప్రియునివద్దకు దూతగా పంపించింది

ఈకావ్యంలో దూతప్రశంసలోను మార్గవర్ణనలోను తమిళవాఙ్మయంలోని పురాణాలు, ప్రబంధాలు, వ్యాకరణం, ఛందస్సులకు సంబంధిచిన విశేషాలు, శైవమతభక్తి భావాలు విస్తారంగా వర్ణింపబడ్డాయి.

తమిళవాఙ్మయానికి సంబంధించిన విజ్ఞానం ఆమూలాగ్రంగా పాఠకునకు తెలియచేయాలన్నదే కావ్యం ప్రధానోద్దేశ్యం దీనిచాయలలోనే శ్రీపూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు తెలుగులో "తెనుగుసందేశము" అన్న సందేశకావ్యం రచించారు. అందులోను తెలుగుభాషా సాహిత్యాల వైభవం విస్తారంగా వర్ణింపబడ్డది.

## 2. అలగర్ కిళ్ళైవిడతూద్ :

ఈ కావ్యకర్త పలపట్టడై చొక్కనాధ మహాకవి.

మధురైలోని పెరుమాళ్లను ప్రేమించిన ఒక వనిత అతనివద్దకు చిలకను దూతగా పంపింది

ఇది వైష్ణవపరమైన కావ్యం, మార్గనిర్దేశంలో వైష్ణవ క్షేత్రాలు, తమిళ దేశంలోని ప్రకృతి అతి మనోహరంగా వర్ణింపబడినాయి.

## 3. మకిల్ విడ్ తూద్ :

మకిల్ అంటే మేఘం. మేఘంచేతదూత్యం పంపబడిన దూతకావ్యమిది

కారైకూడి మీనాక్షిసుందర్ హైస్కూలులో తమిళపండితునిగా పని చేస్తున్న అరసన్ అనేకవి ఈ కావ్యాన్ని వ్రాశారు

ఒక గృహిణి ధనసంపాదనార్థం ప్రవాసంపోయిన పతిజాడ ఎంతకాలం తెలియకపోవడంచేత అతనివద్దకు తన కుటుంబవిషయాలు తెలియజేయమని మేఘుని అర్థించి దూతగా పంపింది.

ఆధునికంగా ఈ శతాబ్దిలోని సమకాలిక సమాజానికి తన కావ్యం దర్పణంగా చేశారు అరసన్ మహాకవి [1]

---

[1] ముఖాముఖి – శ్రీమతి ఆర్. సందనమారి, తమిళవిద్వాన్ టి టి షి, హైస్కూల్, విజయవాడ.

# మలయాళ సాహిత్యం

ఇతర భారతీయసాహిత్యాలలో కంటే మలయాళ సాహిత్యలో ఈసందేశ కావ్యాలకు విశిష్టమైన స్థానమున్నది.

ఈ మలయాళ దేశంలో సంస్కృత భాషలో కూడ అనేక సందేశ కావ్యాలు వచ్చాయి. కాళిదాస మేఘసందేశం తరువాత చారిత్రకంగా రెండవది యైన శుకసందేశం మలయాళ దేశంలోనే వెలసింది. అంతేగాక సంస్కృతంలో ప్రసిద్ధాలైన చటక, కోకిల, భ్రమర, మయూర సందేశాలు కేరళదేశీయాలే.

సారవంతమైన, శృంగారభావనే ముఖ్యలక్షణంగా గల్గిన ఆదేశపుకవులు సమృద్ధాలు, ఆత్మాశ్రయాలు అయిన తమభావాల్ని వెల్లడించడానికి సందేశ కావ్యమే తగినదిగా భావించి ఆ కావ్య సృష్టిచేశారు. సహృదయులైన కేరళ ప్రజలకివి మిక్కిలి ప్రీతిపాత్రాలైనాయి. ఆ కారణంచేత ఆ భాషలో అనేక సందేశకావ్యాలు వ్రాశారు కవులు.

మణిప్రవాళవాఙ్మయంలోని తొలిదశను సందేశకావ్యాలకు స్వర్ణయుగంగా పరిశీలకులు భావించారు.

కాని మణిప్రవాళభాషలోని తొలిదశలోని వాఙ్మయం నాశనమైపోయింది. అందులో సందేశకావ్యాలుకూడ ఉన్నాయి.

మలయాళ భాషలోని సందేశకావ్యాల్లో ఉణ్ణునీలిసందేశం అతిప్రాచీన మైనది అంతేగాక ఆ కావ్యాల్లకు తలమానికమైనదికూడ ఈ కావ్యకర్తను గూర్చిన ఆధారాలు లభ్యం కావడంలేదు. ఈతడొక రాజకుటుంబానికి చెందిన వాడై యుండవచ్చు. కావ్యంలోని వర్ణనలనుబట్టి ఊహించి 14వ శతాబ్దివాడని విమర్శకులు భావిస్తున్నారు.

ఈ కావ్యంలో కవే నాయకుడు నాయిక పేరు ఉణ్ణునీలి. మధ్యకేరళ దేశంలోని వడక్కుమ్కూరుకు చెందిన రాజకుటుంబానికి చెందిన యువతి. వీరిద్దరూ వైవాహిక జీవితాన్ని పరమానందంగా అనుభవిస్తున్న సమయంలో ఒక యక్షిణి నాయకుని సౌందర్యానికి ఆకర్షితురాలై నిద్రిస్తున్న సమయంలో నాయకుని కడతూరు నుండి తిరువేంద్రంలోని అజ్ఞాతమైన స్థలానికి తీసుకు పోయింది. ప్రభాతంకాగానే నాయకుడు మేల్కొని తనస్థితిని గుర్తించి నృసింహ మంత్రాన్ని జపించాడు. ఆ ప్రభావానికి యక్షిణి నాయకుని వదలిపారిపోయింది.

అపుడాతడు సమీపంలోని దేవాలయానికిపోయి తన మిత్రుడు, సహపాఠి క్వాలన్ రాజకుటుంబానికి చెందినవాడైన ఆదిత్యవర్మనుచేరి అతనిద్వారా తనప్రియురాలికి సందేశాన్ని పంపాడు.

ఇందులో ఆకాలంనాటి సామాజిక జీవనం. రమణీయమైన ప్రకృతి మనోహరంగా వర్ణింపబడినాయి.

ప్రతిపద్యం ఉత్తమమైన మణి ప్రవాళ కవితకు నిదర్శనంగా భాసిస్తున్నది.

తరువాత వచ్చిన సందేశకావ్యాలలో కూడ కేరళదేశ సమాజ సహజ సౌందర్య ప్రకృతి సంపద అద్భుతంగా వర్ణింపబడినది.

**శుభగసందేశం :**

ఈ కావ్యకర్త నారాయణ నంబూరి. ఇతడు రామవర్మ మహారాజు ఆస్థానంలోను అతనిమేనల్లుని ఆస్థానంలోను ఆస్థానకవిగా సమ్మానింపబడ్డాడు. ఆనాటి ఆ దేశంలోని రాజకీయవ్యవస్థలో మేనల్లునికి రాజ్యాధికారం వచ్చేది. ఆనాటి కవులలో మిక్కిలి ప్రతిభాశాలిగా కీర్తింపబడినాడు

ఈ కావ్యంలో నాయిక పేరు మానవీ మేనక. నివాసం తృశ్శివపేరూరు. దుర్విధికారణంగా ప్రియుడు ప్రియురాలు వీడిపోయారు. కన్యాకుమారిలో అతడు ఉన్న సమయంలో ఒక బ్రహ్మచారి తటస్థపడ్డాడు. అతనిచేత తన నాయికకు సందేశాన్ని పంపించాడు.

**కామసందేశం :**

ఈ కావ్యకర్త మారుదత్తుడు. మలయాళ, సంస్కృత వాఙ్మయాలలో ప్రసిద్ధుడైన పండితుడు.

ఈ కావ్యంలో నాయకుడు మాతృదత్తుడు. నాయిక చంద్రలక్ష్మి ఊరు చిదంబరం కారణాంతరాలవల్ల ప్రియావియోగాన్ని పొందిన మాతృదత్తుడు తిరుణావూరుచేరి అక్కడినుండి తన ప్రియురాలికి సందేశాన్ని పంపాడు.

శివగంగ కావేరి మొదలైన నదులు శ్రీరంగం, కోయంబత్తూరు కొంకణం మొదలైన పట్టణాలు అద్భుతంగా వర్ణింపబడినాయి,

**కోకిలసందేశం :**

ఈ కోకిల సందేశ రచయిత ఉద్దండశాస్త్రి పండితుడు. ఇతడు నిజంగా ఉద్దండుడే. 'ఉద్దండ' అనేది బిరుదనామం. చెన్నమంగళానికి చెందిన తూళ్క్కర అనే గ్రామంలో ఒక నాయర్ స్త్రీతో ఈ కవికి సంబంధమున్నది.

ఆమెతో సుఖంగా కాలక్షేపం చేస్తున్న సమయంలో కాంచీపురానికి కామాక్షి సేవకై పోయే స్త్రీలతో ఏనికి పరిచయమైంది. వారితో కలసి కామాక్షి పురానికి పోయాడు. అశరీరవాణి అతనిని ఐదునెలలు అక్కడే ఉండమని ఆదేశించింది ఆ స్త్రీలు అక్కడ ఉద్దండశాస్త్రిని వదిలిపోయారు మూడునెలలైన తరువాత ప్రియావిరహాన్ని సహింపలేక కోకిల ద్వారా ఆమెకు సందేశం పంపాడు.

ఈ విధంగా మయూరసందేశం, భ్రమరసందేశం మొదలైన కావ్యాలు మలయాళ సాహిత్యంలో అవిర్భవించాయి ఆ ప్రజల విలాసవంతమైన, శృంగార పూరితమైన జీవనానికి దర్పణాలుగా భాసిస్తున్నాయి

కేరళదేశంలో ఈ విధంగా సందేశకావ్యాలు బహుళప్రచారంలోకి వచ్చాయి కవియైన ప్రతిఒక్కడు తప్పనిసరిగా ఒక సందేశకావ్యాన్ని వ్రాయ డానికి యిష్టపడేవాడు. అందుచేత ఆ కావ్యాలసంఖ్య అపరిమితంగా పెరిగి పోయింది. ఈ పరిస్థితిని చూచిన ఒక కవి వ్యంగ్యగర్భంగా కాక సందేశమనే కావ్యాన్ని వ్రాశాడు.[1]

---

1 ఆధారం —
డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులుగారితో ముఖాముఖి
దక్షిణభారత సాహిత్యములు
— మమలయాళ సాహిత్య అకాడమి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
మలయాల వాఙ్మయచరిత్ర
— పి. కె. పరమేశ్వరన్
— పుటలు 35, 36, 37.



# ముగింపు

ఈ విహంగ వీక్షణాన్నిబట్టి తెలుగు సాహిత్యంలో సందేశకావ్యాలు తగినంతగా వచ్చాయనే చెప్పవచ్చు తెలుగులోని 'చకోర సందేశకావ్యం' కాళిదాసుని మేఘసందేశకావ్య సమ్మతంగా సంభావించవచ్చు మనోహరమైన ధ్వనిమర్యాదతో కూడింది కావటంచేత ప్రణయ సందేశకావ్యాల్లో దానిదే అగ్ర తాంబూలం.

సామాజిక సందేశకావ్యాల్లో జాషువ కవీంద్రుని 'గబ్బిలం' దానిశైలిని బట్టి నుడికారాన్నిబట్టి అగ్రగణ్యమైంది. ఇందుకు తెలుగుజాతి గర్వించవచ్చు

సందేశ కావ్యరచనకు ప్రతిభావ్యుత్పత్తులు సమగ్రంగా ఉండాలి. ఇందులో ప్రకృతివర్ణన, వివిధ ప్రదేశవర్ణనలు ఉంటాయి కాబట్టి 'కవి' అనే నామాన్ని (కవయతి - వర్ణయతి) సార్థకం చేసికొనే అవకాశముంది. చాలా మంది కవులు ఛాయాచిత్రకారులేగాని సూక్ష్మేక్షికతోలో లోతుల్ని వర్ణించగల దక్షత కొద్దిమందికే సాధ్యం. ఆ కవీశ్వరుడొక్కడైనా సాహిత్యం సారవంత మౌతుంది.

సందేశ కావ్యకర్తకు బహుదేశాటనం. బహు శ్రుతులతో నిరంతర పరిచయం, విబుధసేవ ఉంటేగాని అతని వర్ణనలు ఏవైనా సారవంతం గావు. అట్టి లోపాన్ని కొందరు తమ ప్రతిభానైశిత్యంతో కన్పింపకుండ చేసికోవచ్చు.

మొత్తంమీద ప్రతిభావ్యుత్పత్తుల సరస సమ్మేళనంగల కావ్యోచితిలోనే ఈ సాహిత్య ప్రక్రియ పండుతుంది. అట్టి కవి నూటికి కోటికి ఒక్కడై నాచాలు.



# ఆధార గ్రంథ సూచి


1. అలక (హిందీనాటిక) — సీతారామచతుర్వేది
అఖిలభారతీయ విక్రమపరిషత్, కాసీ.

2. అనిలసందేశం — పి. వెంకటసుబ్బయ్య
నందలూరు, కడపజిల్లా.

3. ఆంధ్రమహాభారతం అరణ్యపర్వం — నన్నయభట్టారక విరచితము
సాహిత్య అకాడమి ప్రచురణ.

4. ఆంధ్రమేఘసందేశం — వేంకటరామశాస్త్రి కల్లూరి
రాజమహేంద్రవరం

5. ఆళ్వారుల మంగళాశాసన పారుశువులు — సుదర్శనాచార్య, బి కె. యస్
తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ
తిరుపతి 1957.

6. ఆంధ్రభూసుర సందేశం — సీతారామయ్య ఛమిడిమల్లి
రాజమహేంద్రవరం 1904

7. ఆంధ్రమేఘప్రతిసందేశం — వేంకటరామశాస్త్రి రావాడ
బళ్ళారి 1939.

8. ఇన సందేశం — జోసెఫ్‌కవి ఎడ్లపల్లి, సత్తెనపల్లి

9. కవిసేన మేనిఫెస్టో (ఆధునికకావ్యశాస్త్రం) — శేషేంద్రశర్మ గుంటూరు
ఇండియన్ లాంగ్వేజి ఫోరం ప్రచురణ
జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్, గోషామహల్,
హైదరాబాద్ - 1977.

10. కావ్యప్రకాశిక — ఆచార్య ముమ్మట విరచితము

| | | |
|---|---|---|
| 11. | వ్యాలంకార సంగ్రహము | రామరాజభూషణ విరచితము<br>వివరణకర్త సూర్యనారాయణశాస్త్రి సన్నిధానం<br>ప్రథమ ముద్రణ - 1954 |
| 12. | కాళిదాసకవిత | డా॥ పురుషోత్తం బొడ్డుపల్లి<br>శ్రీ గిరిజా ప్రచురణలు, గుంటూరు.<br>ద్వితీయ ముద్రణ - 1980. |
| 13. | కాళిదాసకళామందిరము | హనుమచ్ఛాస్త్రి ఇంద్రగంటి,<br>విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. |
| 14. | కీరసందేశం | సూర్యనారాయణశాస్త్రి సన్నిధానం<br>గోకులము, సికింద్రాబాదు. |
| 15. | ఘనసందేశం | లక్ష్మీనారాయణశాస్త్రి రాంభట్ల<br>13-28-6, మహారాణిపేట, విశాఖపట్నం. |
| 16. | చకోరసందేశం | విజయ వెంకటరావు మోటూరు,<br>శోభా ప్రచురణలు, విజయనగరం. |
| 17. | తెనుగుసందేశం | శ్రీరాములరెడ్డి, పూతాలపట్టు, |
| 18. | తుమ్మెదసందేశం | మణిరామచంద్రరావు సుంకర,<br>రాజమహేంద్రవరం. |
| 19. | దూతమత్తేభం | సుబ్బారావు రాయప్రోలు<br>సికింద్రాబాద్ - 1949. |
| 20. | దక్షిణభారత సాహిత్యములు | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ<br>1979. |
| 21. | ద్విపద మేఘదూతము | పూర్ణ ప్రజ్ఞాచార్యులు పళ్లె<br>పూర్ణప్రజ్ఞగ్రంథమాల, ఆర్. అగ్రహారం<br>గుంటూరు - 1931. |

